# ప్రముఖుల అభిప్రాయాలు

నా సహాధ్యాయి మధిర సుబ్బన్న దీక్షితకవి సర్వవిధముల ధ
వ్రాయుటకు మిగుల సంతసించుచున్నాను. అతఁడు నాతో మును మున్ను
గ్రంథములు గౌతమీ మాహాత్మ్యము లోనగునవి. వ్రాసియుండియు నిపుడు
సారముగాఁ గథలు వ్రాయుటకుఁ బ్రారంభించినాఁడు. చిన్నతనములో నుబుసు
జెప్పుకొను కథలను బుచ్చుకొని "కాశీమజిలీలు" అను పేరుతోఁ జమత్కారిం
సంవిధానముం జతపఱచి మొదటి భాగమచ్చొత్తించి ప్రకటించినాడు. అది
మదులనాకర్షించినది. ద్వితీయ తృతీయాది భాగముల వ్రాయుటకు ప్రోత్సా
గలిగించినది. ఇప్పటికి పన్నెండు భాగములైనవి. నేనీ కథలను పూర్ణముగఁ
లేదు గాని యే భాగములోనో యొకటి రెండు కథలు మాత్రము చదివితిని.
చదివినప్పుడు నాలో నాకే పరమాశ్చర్యము గలిగినది. నా సహాధ్యాయి వి
నేను జెప్పుట కొంతవరకు దగదేమోకాని పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ
బోలె మనోహరత్వముం గలిగించినది. ఇట్లు నాబోట్లు వ్రాయుటకుం బూ
కృత్యులు గాలేరనియే నా నిశ్చయాభిప్రాయము. ఒక్కొక్క పురుషున కొక
దానిలోఁ బ్రావీణ్యము గలుగుననుట నిశ్చయము వాని కథ లుపకథలతోఁ గూ
పెద్దగొలుసువలె మనోహరములై యుండును. ఆ కథలలో ననేక నీతులు, ధర
ఆచారములు, శృంగారాదిరసములు, అధ్యాత్మావబోధక ప్రదర్శన
యుండును. ఇవి సర్వజనాదర పాత్రములగుటయే నా చెప్పిన మాటలు సత
టకుఁ దార్కాణమగుచున్నవి. గద్యశైలియు సుబోధమై పండితపామర హృ
చున్నయది. ఈ కథలు బృహత్కథాదులవలె జగద్విఖ్యాతి గాంచుగాకయ
చున్నాను.

ఇట్లు,

**శ్రీపాద కృష్ణమూర్తి**

కొలఁది దినములనాఁడు దయాపూర్వకముగ నాసంగిన కా
అను పేరుగల భవద్విరచిత గ్రంథము నాకొసఁగుచు వీనిని జదివి యభిప్రా
దెలుపవలసినదియని సెలవిచ్చియున్నారు. తదేకదృష్టితో దద్గ్రంథము
కొన్ని కథలను జదివితిని. అవి కేవలము కథలవంటివేకాక వ్యాకరణాదిశాస్త్ర
దాయము నందేమి యలంకారాదుల యందేమి మన ప్రాచీనకావ్యముల కిం
దీసిపోక పాఠకులకు మంచి సాహిత్యజ్ఞాన మలవఱచుటకుఁ గడుంగడుఁ దగి
గ్రహింపఁగల్గితిని.

ఇట్లు,

**శతావధాని చెళ్ళపిళ్ళ వెంకట**

బ్రహ్మశ్రీ పండిత మధిర సుబ్బన్న దీక్షిత కవిగారిచే రచియింపబడిన కాశీమజిలీ కథలు చదివి యానందించితిని. మృదుమధుర శైలిగలిగి నీతిబోధకములగు పద్యములతో నొప్పుచు బండితపామరజన మనోహరమై తగు నీ కథల విషయమై యభిప్రాయమీయ మె మనస్థలమయ్యు దత్కృతజ్ఞాపకన సంజాత హర్షాతిశయమే యిట్లు వ్రాయుటకుఁ బ్రోత్సాహపరచినది.

ఈ కథలు ప్రారంభించిన తరువాత నెంత పనిలోనున్నను చివరవరకు చదివినంగాని విడువకపోవుటయే యిందలి రసాధిక్యము ప్రఖ్యాతమగు చున్నది. ఇందులకు లోకమే ప్రమాణము. వీని కథలని సామాన్యముగాఁ దలంపరాదు. శంకరాచార్యాది మహాపురుషుల చరిత్రములిందు వర్ణింపబడుటచే నిదియొక పురాణగాథా కోశమని చెప్పుట సమంజసము. ఈ కథ లాంధ్రయోషకు నూత్నభూషా విశేషములై యొప్పుచున్నవని రూఢిగా చెప్పుచున్నాను. ఇట్లు,

**కావ్యనిధి శ్రీ చెలికాని లచ్చారావు**

"కథావినోదమే"యని మహర్షులు దాని జతుష్షష్టి విద్యలలో బరిగణించి యనుశాసించి అభివృద్ధి పరచిరి. ఇట్టి కథావినోదము వినోదమాత్ర ఫలజనకముగాఁ ధర్మాదిసాధనోపాయ మహత్తరంబగుట సర్వజనవేద్యమే.

కాశీమజిలీకథా నిబంధనము సర్వజన చిత్తాకర్షకంబనుటకును సందియము లేదు. దీనిలో రసాభావ పుష్టియు గథాసంధాన కౌశల మట్లుండ జతుర్విధ పురుషార్థతంబులగు మహాకవి వాఙ్మయములోని నవరత్నములు సాధారణ కథా కథనధోరణిలో వెదజల్లబడి యుండుటచే నివి పండితులకును, గావ్యకర్తలకును గూడ బ్రతిభాన్వేషణ క్షమంబులని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇందు బారమార్థికులకు దప్ప సామాన్యులకు రుచింపని శంకరాచార్య చరిత్రము లతిరవంతములుగా బరమార్థబోధకంబులుగ కథాధోరణిగా గూర్పబడినవి."

విశ్రాంతి చింతావినోదులకు జన్మజీవన తరుణోపాయంబగు తీయనియౌషధంబువలె నుండు నీ గ్రంథరాజమెంత పెద్దదిగానున్నను విసుగులేక యుత్తరోత్తర సంపుటముల కెల్లరును వేచియుందురని నిశ్శంసయముగా జెప్పవచ్చును.

ఇట్లు,

**మానవల్లి రామకృష్ణకవి** *M.A.*

"శ్రీమత్పండిత మధిర సుబ్బన్న దీక్షితుల వారిచే రచింపఁబడిన "కాశీ మజిలీకథ" లను పేర నొప్పు కథాసమూహ మింత కాంధ్రదేశమంతయుఁ జక్కఁగా నెఱింగినదే కావున నేను ప్రశంసింపవలసిన యావశ్యకత లేదు. ఆ గ్రంథముల కిడిన కేవలనామము సహితము మనకుఁ బవిత్రమైన భావమును హృదయమున నుత్పాదింపఁ జేయుటయేకాక పూర్వకాలమున రాకపోకలకు మనకువలె సౌలభ్యములు లేకుండియుఁ గ్లేశప్రియులైన మన పెద్దలు కాలినడకతో పుణ్యపట్టణమైన కాశిని దర్శించి వారెంతటి క్లేశములు వహించి యుండిరను నాశ్చర్యము గలిగించుచున్నవి. జనసమూహముల నాప్యాయింపఁజేయుటకుఁ గథాకథనము మన హిందూదేశములో నతిప్రాచీన విద్యయే. దానికి ననుపమముల ప్రయోజనము గలదు. ఈ కథలు ధర్మపరాక్రమముల తత్త్వ ప్రభావముల నుపదేశించుటయేకాక అప్పటి దీర్ఘకాల మార్గాయాసమును యాత్రికసంక్లేశములను బోలఁగించుచుండును. మతవిషయమునను ఆధ్యాత్మిక విషయమునను విశ్వాసములేని యింతటి శంకితమగు నేఁటికాలమున స్వభాషలో సులభశైలి వ్రాయఁబడిన యీ కథలు హిందూదేశమున నాదియగు వేదశాస్త్ర పురాణాది విద్యాప్రపంచమున నేదియేది శ్రేష్ఠమో శాశ్వత స్మరణీయమో దానినెల్లఁ దప్పక పునరుజ్జీవనము చేయుచున్నవి. ఇవి యవనయామినీ వినోదకథలలోని చమత్కృతి ప్రభావము చూపుచున్నను కట్టుకథనమందును, భావముల యందును అశ్లీలధర్మసాంకర్యాది దోషములు లేక భాసిల్లుచున్నవి. కథలకిచ్చిన పేరును, సంవిధాన ధోరణియు సమస్తవిషయ సంగ్రాహకమగుటచే యట్లే కొనసాగుచుండిన యెడల నిది తప్పక హిందూపురాణ గాథా కోశమై సర్వవాఙ్మయమున కాదర్శమై యొప్పుననుట యసాధ్యముగాదు.

ఇట్లు,

బ్రహ్మశ్రీ శ్రీమాన్ **యస్. కృష్ణమాచారి**

***M. A. M. L. P. H. D.***

# సూచిక

## మజిలీవరకు వచ్చు కథలు

శుభమస్తు — అవిఘ్నమస్తు

# కాశీమజిలీకథలు

## పదునొకండవ భాగము

### 250 వ మజిలీ

శ్రీగౌరీధృతకరణా!
వాగీశాద్యఖిల దేవవందితచరణా!
నాగాసురమదహరణా!
భోగీంద్రాభరణజిత భూధరశరణా! (1)

దేవా! అవధరింపుము. అట్లు మణిసిద్ధయతీంద్రుండు గోపశిష్యునితో గూడ గాశీయాత్ర గావింపుచు గ్రమంబున బంచాశద్ద్విశతసంఖ్యాకంబగు నివాసస్థానంబు చేరి యందు గాల్యకరణీయంబుల దీర్చికొని భుక్తోపవిష్టుండై శిష్యునిరాక నరయుచున్నంత నింతలో నగ్గోపాలుం డూరిలోనికరిగి నాలుగువీధులుం దిరిగివచ్చి యయ్యొవారికి నమస్కరించుచు నిట్లనియె.

స్వామీ! ఈ గ్రామంబంతయు దిరిగి చూచితిని. వింతలేమియు గనంబడలేదు. సీమాంతముల బరిశీలింతమనుకొంటినిగాని మీరు నా నిమిత్తము వేచియుందురని తొందరపడి వచ్చితిని. ప్రస్తావ్యాంశ మొకటి యించుక లభించినది వినుండు.

ఊరినడుమ శివాలయంపుటరుగుపయిం గూర్చుండి కొందరు పౌరులు సమస్యగా నీయబడిన యొకశ్లోకపాదమును బఠింపుచు దదర్థావబోధనము చేసికొనలేక యొండొరులు కలహించుచున్నారు. నే నందు గూర్చుండి యా సంవాదమంతయు నాకర్ణించితిని. ఆ శ్లోకపాదమును వ్రాయించుకొని వచ్చితిని. వినుండు—

శ్లో॥ ప్రసూత కన్యాత్మజ మప్యనాథా
గీ॥ కన్య గనియె సుతు మగండులేక

ఆ పాదమునే మరియొకరిట్లు తెనిగించిరి. ఈ సమస్య యే సందర్భమున నెవ్వ రిచ్చిరో యందెవ్వరికి దెలిసినదికాదు. ఎవ్వరినడిగినను జెప్పలేకుండిరి. ఇదియే నేటికడుగుపడిన విశేషమని తలంచి దానిం జదివికొనుచు మీ సన్నిధికి వచ్చితిని. నా పుణ్యము ఫలించెనేని యీ సమస్యవలన

మంచికథ పొడకట్టునేమో తెలిసికొని యెరింగింతురే! దేవరకుగాక యింతలిరహస్య మెరులకు దెలియగలదా! అని యడిగిన విని యయ్యతిపతి యిట్లనియె.

గోపా! వేళమిగిలినది. నీవు భుజంపుము. నీ వడిగిన ప్రశ్నము రిత్తబోవదు. అందు విచిత్రకథా ప్రాచుర్య మేదియో యుండకపోవదు. అనుటయు నుబ్బుచు గొబ్బునవాడు సాపడివచ్చి యొజ్జల యడుగులం బట్టుచు స్వామీ! కుడిచి వచ్చితిని. తదుదంత మాకలించుకొంటిరా? విశేష చమత్కారము లేమైన నిందు గలవా? అని యడిగిన నవ్వుచు నవ్విద్వాంసు డిట్లనియె.

వత్సా! నే ననలేదా, నీవు తొల్లింటి పుట్టువున జాల పున్నెము సేసి యే కారణముననో గోపుండవై పొడమితివి. నీ యంతఃపురమునకు దైవసాన్నిధ్యము కలదు. నీవు చొప్పదంటుంజూచి యడిగినను గొప్పకథ గలిగియుండును. ఈ సమస్యార్థము విచిత్రకథా సందర్భముల నొప్పారుచున్నది. సావధానుండవై యాకర్ణింపుము.

## అగ్నిశిఖుని కథ

తొల్లి భోజనృపాలం పాలితంబగు ధారానగరంబున నగ్నిశిఖుండను పాఱుండు దేవదత్తయను భార్యతో గాపురము సేయుచుండెను. అతండు వేద వేదాంగముల సాంతముగా దెలిసికొని తదుక్త ధర్మంబుల యథావిధిం గావింపుచు శ్రోత్రియుండని ప్రఖ్యాతి పడసెను. మరియు నున్నదానితో సంతుష్టినొంది యొరుల యాచింప నిష్టములేనివాడగుట యాగంబులు సంపూర్ణదక్షిణాత్యాగంబునం గాని సుకృతోపయోగంబులుగావని వానియం దాదరము వహింపడయ్యెను

నిత్య కర్మానుష్ఠానములయందు శ్రద్ధవహించి ధర్మశాస్త్రముల బరిశీలింపు చుండును. పూర్వాచారముల నాదరించి నూతనాచారముల నాక్షేపించుచుండ నతనిని ఛాందసుడని జనులు పరిహాసమాడుచుందురు. ఆ ప్రోల భోజభూపాలుండు కవి దివిజపాలుండై లక్షలకొలది పండితులకు విత్త మిచ్చుచున్నను నా భూసురుం డెన్నడు నతనికడ కరిగియెరుగడు. సంతతము విద్యార్థులకు స్వాధ్యాయము చెప్పుచుండును. అస్వస్థులని యెవ్వరింటికిం గుడువబోడు. అరగువికిచి పొరుగింటికరుగ నెరుగడు.

అతనిభార్య దేవదత్త యరుంధతికి తప్పులు దిద్దునది. స్వాధ్యాయా ధ్యాపనమున కంతరాయము గలుగునని భర్తను గృహకృత్యముల విషయమై యెన్నడు నియమింపదు. కావలసిన సంభారము లన్నియు విద్యార్థులచే దెప్పించి కుటుంబయాత్ర గడుపుచుండును.

ఒకనా డామె కొశికుండను నంతేవాసింజీరి, యోరీ! మీ యయ్యగారికి ఛాందసము దిన దినాభివృద్ధి వహించుచున్నది. వారి తండ్రిగారి యాబ్దికము నాలుగు దినములలో రానున్నది. ధర్మశాస్త్రములలో జెప్పిన ప్రకారము భోక్తల

యూరంతయు దిరిగి శ్రోత్రియుల శ్రోత్రియ పుత్రుల విమర్శించి పేరులు వ్రాసి కొనివచ్చి గురునకు నివేదించుటయు.

సీ. ఒకని వామనుడంచు నొకని నున్నతుడంచు
నొకని స్థూలుడంచు నొకని గృశుడు
నొకడు వేదవిహీను డొక డసత్కులజాతు
డొక డంగవికలు డింకొకడు మూగ
యొకడు గోళకుడు వేరొకడు కుండకుడు నిం
కొకడు జారజుడు మఱొకడు మూర్ఖు
డొకడనాచారసంయుతు డొక్క డతివాది
వికటదంతుడు పరివేత్త యొక్క
గీ. డొక్కడ బ్రహ్మచారి యింకొకడు కృపణు
డొకడు సిద్ధాంతవేది యింకొకడు సుకవి
యొకడు వైద్యోపజీవి వేరొకడు శూద్ర
యాజకుడని నిరసించు నా గృహస్థు. (8)

అట్లతం డందరకు దలయొక వంకయుబెట్టి యంగీకరింపకున్న గౌళి కుండు మరియుం దిరిగి తిరిగి శ్లోక్తల నేరిజెప్పిన నతం డొప్పికొనమిక వగచుచు నిట్లనియె.

స్వామీ! మీరీయేడు శ్రాద్ధము మానవలసినదే. ఇంతకన్న శ్రోత్రియు లీ యూరలేరు. మన యత్నమువిని యీ యూరి పాఱులు పరిహసింపుచున్నారు. వారిచే మన మనస్థులని యాక్షేపింపఁబడితిమని మనపై నీసుబూనిరి. ఇక నీ ప్రయత్నము విడిచి చటకశ్రాద్ధము గావింపుడని నివేదించుటయు నగ్నిశిఖుండు కౌశికా! కలిలోక్తం కిదుటకంటె నీ వనిన మాటయే లెస్సగానున్నది. మరియొకటి వినుము.

శ్లో. పరిపూర్ణం భవేచ్ఛ్రాద్ధం యతిషు శ్రాద్ధభోజిషు

అనియున్నది. యతులెవ్వరైన నీ యూర నున్నారా? వారి గుణ దోషములు విమర్శింప నవసరములేదు. వారి నర్చించిన బితృతృప్తి కారణము చూచివత్తువే యనుటయు వల్లెయని యాపగలెల్ల నూరుదిరిగి వచ్చి యంతేవాసి యొజ్జల కిట్లనియె

గురువరా! ఈ యూరనున్న యతులందరు మొన్న మొన్ననే తీర్థ యాత్రల కరిగినారట. శివాలయము జ్ఞానతీర్థుఁను యతి యొక్కడుమాత్ర ముండెను. అతండు మహానుభావుండని జెప్పిరి. మీరు వ్రయత్యర్థించిన నంగీకరించునని యెరింగించుటయు నగ్నిశిఖుండు సంతసించుచు మరునాడు ప్రాతఃకాలమున నిత్య కృత్యములం దీర్చుకొని శిష్యునితోగూడ శివాలయంబున కరిగి యతీశ్వరునకు సాష్టాంగ వందనములు గావించెను. అయ్యతి నారాయణ స్మరణగావించుచు గూర్చుండుడని

[illegible]. సన్నముండై గురుండు యతి పరిసరంబున వసించినంత కౌశికుం డగ్నిశిఖుని శ్రోత్రియత్వాది విశేషములన్నియు నుగ్గడించి వీరొక కార్యావసరమున నీ గృహమునకరుగుదెంచిరి యని నివేదించెను. ఓహో! సన్యాసిని. నాతో [illegible] వసవచ్చినది వారి యాకారముసూడ పరమశ్రోత్రియులవలె గనంబడు చున్నారు! వారి యభిమత మెప్పుడునేని తీర్చువాడ. తెలియపరచు డనుటయు, [illegible]గించి యగ్నిశిఖుం డిట్లనియె.

స్వామీ! మీరు జ్ఞానచక్షువులు. మీ యెరుంగని ధర్మములుండవు, [illegible]ధనములని చెప్పుదురుకాని జ్ఞానసాధనములనియే నా యభిప్రాయము. [illegible] నట్లే చెప్పియున్నారు. నాకు మొదటినుండియు కర్మయందు దాసక్తి [illegible]. [illegible]గుదాశాస్త్రముగా గర్మల జరుపుట కడుంగడు కష్టము. అందులకు [illegible] అన్యోన్య సహాయంబుకంగాని కర్మతత్వము నెఱ [illegible]. [illegible] మా యింట తిధిప్రయోజనము. అందులకు భోక్తలుగా నిమంత్రింప [illegible] శ్రోత్రియుం డెవ్వడుం నీ యూర నాకు గనంబడలేదు. అధికము మానవలసి వచ్చుచున్నది.

శ్లో॥ యోగిభిక్షుస్సామగో బ్రహ్మవేత్తా భాగ్యాల్లభ్యాశ్చైత్రధా భోజనీయాః

[illegible] న్నది మా పూర్వపుణ్యవశంబున మీరిందు నిలిచి యుంటిరి. మిమ్ము భోక్తగా నిమంత్రించుచున్నాను. అంగీకరింపవలయునని పాదంబులంబడి వేడుకొనుటయు.

ఆ యోగి నవ్వుచు లేవనెత్తి నీవు వేదమూర్తివి. నీ యభిలాష దీర్చుట [illegible] పనపూర్తములేదు. అట్లే భిక్షకంగీకరించితిని. కాని రెండవభోక్త నెవరి [illegible]గింతువని యడిగిన నతం డిట్లనియె స్వామీ! అందులకేకదా యిన్ని చిక్కులు [illegible]. తమ కెరింగిన వా రెవ్వరేని యుండిన వక్కాణింపుడు. అనవుడు [illegible] సెపాలోచించి వైదికుడా! నే నొక్కనిం బేర్కొందు. ఇట్టటనక [illegible] సంగీకరింతువే? అని యడిగిన సరిసరి. మీ కన్న నే నెక్కుడు ప్రాజ్ఞుండనా? మీ యాజ్ఞ శిరసావహించి యట్లు కావించెద నా నతిం దనుటయు సన్యాసి యిట్లనియె.

ఆ. వె. కలదు కాళిదాసకవివరుం డీయూర
నిలువు మతని దారసిలి ద్వితీయ
భోక్తగా నతడు బొటి మదీయోక్తుల
నాదరించి భక్తి కనుమతించు. (4)

అతనిపేరు మీరును నెరింగియుందురు. అట్లుసేయుడు పో వొండని [illegible] లోపలికి బోయెను. ఆ మాట వినినతోడనే యగ్నిశిఖుని హృద [illegible]నది. ముహూర్తకాల మేమియు నోరు తెఱచుకాదు. యేదియో [illegible]ండు స్వామీ! ఇంటికిం బోవుదము రండు. స్వాములవారు

సెలవిచ్చినరీతి జేయకతప్పదు. పదుడు పదుడు పదుడని పలుకుచు నీవలకు దీసికొని వచ్చెను.

అగ్నిశిఖుడు కౌశికా! ఇదియేమి కర్మము. కాళిదాసుని మన మెప్పుడు చూచి యెఱుగము. వాని చర్యలు విపరీతముగ జెప్పుకొను చుందురు. అత డపత్నీకుడని వింటి. అయ్యో! నా శ్రాద్ధ మధ్వాన్నముగానే యన్నది. యతులకు కర్మనియమము తెలియదు. ధర్మశాస్త్ర కర్తలు యతుల కిడుమనుట యసమంజసమని తలంచెద. ఇప్పు డేమనుకొన్నను ఫలములేదు. వానిం బిలవకున్న తాను రానని సూచించెను. ఎట్లయినను నాబ్దికము భ్రష్టమైనది. కానిమ్ము. కాళిదాసెందుం డెనో తెలిసికొంటివా? యని యడిగిన శిష్యుం డిట్లని యె.

గురువరా! అట్లనరాదు జ్ఞానులమహిమ జ్ఞానులకే తెలియును. కాళిదాసెట్టివాడో యెవరికి దెలియును? పోయి ఏమిచ్చెంతము రండని పలుకుచు నటగడచి యొకవీథింబడి పోయిపోయి యెదురుపడిన యొక పాఱుంజీరి కాళిదాసకవి యెందుండునని యడిగిరి. అతండు అగ్నిశిఖుని ధాందస మెఱిగినవాడగుట నవ్వుచు మీరతని భోక్తగా నియమం తురా? మేతెంగెను ఆబ్దికమున మద్యమాంసములిడుట పూర్వసాంప్రదాయకమగుట వానిని బిలువవలసినదే. ఆ కవి కవియిష్టములగుట ప్రీతుండగును. అతండు వేశ్యావాటికలో విలాసవతియను భోగము దానియింట నుండును. అందు బొండు. విలాసవతిని ముత్తైదువుగా బిలువుడు. అని యాక్షేపించుచు నతం డవ్వలికి బోయెను.

అతని మాటలువిని యగ్నిశిఖుండు సిగ్గుపడుచు, కౌశికా! మనకీ యాపద యెట్లు తప్పును. వానిని బిలిచిన నొకతప్పు. పిలువకున్న నొకతప్పు. ఇట్లిరుకున బడిపోయితి. మేమి కర్మము. ఛీ! నే నీబ్రాహ్మణకులంబున నేమిటికి బుట్టితినో అని తన్ను నిందించుకొన విని శిష్యుం డిట్లనియె.

గురువరా! మీ హృదయమున నేతో యొకటి స్థిరపరచుకొన వలయును. ఒకరి నిందాస్తుతులతో మనకు బనిలేదు. జ్ఞానతీర్థుడు సామాన్యుడుగాడు. ఆయతి నీ యూర నందరు నర్చించుచుందురు. అతనిమాట వడువున గావించుచుంటిమి. తప్పైన నగుంగాక. సందియమును విడువుడు అని చెప్పి యావిప్రుని వేశవాటికకు దీసికొని పోయెను. అందు——

క. ఆయింట లేవగొట్టిన
 నీ యింటికివచ్చి లోని కేగుడు పీరల్
 సీయని త్రోసిన షిగ్గని
 కాయంబులు కుక్కలట్లు కదలి చనంగన్.

కైలాసశిలరాకార ప్రాకారములచే నొప్పు నగరంబుల వేశవధూ నస్తనోప మర్దమానంబులగు గవాక్షంబులనుండి బయలు వెడలు నగరుపధూములచే దుర్దినమగు చుండ నందందు ద్వారదేశముల వారాం గనలు మబ్బుచాటున మెరయు విద్యుల్లతలో

మనల వంచించుటకే యాసన్యాసి యిట్లుచెప్పెను. నాకువీని నిమంత్రింప నిష్టములేదు. ఇంటికిం బోవుదమురమ్ము, అనవుడు శిష్యు డిట్లనియె.

ఆచార్యా! మీరొక మాటపై నిలువకున్న నేమనదగినది! అధికముమాట యటుండనిండు. యతీశ్వరునితో నాడితప్పుట కడుంగడు పాపము. మీరితని నిలువ కున్న నా యతివాడు. తద్దినఃబు వృధా పాడగును ఓర్పు వహింపుడు. అని జనాంతిక ముగజెప్పి బాలా! వారితోమాటాడ నత్యవసరము గలిగియే వచ్చితిమి. మాకాక వారికి నివేదింపుము. నీకు మంచి విటశిఖామణి లభించునని యాశీర్వదించుటయు, సబ్బాలిక ముసి ముసి నగవులతోఁబోయి కవివరున కత్తెరం గెరిగించినది.

అతండవ్వార్తవిని సత్వరము మేడదిగివచ్చి ద్వారదేశమున నా భూసురులం గని సీధురసవాసనలు నలుదెసలం బ్రసరింప నాతో మీకేమి పనియని యడిగెను. ఆ విప్రు డతనిజూచి యేవగించుకొనుచు ముక్కుమూసుకొని యేమియు మాటాడదయ్యె. అప్పుడు. శిష్యుం డప్పొరుని వృత్తాంతమంతయుం జెప్పి నెల్లి వీరింట నాబ్దికము. జ్ఞాన తీర్థులవారి నొకభోక్తగా నిమంత్రించిరి. రెండవభోక్తగా మిమ్ము నిమంత్రించుమని వారే చెప్పియున్నారు. అందులకే మేమిందువచ్చితిమి. నావుడు సరియే అల్లేవత్తును పొమ్మండని పలికి యిల్లు తెలిసికొని యక్కవితిలకుండు లోపలికిం బోయెను. ఆ శ్రోత్రి యుం డతనిజూచి కౌశికా! ఈతడేనా కాళిదాసకవి? వీనియందు బ్రాహ్మణ వర్చస్సు ఇంచుకయులేదే? కవీంద్రుల గ్రంథములు మన్నింపవలసినదేకాని వారి చర్యలు స్తుతిపాత్రములుగావు అయ్యయ్యో! వీడా మనకు భోక్త. మన కర్మము కాలినట్లే యున్నదని విసిగికొన గౌసికుం డయ్యగారు! మీ రేమియు నాలోచింపవలదు. మహా త్ముల చరిత్రలు కడు విచిత్రములు. ఇంటికిం బోదముర౦డని దేశకునితో గూడ కౌశికుం డింటికింబోయెను.

అని యెఱింగించువరకు కాలాతీతమైనది. తరువాతకథ పై మజిలీయందిట్లు యుండునని చెప్పదొడంగెను.

## 251 వ మజిలీ

## కాళిదాసకవి భోక్తృత్వము.

అగ్నిశిఖుండు శ్రార్ధదివసంబున నిత్యకృత్యంబులం దీర్చుకొని వంటయు భోక్తల నిమంత్రించు నిమిత్తము బయలుదేరి శివాలయంబున కఱిగి తొలుత యతీశ్వ రునకుం జెప్పి తరువాత విలాసవతీభవనంబున కరిగెను.

వాకిట బాధిచేయుచున్న దాదినిజూచి ఓసీ! కాళిదాసకవి లేచెనా? అని యడిగిన నది నవ్వుచు వారిప్పుడే లేతురా? రాత్రియెల్ల నిద్రమాని వేసవకాపున పండుకొందురు. ఒక్కొక్కనాడు మట్టమధ్యాహ్నముదనుక లేవనేలేవరని యుత్త

రని చెప్పినది. ఆ మాటవిని యా పాఱుడు దిగులుపడి అయ్యో! నేడు నేను గంగలో దిగిన బాగుండెడిది ఇది యెక్కడి భోక్తృత్వము. నా కర్మము కాల! నే నిందుల కేమిటి కనుమతింపవలయును! అతనికి నా మాట జ్ఞాపకమున్నదో లేదో! ఎప్పుడు లేచునో తెలియదు. అంతదనుక నే నిందుబడియుండవలసినదే! అక్కటా! పతివ్రతా! నాకు మంచి ప్రాయశ్చిత్తము జేసితివి. ఊరిలోనివారెల్ల [illegible] భోక్తగా నియమింపుమని నియోగింతునా? తెలిసినది. యోగులు సర్వజ్ఞులగుటచే నా నిర్మలత్వము భ్రష్టముచేయు తలంపుతో నిట్లు జెప్పితివి. తెలిసి కానలేక పోయితిని.

అని యూరక పశ్చాత్తాపము జెందుచు లోపల నేదియో గొణిగి కొనుచున్న యావిప్రుని [illegible] చెట్టనిట్టూర్పు గనిపెట్టి చేతిపనిమాని వేగమ మేడపైకేగి దాది విలాసవతి కిట్లనియె.

అమ్మా! ఎవ్వరో బాపనయ్య అయ్యగారితో బనియుండివచ్చి మన వీధి యరుగుపై గూర్చుండెను. వారు ప్రొద్దెక్కుదనుక లేవరని చెప్పిన పరితపించెను. పాపము [illegible] వీరిని లేపెదనే యని చెప్పిన నొప్పుకొని యప్పడతి యప్పండిత మండనుని ప్రబోధించి యవ్వార్త దెలిపినది. అతండు కన్నుల నులిమికొనుచు లేచి [illegible] వాకిట వేదికపై నిలిచి నోటి తాంబూలపుతమ్మ తుపుక్కున నుమిసి యా బాడబుని జూచి మీరా! మీ యింట నాబ్దికము నేనా? యని యడిగిన నా విప్రుండు ఆబ్దికము నేడే! మిమ్ము భోక్తగా నిమంత్రించితిని. నా కోరిక మరియొకటి వినవలయును. ఇక మఱిమియు [illegible] వలదని ప్రార్థించుచుంటి. మా యింటికి గుఱప కాలమునకు దయచేయుడు అని చెప్పిన నతండు నవ్వుచు వల్లెయని మరలి యింటి లోనికి బోయెను.

అగ్నిహోత్రుల గింటికిం బోవుచు ఆహా! విధి పురుష ప్రయత్నముగనే [illegible] గొనుచుండెను. ఊరిలోనున్న శ్రోత్రియులనెల్ల నుల్లంఘించి యింటి మఱియొక్క ప్రయత్నము సేయ చివరకథమాధముడు లభించెను. వీడు ప్రపఋల కైన గూర్చుండ నర్హుడైన నష్టుడుగాడు. ఎక్కడి విలాసవతి! ఎక్కడి కాళిదాసు! ఎక్కడి భోక్త! నాటి నిట్టిపని యెఱింగియున్నను భగవంతుడే చేయించుచున్నవాడు. [illegible] స్వతంత్రుడు కాడని మీనందెల్ల మగుచున్నయది వాని పుణ్యదినము. స్నానమైన జేయుదునని యొప్పుకొనియెను. పదివందెలనీళ్ళు కాచి గుమ్మరింపవలెను. వాని మేని మురికియంతయు మా పెరటిలో విడుచును గాబోలు. ఇది గుణంగొంత మేలే యని దలంచుచు నింటికి బోయెను.

అప్పటికి రెండుయామములైనవి. 'అతని వంట పూర్తిజేసి [illegible] [illegible]? మీ మనస్సునకు నచ్చినవారు దొరకిరా? యని యడు [illegible] యోగము చెట్టించుకొనుచు, ఆ - దొరకిరి. మీ యింటికి పోనే నాకు

గొట్టినది. కానిమ్ము వంటకు సహాయమెవ్వరును రాలేదా? యని యడిగిన నప్పా లుత యిట్లనియె.

శ్రోత్రియులు మిమ్మేమనుటకుంజాలను భోక్తలకై యూరంతయు వెదకించితిరి. ఎవ్వరును బనికిరారని నిరసించితిరి. అందరకు మనపై నీసుగానున్నది. అది యట్లుండ గాళిదాసకవిని భోక్తగా బిలిచితిరట. అతడు బ్రాహ్మణకులములో లేడట. మన యింటి కెవ్వరును రారట. పాఱుల వీధుల గుజగుజలాడుచున్నారు. చుట్టములుగూడ రారైరి. కానిండు యిప్పుడేమనుకొనినను బ్రయోజనములేదు. వంటయైనది. మీ యనుష్ఠానము దీర్చికొండు. శిష్యులే సహాయము చేయుచుండిరని చెప్పినది.

ఆ మాటవిని దిగులుపడి యతండేదియో చెప్పబోవునంతలో నంతేవాసి వచ్చి కాళిదాసకవి వచ్చియున్నాను. స్నానము చేసెదునట. నీరుకాగినదా? అని చెప్పిన నగ్నిశిఖుండు తొందరగా వాకిలికిం బోయి యందున్న కవికి నమస్కరించుచు దోడ్తెచ్చి యతని కుపచారములు చేయ శిష్యుల నియమించెను.

కాళిదాసకవి శిష్యులవెంట నూతియొద్దకుంబోయి యెసరువలె గ్రాగిన వేడి నీళ్ళబిందెల శిష్యులు పధానపటముతో నెత్తిపై యభిషేకము వేయ దృప్తిగా స్నానము జేసెను. వేడిబిందెలంటుటచే శిష్యుల కరతలంబులు కమిలినవిగాని యా కవికి వేడి యించుకయు సోకినదికాదు. అతండట్లు తీర్థమాడి మడిపుట్టమ్ములం గట్టుకొని యొడలెల్ల విభూతిబూసి జాముదనుక నన్ను పిలువవలదని చెప్పి యొక గదిలో గూర్చుండి జపము చేసికొనుచుండెను.

అగ్నిశిఖుండు బ్రహ్మయజ్ఞ పితృతర్పణాదినిత్య విధుల నిర్వర్తింపుచుండ నంతలో జ్ఞానతీర్థు లరుదెంచిరని శిష్యుడు చెప్పుటయు నతండాయతికి నందనముచేసి తీసికొనివచ్చి విష్టరోపవిష్టుం గావించెను. సన్యాసి కాళిదాసకవి వచ్చెనాయని యడిగిన గృహమేధి ఆ వచ్చిరి. గదిలో జపముచేసికొనుచున్నారని చెప్పెను. సమయమైనది. లోపలికి బోయి పిలిచికొనిరమ్ము హొమ్మనిచెప్పిన విప్రుడు మెల్లన తలుపుతీసి లోపలికేగి చూచెను. అమ్మహానుభావుండు బాహ్యప్రచారములేక యాత్మయం దీశ్వరసన్నిధానము గల్పించుకొని ధ్యానించుచుండుటం బట్టిగట్టిగ నతం డెంతపిలిచినను బలుకడయ్యె. పిమ్మట దాపునకు బోయి కవీంద్రాయని పిలుచుచు మెల్లగా నతనియొడలిపై జేయిడియె. క్రాగిన యినుపకమ్మివలె దగిలినతోడనే యతని చేయి భగ్గునమండి చర్మమూడినది.

అమ్మో యని యఱచుచు చేయి లాగుకొనియెను. ఆ రొద విని యా కవి కన్నులు దెఱచి చేయి విదల్చుచు బాధపడుచున్న యా జన్నికట్టుచేయి పట్టుకొని

వానిని ఫూత్కారము గావించినంత జల్లబడి యావంత యావంతయులేక యథా ప్రకాశగ సాగర మొప్పుచుండెను.

అప్పు డగ్నిశిఖున కతనియం దెక్కుడలేని భయభక్తి విశ్వాసము లుద యించెను. భార్యతోగూడ నతని పాదంబులంబడి యనేకోపచారములు సెప్పికొని యిట్లు పిమ్మట జ్ఞానవీర్థులకు మ్రొక్కుచు మహాత్మా! నీవు నన్ను వంచించుట కిట్లు నిదురించితివని నిందించితిని. కాళిదాసు మహానుభావుండని యెరుగకపోయితిని ఇంతకాలమిప్పుడు తెరచూపినారు. కన్నులకు మిరుమిట్లు గొలుపుచున్నది. అయ్యారే యింతటి మహాత్ముడు! వేశ్యాలోలుడన నేమో యనుకొంటిని. నేటితో మాపితరులు పుణ్యలోకమునకు పుట్టుగలరని యూరకస్తుతిచేయుచుండ సన్న్యాసి యిట్లనియె.

ప్రియసఖా! కాళిదాసకవి యవధూతవంటివాడు. అతనికి సంకల్ప వికల్పములు లేవు. జ్ఞానవంతులలో నట్టివిజ్ఞాని లేడు. ఈ విషయము నా కొక్క నికే తెలియును. తక్కినవారెల్ల నతని ప్రకృతిరతుగా దలంతురు. భోజుండును కవిని మహాకవి యనియే గౌరవించును కాని విజ్ఞానియని యెరుగడు. వినుము.

క. ఘోరి మేధమ్ములు నూరులు
పరిహత్యలు చేసినను నసంకల్పునకున్
బరమార్థవేది కంటవు
పరికింపగ పుణ్యపాపఫలములు ధరలో (8)

మహానుభావు లున్మత్తజడమూకాంధులవలె గనంబడుచుందురు. అట్టివారి యోగ్యతలను శక్తి సామాన్యులు గ్రహింపజాలరు. అని యా సన్న్యాసి యుపన్యసింపు చుండగనే కాళిదాసకవి జపము ముగించి గది తలుపు ద్రోసికొని యీవలకు వచ్చెను. అప్పు డగ్నిశిఖుండు మరియు మరియు నతని చరణంబులకు జోహారులు జేయుచు నతనియెడ దాను తా బొందిన వ్యామోహము నప్పుడు కలిగిన సంతోషమును వెల్ల డింపుచు పెద్దగా నగ్గించుటయు గాళిదాసకవి యేమియు మాటాడక సన్న్యాసి మొగము చూచి మందహాసము గావించెను.

సమయమగుటయు నగ్నిశిఖుండు యథాశాస్త్రముగా వారి నిరువుర నగ్నింగి సమంత్రకముగా నార్థికప్రయోగము నెరవేర్చెను. భుజించిన వెనుక నా యోగి యిరువురు లాశ్రోత్రియున కుత్తమసంతానము గలుగున ట్లాశీర్వదించి తమ నెలవు నకుం బోయిరి.

అని యెఱింగించి —

253 వ మజిలి

## సుమతి ప్రమతుల కథ

మరునాడు కౌశికుం డుపాధ్యాయునికడకువచ్చి గురువరా! ఈ యూరిపాఱు లెట్టివారో చూచితిరా? కాళిదాసకవి మనయింట గుడిచెనని మనకు వెలివేసిరట. విద్యార్థుల కెవ్వరికి వారయియ్యక పొమ్మనిరి. జ్ఞానతీర్థుల నెవ్వరు భిక్షకు బిలువ మింజేసి నేటి తరువాత నాతడీయూరు విడిచి యెందేనిం బోయెనట. సభాపతి యా యూరి విప్రుల కంపలకు మన యింటికిం బోవలదని తెలియజేసెనట. రచ్చలయందు గూర్చుండి మనల నాక్షేపించుచున్నారట. మన మిప్పుడేమి చేయవలయునో తెలియ దని చెప్పిన నాశ్రోత్రియుం డిట్లనియె.

ఔను. అతి గూఢమైన యా మహాత్ముని ప్రభావ మెవ్వరికి దెలియగలదు? వారికి దెలిసిన పిమ్మట నా కించుకయు విచారములేకయున్నది. మనల వెలివేసి యేమిచేయగలను? విద్యార్థు లందరు మా యింటనే కుడుతురుగాక, మీ రేమియు భయపడవలదని యభయహస్త మిచ్చెను. నాటినుండియు నంతే వారు లందే భుజింపు చుండిరి.

బ్రాహ్మణాశీర్వాద మమోఘముకదా! కొన్నిదినముల కతని యిల్లాలు చూలాలై శుభలగ్నంబున దివ్యతేజస్సమన్వితుం డగు పుత్త్రుం గనినది. మరియు గాలక్రమంబున మరియొక కుమారుడును నాడుపిల్లయు నామె కుదయించిరి. పెద్ద వానికి సుమతియనియు రెండవవానికి ప్రమతియనియు నాడుపిల్లకు బితృదత్తయనియు నామకరణములు వ్రాసిరి. దేవతా శిశువులవలె నా బిడ్డలు మువ్వురు నిరతిశయ సౌందర్యకళా విభ్రాజితులై బాలక్రీడల తల్లిదండ్రుల మిక్కిలి యానందము గలుగ జేసిరి. ఆ బిడ్డల తేజము బ్రాహ్మణ్యము మూర్తీభవించినట్లు మెఱయుచు నూపరకు వెరగు గలుగ జేయుచుండెను.

పితృదత్త బాలికయై యచ్చరపోలిక మెఱయుచున్నది. యౌవనంబున నెట్టిసోయగపు విలాసములు గలిగియుండునో యని ప్రజలక్కజ పడజొచ్చిరి. అగ్నిశిఖుడు యథాకాలమున బుత్రులకు నుపనయనము గావించి యధ్యయనము చెప్పుచుండెను. అక్కుమారు లిరువురు సులభముగా విద్యలు గ్రహింపుచుండిరి. యముడు కృతాకృతంబులు విచారింపడు. పెద్దవానికి పదమూడేడులు ముగియక మున్నె యగ్నిశిఖుండు పరలోక మలంకరించెను. దేవదత్త పుత్త్రప్రేమ యించుకయు లెక్కసేయక భర్తతో సహగమనము చేసి నాకములో గలిసికొనినది. వారి కప్పటికిని వెలితీఱలేదు. ఎవ్వరు వారింటికి రారు. వారి నెవ్వరు బిలువరు. అగ్నిమిత్రుడను బ్రాహ్మణుండు పితృసఖుం డగుట దిక్కులేని యా మువ్వురు బిడ్డలసేమ మరయుచు వారిని గుంపులో గలుపుకొనుమని సభాపతికి తెలియ జేయు

[illegible], [illegible] సగ్నశిఖుని యందుగల యీసుదంజేసి వెలిలోనుండగా బుట్టినవారికి [illegible] లేవని నిరాకరించెను.

అగ్నిశిఖుండు స్వర్గస్థుడైన కొంది దినములలో విద్యార్థులందరు తలయొక [illegible] ఉత్తర దేశముల కరిగిరి. అప్పటికి బిత్రుదత్తకు బదియేండ్ల [illegible] నున్నది. తెలిసీ తెలియని జ్ఞానముతో నా కన్నియయే వంట [illegible] గ్రాసం బెట్టుచుండెను. ఆ ముప్వురు నిల్లువదలక యున్నదానితో [illegible] కృత్యముల నెఱవేర్చుకొనుచుండిరి. అక్కుమారులకాయూర [illegible] న్చెరికారు. వారే యింట గూర్చుంకి పుస్తకముల బరిశీ [illegible] వృద్ధిపఱచుకొనుచుండిరి.

[illegible] మత్యద్భుతము. మేనఱవ్వనము ప్రాకినకొంది సాన [illegible] బరాశించుచుండెను క్రమంబున నా కన్యకా రత్నము వంటయం [illegible]. సంతతము పురాణములు చదువుచుండును. సావిత్రి దమయంతి [illegible] చరిత్రములు చదివి వారి సుగుణంబులు గొనియాడుచు నన్న [illegible] చుండును. వారిద్దరు చెల్లెలిని దద్దయు ముద్దుగా జూచుచు [illegible] లేని లోపమగపడకుండ గాపాడుచుండిరి.

[illegible] మారు లొకనాడు పితృసఖునితో చెల్లెలి వివాహమును గూర్చి [illegible] సఖుండు మీరు వెలిలోనుండదగిన సంబంధము గుదరకున్నది. [illegible] యెట్లున్నదో తెలియదని పలికిన కానిండు మంచివరుడు [illegible] పెండ్లి చేయుదము. లేకున్న దానికి దైవమే భర్త. అట్లే యుండ [illegible] సమాధానము చెప్పిరి. ఆ చిన్నది సంతతము గ్రంథావలోకనము [illegible] విషయము లేమియు గణింపదు. పితృదత్తకు మేన యౌవనము [illegible]. కాని తద్వికారము లేమియు మానసము నంటినవి కావు. నీటి [illegible] కరుగుటతప్ప యెన్నడిల్లుకదలి యెఱుంగదు. పుస్తకములే [illegible] మనుష్యులు. పురాణ గాథలే బంధువులు. ఆ పడుచు సోదరులచే [illegible] లోకవాసనీలయందు మానసము ప్రవేశింపనీయక కాలక్షేపము [illegible] చుండగ హఠాత్తుగా నత్త్వనిమేనదౌహృదయ లక్షణము లుదయించుటయు [illegible] నా చంచలాక్షి యించుకయు గ్రహింపలేకపోయినది. అన్నము [illegible], [illegible] హారము వెళ్ళగక్కుచుండ నదిరోగవికార మనుకొని యన్నలు [illegible] దిన ... లు మందు లిప్పించిరి నడల జడత, పాలిండ్లునీగువు, [illegible] క్రమంబుగం బలియ మూడు నెలలు దాటినంత నవి గర్భచిహ్నం [illegible] గ్రహింప గలిగిరి.

ఒకనాడు సుమతి యా యువతి గర్భవతియైన మాట రూఢిపఱచుకొని [illegible]. అహో! ధర్మశాస్త్రకారకులు చెప్పినమాట లెన్నడు రిత్తవోలు.

శ్లో॥ మాత్రాస్వస్రా దుహిత్రావ నైకశయ్యా వసేద్రహః
బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి.

గీ॥ తల్లితో బుట్టునక్కతో దనయతోడ
నేకశయ్యనుండ దానెన్నటికిని
మోసమొనరించు విషయసమూహ మెట్టి
పండితునైన దుర్బలునిజేసి.

ఇంద్రియచాపల్యము మహాత్ములగూడ నగాధములో దింపుచుండును. బ్రహ్మయంతటివాడు పుత్రికను మోహించెను. ఈ యింటిలో సోదరులముగాక మఱియెవ్వరును లేరు, పితృదత్తవీని మొగము జూచి యెఱుంగదు. గర్భవతి యయినది. కారణమేమని యూహింప వలయును? నేనుగాని, మా తమ్ముడు ఛీ! ఛీ! అట్టి తుచ్ఛపుపని వాడెట్లు సేయును. శ్రోత్రియబ్రాహ్మణునికి బుట్టి వేదాభ్యాసము సేయుచు నియతవ్రతుడగు వాడు అకార్యకరణము సేయునా? ఏమో కామాంధులు యుక్తాయుక్త వివేక శూన్యులని చెప్పుదురు. పితృదత్త సంతత ముత్తమ చిత్తముతో సద్వ్రతంబులు సేయుచుండును. ఇట్టి నీచపు పనికొడంబడునా? ఏమియు నెఱుగనిచో గర్భవతి యెట్లగును? ఏదియు నిశ్చయింప శక్యము కాకున్నది. ఈ రహస్యము దైవమునకుగాక మనుష్యుల దెలియదు. పాపకృత్యములు కనులార జూచుటకంటె నెందేవి లేచిపోవుట. లెస్స. అని తలంచుచు నా రాత్రి దమ్మునికొక కమ్మ వ్రాసి ముగ్గు బుట్టలోనిడి వేకువజామున నెవ్వరికిం దెలియకుండ సుమతి దేశాంతర మరిగెను.

ప్రమతియు దైవికముగా నాడే పితృదత్త గర్భవతి యయినదనియు తెలిసికొని పరితపించుచున్న వలననే యా పని జరిగియుండునని తలంచి లోకప్రవృత్తి యెఱిగి కామమును గర్హించుచు స్త్రీ చేష్టితముల నిందించుచు సోదరీ స్నేహపాశబద్ధుండై యామె నేమియు ననజాలక యన్న పేర నొక చీటి వ్రాసి పంచాంగంలో బెట్టి యెవ్వరికి జెప్పకుండ ప్రమతియు నాటి వేకువజాముననే విదేశ మరిగెను.

పితృదత్త వాడుక ప్రకారము వేకువ జామునలేచి యీశ్వరధ్యానము సేయుచు సుమతి పండుకొనియున్న గదిలోనికిబోయి అన్నా! లెమ్ము. లెమ్ము. తెల్లవారుచున్నది. నాకు ప్రార్థనశ్లోకములు సెప్పవా? అని యడిగి ప్రతివచనంబుగానక యతండులేని యవ్వలికి బోయెనని తలచి ప్రమతి గదిలోనికిం బోయినది. అతండును నందులేడు. ఇరువురు పెందలకడలేచి యెక్కడికో పని యుండి యేగిరని తలంచి తత్కారణ మాలోచింపుచుండ నింతలో దెల్లవారినది. అబ్బాయి వంటసాలయలికి ముగ్గుపెట్ట బుట్టతీసినంత నందు సుమతి వ్రాసిన చీటి గనంబడినది. విప్పి చదువ నిట్లున్నది.

సీ॥ తమ్ముడా! మనము శుద్ధశ్రోత్రియుని పుత్రు
లము సోదరియ సుశీల పరిసక్త
మన ముస్వరకాక మారువారియింట
లేరు పోవదుగ చెల్లెలును నిల్లు
విడిచి యెన్నడును గుర్విణియయ్యె లేమి! యే
మని తలంపగ దగునయ్య చెపుమ!
త్రపమే యెరుగు తత్కారణ మింతక
న్న మరేమి వచియింప నాల్కరాదు.

గీ॥ ఏపాపాత్మునిఁబు శిక్షింపనోప నేను
చెల్లుపదచి పరారినై యేగుచుంటి
గాపెరక్షింపుమిక నీవె గర్భవతిని
ద్రోతికియుండిన గొంతు నెప్పటికినైన (8)

ఈ యుత్తరము చదివికొని పిత్సృదత్త గుభాలున నేల ఆదికిలబడినది. క్షణ కాలము ఏమియును తెలియలేదు. ప్రపంచకము గిరగిర తిరుగుచున్నట్లయినది. కొంత తడవున కొంతలు తెలిసి ముక్కుపై వ్రేలిడికొని యౌరా! నేను గర్భవతి నెట్లయితిని. నా సోదరుం డిట్లు వ్రాసెనేమి? ఇది స్వప్నమా? కాకున్న సుమతి నా కిట్లు వ్రాయునా? అయ్యో! సోదర వియోగదుఃఖము నేనెట్లు సైరింతును? ప్రమతి యింటను విడిచి ప్రాణములు ధరించునా? ఇట్లువచ్చె నేమియని దుఃఖించుచు భ్రమతిరాక [illegible]చుండెను.

అంతలో పాచిచేయుటకై దాసి యరుదెంచినది. దానిం జూచి పిత్సృదత్త [illegible] మరుగుపఱచుచు ఓసీ! చిన్నన్న వీధి నెందేని గనంబడెనా? అని యడిగిన గనంబడలేదు. అమ్మా మీ మొగమట్లు చిన్నవోయి యున్నదేమి? అన్న లెందేగిరి? ఎందుకు విచారింతువా? అని యడుగుచు పరవుడున కేమియు నుత్తరమీయక [illegible]కొని ధ్యానించుచుండెను. ఆ దాసి ముగ్గుబుట్టకై ద్వారబంధము మీది గూటిలో చెయిపెట్టినది. కనంబడలేదు. "ముగ్గుబుట్టయు పంచాంగము ద్వారబంధపు గూటిలో నుండుట లోకుల కలవాటు" దానిచేయి దగిలి పంచాంగము జారి క్రింద బడెను. దానిలోని ప్రమతి వ్రాసిన చీటి గాలిచే నెగిరి పొరలుచుండ పిత్సృదత్త చూచి దానిం దుడికొని చదువ నిట్లున్నది.

అన్నా! పవనపర్ణాంబు భక్షులైన మహర్షులుగూడ యింద్రియసమూహమును జయింపలేకపోయిరి. మన మన నెంతవారము. కామము యథావిధి వినియోగము గావింపని పక్షమున ప్రబలియ యగుంగదా! మన పిత్సృదత్త యంతర్వత్నియగుట నీకును నాకును తెలియదు కారణ మగాహ్యమైయున్నది. ఎవ్వరి నేమనుటకును నోరాడదు. ఏపాపాత్ముల శిక్షింప నిష్టము లేని వాడనగుట నింటనుండజాలక దేశాంతర మరుగు

చున్నవాడను. సోదరిం గాపాడుభారము నీ మీద వైచితిని. అందలి మంచి చెడ్డలు నీవే వహింపవలసి యుండును. పితృదత్త మన చేతులలో పెరిగినది దాని నేమియు నిందింపరాదు. బ్రతికియుండిన నెప్పటికైన నిను గలసికొనకపోము.

ఇట్లు
భవత్ప్రియసోదరుడు ప్రమతి.

# పితృదత్త కథ

ఆ చీటి చదువుకొని యాబోటి నేలంబడి మూర్ఛిల్లినది. పెద్ద తడవునకు తెలివి దెలిసి హా! సోదరులారా! నీ చెల్లెలి శీలమెరింగియు మీరింతయు ననుమానపడి నన్ను విడిచి లేచిపోవుదురా? దిక్కుమాలి యొక్క నిముషము బ్రతికియుందు ననుకొంటిరా? ఇక గడియలోనే మడిసెదంగాక. కాని నాకీ యపనింద యెట్లువచ్చినదో తెలియదు. పురుషసంపర్కములేక గర్భముదయించునా? ఛీ! తండ్రులవలె నన్ను గారాబముగా పెంచిన యన్నదమ్ములు పరకీర్తి జెందు దేశముల పాలై పోవ నేనిందు బ్రతికి యేమిచేయుదును? చచ్చుటయే కర్తవ్యమని యన్నలం దలంచుకొని వెక్కి వెక్కి యేడువదొడంగినది. దాది యామెదాపునకుం బోయి — అమ్మా! ఎన్నడును గంటతడి పెట్టని నీ విప్పు డిట్లేడుచుచుంటి వేమి? అన్న లెందుబోయిరో నిజము చెప్పుము. అని యడిగిన కొంత సేపేమియు మాటాడక యెట్టకేల కిట్లనియె.

ఓసీ! నేను చూలాలనైతినా? ఆ చిహ్నము లెట్టివి? అది యెట్లు వచ్చును. అని యడిగిన నద్దాసి సెబాసు! నీకే తెలియకుండ గర్భమైనదియా? నీ వడలు, నీ నడుము, నీ మొగిము చూచుకొనుము. నీకే తెలియగలదు. నన్నడుగనేల? నేనిది వరకే గ్రహించితిని. పెండ్లి కాని బిడ్డవు. పెద్దలింటలేరు. మీది గొప్ప వంశము. ఇట్టిరట్టుజెందుట నీ వంటి దానికి దగదు. నీ వెవ్వరితో భోగించితివో చెప్పుము నా కడ దాచకుమని యడిగిన ఛీ! భోగమన నేమి? ఏమంటివి? అని కసరుచు నా దాది మరియు నిట్లనియె.

వాలంటి! నీ వెంత నంగనాచివోగదా! భోగమన నేమియో నెరుంగనంటే యిట్లు పొట్ట పెంచికొంటివా? చాలు, చాలు. నిజము చెప్పుమని కసిరినది పో పొమ్ము రండా! అవ్వలికి బొమ్ము. ఇంక నేనెవ్వరితో మాటలాడను. నాకు నీవు నీతులు చెప్పవలదు. అని యదలించి కన్నులు మూసికొని యాయన్నలమిన్న పెండియు విలపింప దొడంగినది. అప్పుడా దాది వేగమ పితృసఖుండగు నగ్ని మిత్రుని కడకరిగి యయ్యగారూ! సుమతి ప్రమతులింటలేరు. పితృదత్త యూరక దుఃఖించుచున్నది. మీరు వచ్చి యోదార్చుడని చెప్పుటయు నప్పుడతడు వచ్చి చెప్పిన నప్పడతి యున్నకడ కరుగుటయు పుత్తరుండ యనని చరణంబులంబడి గోలున నేడువ దొడంగినది. అతం

బొమ్మని కనరుచుండెను. ఆమె కేలోపము రాకుండ దగిన పరిచారకుల నియమించెను.

అని యెరింగించువరకు కాలాతీతమైనది. తదనంతరోదంత మవ్వలి మజిలీయం దిట్లు చెప్పందొడగెను.

## 254 వ మజిలీ

# సమస్యాపూరణము

ధారానగంబున భోజమహారాజు రాత్రులయందు మారువేషము వైచికొని యూరి విశేషములం దెలిసికొనుటవాడుకయై యున్నది. ఒకనా డప్పదమితే దంధకారబంధురమగు కృష్ణపక్ష క్షపా ప్రథమ యామావసానమున గంబళి కప్పుకొని వికారీ వేషముతో బట్టణము వీధులం దిరుగుచు దైవికముగా బ్రాహ్మణ వీధి సందులో చూరుపంచ పొంచుండ లోపలి దంపతుల సంవాద మిట్లు వినంబడినది.

బ్రాహ్మణి - నాథా ! అగ్నిశిఖుని కూతురు పితృదత్త యొన్న మగ శిశువుని గనినదట. వింటిరా ? ఆ బాలు డెంతయో చక్కగా నున్నాడట. మనపిల్ల వెళ్ళి చూచి వచ్చినది.

బ్రాహ్మణుడు—పురుడు వచ్చినదీ ! ఛీ ! ఆ పేరు తల పెట్టకుము. వావి వర్తనలు లేక ప్రవర్తించినది.

బ్రాహ్మణి—రామరామ ! లోకులనుకొను మాటలు వట్టివట. రాత్రి కలలో నెవ్వడోవచ్చి యామెతో గలిసికొనెనట. అందువలన గర్భమైనదట. అమ్మాయి చెప్పినది.

బ్రాహ్మణుడు— ఆ కల్పన దాని తండ్రి సఖు డగ్నిమిత్రుడు చేసి యున్నాడు. అట్లనక యగ్నులకై నదని చెప్పునా యేమి ?

బ్రాహ్మణి—అన్న లుత్తరములు వ్రాసి యొకరిపై నొక రనుమాన పడి లేచిపోయిరట. కాదా ? ఈ నింద వారికెట్లు వచ్చినది ?

బ్రాహ్మణుడు—ఇట్టి యపఖ్యాతి వహించి యూరిలో నిలువ గంరా ? నలుగురు మీదనుమియరా ? అబ్బా ! వీరి తండ్రి కెట్టిగర్వము ! తానే శ్రోత్రియుడ ననియు నూరిలోని వారెల్ల నపవిత్రులనియు దలంచువాడు. వానికి మంచి సంతానమే కలిగినది.

బ్రాహ్మణి—ఇంక వాండ్రను బ్రాహ్మణులలో గలపరా ?

బ్రాహ్మణుడు—తండ్రి నాటి సందియు వారికి వెలియే. ఇప్పు డీకన్య కుంతివలె కొడుకును గన్నది. ఆ వెలి నెవ్వరు తీర్పగలరు ?

బ్రాహ్మణి—సభాపతిగారి చేతిలో నాలుగురూకలు బెట్టిన ప్రాయశ్చిత్తము నెఱవేఱకుండునా ?

బ్రాహ్మణుడు — ఈ లాటి మాట లాడకుము. ఎవ్వరైన వినిన నవ్వుదురు.

అని వారు మాటాడుకొనిరి. ఆ సంవాదమంతయు భోజభూపాలుఁడు చాల వినెను. ఆ వృత్తాంతము సాంతముగా దెలియక చింతించుచు నటగదిలి కొంతదూరము పయనించి మఱియొక యింటి చూరు ప్రక్క నిలువంబడుటయు నం దిట్టిసంవాదము వినంబడినది.

భార్య—పితృదత్త కుమారు డెంత చక్కఁగా నున్నవా డనుకొంటిరి ! ఆహా ! ఆ సౌందర్యము చూచితీరవలయును. ముద్దులు మూటగట్టు చున్నాడు. వానిని చూచి చాలసేపోయితిని. నా కట్టి కుమారుడు గలుగగూడదా ?

భర్త—నీవుకూడా నవ్వేదియ చేదినట్లు చేయుము. మంచి కుమారుఁ డుదయింపగలఁడు.

భార్య—అది యేమి చేసినది ?

భర్త—ఏమిచేయకున్న కన్యక కెట్లు సుతుం డుదయించును.

భార్య—స్వప్నములో నెవ్వడో వచ్చి దానిని గూడెనట. ఆ మాట యబద్ధ మందురా యేమి ?

భర్త—నీ కెప్పుడేని నట్టి కలవచ్చినదా ! వచ్చినం బాగుండునుగదా ! ఈ టక్కరిమాట లీ కాలములో నెవ్వరు నమ్ముదురు ? ఇది యగ్నిమిత్రుడు చేసిన కల్పనయట.

భార్య—పాప మా పిల్లను నాకును చిన్నతనమునుండియు సహవాసము. అట్టిగుణవంతు రీ పృథివిలో లేదని చెప్పగలను. ఎప్పుడూ పుస్తకములే చూచు చుండును. అట్టి యాచార వంతురాలింకొకతె లేదు.

భర్త—గుణములు మంచివియే. ఆచార మెక్కుడుగా జేయును. పుస్తకములు చదువవచ్చును. కడుపులో గుణమెట్లు పోవును ?

భార్య—అయ్యా ! గర్భముమాట నాకు దెలియదు కాని యది నిర్దోష గాని నేను శపథముచేసి చెప్పగలను.

భర్త—వహవా ! గర్భముమాట దెలియదా ? నిర్దోషురాలని చెప్పెదవా ! ఇతర దోషము లేమియు లేకపోవచ్చును. అక్కడనే సందేహాస్పదము.

భార్య—దానికర్మ మట్లున్నది. దానికి దిక్కెవ్వరును లేరు. పాపము అగ్నిమిత్రుడే పుడుకు పోయించుచున్నాడు. అని కన్నీరు విడుచుచున్నది.

ఆ సంవాదము వినుటచే భోజన కియ్యుదంతము కొంతయంతఃకరణ గోచరమైనది. అతం డక్కడ గదలి మఱియొక వీధికిం బోయి యాకర్ణింప నేరొక

యింటిలోగూడ నట్టి సంవాదమే వినంబడినది. పెక్కేల? ఆ రాత్రి నా ధ్రాత్రీపతి బ్రాహ్మణవీధిలో నెక్కడికిబోయినను పితృదత్త ను గురించి చెప్పికొనుమాటలే వినం బడుచుండెను. కొందరామె మంచిదనియు, గొందరు చెడ్డదనియు, నాటోపవాదములు గావించిరి. బోజనృపతికింగూడ నా వేదియ శీల మెట్టిదియో, యా యర్భకుం డెట్టుదయించెనో నిజము దెలిసికొన నభిలాషగలిగినది. తెలతెలవారుచుండ నింటికి బోయి పండుకొనియెను.

మరునాడు కొలువుకూటంబున కరుదెంచి విద్వత్కవులనెల్ల రప్పించి యీ సమస్య నిచ్చెను.

శ్లో॥ ప్రసూత కన్యాత్మజ మప్యనాధా

ఆ సమస్య కవుల కిచ్చుటయు దలయొకరీతిని బూర్తి గావించిరి. అందు భవభూతి.

శ్లో॥ మునీంద్ర దత్తోత్తమ మంత్ర శక్త్యాసమీక్షింతుభాను ముదీక్షకుంతీ
సరిద్గతాహూతరవి ప్రభావాత్ ప్రసూత కన్యాత్మ జమప్యనాధా.

కన్యక మగడులేనిదై నను కొడుకుని గనినది. అను సమస్యకు భవభూతి దూర్వాసులచే నీయబడిన మంత్రశక్తి ని దెలియుటకై కుంతీదేవి భానునిం బిలిచి యతనివలన కుమారునిం గనినది యని పూర్తి చేసెను.

పిమ్మట నమ్మహారాజు కాళిదాసకవి మొగంబుచూచి కవీంద్రా! నీవుకూడ నీ సమస్యం బూర్తి చేయుదువే యని కోరుటయు నమ్మహాకవి యిట్లు పూర్తి చేసెను.

శ్లో॥ సకామరూపో మణిమాన్నృణీంద్రః
సరిత్త టేవీక్ష్య వధూం ప్రసక్తః
ప్రవిశ్యరేమే నిశికన్యయాంతః
ప్రసూతకన్యాత్మజమప్యనాధా.

మణిమంతుడను సర్పరాజు కామరూపుడగుట నేటియొడ్డున బిత్రృదత్త ంజూచి మోహించి రాత్రి యామె పండుకొనిన గదిలో బ్రవేశించి నిద్రలో నామెతో గూడెను. దానం గుమారు డుదయించెను. అని కాళిదాసకవి పూర్తి చేసెను.

భోజభూపతి రాత్రి బ్రజలాడుకొనిన మాటలలో నా బోటి కలలోవచ్చి యెవ్వడో తనతో గలిసికొనెనని చెప్పెననువార్త వినినవాడగుట నా కథ కీ సమస్య సరిపోయినట్లుగా దలంచి పితృదత్త సత్తమ వ్రతశీల సంపన్న యని నిశ్చయించి యట్టి దేవరహస్యము వెల్లడించిన కాళిదాస కవి నగ్గించుచు గౌగలించుకొనియెను.

తరువాత తన రాజధానిలో నొక సతీతిలక మూరక యపనింద పాల్పడిన దని వగచుచు నప్పుడు యా రహస్య చరిత్రమంతయు బత్రికలలో వ్రాయించి గ్రామ మంతయు బంచిపెట్టింపుచు నామె నిర్దోషురాలని చాటింపజేసెను.

[illegible]తో నిడువర మరునా డుదయకాలంబున నా పతివ్రతను నామె గనిన [illegible] దగ్రపక్షకందగు నగ్నిమిత్రునకు వార్త నంపి మంత్రిసామంత [illegible] సహితముగా బిత్రృదత్త యున్న సూతిక గృహపరిసరమున కరిగెను. [illegible] వచ్చి నాలుగు దివసరములైనవి. అయ్యది శిష్టమునకు బాహ్మణస్త్రీలు [illegible]గా వచ్చి చూచుచు బాలకుని రూపురేఖా విలాసముల కచ్చెరు [illegible] నాక్షేపించుచు మరలిపోవుచుండిరి. ఆడువారాడు మాటలు [illegible] చెవులం బడినవి. లోకులు కాకులవంటివారు. అప [illegible] పలుకులను శ్రోతలకునుగూడ గడుప్రీతిగానుండును. పిత్రృదత్త [illegible] ప్రసవించినను ననుమతింపరుగదా అని యాలోచించుచు నగ్నిమిత్రుని [illegible]యన్నలు దేశాంతరమరిగిరా? మీరే యీ యిల్లాలిని గాపాడ [illegible]? [illegible] మీకు జాల పుణ్యము రాగలదని పలికిన నవ్విప్రుం [illegible].

[illegible] పిత్రృదత్త కడు సత్తమురాలు. ఈ యూరి పౌరులెరుగక [illegible] నిందలు వేయుచున్నారు. దీని యన్నలు శుద్ధశ్రోత్రియులు. ఈ [illegible] నొక యపవాదము వినిపె నొక రనుమానముపడి దేశాంతర మరిగిరి. ప్రజలా [illegible]గా నపోహపడు చున్నారు. "దుర్బలస్య బలంరాజా" అని [illegible] దిక్కుమాలిన యీ బాలికకు దేవరయే దిక్కు కావలయును. అని [illegible] నృపతి యపరిమితానందము జెందుచు బొత్తికలోని యా శిశువును [illegible] తదాకార లక్షణములరసి వీడు దేవతాంశవలన జనించినవాడు సంది [illegible] నా పాలన కిట్లనియె. బాలకోత్తమా! నేడు మొదలీ [illegible] భారము మేము వహింతుము. నెలకు వీరి కెంతసొమ్మవసరమో [illegible] సమముగా నేర్పరచి పంపుచుందును. ఇట్టి శ్రోత్రియు లీ యూర [illegible] యను దెలిసినదికాదే యని పలికి కావలసినసొమ్ము గురించి తెలిసి [illegible] యా బాలకునకు గానుకగానిచ్చి పరివారముతో గూడ నింటికి [illegible].

అప్పుడే మంత్రితో నాలోచించి నెల నెలకు ప్రథమదివసంబుననే మూడు [illegible] దీనారములు పిత్రృదత్త కనుపుచుండవలయునని శాసనము వ్రాసియిచ్చి [illegible] సభాపతిని రప్పించి యిట్లనియె.

రాజు — మీరు అగ్నిశిఖుని కూతురు పిత్రృదత్త నెరుంగుదురా?

సభాపతి — తండ్రినాటినుండి నెరుంగుదుము.

రాజు — పిత్రృదత్తకు మీరు వెలివేసితిరట! ఎందులకు?

సభాపతి — ధర్మశాస్త్రము ననుసరించి పెండ్లికాకుండ నితర పురుషులతో [illegible] గనుటచే.

రాజు - ఆమె తెలిసియే చేసినదా ?

సభా - అది యెవ్వరికి తెలియగలదు.

రాజు - ఆమెతో స్వప్నములో దేవపురుషుడు వచ్చి కలసికొనియెను. దానం గర్భవతియై పుత్రునిగనినది. ఇందామెదోష మేమియున్నది ?

సభా - అంతయు నట్లే చెప్పుదురు. ఆ మాట నమ్మ నర్హముగా నున్నదా యని యాలోచింపవలయును.

రాజు - (కోపదృష్టితో) నేను దైవశోధనచూచి చెప్పుచున్నాను నమ్ముదురా నమ్మరా !

సభా - మహారాజా ! అందులకు నేనేమి చెప్పుదును. పదుగురితో బని నే నొక్కరుఁడ నమ్మిన నేమిలాభము ?

రాజు - నలువురతో నా మాటగా జెప్పుము. ఈ మాటు వెలియనిన శిక్షింతు జాగ్రత్త. పో పొమ్మని కసరి యేలిక లోపలికిం బోయెను.

సభాపతి యింటికిబోయి మరునాడు రచ్చపల్లియం దొకసభ గావించెను. ఆ సభ కాయూరిలో పేరుపొందిన బ్రాహ్మణోత్తము లెల్ల విచ్చేసిరి. ముందుగా సభాపతి యిట్లుపన్యసించెను. సభాస్తారులారా ! మన గ్రామము వేదశాస్త్రపారంగతులగు పండిత ప్రకాండులచే నిండి యున్నది. ఇందలి వారందరు పూర్వాచార పరాయణులని వేర చెప్పనవసరములేదు. ఇప్పుడు మనకు ప్రభువు భోజుండు. విద్యాపీకమే కాని వైదికులయందు వైదిక కర్మలయం దంతగా నాదరము వహింపడు. కవీంద్రుల నెక్కుడుగా గౌరవించునని లోక విదితమేకదా. కవుల నాచారపరులు, కర్మహితులు స్నానమైన జేయకుండ భుజింతురు. శృంగారపురుషులు. ఇందులకు నిదర్శనము కాళిదాసకవియేకదా ! ఈ రట్టంతయు నతని మూలముననే వచ్చినది. నన్ను నిన్న రాజు పిలిపించి పితృదత్తకన్యయై పుత్రుని గనినం గనుగాక యుత్తమురాలు దానికి వెలివేసినవారిని శిక్షింతును పోయి మీ బ్రాహ్మణుల కెల్ల జెప్పుమని నాతో జెప్పెను. నే నేదియో చెప్పబోయిన నాయనకు గోపము వచ్చినది. కాళిదాసకవి బ్రాహ్మణార్థముమాట యుగ్గింతమనుకొంటిని కాని యూరకయే మండిపడుచుండ నా మాట చెప్పిన నాజ్యముపోసిన యాహుతివలె మరియుం గినయగలడని యూరకుంటిని. ఇందులకు మీరేమందురో చెప్పుడు. మనకు రాజుతో గలహము వచ్చును. ఆలోచింపుడని చెప్పి కూర్చుండెను.

అప్పుడు మరియొక విప్రుండులేచి రాజుగారికి గోపము వచ్చిన మనల నేమిచేయును ? కులము కట్టుబాటులతో దాను జోక్యము కలుగజేసికొనుట కడుంగడు తప్పు. ఇది రాజకీయవ్యవహారము కాదు. కాళిదాసకవి యక్కన్యతండ్రి తన్ను మున్ను బ్రాహ్మణార్థము పిలిచెనను సభిమానముతో నగ్నిమిత్రునివలన నా రహస్యము దెలిసికొని సమస్య యట్లుగా బూర్తిచేసెను. రాజు అమాయకుడగుట నా

వేతనము తీసికొని మీ యింటికి వచ్చుచుందును. నిన్ను జూచినది మొదలు నా హృదయమును మదనుడు పదునుపదరంబుల పీడింపుచున్నాడు. ఏమిచేయుదును ? ఈ బాధ నీతో జెప్పుకొనుట కవకాశము దొరకదు నీ పాదము తోడుగా జెప్పుచున్నాను. నిను దలచుకొన నన్నము రుచింపదు. నీ వదనవిలాసములు సంతతము నా హృదయమున గట్టినట్లే యుండును. నీ వనాథవుగద నన్ను గైకొనుము మఱి నక ముఖముగా నృపతితో జెప్పి నీ వేతన మభివృద్ధి నొందజేసెద. నా యందము కన్నెత్తిచూడుము. నీ నందనునిచ్చినవానికి దీసిపోవను. నీవు తిరస్కరించి వేని యిప్పుడే నీ పాదములమ్రోల ప్రాణములు విడిచెదనని తన మనసిగల యనురాగ మంతయు వెల్లడించుటయు నప్పల్లవపాణి హృదయము ఝల్లుమన నించుక యాలోచింపుచు సరే, కానిమ్ము. ఇది సమయముకాదు. రాబోవు శుక్రవారము మొదటి జాముమన మా యింటికిరమ్ము నీ కొఱకు వేచి యుండెద. ఇదియే సాంకేతికమని చెప్పి చేయివిడిపించుకొని యవ్వలికిం బోయినది.

దైవికముగా బురోహితుడుగూడ నాడే యొకసందు మలుపులో గాచికొని యుండి యవ్వేదండగమన వచ్చినతోనే యడ్డమై చేయిపట్టుకొని నాతీ! నీతో నొకమాట జెప్పవలసి యిందు గాచితిని. మీ యింటికి వచ్చినప్పు డవసరమే దొరకదు. నీ గర్వ ప్రదు డెవ్వడో తెలియదుగదా ? నేను రాజపురోహితుడ నెరింగితివా ? మా తండ్రి పెద్దవాడగుటచే నీ నడుమనే నాకీ పురోహితత్వ మొసంగిరి. తేనికి బ్రీతివిషయము నన్నడుగక తీరదు. భార్య గదిలోనికిగూడ నే జెప్పినగాని పోవదు. నీ వేతన మింకను వృద్ధిచేయుమని చెప్పుచున్నాను. నిన్నాక్షేపించిన బ్రాహ్మణుల నెల్ల జదురునకు పిలిపించి మందలింపజేసితిని. నీ నిమిత్తము పడుచున్న కష్టము నీ కెట్లు దెలియును. వినుము. నీవు పూర్ణయౌవనములో నుంటివి. మంచిచక్కనిదానవు. నిన్ను జూచ జాలిగలుగుచున్నది. నీ బిడ్డ కేడెనిమిదేండ్లు వచ్చినవి. తగిన పురుషుడున్న నీ పాటికి మఱియొక కుమారునిం గనకపోవుదువా ? నీ ప్రసన్న పురుషుడు వెండియు వచ్చినజాడ గనంబడదు. ఈ పరువపుదినముల నూరక బోగొట్టుచుంటివి. వచ్చినవాడు రానేవచ్చినది. కాళిదాసకవి నాకు మిత్రుడే. ఏదో సమస్య పూర్తి చేయించి నీపై నిందలేకుండ జేయు సామర్థ్యము నా కడ నున్నది. సమకులుడ శృంగార గ్రంథములు బాల చదివినవాడ ఈడుజోడువాడ నా యభిలాష తీర్పుము. యీ మాట నీతో జెప్పుటకే యిందు వచ్చితి సత్వరము ప్రత్యుత్తరమిమ్ము నలువురు లేచువేళయైనదని యడిగిన నప్పడతి చిరునగవుతో రేపు రాబోవు శుక్రవారము రెండవజాముస మా యింటికి రమ్ము. నీకై వేచియుందునని చెప్పి యా సుందరన యవ్వల బోయినది.

మరికొంతదూర మరిగినంత గణకు డడ్డంబై తనపేరుచెప్పి వారివలెనే తన యభిలాష వెల్లడించుటయు శుక్రవారమునాడు రాత్రి మూడవజామున రమ్మని

నిరూపింప యేగినది. మరినాలుగడుగులు నడచిన దండనాథుం డడ్డంబై నిర్బంధింప నాలుగవజాము నరమ్మని చెప్పినది.

అట్లు కపటోపాయంబున నా నారీమణి వారిబారినుండి దప్పించుకొని తెల్లవారు నప్పటికి యింటికి బోయినది. అప్పుడే యా దుండగము నృపతికి నివేదించిన నతం డెట్లు గెలంతునో పట్టి యిచ్చుటయే కర్తమని యా జన్ని గట్టువట్టి యొకపెట్టె నాలు గురిం గలది చేయించి నాదు చేయదగినవి వానము ప్రోథలగు దాదులకు బోధించి [illegible] నిరీక్షించు చుండెను.

ఆ నలువురు నింటికింబోయి శుక్రవార మెప్పుడువచ్చునని గడియ లెంచుకొనుచుండిరి. ఒకరి రహస్య మొకరెరుగరు. మంత్రిపుత్రుడు [illegible] మొదటిజామున రమ్మన్న కారణ మేమైయుండునని యాలో చించి తెలిసినది మొదటిజామే భోగసమయము రెండవజాము నిద్రావేశసమయ [illegible] యోగ్యముకాదు. అట్టిజాణ యెందైనగలదా? మొదటిజామన్నది [illegible] నాలుగు జాములు నిద్రబోనిత్తునా! నా పాండిత్యము చూచినతరువాత విడు [illegible]! అట్టి యదృష్టము పట్టిన నేతన్యుడగదా అని యాలోచించుచుండెను.

పురోహితుడు రెండవజామున రమ్మన్నది కారణ మేమగును? ఔను తెలిసికొంటి [illegible] సంచారయోగ్యంబగు కాలమర్ధరాత్రము కాక ప్రథమయా మమా! యింత తెలిసికొనలేకపోయితినేమి? అని సమాధానపడి సమయము నిరీ క్షించుచుండెను.

షరాబు ఇంటికింబోయి మూడవజామున రమ్మన్న హేతువు వితర్కించుచు [illegible] సంగళ్ళే కట్టుదు. రెండవజామున రాజ పురుషులు వీధులగస్తు తిరుగు చుందురు. మూడవజామున నందరు నిద్ర యావేశించియుందురు. అందువలనే యప్పుడు [illegible]. రహస్యగోపనమునకై చెప్పినమాట గ్రహింపలేని వెంగలి నక్కలికి [illegible] నెట్లు [illegible] వడయుదునో తెలియదు. అని యాలోచించి సమాధానపడి తరి [illegible].

ఆ దండ నాథుడు అయన్ను మిన్న నన్ను మూడుజాములు విడిచి నాలుగవజామున రమ్మన్నదేమి? అప్పుడు మఱియొకవిటునితో గూడునా? అట్టిజాణ [illegible] గసటుతదే! నాకు జదువురాదు శంకనగుట నా మర్మము తెలిసికొనజాల [illegible] అని తలంచుచు బండి తులకడకు బోయి రాత్రి నాలుగవజామున జేయ [illegible] కృత్యము లెట్టివో చెప్పుదని యడుగుటయు దలయొకమాటయు జెప్పిరి. [illegible] పండితుడు "పద్మినీమంత్య యామె" అనియున్నది. పద్మిని జాతి స్త్రీకి [illegible] ప్రియమగుట దానితో నప్పుడు గూడుట లెస్సయట్లు చేయుమని [illegible] జెప్పెను.

ఆ మాటవిని దండనాథుడు మనసులో నోహోహో! ఎంత గూఢమైన

యూహ ! ఇది నా కెట్లు తెలియును ? ఆ చిన్నది పద్మినీజాతి యగట నప్పుడు రమ్మన్నది. దీనివలన నా భోగమున కిష్టపడినట్లె తలంపనగును. నిజము తెలియక పాపము లేనిపోని యపోహలు పడితినిగదా ! అని యుబ్బుటలూగు డెందముతో గడియలు లెక్క పెట్టుచుండెను.

ఎట్టకేలకు శుక్రవారమునాడు సూర్యోదయమైనది నలువురును క్షౌర ములు చేయించుకొని కనురెప్పలు మీసములు దిద్దించుకొని యద్దము చూచుకొనుచు తమరూపము లెప్పగానున్నదని మురియుచు నభ్యంగనమాడి క్రొత్తపుట్టములు గట్టికొను చుండ దక్షణము రావలయునని రేనియొద్దనుండి వారినలువురకు బిలుపువచ్చినది. అందులకు వెఱచుచు నొక్కటొక్కరుగా నృపతికడ కరిగిరి. నరపతి పురోహితుని జూచి క్షౌరము సేయించుకొనుట గ్రహించి, పౌరుడా ! నేడేకాదశియని యెరుంగవా ? పర్వదినంబున క్షౌరము చేయించుకొంటివేమి ? బ్రాహ్మణుడవుగావా ? కర్మభ్రష్టుం డవా ? యని యాక్షేపించుటయు నతండు గడగడలాడుచు దేవా ! నేడు పర్వమని యెఱుంగను, పంచాంగము చూడలేదు. ప్రమాదము జరిగినది. ఇందులకు ప్రాయ శ్చిత్తము జేసికొనియెద క్షమింపుడని వేడుకొనియెను.

అంతలో దక్కిన మువ్వురుకూడ నక్కడకు వచ్చి వారున్నిష దారులైనను మొగంబుల క్షురక్రియలు. పొడగట్టుట గ్రహించి ప్రభువోహో ! మీకును బుద్ధిలేక పోయినదా ? ఏకాదశి మంచిసమయము దొరికినది? అని యదలించిన వారు మేము మంచి చూచుకొనలేదు. అయ్యగారినిజూచి చేయించుకొంటిమని యుత్తరమిచ్చిరి. రాజు నవ్వుచు గానిండు. మీ కందరికిందుల నిష్కృతిగాగలదు, రంగగిరిలో నేటి రాత్రి రథోత్సవము జరుగును. ఆ పెరుమాళ్ళకు మనమీయవలసిన వార్షికము దీసి కొనిపోయి యర్పించి రేపు సాయంత్రమునకు రండు మీ కిదియే ప్రాయశ్చిత్తము. పొండని పలికి సొమ్మిమ్మని కోశాధిపతికి జీటియిచ్చి భూపతి లోపలికింబోయెను.

ఆ మాటవిని నలువురహృదయములు ఝిగుమన్నవి. యొకరో ఒకరికిలబడిగ్, ఒకరిరహస్య మొకరితో జెప్పుగొనరు. అందరిమొగములు నొకరీతినే వాడిపోయినవి. వెట్టనిట్టూర్పులు నిగిడించుచు పురోహితుండు తక్కినవారికిట్లనియె.

పురోహితుడు — అమాత్యపుత్రా! నీవు నాకు జిరమిత్రుడవు నే నెరుగక క్షౌరము చేయించుకొంటిని. అందులకు ఉపోష్యపవాసముండి ప్రాయశ్చిత్తమంత్ర ములు రువ్వు పెట్టుకొనియెద రాజుగారి యెదుట మాటాడలేకపోయితిని. ఇందులకు నీవు నా కొక యుపకారము చేయవలయును. మీ మువ్వురు బయలుదేరి వెళ్ళుడు. నియమితకాలమునకు స్వామికి సొమ్మర్పింపుడు. ధూపోత్సవసమయమునకు మిమ్ము గలిసికొనియెద. ఇదియే నా ప్రార్థన.

మంత్రిపుత్రుడు — గురుసత్తమా ! నే నా మాటయే నీతో జెప్పదలంచు చుండ నీ మాట ముందైనది. నీకు నూటపదారు రూకలు కానుక నిచ్చెద. నన్ని

గ్రామ ... గ్రామములో నుండునట్లు చేయుము. నేడ గత్యమైనపనియున్నది. రేపు రంగగిరిలో మిమ్ము గలిసికొనగలను. అందఱము రేపురాత్రి కీ యూరు చేరుదము, మీ ప్రాయశ్చిత్తము మరి యొకప్పుడు చేసికొనవచ్చును. ప్రభువు చెప్పినట్లారథోత్సవములో దాసులగుటయే నిష్కృతి. రథస్థుడైన రంగని సేవించుటకంటె మంత్ర ప్రాయశ్చిత్త ముత్తమముకాదు. నీ యుపకారమెన్నటికిని మరువను.

పురోహితుడు – నా ముద్దు నీవే చెల్లింపవలయును.

మంత్రిపుత్రుడు – అట్లుకాదు. ఈ మాటు నీవు నామాట వినకతప్పదు.

గరుడుడు – అయ్యా! మీ యిరువురితగవు లట్లుండనిండు. ఏలికతో చెప్పవలసినదిసి. మా యింటికి జుట్టములు వచ్చిరి. వారింటనుండ బొంగూరికేగిన దెప్పుడెట్లుగును. అందుల కేదియేని యుపాయము చెప్పవలయును.

రంగనాథుడు – ఔను స్వామి? నే మీకడ మనవిచేసికొనకాలకున్నాను. నాకును నేడింపగత్యమైనపనియున్నది. నేటికాగి రేపు పోగూడదా?

పురోహితుడు – సరిసరి. సాయంకాలమునకు రంగగిరికరిగి స్వామికి విన్నవించిన యీ వార్త వెంటనే యిక్కడికి బంపవలయునని జెప్పిన ప్రభువుగారి మాట జ్ఞాపకమున్నదా?

మంత్రిపుత్రుడు – జ్ఞాపకములేకేమి! అందులకే మిమ్ము బొమ్మనుచుంటి.

పురోహితుడు – అందులకే నన్ను విడువమని నిన్ను గోరుచుంటి.

మంత్రిపుత్రుడు – ఇప్పటి పయన మెవ్వరికిని వీలులేకున్నది. ఇందులకు నా కొక యుపాయము తోచుచున్నది అట్లు గావింతుమా?

పురోహితుడు – బాబూ! అదేదియో జెప్పుము.

మంత్రిపుత్రుడు – ముందుగా నమ్మకమైన యొకనిని రంగగిరి కంపుదము. అప్పుడే వానిచేతి కొక ఉత్తరము ప్రభువుపేర వ్రాసి యిత్తము. మే మిందు లేకేమి, మిమ్ము స్వామికర్పించితిమి. అని యందు వ్రాయుదము. ఆ వాలు వెంటనే ప్రభువుగారి కందునట్లు చేయుదము. ఈ రాత్రి మొదటిజామును దాటిన పిదపనే బయలుదేరుదము. ఈ యూహ బాగున్నదియా!

పురోహితుడు – బాగున్నది కాని రెండవజాము దాటినంగాని నాకు వీలు పడదు.

మంత్రిపుత్రుడు – పోనీ. అట్లే కావింతము.

గరుడుడు – సరి సరి. నాకు రెండుఝాములు దాటినంగాని నిద్రయే పట్టదు. మూడవజాముదాటించి నాలుగవజామున బయలుదేరుదము.

రంగనాథుడు – అయ్యా! మీ సదుపాయము మీరు చూచుకొనుచున్నారు.

ఇటు సూర్యుఁ డటు పొడిచినను నాల్గవజామున నేను కదలఁజాలను. సూర్యోదయమగు చుండ బయలుదేరుట ఉచితము.

మంత్రిపుత్రుడు-అప్పుడు బయలుదేరి యెప్పటికి బోగలము?

దండనాధుడు-పంౘరెండు గంటలకు బోవచ్చును.

మంత్రి-అప్పటికిబోయి యేమిజేయఁదము?

దండనాధుడు-సూర్యోదయమునకు బోయి యేమిచేయదలచు కొంటిరో యదియే యప్పుడు చేయవచ్చును.

పురోహితుడు-మనలో మనము తగవులాడుకొనవలదు. దండనాధుడు చెప్పినట్లే యొప్పుకొందముగాక రెండుజాములలో మిగిలినదేమి, ముందుగా ప్రభువు గారికి వ్రాయవలసిన చీటి వ్రాయుడు.

మహారాజాధిరాజరాజపరమేశ్వరాది బిరుదాంకితులగు శ్రీ భోజమహారాజవారి దివ్యసముఖమునకు,

సేవకుడు మంత్రిపుత్రుడు వ్రాయువిజ్ఞాపనపత్రిక,

తమ శాసనము శిరసావహించి వెంటనే రంగగిరికరిగి స్వామి కర్పింపవల సిన వార్షికము నాలుగు గంటల కందిచ్చి రసీదు తీసుకొంటిమి, రాత్రి రథోత్సవము జరిగించి రేపు సాయంకాలమునకు దేవరపాదమూలము చేరువారము.

ఇట్లు, మంత్రిపుత్రుడు, రంగగిరి.

అని వ్రాసి మరియొక పత్రిక యిట్లు వ్రాయుచున్నాడు. రంగగిరిలో నున్న స్వామిసేవకులు రంగాచార్యులవారి సన్నిధికి నమస్కారపూర్వకముగా మంత్రిపుత్రుండు వ్రాయువిజ్ఞాపన పత్రిక.

భోజభూపతి రంగస్వామి కీయవలసిన రథోత్సవవార్షిక దీనారములు నేడే మాచేతికిచ్చిరి. మేమువానితో నేటిసాయంకాలమునకే యక్కడికి రావలసినవారమై యున్నారము. కాని నేడిరాత్రి మాకిట నత్యంతావసరమైన పని కలుగుటబట్టి యట్లు రాలేకపోయితిమి సొమ్ముతో రేపు పదిగంటల కందు జేరువారము. మా మిత్రుడు చెప్పిన జాబుమీద స్వామివారిముద్రికనద్ది యతని వానికిచ్చి వేయవలయును. ఇందులకు గానుకగా మీకు నూటపదారురూపికల నంపితిని, కార్యసాఫల్యము గావింతురని నమ్మి తిని. ఇది రహస్యవిషయము. తక్కిన విషయము లన్నియు రేపు సమక్షమున మనవి చేయగలను.

ఇట్లు మీ ప్రియమిత్రుండు, లబ్ధవర్ణుడు.

ఆ రెండు కమ్మలు మడిచి నమ్మకముగ నొకమిత్రునికిచ్చి చేయందగిన విధానమంతయు బోధించి రంగగిరి కనిపెను. అందుల కిచ్చిన లంచము వారుసలువురు పంచుకొనుటకు నిశ్చయించుకొనిరి.

అప్పుడు మంత్రిపుత్రుడు తక్కినవారితో "ఏనుండు మనమిప్పుడే రంగగిరి [illegible]న్నట్లు ప్రకటింపవలయు. నేటి పగలును రాత్రియు నెవ్వరికిని గనంబడకుండ ఇంటిలో నణగి యుండవలయును. రేపు సూర్యోదయము కాకపూర్వము గుప్తముగా మా యింటికి వచ్చినచో కలసి పోవుదముగాక. ఇదియే సాంకేతిక"మని చెప్పుటయు నొప్పుకొని యెవరి యింటికి వారు పోయిరి.

అని యెరింగించి మరియు నిట్లనియె.

256 వ మజిలీ

# జారపురుషవంచన

వాడు వారినలువురకు నెప్పటికి సాయంకాలమే యైనదికాదు. ఆ పవలు యుగాంతరములైనట్లు తోచినది. నిముష నిముషమునకు గడియారము చూచుచుండెను. ఎట్టకేలకు సాయంకాలమైనది మంత్రిపుత్రుడు పెందలకడ భోజనముచేసి దట్టముగా నలంకరించుకొని నల్లజలతారు పట్టుధోవతి ముసుంగువైచికొని యెనిమిదిగంటలకు [illegible]దనే పెరటిదారి వీధింబడి యెదురుపడిన తలవరుల కొదుగుచు నందందు గస్తుతిరుగు జనసమూహముల దప్పించుకొనుచు మెల్లన పితృదత్తయున్న యింటికరిగి తలుపుగొట్టెను.

అంతకు ముందందు వేచియున్న దాదులిరువురువచ్చి తలుపుతీసి చీకటిగా నుండుటచే తొట్రుపడుచున్న యా చిన్నవాని చేయిపట్టుకొని పెరటిలోనికిం దీసికొని పోయి మందస్వరముతో నిట్లనిరి. అయ్యా! మేము పితృదత్తపరిచారికలము. మీకు [illegible]గుండి తీసికొనిరమ్మని యామె మాకు నియమించినది. దీపమున్న మాకు సిగ్గగును. చీకటిలో మీకు దలనంటెదము. అందులకు శంకింపక పుట్టములూడ్చి యిందు[illegible] ఆ గోచిపెట్టుకొని పీటపై గూర్చుండుడు. వేగమే తలయంటి నీళ్ళుపోసి లోపలకు దీసికొని పోయెదము.

అని చెప్పుటయు నతం డొప్పుకొని నగలు పుట్టములూడ్చి వారిచ్చిన గోచి పెట్టుకొని పీటపై గూర్చుండెను. ఆ దాదులదివరకు నూనెలో వైచిన బండికందెన రంగ[illegible] యతని యంగములకు బట్టించి నలుచుచుండిరి. వాని చిత్తమంతయు పితృదత్తయందే వ్యాపించియున్న కతంబున వారేమి చేయుచున్నది తెలిసికొనలేక పోయెను. కానిండు, వేగిరము ముగింపుడు. మీరు పితృదత్త గూర్చిన పరిచారకులా? మీకు దగిన పారితోషిక మీయగలవాడ. కానిండు, వేగిరము కానిండని తొందర పెట్టుటయు నా దాదులు సరిసరి చిన్నగా నంటకున్న నాయమ్మవలన మాకు మాటరాదా? తొందర పడకుడు. ఈ నలుగు నలిపి నీరుపోసెదమని నలుచుచుండ నింతలో వీధిలో నెవరో తలుపు గొట్టినట్లయినది.

ఆ ధ్వని విని దాదులు జడియుచు బాబో! కొంపమునిగినది. ఈమెతండ్రి స్నేహితుడు అగ్నిమిత్రుడు వచ్చినట్లున్నాడు. అప్పు డప్పుడు రాత్రుల వచ్చి యీ చంచలాక్షిని బరీక్షించుచుండును. ఇల్లంతయు దిరిగిజూచికాని వెళ్ళడు. బాబూ! అతం డరుగుదనుక నీ వీ పెట్టెలో నణగి గూర్చుండవలయు. నీ రాక దెలిసినచో నిన్నును,మమ్మును, పితృదత్తనినుగూడ జంపగలడు. అని మెల్లగా జెప్పుటయు నతం డదలుచులేచి యామందస మెందున్నదో చెప్పుడు. అందు గూర్చుండెదంగాక. అనిన నవ్వనితలు వానిచేయిపట్టుకొని తీసికొని పోయి పెట్టెలో గూర్చుండబెట్టి యావల తాళము బిగించిరి.

ఆ వెంటనే పోయి వీధితలుపులు తీసిరి. దివ్యభూషణాంబరములు ధరించి పరిమళద్రవ్యములు మేన నలందికొని తాంబూలము నములుచు నిలువంబడియున్న గురుపుత్రునిజూచి నమస్కరించుచు అయ్యా! మేము చిత్రదత్త దాదులము. అంతరంగిక పరిచారికలము. లోపలకు రండని మెల్లగా జెప్పి పెరటిలోనికి దీసికొనిపోయిరి. ఈ గది చీకటిగా నున్నదని యనుమానపడవలదు మీకు దలయంటవలసి యున్నది. అడువారమగుట సిగ్గుచే నిట్లు చీకటిచేసితిమి, మీరికౌపీనము ధరించి యాపీటపై గూర్చుండుడు. తెలిసినదా? యని చెప్పిన నతండు మొగమాట మభినయించుచు నిట్లనియె.

ఔను. నేను చిన్నగుడ్డ కట్టుకొనిన వెలుతురున మీరు నాకు దలయంటుటకు సిగ్గుపడుట విపరీతముకాదు. పితృదత్తయాజ్ఞ వడువున గావించుట సంతసమే. ప్రొద్దున క్షౌరము చేయించుకొని తలయంటు కొంటి. మంగళార్థమై చేయుదని చెప్పినది కావున లఘువుగా సంస్కారము గావింపుడు. ఇందులకు మీకు బారితోషిక మిచ్చువాడనని చెప్పిన అమ్మయో! ఏ మాత్రము లోపము చేసితిమని తెలిసికొన్నను మమ్మామె దండింపకమానదు. సంపూర్ణముగా నంటక మిమ్ము విడుచువారముకాము మీ కానుక లాశనా దందుకొనవారముకాము. మన నేస్తము చిరకాల మిట్లుండవలసినదే. అని పరిహాసవచనములాడుచు గోచిపెట్టించి పీటపై గూర్చుండబెట్టి మసినూని యొడలికి రాయుచు రెండవజాము దాటించిరి.

అంతలో జెప్పినవేళకు గణకుండువచ్చి వీధితలుపు కొట్టెను. ఆ చప్పుడు విని వరవుడులు గడగడలాడుచు అయ్యగారూ! నేటితో మన పని ముగిసినది. అగ్నిమిత్రునకు చిత్రదత్తయం దభిమానము కలిగియున్నది. తరుచు రాత్రులువచ్చి పరీక్ష చేయుచున్నారు ఇప్పుడందుకే వచ్చియుందురు. రెండవదారి లేనిలోపమే యీ యింటికి గలిగి యున్నది. అని బెదరు గదుర బలికిన విని యా పురోహితుం డిట్లనియె.

అయ్యో! నేనిల్లు వెడలివచ్చుచుంత మంచి శకునమైనది కాదు. రెండుసార్లు లోనికిపోయి వచ్చితిని. నా యునికి యాతఁడు దెలిసిన బ్రతుకనీయడు.

[illegible] దించివేసి తావులేదు ? ఈ మూలకువచ్చి చూచునా ? అనుచుయు, దీపము [illegible] మూల నునేల గదులన్నియు దిరిగి చూచును. ఇందెక్కడ [illegible] దలిసికొనగలడు. అందొక్క మందసమున్నది దానిలో గూర్చుండుము. [illegible] పు [illegible]గించి యతండు గిన వెనుక తీసెదము గాక ఇంతకన్న వేరొక సాధనము [illegible] యుపట్టుకొని వాని నా మందసము దాపునకు తీసికొని పోయిరి. దాదులారా! [illegible] మూసి రాచితిరి కాబోలు. మేను చిరచిర లాడుచున్నది. మొగము [illegible]పుని యిప్పస తైలము చెడువాసన గొట్టుచున్నది. భరింప [illegible]. [illegible] యైనా పోసిన బాగుండును గదా ! మీ పుణ్యమతండు పరీక్షించి [illegible] టవేనన్ను పీధికి దోలివేయుదు మీ సుందరి పొందుమాట [illegible]. ఈ [illegible] దాటింపుడని వేడుకొనుచుండ వానిని రెండవ యరలో [illegible] పుమూసి తాళము వైచిరి.

అప్పటికి రెండుజాము లతిక్రమించినవి. మూడవజాము జొరపడగనే [illegible] తలుపు కొట్టెను గావున దాదులుపోయి తలుపుతీసి వెనుకటివాని [illegible] లోపలికి తీసికొనిపోయి తలయంటుచు నా కోమటితో బరిహాస [illegible] మూడవజాము దాటించినంత నాలుగవ జామున దండనాథుడువచ్చి [illegible] ము మున్నువలె వానినిగూడ బెదరించి మూడవ యరలో గూర్చుండ [illegible] సికి తలుపును దెరచిరి.

దండనాథుడు లోపల ప్రవేశించి వెనుకటివారి వలెనే దాదులమాట పాటించి [illegible] తల యంటుకొనుచు వారి కిట్లనియె దాదులారా! మీరు రాచినదే [illegible] చున్నారు నాలుగు గడియల రాత్రి యుండగనే యిల్లు దాటి [illegible]. అప్పుడే కోడి కూసినది. మీరీ దుర్వాసన నూనె రాచిన దానినే [illegible] లు గసంబదరంత మొగమంతయు బూసివైచిరి. ఈ జిడ్డు మూడు [illegible] నట్లు లేదు. తెల్లవారగనే పొరుగూరి కేగవలసియున్నది. ఈ [illegible] పిత్రుదత్త యెందున్నదో చెప్పుము. ఒక నమస్కారముచేసి [illegible]. నీటి కవకాశము లేదు. ఆమె కళిమానముండిన మఱొకప్పుడు [illegible] జెప్పబడితివేని నాకు శిరచ్ఛేదవు కాగలదు. నన్ను వదలుడని [illegible] అయినది. ఈ చేయనాచి నీరు పోసెదమని పలుకు [illegible] నాలుగవ జాము సగము గతించినది.

న్నది. ఇప్పుడేమి చేయుదును. నన్నెట్లైన నీ యిల్లు దాటింపుడని వారి పాదం బులంబడి వేడుకొనియెను.

వారు నవ్వుచు భయపడకుము ఆ పౌరుడు లోనికేగుదనుక నీ వీ పెట్టెలో గూర్చుండుము. పిమ్మట నిన్ను దాటింతుము అని పలుకుచు వానిని గూడ నాలుగవ యరలోనికిం ద్రోసి తలుపులు వేసి తాళము బిగించిరి.

అప్పటికి తెలతెలవారుచున్నది పితృదత్త వచ్చి దంతికిఁ దలుపు తీసినది. అతండు లోనికిం బోయి నాకసత్యముగా వార్తనంపితివి. పని యేమియని యడుగుటయు నాకుటిలకుంతల జరిగిన వృత్తాంతమంతయు నతని కెరుగ జెప్పినది. అతండు ముక్కుపై వ్రేలిడుకొనుచు ఔరా! ఎంత విచిత్రమైన పని చేసితివి? ఈ రహస్యము రాజుగారికి దెలుప వలసినదే. వీరిని గట్టిగా శిక్షింపగలరని పలుకుచు నిత్యకృత్యములం దీర్చికొని వెంటనే కొలువు కూటంబున కరిగి యొక పత్రికవ్రాసి ప్రభువున కర్పించెను.

ఆ పత్రికను జదివికొని రాజు నవ్వుచు మంత్రి దిక్కు మొగంబై అమాత్యశేఖరా! ఈ చిత్రము వింటివా? పితృదత్తను బ్రాహ్మణోత్తములేకాక దయ్యములుకూడ బాధించుచున్నవట. భూతములో, బ్రహ్మరాక్షసులో నిన్నరాత్రి వారింటి మందసములో బ్రవేశించినవట. మాంత్రికులతో నీవచ్చటకరిగి పరికించి తదుచ్చాటనము గావించి రమ్ము. అని నియోగించుటయు ప్రధాని యప్పుడే రాజభటులతో వారింటి కరిగెను.

అంతలో నా వార్త గ్రామమంతయు వ్యాపించినది. పౌరులు గుంపులుగా వచ్చి వారింటిచుట్టు మూగుచుండిరి. ప్రధాని యా మందసముదాపునకు బోయి రంధ్రములనుండి పరిశీలించి చూచెను. కోతులకు మొగ మొక్కటియే నలుపు. వారికి నొడలెల్ల నల్లగా వికృతముగా నున్నది. అతడు వారిని బ్రహ్మరాక్షసులేయనుకొని, మీ రెవ్వరు? ఇందేల ప్రవేశించితిరి? నిజము చెప్పిన విడిపింతును. లేకున్న మిమ్మిందు మారణహోమము గావింతునని పలుకుటయు వారు లజ్జాభయోద్వేగ సంభ్రమాక్రాంతస్వాంతులై సగముచచ్చి యేమాటయుం బలుకనేరక యూరక మూల్గుచుండిరి.

ఆయన వెంటవచ్చిన భూతవైద్యులు వారిని జూచి దేవా! ఇవి భూతములే. వీరిని బంధింతము. బలిసాధనంబుల దెప్పింపుమని కోరుచుండిరి. ప్రధాని తలుపు చాటున నున్న పితృదత్తతో అమ్మా! యివి దీనిలో నెప్పుడు ప్రవేశించినవి. పై తాళములుండిన లోపలికెట్లు పోయినవని యడిగిన నమ్మగువ యిట్లనియె.

దేవా! ఇవి నిన్న రాత్రి ప్రవేశించినవి. పైకి వచ్చునని వెంటనే తలుపులువైచి తాళములు బిగించితిని. ఈ పెట్టె మహారాజు వారియొద్దకు బట్టించుకొనిపోయి వారియెదుట పడగొట్టింపుడు. ఇదియే నా కోరిక యని తెలిపిన సంత

సింగుడు ప్రధాని వెంటనే బండి తెప్పించి యందెక్కించి రాజ మార్గంబునం దీసికొని పోవుచుండెను.

వేలకొలది జనులుమూగి యా వింత చూచుటకై బండితో నడచుచుండిరి. కోటలోనికి దీసికొనిపోయి బండి నిలిపిరి. లక్షోపలక్షలు ప్రజలూరక ప్రవాహము వలె వచ్చుచుండిరి. పిశాచదర్శనకు మనుష్య సంపర్కము తక్కువ. భూత వైద్యులు బ్రహ్మరాక్షసాదులతో బరిచయము గలిగియున్నది. అందుచేత నవి యామె [illegible] యుంచుచుండెనని బ్రాహ్మణబ్రువు లాక్షేపించుచుండిరి.

రాజుగారీ వార్త దెలిసి కొలువు కూటమునుండి సామంతనటవిట విదూషక గాయకాదులతో నచటికివచ్చి యా మందసమును జూచెను. భూతోచ్చాటన వైద్యులు మహాప్రభూ! వచ్చితిమి. ప్రధానిగారితో బోయి యా మందసమిక్కడికి దెచ్చుకొని వచ్చితిమి.

రాజు—ఇవి భూతములా? బ్రహ్మరాక్షసులా?

భూత—బ్రహ్మరాక్షసులే। భూతములింత నల్లగా నుండవు.

రాజు—అట్లయిన తలుపు తీయింపకుడు. ప్రజలపైబడి పీడించునేమో?

భూత—దిగ్బంధనము గావించిన తరువాతగాని తలుపు తీయింపము.

అగ్నిమిత్రుడు— ఇవియంత గొప్ప భూతములు గావు. వీనిని మన పురోహితుడు సులభముగా బట్టుకొను నతనిని బిలిపింపుడు.

రాజు—ఆయన నిన్న రంగగిరి కరిగిరి. ఇంకను వచ్చిన జాడలేదు. అంతవరకు నిలిపింతునా?

అగ్ని—అక్కర లేదు. భూత వైద్యులతో బనిలేదు. నేనే వాని దూరముపోవు మను చేసెద; తలుపులు తీయింపుడు. అని దుడ్డుగఱ్ఱ పట్టుకొని యచటను నిలువంబడియె. తలుపులు తీయుచున్నారు, దయ్యము లీవలకువచ్చి ప్రజలపై బడగలవు. దూరముగా బొండు అని రాజ భటులు కేకలు పెట్టుటయు దోక త్రెంపిన పిల్లులవలె జనులు దూర దూరముగా బాఱిపోవ దొడంగిరి.

రాజభటులు విచ్చుకత్తులు ధరించి కాచియుండిరి. అప్పుడు తలుపు [illegible] భూతవైద్యులు వెడలుచుండ నగ్నిమిత్రు డాదాపునకు బోయి తాళములు తీసి తలుపులు తెరచి రండు భూతములారా! యీవలకు రండు. మిమ్మిందు [illegible] చేయింతుమని పలుక వారు భయపడుచు నీవలకు వచ్చిరి కారు.

అప్పుడు అగ్నిమిత్రుడు కఱ్ఱతో బొడుచుచు నీవలకు రాకున్న మిమ్ము [illegible] కొందురా? రండురండు. అని బెదరించిన నిలువలేక వారీవలంబడి [illegible] ప్రధాని గరుండనను తలంపుతో నతని పాదంబుల మీదబడి పట్టుకొనిరి.

రాజా! దయ్యములు మంత్రిగారి మీదబడి చంపుచున్నవి. యింకేమి [illegible] అని యరచుచు నందఱు జనులు పికాపికలై కట్టుగుడ్డలూడ నొకరి

నొకరు త్రొక్కుకొనుచు దలయొక దెసకు బరువిడ దొడంగిరి. ప్రధాని యొదలెరుం గక నేలంబడి మూర్ఛిల్లెను. మాంత్రికులు వారిపై విభూతి చల్లుచు హుంకారములు సేయుచుండిరి. భోజుడు తన మీదకు వచ్చునేమోయని వెఱచుచు బారిపోవ యత్నింప నగ్నిమిత్రుండు వలదు వలదు. భయము లేదు నిలువుమని యడుటు చెప్పెను.

వచ్చినజట్టు రానేవచ్చినది. కొంత యల్లరిచేసి ప్రజలను గగ్గోలు పెట్ట వలయునని తలంచి యా నలువురు లేచి తల విరియ బోసికొని చిందులు త్రొక్కుచు ప్రజలపై బడబోవుచు జనులొండొరులం ద్రొక్కుకొనుచు గోచులుజార కట్టుగుడ్డలూడ బాఱిపోయిరి. కొందరు నేలంబడి మూర్ఛిల్లిరి. భోజుండగ్ని మిత్రుడు చెప్పినను వినక లోపలి కోసరల్లి తలుపులు వైచికొనెను. మాంత్రికులు మూలమూలకుబోయి దాగికొనిరి.

రాజభటులు వెఱచుచుండ నగ్నిమిత్రుడు ప్రేరేపించి రండు మీకేమియు భయము లేదు. భూతముల నేఁటమార్చెదనని చేరఁగా వారిని బట్టుకొనబోయిన కసిదీర నాతనిని గఱచిరి. కాటుదినియు విడువక వారిని దరిమి యొకనిని బట్టుకొని రాజభటుల వశము చేసెను.

కింకరులు వానిని బట్టుకొని కొట్టుచుండ మొఱపెట్టుచు మేము దయ్యములము గాము. మనుష్యులమే యని పెద్దయెలుగున బలుకన దెలిసి భయముగిడి వడివడి తక్కినవారినిగూడ బట్టుకొని రెక్కలు విరచి కట్టిరి. అంతలో ప్రధాని మూర్ఛ నుండి లేచుటయు గుమారుండతని చెంతజేరి దైన్యముతోప తండ్రీ! నేను నీ కుమారుండ లబ్ధపర్ణుడ. ప్రారబ్ధ దోషంబున నిందు జిక్కుకుంటినని చెప్పి గోలున నేడువ దొడంగెను.

మంత్రి మేను ఝల్లుమన దక్కిన వారెవ్వరని యడిగిన వారి పేరులు, చెప్పి యా యాపద దప్పింపుమని వేడుకొనియెను. అంతలో రాజు అగ్నిమిత్రుని వలన నా రహస్య వృత్తాంతమంతయు దెలిసికొని పితృదత్త చేసిన పనికి జాలసంతోషించుచు నీ వలకు వచ్చిచూడ జనులు పారిపోవుటచేత హజారము బట్టబయలై యున్నది. ప్రధానియు రెక్కలు కట్టబడిన వికృతాంగులు వారు నలువురు రాజకింకరులుమాత్ర మందుండిరి. రాజు ప్రధానిని దాపునకు జీరి వీరెవ్వరో యెఱిగితివా? మనవారే. పితృదత్త నెట్టి ద్రోహము సేయదలచితిరో వింటివా? వీరికెట్టి శిక్ష సేయవలయునో ఆలోచింపుము. ఇప్పుడు వీరి నలువుర నీ బండియే యెక్కించి డిండిమముతో వీరు చేసిన పని వెల్లడించుచు నూరంతయు ద్రిప్పిరమ్మని యాజ్ఞాపింపుము. శిక్షమాట పిమ్మట విమర్శింతమని పలికి లోపలికి బోయెను.

తచ్ఛాసన ప్రకారము రాజకింకరులు వారినలువుర నా రూపముతో బండి నెక్కించి ముందు డిండిమము మ్రోగుచుండ—

క॥ ఘనశీలను చిత్రదత్తం
గనుగానక వలచి పే రగారముచే జే
రిన బరిభవించెనిటు సతి
కనుగొన రో పౌరులార ! కౌతుక మలరన్. (9)

అని కేకలు పెట్టుచు నూరంతయు ద్రిప్పుచుండ గృహస్థులు ద్వారదేశములం నిలిచి వింతగా చూచుచు నందుఁగొందరు—

క॥ జారిణియు దనకు నచ్చని
వారలఁగైకొనక పరిభవము సేయుట యా
చారం బిదియును నట్టి ప్ర
కారము జరిగినదియే ప్రకాశముఁగాగన్. (10)

మఱికొందరు—

సీ॥ అఁగాదె రావణుం డఖిల బంధువులతో
జెడదెచ్చి సద్గుణస్ఫీత సీత
నల ప్రవక్యలై చచ్చె దమయంతి నఁబట్టి
వలచి కాఁడవిలోపలను నెపుకు
పరమ చారిత్ర ద్రౌపదిని బట్టగఁబూని
చేడ్పడె భీముచే సింహబల డు
సుచిరపాతి వ్రత్య రుచిర శచీదేవి
రతిగోరి నహుషుండు భ్రష్టుడయ్యె.
గీ॥ ఎఱిగి సాధ్వీవతంసల జెరపదలచు
దోసకారులు భువి మన్నుదురె పరాభ
వము వహింపక యిహమున బరమునందు
మంచి పనిచేసె చిత్రదత్త మానహరుల. (11)

అని తమకు దోచినట్లు ప్రజలాడుకొనుచుండ రాజకింకరులు వారి నూరేగించి పిండియు రాజునికటంబునకు దీసికొనివచ్చి రప్పుడు భోజుండాలోచించి తదేక ప్రాణుండగు సమాత్యుని సాధుత్వము దలంచి శిరచ్ఛేదము సేయక బ్రహ్మవర్ధుని నామ మాత్రపు శిక్షతో మండలించి విడిచి పెట్టెను. తత్కారణంబునం జేసి చిక్కిన ముష్కర సచివ్యోగముల నుండి తొలగించి యద్దే విడిచి పెట్టక తప్పినది కాదు.

అం యోగించు నప్పటికి కాలాతీతమైనది.

257 వ మజిలీ

# ఫణిదత్తుని కథ

పితృదత్త కొడుకును ఫణిదత్తుడని పేరుపెట్టి పిలుచుచుండెను. పితృదత్త మూలమున మంత్రిపుత్రాదులు నలువురు రాజుచే శిక్షింపబడుట నిరుద్యోగులై యూరివెంబడి తిరుగుచు నామెపై నీసుబూని దొరికినప్పుడు పుత్రునితోగూడ నా చేడియను గడతేర్చుటకు బ్రయత్నము చేయుచుండిరి. ఆ వార్త లోకులవలన దెలిసికొని పితృదత్త యొకనా డిట్లు తలంచినది.

నా కీయూర నగ్నిమిత్రుడు దక్క దిక్కెవ్వరును లేరు. పాపమతడు నా నిమిత్తమాప్తులతో విరోధపడుచున్నాడు. మొదటి నుండియు నీయూరి పౌరులకెల్ల మాపై విరోధమే కద! పైపెచ్చు ఉచ్చ్రోది గట్టికొనినట్లు ఖలులతో దగవు వచ్చినది. వారు మాపై మత్సరము బూనియున్నారు. నన్నేమి చేసినను వెరచుదానను గాను. కాని పిల్లవాడు బలికిపోవుచుండ దాఁగాలి కొట్టిన నేమి చేయుదాన? అనర్థకము రాక మున్నె ప్రతీకార మాలోచింపవలయును. పడగనీడ గప్పవలె వారికి జడియుచు నెన్నిదినము లిందువసింపము? నృపతికి దెలియ జేయుదుమా యనిన నందులకు దగిన నిదర్శనము చూపజాలను. నింద పాల్పడినచోట నివసింపరాదని పెద్దలు చెప్పుదురు. ఇండలివారు నన్ను నిందింతురే కాని సుగుణంబు లెత్తికొనరు. అన్నలు దేశాంతర మరిగిరి. ఇక నేనీయూర నిరసించుటకంటె హైన్యము లేదు. అగ్నిమిత్రునికి జెప్పిన నంగీకరింపడు. పిల్లవాడు పెద్దవాడైన తరువాత దిరుగా రావచ్చును. మేనమామగారి యూరు పాటలీపుత్ర నగరంబున కిప్పుడు పోయెదంగాక అని నిశ్చయించి యా పాటలగంధి యొకనాడెవ్వరికి జెప్పనింటికి దాళమువైచి వేకువజామున లేచి కుమారునితోగూడ బండియెక్కి యుత్తరముగా బయనము సాగించినది.

ధారానగరమున కీశాన్యముగా బాటలీపుత్రనగరము నూరు యోజనముల దూరములో నున్నది. సరియైన మార్గమేదియును లేదు. నడుమ నదులు పర్వతములు మహారణ్యములు చాల గలవు. కొంత దూరము బండ్లమీద గొంతమారము కాలినడకను బోవుచుండెను. ఆమెకడ బంగారు నాణెములు మాత్రము చాల గలవు. మరియేసామగ్రియు దీసికొనలేదు. ఎప్పటికప్పుడు కావలసిన సరకులు గొనుచుండెను. అప్పటికి ఫణిదత్తునకు బది యేండ్లలోపు ప్రాయము గలిగియున్నది. ఆ నగరములో నా బాలుడు విద్యాభ్యాసము చేయునప్పు డుపాధ్యాయులు వాని శరీరదార్ఢ్యము చూచి వ్యాయామ సాధకములు గూడ వానికి నేరుపుచుండిరి. విద్యాగ్రహణము కన్న సాము నందు వాని కెక్కువ పాటవము కుదురుచున్నది. వాని లంఘన తాండవసంకోచన విస్తృతాది నైపుణ్యము చూచి యొజ్జలు అభినవ భీముడని వానిం బిలుచుచుండిరి.

మరునాటి పయనములో నా బాలుడు తల్లిని జూచి అమ్మా! నా ఆదువున [illegible] గలుగ జేసి నన్నిప్పుడెక్కడికి దీసికొని పోవుచున్నదానవు? ఉపాధ్యా[illegible] సెలవైన వ్రాయలేదు. నా పేరు తగ్గింతురేమో! వెండియు నెన్నినాళ్ళకు [illegible]? అని యడిగిన కుమారుని ముద్దుపెట్టుకొనుచు దల్లి యిట్లనియె.

నాయనా! ఆ యూరిలో మనకు దిక్కెవ్వరును లేరు. మీ తాత నాటినుం[illegible] [illegible] మనపై కోపము. ఇప్పుడు క్రొత్త విరోధులు కొందరు [illegible]. బదికిపోవుచుండ దాగి చాటి నిన్ను జంపుటకు బ్రయత్నము చేయుచు [illegible]. అందులకు వెఱచి యూరు విడిచి వచ్చితిని. పాటలీపుత్రనగర[illegible] [illegible] చుట్టములున్నారు. నిన్నక్కడికి దీసికొని పోవుచున్నాను. అదియు [illegible]. అందునీవు చదువుకొనవచ్చును. నీవు పెద్దవాడవైన తరువాత దిరుగ [illegible] రాగలమని చెప్పినది.

అమ్మా! నీవువట్టి వెఱ్ఱిదానవు. మన మెవ్వరి కపకారము చేసితిమి? [illegible] రేలవతురు! నీ నీక్ర బొక్కి నీవు బడిసికొందువు. కానిమ్ము మనము [illegible] కెప్పటికి బోవుదమని యడిగిన రెండు నెలల కరుగుదుమని చెప్పినది. [illegible] వారు క్రమంబునబయనములు సాగించుచు గాలి నడకను బోవు [illegible] మోయుటకై కూలివానిని గూడ దీసికొని పోవు [illegible]. ఒకనా డొక మహారణ్యమధ్యంబునం బోవుచు బర్వతముల నడుమనున్న [illegible] చేరునప్పటికి మధ్యాహ్నమైనది. అందుదిగి పితృదత్త వంట చేయు [illegible]. తోడనున్న కూలివాడు వారి నిస్సహాయత దెలిసికొని మూట యెత్తుకొని [illegible]. పితృదత్త చూచి కేకలు పెట్టినను నిలువక పోవ ఫణిదత్తుడు [illegible] వానిని దరుముకొనిపోయి యదలించుటయు వాడు పిల్లవాడు గదా [illegible] సు త్తరము చెప్పుచుండెను.

# కా మం ద కు ని క థ

అంతలో నా దారినొక బ్రాహ్మణ కుమారుండు ముప్పదియేండ్ల లోపు [illegible] కరుదెంచి పిల్లవానిని గద్దించుచున్న కూలి వానిని జూచి ఆ. ఆ. నిలు [illegible] అని కేక పెట్టుటయు వాడాతనిం జూచి భయపడి మూట నందు విడచి [illegible] పారిపోయెను.

పిల్లవాడు మూటదెచ్చి తల్లి కడ [illegible]యెను. ఆ తోటి బాటసారి వలన [illegible] సంతసించుచు అన్నా! మీ దేయూరు? ఎందు బోవుచున్నా[illegible] సతడు మాది దక్షిణదేశము. నా పేరు కామందకు డందురు. పాటలీ[illegible] యుత్తరము చెప్పెను. ఆమె సంతసించుచు మేము [illegible] వారము మాకు దోడుగానుండుము మాతోపాటు భుజింతువు

గాక అని చెప్పిన సంతోష మతిశయించుమ నక తంగీకరించి వారితో భుజించెను. ఇది యడవిదారి. దూరమునగాని యూరులేదు. దారిలో జీకటిపడిన దొంగలు కొట్టుదురు. వేగ బోవలయునని తొందర పెట్టుచు బండలకడ బయలుదేర దీసి మూటతానే మోసికొనుచు వారిని వెంట బెట్టుకొని యాపాపడు నడుచుచుండెను. చీకటి పడునప్పటికొక కోయపల్లె సేరిరి. అందు నడుమ నొక చిన్న చావడి కలదు అందు బాటసారులు డిగుచుందురని తెలిసి వారు మువ్వురు మూటదింపి యందు గూర్చుండిరి. ఇంతలో గోయపెద్ద పొలము నుండి యింటికివచ్చుచు జావడిలో నున్న వారిని బిలిచి మీరెవ్వరు ? ఎందు బోవుచున్నారని యడిగిన మేము బ్రాహ్మణులము పాటలీపుత్రనగర మరుగుచుంటిమని కామందకు డుత్తరము చెప్పెను.

ఇందు బండకొనరాదు. దుష్టజంతువులు వచ్చుచుండును. మా యింటికి రండు. పండుకొని రేపు పోవుదురుగాక అని పలికి వారిని దీసికొని పోయి నివసింప జోటుచూపి యా రేయి బాలుని బంగ్లును తిననిచ్చెను. వారందు హాయిగా బండుకొనిరి. పరోపకారపారీణు లన్ని కాలములలో నుందురుగదా ! అంత నర్ధరాత్రమున వీధిలో నా చావడికడ గోలాహల ధ్వని వినబడుటయు గోయదొర లేచి యక్కడికి బోయెను.

అందు బండుకొన్న బాటసారులకు నా పల్లెలోని కూలివాండ్రకు బోట్లాట జరుగుచున్నది. మూట యెత్తుకొనిపోయి వణిదతునిచే దెబ్బలు తిని పారిపోయిన కూలివాని కాపుర మా పల్లెయే. జ్ఞాతి వాడందు జేరి చావడిలో బండుకొన్న వారు బ్రాహ్మణులే యనుకొని పదుగురు వెంటబెట్టుకొనిపోయి కర్రలతో వారిని గొట్టుటయు నందు బండుకొన్న తెరువరులు వాండ్రకన్న మోటరులగుట దిరుగబడి కూలివాండ్రను గొట్టిరి. రెండు తెగలవారు పోట్లాడుచుండ గోయదొర వారించుచు గలహ కారణమడిగిన బాటసారులు నిద్రించుచుండ పీండ్రుతమ పై బడి కొట్టిరని చెప్పిరి.

కూలివాండ్రు, వినుము మావాడు వీరిమూట మోచికొనివచ్చుచుండలేనిపోని యపరాధముగణించి దారిలో వీనినిగొట్టి కూలీయక పాఱదోలిరట. అది న్యాయముగా నున్నదియా ? అని చెప్పుటయు నా మాట మా కేమియుం దెలియదని బాటసారులు చెప్పిరి. కోయదొర గ్రహించి కూలివాండ్రను మందలించియింటికివచ్చి కామందకుని లేపి నేడు మీ పుణ్యము ఫలించినది. చావడిలో బరుండిన కూలివాండ్రు మిమ్ము గడతేర్తురు అని యా కథయంతయు జెప్పెను.

అతడా కోయదొరను పెద్దగా నగ్గించి యిన్నిద్రబోక మూటం గాపాడుచుండెను. అంతలో దెల్లవారినది. కోయదొర చాలమంచి వాడగుట బ్రొద్దున లేచి వారు పయనమగుచుండ దారిలో గూలివాండ్రడ్డపడి యేమిచేయుదురో యని తన పాలికాపు నొకనిని సహాయమిచ్చి యడవి దాటించిరమ్మని నియమించెను. వాడు దారిచూప మువ్వురు నడచుచుండిరి. కామందకుండు మూట మోయుటకు మొగమాటపడుచు నా పడుచు అన్నా ! కామందకా ! మామూట నీవు మోయుచుండ నాకు జాలకష్ట

ఱుగా నున్నది. కూలివానిని బెట్టుము. ఎంతైన నీయగలను బండ్లు నడచుదారి యిన బండికి దుర్గము నీమోత నాకు జాల భారముగా నున్నదని పలికిన విని చిరునగ వుతో నాజన్ని గట్టిల్లనియె

తరుణీమణీ! స్నేహము కలిసినపిమ్మట నొకండొకర మొకరు వహింపకున్న ట్లు? కష్టపడి వండిపెట్టుచుంటివి. నీవు నా భారము వహించుచుండుటలేదా? అందులకు సందియమందవలదు. నన్నాంతరంగిక బంధువునిగా దలంపుము. మీ కే కొదువయు రాకుండ హృదయంబున బెట్టుకొని తీసికొని పోయెదను. నా చిత్త వృత్తి నీ కింకను దెలియలేదు. అవసరమైన ప్రాణమైన నీయగలనని సమాధానము చెప్పెను.

ఆ మాటలు వినుటచే నామెకు వానియందు గొంత యనుమానము గలిగి నది. అయ్యో! వీడు నన్ను వలచినట్లున్నది. వీని మాటలలో శ్లేషార్థము గనం బడుచున్నది. నడచునప్పుడు దాపు దాపుగావచ్చి యేదో పల్కరించుచుండును. గొంపవిడచినను నా కీ కర్మము తప్పలేదుగద! ఉపకారము చేయువానిని గసరుటకు నోరు రాకున్నది. కోయదొర యామె నీకేమి కావలయునని యడిగినప్పుడు భావార్థము సూచించినట్లుగా "మా వాళ్ళేయని" యుత్తరమిచ్చెను. ఏమి మోసము చేయునోకదా యని యాలోచించుచు వానికి దూరముగా నడచుచుండెను.

అతండు దాపు దాపుగా నడచుచు బిల్లవానిని లెక్కసేయక పల్లవపాణీ! ఇదె పల్లము మెల్లగా దిగుము. ఇది మిట్టు ఊతముగా నెక్కుము. నీ బలము [illegible]తము. నాతో సమముగా నడువుము, ఇంతే! ఏమోయను కొంటిని. అబ్బాయీ! ఏమి యమ్మ పైవేసమేకాసి వట్టియుర్కులు రాలునా! అని పలుకుచుండ నామె చెవులకు ములుకులవలె నా పలుకులు నొప్పించుచుండెను. ఆ మాటలకేమియు సమాధానమియ్యక యామె యావ విచారముతో తెరువు నడుచుచుండును. కోయదొరపంపిన పాలికాపు కాఱడవి చివరవఱకువచ్చి అడవిదాటినది. ఇక భయములేదు. రెండు పరుగులలో నొక చెఱువు గనంబడును. దాని ప్రదాపింటోయిన దానికి పరుగులో బాపనగూడె మున్నది. అందు బొందనిచెప్పి యా పాలికాపు మరలి చనియెను.

కామందకుడు వాడు చెప్పిన గురుతులుచూచుకొనుచు తిన్నగా నడిపించి ఆమెను ప్రొద్దెక్కినప్పటి కా యగ్రహారమునకు దీసికొనిపోయెను. మూటనెత్తి పై నిడికొని కామందకుడు ముందు నడచుచుండ బిల్లవానితో పితృదత్త వెనుక వచ్చు చుండెను. వారిం జూచినవారెల్ల భార్యాభర్తలేయని తలంచుచుండిరి. ఆమె నడుచునప్పుడు దేహలావణ్యము దెలపడకుండ నొదలికి ధూళిరాచి కొనినది. మసి పూతగట్టినను మాణిక్యము తేజమెక్కడికి బోవును? ఆమె యవయవములతీరు పిల్ల వాని నోరుచూచి మూటమోయు మోయుపాఱుని కిట్టి సుందరమెట్లు దొరికినదని చూపరు లక్కజపడజొచ్చిరి.

కామందకుం డా గేస్తుం జూచి అయ్యా! మేము బాటసారులము. పాటలీపుత్రనగరమున కరుగుచున్నవారము. పేదలము. ఈ పూటకు వంటచేసికొనుటకు గొంచెము తావిత్తురేయని యడిగిన నతం డయ్యయ్యో! ఇందుల కింత వినయమేల? వంట చేసికొన నక్కరలేదు. మా యింటనే మీరు కుడువవచ్చునని పలుకుచు గాళ్ళగడుగ నీళ్ళందెచ్చి యిచ్చెను.

అతడు మూట లోపలబెట్టి పాదప్రక్షాళనము చేసికొనుచుండ నంతలో ఫణిదత్తుడక్కడికి చేరుకొనియెను. అబ్బాయీ! వచ్చితివా? మీ యమ్మ యెంత దూరములో నున్నది? పాపము నడువలేక దానికి గాళ్ళు పొక్కులెక్కు చున్నవి గదా! ఈ పూట కిందు గడిపిపోవుదము రమ్ము. ఇక్కడనుండి బండ్లదారి యున్నదట. ఇక నడువనక్కరలేదులే అని యా యజమానుడు విన బలుకుచు నా బాలునకి గాళ్ళుగడిగి మొదలిదుమ్ము దులిపి కూర్చుండబెట్టెను. ఇంతలో పితృదత్త వచ్చినది. లోపలికిరమ్మని పిల్లవాడు పిలిచెను. ఆమె లోపలకువచ్చి పెరటిలోనికింబోయి వంటజేయదగిన తావు నా యింటి యజమానురాలి నడుగుటయు నామె యిట్లనియె అమ్మా ప్రొద్దెక్కినది మీరు వంటచేసికొన నక్కరలేదు. ఈ పూటకు మా యింట భుజింపుడు. మేము కృతార్థుల మగుదుమని పలికిన నక్కలికి తల్లీ! మీ యాదరణ మెప్పటికిని మరువను. అయనయు బిల్లవాడును మీ యింట గుడుతురు. నే నొకరియింట గుడువను. వండుకొని భుజింతు. వంటపాత్ర నొకటి యిప్పింపుడిదియె పదివేలని చెప్పినది. ఆమె మగనికడకిరిగి భర్తయు బుత్రుడును మనయింట గుడుతురట. ఎంతజెప్పినను నామె యొప్పుకొన్నదికాదు. పోనిండు అదియె చాలునని చెప్పి పితృదత్తకు వలదనుచుండ బలవంతముగా గూరలును బిండివంట సామాగ్రియు నిచ్చి వండింపజేసినది.

పితృదత్త యామె తనకుజేయు నాదరము వేనోళ్ళను బ్రస్తుతించుచు మొగమాటముతో భుజించినది. కామందకుడును ఫణిదత్తుడు వారింట భోజనము చేసిరి. భోజనానంతరము చావడిలో గూర్చుండ దాంబూలమిచ్చి యా యజమానుడతని కిట్లనియె. అయ్యా! మేము ప్రతిశుక్రవారము దంపతిపూజగావించి చీరయు దోవతియు గట్టనిత్తుము. నేటి శుక్రవారము గ్రామములో గార్యము లుండుటచే దంపతులు దొరకలేదు. దైవము మిమ్ము బార్వతీ పరమేశ్వరులవలె దీసికొని వచ్చెను. మీ యిల్లాలు మా యింట గుడువలేదు. పోనిండు. నా దొక కోరిక యున్నది. ఆ పుట్టములు మీ కర్పింతు గట్టికొని నన్ను కృతార్థుని జేయుమని నా ప్రార్థన. ఏమందురు? అనవుడు కామందకుడు డిట్లనియె.

నా భార్య కడు మానస్థురాలు. ఒకరియింట గుడువనప్పు డీ పుట్టములెట్లు కట్టుకొనును? అందులకు నా కభ్యంతరమేమియు లేదు. దానితో నీ మాట చెప్పరాదు. అని చెప్పిన పోనిండు ఆమెకీయము. చీరయు ధోవతిదావును

మీరే స్వీకరింపుడు కొంటినని చెప్పి యెప్పుడో యామెకుగట్టి నిత్తురుగాక అట్లు చేయుదని బలవంతమున నతని మూటలో గట్టెను.

మరునాడాయూరినుండి బండిమీదగొన్ని పయనములు సాగించిరి. ఒకనాడిసుకదారిలో నడచుచుండ పిల్లవానిని మాత్రము బండిలో గూర్చుండనిచ్చి పెద్దవారు బండిదిగి నడచుచుండిరి. అప్పుడు కామందకు దక్కాలికి ప్రక్కగా నడచుచు నామెతో నిట్లనియె. తరుణీమణీ: నీతో నే నొక్కమాట చెప్పదలచుకొంటి. చివరవఱకు విని ప్రత్యుత్తరమిమ్ము. నా కాపురము ధారానగరమే. పిన్ననాటినుండియు నిన్ను నే నెఱుంగుదును: నీవు జారపురుషుల వంచించిన విషయము లోకవిదితమే గదా! స్వప్నసంగతులవలన గుమారునింగనిన వార్త కొందరు నిజమనియు గొందఱసత్యమనియు నా యూర వాదించుచుండిరి. ఏది యెట్లయినను పురుష సంపర్కము లేక పుత్రుడుదయింపడుగదా. కలలే నిజమైనచో నెండమావులలో నీరు గ్రోలవచ్చును. పదిసంవత్సరముల క్రితమువచ్చిన నీ స్వప్నము మెండియు రాకుండుట శోచనీయము. ఇప్పుడు నే జెప్పబోవు సారాంశ మేమనగా నీ వా యూరు విడచి వచ్చిన తరువాత నీ విషయమై యూరంతయు గగ్గోలుగా చెప్పుకొన దొడంగిరి. నిన్ను దీవించు పొగడినవారుకూడ వేరొక రీతి దలంచుచున్నారు. బండివానివలన నీ వార్త దెలిసికొని జాడలదీయుచు మిమ్ము గలిసికొంటిని. సతికి బతిలేని జీవనము నిరర్థకము. ఇది విదేశమగుట మన మెట్లు చెప్పినను నిందలినారు నమ్ముదురు. నీ ముందటిభర్త యిక నీతో గలిసికొను కాలము మిగిలినది. ఇందు నన్నే భర్త యని చెప్పుము. నీ కేకొరతయు రాకుండ గాపాడెదనని చెప్పిన విని యక్కలకంఠి చెవులు మూసికొని కన్నుల నీరుగార నిట్లనియె.

అన్నా! నిన్ను సోదరునిగా దలంచుచున్నాను. నీవుదారిలో జేసెడు చర్యలన్నియు గనిపెట్టియు నీవు చేసినమేలు దలంచుకొని చురుకుగా నీతో మాటాడ మొగమాటపడుచున్నాను. నీవు నిన్న నాయింటివారితో నన్ను భార్యయని చెప్పినమాటలు నా చెవులంబడినవి అట్టి తలంపెన్నడును మనస్సులో బెట్టికొనకుము. నన్ను దోబుట్టువుగా జూచుకొనుము. నన్ను గురించి మీ యూరివారు తలంచిన తలంపు లన్నియు వట్టి పిల్లలు. మనుష్యుడుగాని దైవముగాని నిద్రలోవచ్చి నన్ను గలిసికొనియెను. అతడు వచ్చుగాక. రాకపోవుగాక. నేనిక నొరుల పరిగ్రహింపదలచుకొనలేదు. నా సంగతి దెలిసికొనలేక మీరు వట్టియపోహలం బడుచున్నారు. నా నిజమైన యభిప్రాయమును నీకు జెప్పితినిగదా. నాయందు గలిగిన మరులు మరలించుకొని సోదరీభావంబున జూచికొనుమని గట్టిగా మందలించినది.

అప్పుడతడు సిగ్గుపడి తేనెనాకినయట్లు పలుకనేరక [illegible] వెనువెంట నడచుచుండెను. మరికొన్ని పయనంబులు సాగించిన తరువాత నొకనాటిమార్గంబున నిట్లు తలంచెను. ఆహా! నేని వరారోహ నిమిత్తమై యూరువిడచి దారిలో వెక్కుకష్ట

ములుపడి జాదలుదీసి వెంట తేరుకొంటిని. ఈ వెంత నావెంత తంతు లెరుంగని దాని వలె బొంకు చున్నది. సామమున నిది వశపడునట్లులేదు. ఇందులకు భేదమే వినియో గింపవలసియున్నది. ఇట్లు చేసెదంగాక యని తలంచి యా ముందరి గ్రామములో నొక విప్రునియింట బసచేసి వంట వేగిరముచేయుమని భార్యతో జెప్పినట్లు చెప్పుటయు నా యిల్లాలు మొగము ముడుచుకొని కామందకా! నీకు నేను వండి పెట్టను. నీవు సంభా షింపదగినవాడవుకావు ఒకనాటి యుపకారము తలంచి చురుకుగా మాట్లాడుటకు సంశ యించుచుండ మీదు మిక్కిలి చేయుచున్నావు. ఇక నీవు మాతో రావలదు. నీ దారిని నీవు పొమ్మని కచ్చితముగా జెప్పినది. అప్పుడతడు పెద్దయెలుంగున చీ! దుష్టురాలా! నీ బుద్ధియెప్పుడు నిట్లే పెడసరముగా నుండును. నీకు నేను మగడనని చెప్పుటయు నభిమానముగా నున్నది. నీ వాడినదియాట. పాడినదిపాటగా ననుమోదించి వెనువెంట దిరుగుచుండ పొగరుబట్టి యెదురించుచుంటివి. కటా! నిన్నే వేళ గట్టికొంటినోగాని యెప్పుడు నిక్కట్టులే. నీతో గాపురము చేయుటకంటె గనులు మూసుకొని గంగలో డిగుటమేలు. ఆపులువలసనుచుండ దబ్బంతయు నీయధీనము చేయుటచే నన్ను దిరస్క రించుచున్నావు. పెద్దలతోజెప్పి నీకు బుద్ధిచెప్పించెద చూడుమని కేకలు పెట్టుచుండ నిరుగు పొరుగువారు ప్రోగుపడిరి. అతని మాటలువిని యామె తెల్లబోయిచూచుచు విస్మయముతో నే మాటయు బలుకలేక పోయినది. నలువురు వినునట్లు పలుమా రామా టలే యనువదించుచు వారితో నిట్లనియె

అయ్యలారా! ఇది నా భార్య. దీని నేవేళ గట్టుకొంటినో యెప్పుడూ మాకు దగవులే. దానియందమునకు నేను తగనని నన్ను మగడని జెప్పుకొనదు. దానివెంట నేనుబోవలసినదేకాని నావెంట నదిరాదు. నేను జేసినతప్పు వినుడు. వెనుకటిగ్రామ ములో నొక గేస్తుమాకుదంపతి పూజగాపంచి కట్టుపుట్టములిచ్చెను. వానింగైకొంటినని నాపై గోపము వహించి రట్టుచేయుచున్నది. అని చెప్పుటయు నందు కొందరా సుందరి కిట్లనిరి.

పడతీ! నీవు కొడుకుంగూడ గంటివిగదా! మగనితో తగవులాడవచ్చునా? పతివ్రతల చరిత్రము లెన్నడు వినలేదా? పురాణములైన జదువలేదా? పెనిమిటితో జగడమాడిన యెలనాగ సూకరమై జనించునట మీ దేమూరు?ఎందుబోవుచున్నారు! అని యడిగిన నక్కలికి ముక్కుపై వ్రేలిడుకొనుచు నిట్లనియెను.

తండ్రులారా! వీడుచెప్పిన మాటలన్నియు నసత్యములు, వీడెవ్వడో మే మెరుంగము. దారిలో గలిసికొనియెను కులమువాడు కదాయని వండి పెట్టుచున్నాను. అందులకు నన్ను పట్టిరట్టు పెట్టుచున్నాడని చెప్పిన వారచ్చెరువొందుచు ఏమయ్యా! మొదటికే మోసము వచ్చినదే! ఆ మాట లేమిచెప్పెదవు? ఇట్టి కల్పన లెపుడును విని యుండలేదే. అనుడు కామందకుడు నేను మొదటమీతో జెప్పలేదా! ఇప్పుడు నన్ను

సిరి లేదిపోవలయునని దానికి బుద్ధిపుట్టినది. పోసించు దానినిగట్టుకొనిన మగడెవ్వడో గుణగుడు. ఏమి చెప్పునో చూత మనవుడు మధ్యవర్తు లిట్లనిరి.

కొమ్మా ! పోనిమ్ము. ఇతడు నీ మగడు కానిచో నతండెందున్న వాడో చెప్పవలె ననుగుటయు నాపె బాలుదాలు మీ రా పాపాత్ముని మాటనమ్ముచు లేని [illegible] ప్రశ్నలడుగుచున్నారు. మీ యిష్టము వచ్చినట్లు తలంపుడు. వీడు వట్టి దొంగ యని చెప్పినది. అందెవరి మాట నిజమో యెవరిమాట యసత్యమో గ్రహింపజాలక మీ నిర్ణయము మీ [illegible] మాకేల ? మీ యిష్టమువచ్చినట్లు తగవులాడుడని మధ్యవర్తులు లేచిపోయిరి.

పిత్పదత్త నాడు వానికి వంది బెట్టినదికాదు. తానును కుమారుడును గంటి బండియెక్కి పాటలీపుత్ర నగరంబున కరిగినది. కామందకు డాయజమాను నింట భుజించి తనభార్య చేసిన యాగడము లెన్నియో యుగ్గడింపుచు వినువారికి జాలిపొడమునట్లు వన్యసించెను. అప్పుడాయజమానుడు కనికరముజనింప పారుడా ! ఇక్కడ నా రాజధాని పూటపయనములో నున్నది. నీ భార్య కిడుంగడు జాగవలె గనం బడుచున్నయది. పాపము తెలియక సొమ్మంతయు నామెచేతిలో బెట్టితివిగా లేదా. నన్ను తిరస్కరింపక విడుచునా? వదవద. నీవా నగరమేగి యక్కడ దగవు పెట్టుము. అందుగూత నిర్దేశ తరము చెప్పినచో నా పట్టణాధిపతి నందుడను వాడు. చాల మంచివాడు. అతనితో జెప్పికొనుము. ఆ నృపతి తగినట్లుచేయును. కావ లసిన నీపక్షమున మేమందరము సాక్ష్యమీయగలము. పో పొమ్మని బలికిన గులుకుచు నాగదప్పుడే బయలు వెడలి నాలుగు గడియలలో నా బండితో గలిసికొనియెను.

ఆమె వానితో నేమియు మాటాడక తెర యడ్డుకట్టుకొన్నది. నాటి సాయం కాలమునకే వారు పాటలీపుత్రము జేరుకొనగలిగిరి. మాతామహుని పేరడిగి తిన్నగా వారింటికి దోలించుకొని పోయినది. ఆమె మాతామహుడు చనిపోయి కొన్ని సంవత్సరము లైనది. అతని తమ్ముడు భార్యయు మాత్ర మందుండిరి పిత్పదత్త వారింట ప్రవేశించి తన బంధుత్వ మెరింగించుటయు దెలిసికొని యా వృద్ధు డాముద్దు గూలిం దద్దయు నాదరింపుచు గుమారుని ముద్దు పెట్టుకొనుచు నిట్లనియె

అమ్మా ! మీరు దూరములో నుండుటచే మీ వర్తమానము లేమియు మాకు దెలియుటలేదు. నీతలిదండ్రులు స్వర్గస్థులైరనుమాట యెవరోచెప్ప గావింటిమి. నీవిన్న లెందున్నారు ? నీయత్తవారూ రేది ? నీ మగండేమి చేయుచుండును? ఇందువచ్చెనా? గుసగుసగా చుండగనే యూ వాకిట దొంచియున్న కామందకుడు గుభాలున లోపలి కేతెంచి యిదిగో వచ్చి యున్నాను తాతగారూ ! నమస్కారము. నేనే మీ మను మరాలి మగడనని చెప్పుటయు నప్పుడతి భీ మూర్ఖా ! అవలకు బొమ్ము. తాతా ! వీడు వట్టి గజదొంగ. వీని మాటలు నమ్మవలదు. నా వెంటబడి పెక్కుచిక్కులు పెట్టు చున్నాడు. ఈ కథ చాల పెద్దది. అనక జెప్పెదంగాక.

అని పలుక కామందకుడు తాతా! దీనిమాట నమ్మవలదు. నీ మనుమరాలు వట్టి రంకుది. నన్ను మగడుకాదని పలుకుచున్నది. నాతో బోట్లాడి యిల్లువిడిచి లేచి వచ్చుచుండ గట్టికొసిన దోషమున జేసి విడువక వెను వెంటవచ్చితిని. దీని కథ చాల కలదు. సావకాశముగా దమతో మనవి జేసికొనియెద. అనవుడు నా బ్రాహ్మణుడు పితృదత్తను జూచి అమ్మా! యీతగవేమిటి? వీ రిట్లు చెప్పుచున్నా రేమి? మగనితో దగవులాడి కులమర్యాదలు పాడుచేసితివా? నిజము చెప్పుమని యడుగుటయు నా చిన్నది కన్నీరుగార్చుచు, తాతా! నీ కడనే బొంకులాడుదునా? నీ పాదముల తోడు వీడెవడో నేనెరుగ. దారిలో శని గ్రహమువలె మమ్ము గలిసి కొనియె నని నడుమజరిగిన వృత్తాంత మంతయు నతనికి జెప్పి నమ్మించినది.

అప్పుడా వృద్ధభూసురుడు అహంకారముతో లేచి దుడ్డుకఱ్ఱ దీసికొని తొత్తుకొడుకా! అబద్ధపు సుద్దులాడి యేమియు నెరుగని ముద్దరాలిని బాధింతువా? పొమ్మావలకు బొమ్ము. నీకు దిక్కుగలిగిన వారితో జెప్పుకొనుము. పో పొమ్మని గెంటి వైచుటయు వా డరచుచు నతనితో గొంత తగవులాడెను. అప్పు డిరుగు పొరుగువా రా కామందకుని జేరి వారి తగవులకిగి తెలిసికొని ఓయీ! నీకింత యేలవచ్చినది? రేపు రాజుతో జెప్పుకొనుము, నీ భార్య నిచ్చి తెప్పింపగలడు పొమ్మని యుపాయము జెప్పిరి. వాడందులకు సమ్మతించుచు మరునాడే జేనికడకు బోయి తన యభియోగమంతయు బత్రికపై వ్రాసి యర్పించుకొనియెను.

నందు డాతగవు విషయములన్నియు బరిశీలించి విస్మయమందుచు వెంటనే పితృదత్త మాతామహుని సభకు రప్పించుకొని యతని వలన నిట్లు సాక్ష్యము పుచ్చుకొనియెను.

రాజు—ధారానగరము నుండి మీ యింటికి నిన్నరాత్రి పితృదత్తయను చిన్నది వచ్చినదా?

తాత—వచ్చినది.

రాజు—ఆ చిన్నది మీకేమి కావలయును?

తాత—మా తమ్ముని దౌహిత్రి.

రాజు—ఈ కామందకుని మీ రెరుంగుదురా?

తాత—ఎరుగుదును. రాత్రి వీడు మాయింటికి వచ్చి చాల యల్లరిచేసెను. మహాప్రభూ!

రాజు—ఇతడు నీ మనుమరాలి మగడగునో కాడో మీ రెరుంగుదురా?

తాత—మహాప్రభూ! వీడు మగడుకాడు. కొడుకుతో నా చిన్నది యీయూరు వచ్చుచుండ దారిలో గలిసికొని యిట్టివ్యూహము పన్నెనట.

రాజు—ఆమెకు కొడుకు గూడ కలడా? ఎన్ని యేండ్లున్నవి?

తాత—పదియేండ్లున్నవి. కొడుకు గలడు.

రాజు—(కామందకుని జూచి) ఆ పిల్లవాడు నీ కొడుకేనా ?

కామం—ఔను. నా కొడుకే.

రాజు—వానిని పిలిచి యడిగిన నొప్పుకొనునా ?

కామం—తల్లి బోధ వానికి గట్టిగా దలకెక్కినది. ఒప్పుకొనునని చెప్ప జాలను.

రాజు—తాతగారూ! మీ మనుమరాలికి మగడికందునుకొదనుచుంటిరి కదా ? ఆ మగడు యెందున్నవాడు ?

తాత - ఆమెభర్త నాగరాజు విదేశములో నున్నాడట.

రాజు - మీ కంతలెస్సగా తెలియదను కొందును.

తాత - మహాప్రభూ! నేనాధారానగర మెన్నడును జూచి యెరుగను. ఆ సంబంధమ్ము చేసిచిరకాలమైనది. కాపురమున కజిగిన తరువాత మాయన్న కూతు రప్పుడు నీ యూరురానే లేదు. ఇప్పుడీమె ఠక్కడదిక్కెవ్వరును లేక యిక్కడికి వచ్చినది.

రాజు - మీ మనుమరాలి కుమారునికి ఐదియేండ్లు ప్రాయమున్నది కావున వానిని రప్పించి యడిగిన నిజముచెప్పునా ?

తాత - చిత్తమట్లే చేయుడు.

రాజు - కామందకా! వానిని రప్పించి యడుగుదునా ?

కామం - చిత్తము వానికి దల్లిబోధ తలకెక్కినది. యదార్థము చెప్పనని తలంపను.

రాజు - కానిమ్మడియు జూతుముగా! ఇదివఱ కిట్టి తగవు లెన్నడును వచ్చి యుండలేదు. ఇందలి నిజముదెలిసికొని యపరాధుల గట్టిగా శిక్షించెదనని పలు కుచు నప్పుడే ఫణిదత్తుని దీసికొని రమ్మని దూతలం బుచ్చెను. వారతి జవంబునం బోయి పిల్లవానిందెచ్చి ప్రభువు ముందర నిలిపిరి.

శా. ఆకర్ణాంత విశాలలోచనయుగం బాజానుబాహా కథ
ప్రశస్త శ్రవణద్వయంబు విలస చ్ఛ్రీ శాంకబింబోపమ
వ్యాకోచాస్య విలాసమున్ లలిత దేవాబ్భాయయుంగల్గి ది
వ్యాకారంబునవొప్పు బాలుగని రేడాశ్చర్య విభ్రాంతుడై.

ఔరా! మీ ఠెక్కడి వైదిక కుమారుడు! మారుడుగూడ వీనికీడు గాదని చెప్పనచ్చును. చక్రవర్తి చిహ్నములు వీనియందు గనంబడుచున్నవే అని తలంచుచు —

రాజు - బాలకా! నీ పేరేమి ?

ఫణి - (నమస్కరించి) ఫణిదత్తుడు.

రాజు - మీ తండ్రిపేరు ?

ఫణి-నాగరాజు.

రాజు-మీ తండ్రిగా రిప్పుడెక్కడ నున్నారు?

ఫణి-విదేశములో

రాజు-విదేశమన నేది ?

ఫణి-పేరు దెలిపినచో బోయి తీసికొని రాకుందురా ?

రాజు-నీవు మీతండ్రి నెరుంగుదువా ?

ఫణి-ఎరుగను దేవా.

రాజు-ఈ కామందకు నెరుంగుదువా ?

ఫణి - ఎరుగదును. దారిలో గలసికొని ఈయూరు మా వెంటవచ్చెను.

రాజు-ఇతండు మీతండ్రి కాడా ?

ఫణి-ఛీ ! వీడు మా తండ్రి యెట్లగును?

రాజు-మీతో నెక్కడ గలసికొనియెను.?

ఫణి- ఒకనాడొక కొండలోయలో మాయమ్మ వంటచేయుచుండ మాతో వచ్చిన కూలివాడు మూటయెత్తికొని పోవుచుండెను. నేను వానిని దరుముకొనిపోయి యడ్డగించి మూటలాగికొనుచుండ నా మార్గమున వచ్చుచు నితండు మా పెనుగులాట చూచి కేకపెట్టెను. ఈతని యాతడుచూచి యాకూలివాడు మూటవిడిచి పారిపోయెను. ఆ విశ్వాసమున మాయమ్మ వానికి వండిపెట్టుచున్నది. మాతో నీ యూరు వచ్చెను.

రాజు—కామందకా ! వీని నీవడుగవలసిన మాట లడుగుము.

కామ-వెనకటి గ్రామములో నీ తల్లియు నేనును పోట్లాడినది నీ వెరుందువా ?

ఫణి - నీవు తప్పుడు కూతలు కూసిన మందలించినది. అదియే కలహము.

కామ - నేను నీకు దండ్రిని కానా ?

ఫణి-ఇంకొకతూరి యట్లంటివేని మూతి మీద గొట్టెద.

కామ-చూచితిరా ! వీని పొగరు. మహాప్రభూ !

రాజు-బాలుడా ! నీవేమి చదువుచుంటివి ?

ఫణి-వ్యాయామాగమము.

రాజు - వేదశాస్త్రములు మాని క్షత్రియార్హ విద్య లభ్యసించుచుంటివేమి?

ఫణి - అవియు నిడియుంగూడ మా యొజ్జలు చెప్పుచుండిరి.

రాజు - ఎక్కడ నేర్చికొనుచుంటివి?

ఫణి - ధారానగరములో భోజమహారాజుగారి వ్యాయామ పాఠశాలలో. ఆయనమాకు నెలకు మూడువందల దీనారములు వేతన మిచ్చుచున్నాడు.

రాజు-అట్లయిన భోజభూభుజుడు మిమ్మెరుంగుననుమాటయే ?

ఫణి - ఎరుగుదు మహారాజా!

రాజు - మరి యక్కడనుండక యిక్కడికేల వచ్చితివి ?

ఫణి - అక్కడ దగ్గరచుట్టము లెవ్వరు లేరట. ఆ విద్య లిక్కడ బాగ లభించునని మా అమ్మ తీసికొనివచ్చినది.

రాజు - సాములో నీ వెంత సాధనము చేసితివి ?

ఫణి - చక్రపరిభ్రమణము, లంఘనాతిలంఘనము, దండపరిక్రీడనము, పిడికిలియందు శిలాప్రక్షేపణము, పరిప్లుతవ్యాప్తి, శరీరగుప్తి లోనగు సాధనములయం దున్నిటియందును ప్రథమ పారితోషిక మందితిని. ఇక నెందినములలో జరుగు పరీక్షలో గండ పెండేరము నాకు వచ్చునని విద్యార్థులందరు నిశ్చయించుచున్నారు. ఇంతలో లేచి వచ్చితిమి.

రా - ఏదీ నీ చక్రపరిభ్రమణ పాటవము చూతుము. ఆ మేడ యెక్కి దిగుము.

ఫణి - చిత్తము. అని పలుకుచు నడుము బిగించి యెదురనున్న మేడ యెక్కి చేతులు సాచుచు బహుచంక్రమణములతో నేలకు దిగి దండ మిడెను.

రాజు వాని పాటవము చూచి విస్మయ వివశస్వాంతుండై యోహోహో, బాలుడా! నీ ప్రజ్ఞకు సంతోషించితిమి. నీకు మా పాఠశాలలో గదావిద్య నేర్పించెద చదువుకొమ్మని పలుకుచు గామందకు జూచి యిట్లనియె.

బ్రాహ్మణుడా! నీ తగవు సంశయాస్పదముగా నున్నది. వీరిని ధారానగరమున భోజమహారాజుగా రెరుగుదురని చెప్పుచున్నాడు. వీరివృత్తాంత మెట్టిదో తెలుపుమని యిప్పుడే వారిపేర వ్రాయుచున్నాను. మరియు నీవు చెప్పిన గ్రామస్థుల నెల్ల రప్పించి సాక్ష్యము తీసికొనియెదను. ఆ నగరము దూరము దుండుటచే ప్రత్యుత్తరము వచ్చునప్పటికి నాలస్యమగును. అంతదనుక నిరీక్షించి యుండవలయునని చెప్పిన నా కామందకు డిట్లనియె.

దేవా! బ్రాహ్మణకుల మర్యాదలు బంధుత్వములు బ్రాహ్మణులకే తెలియును గాని ప్రభువుల కెట్లు తెలియును ? ఆ యూరి సభాపతికి వ్రాయుడు. అంతయు నతడు గాగలడని చెప్పిన ననుమతించి యతనికి గూడ వ్రాసి తెప్పించెద గాని నీ వీ లోపల వారింటికి బోయి యల్లరి చేయుదువేని శిక్షింతును జుమీ! జాగ్రత్త యనిచెప్పి వాని నంపివేసెను. ఫణిదత్తుని మరునాడు రమ్మని యాజ్ఞాపించి యంతటితో సభ చాలించెను.

అని యెరింగించి మరియు నిట్లనియె.

## 258 వ మజిలీ

# రుక్మవర్మ కథ

నందభూపాలునకు వ్యాయామాగమ మభివృద్ధిసేయ మిగుల నభిలాష గలిగియున్నది. పట్టణములో బెద్ద మల్లశాల గట్టించి యందులకు గావలసిన పరికరము లన్నియు దెప్పించి పేరుపొందిన మల్లోపాధ్యాయుల రప్పించి విద్యార్థుల కావిద్య నేర్పించుచుండెను. ఆ పాఠశాల ప్రసిద్ధి విని నానా దేశములనుండి పెక్కండ్రు విద్యార్థులు వచ్చి యందు నేర్చుకొనుచుండిరి.

ఆ నందునకు రుక్మవర్మయను కుమారుడు గలడు. వాని విద్యాధికుని జేయు తలంపుతో నందా పాఠశాల గట్టించెను. కొడుకునన్ని విద్యలకన్న వ్యాయామ విద్యలో నెక్కువ పరిశ్రమచేయించుచుండెను.

ఫణిదత్తుడు మరునాడు రాజసభకు బోవుటయు నృపతి సంతసించుచు నపుడే వానిని వెంటబెట్టుకొని వ్యాయామశాల కరిగెను.

అందున్న విద్యార్థుల నుపాధ్యాయుల నెల్ల రావించి ఫణిదత్తుని జూపుచు నీ పిల్లవాడొక మల్లుడు. భోజభూభుజుని వ్యాయామశాలలో చదువుచున్నారట. ఇంతటి నుండి మన పాఠశాలలో జదువగలడు. ఇప్పుడిందుగల మల్ల విద్యార్థి యెవ్వడైన వీనితో గుస్తీపట్టగలడా ? అని యడిగిన సుబాహుడు సుప్రహస్తుడు వజ్రకాయుడు అను మువ్వురు విద్యార్థులు దండచరచుచు మేము వానితో బట్టుదుమని చేతులెత్తి చెప్పిరి.

రాజు తన కుమారు నింజూచి యోయీ ! యీ పిల్లవాడు నీ కంటె జిన్న వాడు. వీనితో మల్లయుద్ధము సేసెదవా ? అని యడిగిన రాజపుత్రుడు యిది యెంత పని ! వీని నవలలజయింపగలను. కాని ముందు సుబాహునితో బోరించిచూచెద. వాని పాటవము దెలిసికొని పిమ్మట గలియబడియెద నని చెప్పిన నొప్పికొని వారిని బురికొల్పెను.

సుబాహుడు సుప్రహస్తుడు వజ్రకాయుడు మువ్వురు వేరువేర ఫణిదత్తునితో గలియబడి మల్లయుద్ధముచేసిరి. ఫణిదత్తునికిగల తాడన నైపుణ్యము వారికి లేకపోవుట చేత సులభముగా వారి మువ్వుర మల్లాడి మల్ల చరచెను.

తరువాత రాజు తనకుమారుని ఫణిదత్తునితో బోరుమని నియమించుటయు నుపాధ్యాయులు ఈ పాఠశాలలో బేరుపొందిన మువ్వుర నతం డెత్తివైచె నీ కొడుకు వానితో బట్టలేడు వలదని వారించుచు ఫణిదత్తునిపాటవము పెద్దగా నగ్గించిరి.

అప్పుడు నందుడా విప్రనందనుని గౌగిలించుకొనుచు నక్కునం జేర్చి కొని తనకుమారుని దాపునకు జీరి ఫణిదత్తా ! వీడు నా కొడుకు. వీనిని నీకు సహాధ్యాయునిగా నతిథ్గునిగా నంతేవాసిగా జేయుచున్నాను. నీవు వచ్చిన విద్యాపాటవ .

మంతయు పీఁకి నేరుపవలయును. నీకు రాని యొజ్జలవలన నేచుకొనవలయును. నీవును మిత్రునిగా దలంచి నీతో సమానుని జేయుము. అని వాని కప్పగించి యుపాధ్యాయులకు జెప్పి యింటికి బోయెను.

నాఁటినుండియు ఫణిదత్తుడు రాజపుత్రునితో మైత్రిచేసి వానికి దనకు వచ్చిన సాము నేరుపుచుండెను. క్రొత్తవిషయము లుపాధ్యాయుల వలన నేర్పుచుండెను.

రుక్మవర్మకన్న ఫణిదత్తుడు చిన్నవాడు. భాగ్యంబున నల్పుడు. అట్టి పిల్లవానికి దాను శిష్యరికము సేయుట రాజపుత్రునకు గష్టముగా నుండెను. అతడు పిలిచిన నపుడు తీరికలేదు, అవకవత్తునని యుత్తరమిచ్చును. పిలువకున్న గరువమని యాక్షేపించును. పలకరించిన విసిపించుకొనడు. పల్కరింపకున్న నాక్షేపించును. ఉపాధ్యాయులతో జెప్పిరనప్పుడే చెప్పితివా? అని కోపించును. ఎల్లరు ఫణిదత్తుని బొగడుచుండ నీసుబూని యుండును.

సుబాహుడు సుప్రహస్తుడు వజ్రకాయుడు వీరు మువ్వురు మాత్ర మా ఫణిదత్తునికి మిత్రులై వానివలన గొత్తవిశేషములు నేర్చికొనుచుండిరి. భీముని జూచిన దుర్యోధనుడు వోలె ఫణిదత్తునిజూచి రుక్మవర్మ యోర్వకుండెను. సుబాహు ప్రముఖుల మువ్వురం దక్క దక్కిన విద్యార్థుల దనపక్షము జేసికొని వారిచే గూఢజా! గరళా! కుండకా! అని వానిని బిలిపించుచుండును.

దానం గోపించి ఫణిదత్తుడు గురువులతో జెప్పి విద్యార్థుల మందలింపజేయగయు రాజపుత్రుడె దానుపూచికొనివచ్చి నీ వట్టివాడవు కావా? అనినం దప్పేమి? నీ యుభయాంగము చదురెక్కలేదా సిగ్గేల? ఊరుకొనుమని యడ్డపడి చెప్పుచుండును.

ఆ పాఠశాలయందుగల విద్యార్థులందరు రాజపుత్రునిపక్షము సుబాహు ప్రముఖులు మువ్వురు ఫణిదత్తునిపక్షము రెండు తెగలుగా గలహింపుచుండిరి. ఒజ్జలు ధనమును రుక్మవర్మ కించుక లేకపోవుటచేత బడియందు నిర్లక్ష్యముగా ఫణిదత్తు నెత్తికొనుచుండు. ఆ మాట నందున కెరింగించుట కందరకు వెఱపుగనే యుండునది. ఫణిదత్తుడు రుక్మవర్మ నిందావాక్యముల గణింపక విద్యాభ్యాసము చేయుచుండెను.

మరియు ధారానగరము పంపినవార్తకు సంవత్సరము నాటికి బ్రత్యుత్తరము వచ్చినది. అందు భోజమహారాజు వ్రాసినజాబులో నిట్లున్నది పితృదత్తశీలం [illegible] తెలుపుమని మీరు వ్రాసిరి. అట్టి పతివ్రతాశిరోమణి భూమండలమున [illegible] లేదు. ఆమెను మే మెఱుంగుదుము. ఇట్లు, భోజుడు. సభాపతి వ్రాసిన లేఖలో నిట్లున్నది. పితృదత్తను మే మెఱుంగుదుము. ఆమె పెండ్లికాకమున్న సంతానముగన్నది. వావివర్తనను లేక సంచరించినది. ఆమె యూరిలో వెలి

వేసితిమి. ఇప్పుడు కామందకుడను బ్రాహ్మణకుమారు నుంచుకొని వానితోగూడ నెక్కడికో లేచిపోయినట్లు చెప్పుకొనుచున్నారు.

ఇట్లు సభాపతి.

నందుడా రెండుపత్రికలు చదువుకొని డోలాయిత హృదయుండై యేది నిశ్చయించుటకు దోచక యా జాబులు రెండునుగలిపి భోజునొద్ద కనుపుచు మరియొక జాబిట్లు వ్రాసెను. భోజమహారాజా! మీ రంపిన పత్రికవలన నిత్యదత్త ఉత్తమ సతీతిలకమని తెల్లమగుచున్నది. మీ గ్రామసభాపతి యా యువతి విషయమై వ్రాసిన లేఖ ఇందుతో బంపితిని. దానిం జదువుకొనుడు రెండును పరస్పర విరుద్ధార్థముల బోధింపుచున్నవి. అందేది నిజమో ఏది యసత్యమో తెలిసికొనవలసి యున్నది. అదం డ్యుల దండించినను దండ్యుల విడిచినను రాజు నరకమునుబొందును. సభాపతివ్రాసిన విషయములు విత్కరింపనాతని మీ సముఖమునకు రా ంచి వ్రాతమూలమైనసాక్ష్యమును దీసికొని పంపవేడుచున్నాను. ఇది శాసింపుట గాదు. మిత్రకార్యముగా భావించి ప్రత్యుత్తరము పంపుడు.

ఇట్లు మీ పాదసేవకుడు నందుడు.

మొదటి జాబులు రెండు దానిలో బెట్టి ధారానగరమున కనిపెను. కామందకు డీ లోపల ధారానగరమున కరిగి తనకథ చెప్పికొని సభాపతిచే నట్లు వ్రాయించిన వాదగుట వెండియు నందునికడకు వచ్చి దర్శనము చేసి ధారానగరమునుండి ప్రత్యుత్తరము వచ్చినదా? ఎన్నిదినములు నే నీ పరదేశములో వసింపవలయునని యడిగిన నందుడు వాని కిట్లనియె. భోజుడు వ్రాసినలేఖ నీకు జాల ప్రతికూలముగా నున్నది. సభాపతి వ్రాసినలేఖలోగూడ నీ భామకు బుసెగట్టిన మగడవని తెలుప లేదు. ఉంపుడువానిగా వ్రాసెంగావున నిప్పు దేమిచెప్పుటకు వీలులేదు తిరుగా వారి పేర వ్రాసితిని. అటనుండి ప్రత్యుత్తరము వచ్చినతోడనే తీర్పు చెప్పెద. గొన్ని నెలలు జరిగిన తరువాత గనిపింపుమని చెప్పి యంపివేసెను.

ఔరా! సభాపతి నా వలన లంచముగొని కట్టుకొన్న భర్తయే యని వ్రాయుదునని చెప్పి యిట్లు వ్రాసెనా? కానిమ్ము. వీని తీరుపు విని యింటికిబోయిన తరువాతవాని నిలబెట్టి యడిగెదగాక అని తలంచుకొనుచు గొన్నినెలలా గ్రామప్రాంతముల సంచారము చేయుచుండెను.

ఒకనాడు నందు డొకపత్రిక చేతంబూని వ్యాయామశాలకు బోయి కుమారుని మల్లసాధన మెట్లున్నదని పరీక్షించెను. విద్యార్థులందరు తమ తమ పాటవముల జూపి రాజుచే మెప్పువడసిరి. రుక్మవర్మ యప్పుడు తనకు దేహములో స్వస్థతలేదని తప్పించుకొనియెను. నందు డుపాధ్యాయుల నెల్ల రాపించి ఫణిదత్తుని చేయిపట్టుకొని వత్సా! ఫణిదత్తా! నీ జెట్టితనము మిగుల స్తుతిపాత్రముగా నున్నది. వినుమిప్పుడు కాశీ మహారాజుగారి యొద్దనుండి యొకహ్వానపత్రిక వచ్చినది. అందలి

వ్యాయామశాలలో మల్ల పరీక్షలు జరుగునట. అందు మొదటివాడుగా బేరువెచ్చికొనిన వాసిగి రతనాల గండపెండేరమిత్తురట. మీ పాఠశాలయందు సమర్థులైన విద్యార్థులున్న యెడల పంపుడని యందు వ్రాసిరి. కావున నీవు దగినవారిని వెంటబెట్టుకొని యందు జరుగు పరీక్షలో సత్తీర్ణుడవై యీ పాఠశాలకు బేరుదెమ్ము? రుక్మవర్మ నిన్ననుసరించి విద్యార్థి. అచ్చటికి బేరుగల జెట్టిమల్లులు పెక్కండ్రు వత్తురు. వారివలన గ్రొత్త విశేషములు గ్రహించి నీ శిష్యునకు నేరుపుము. కావలసిన ద్రవ్యమును నేనుగుల సింగారికల దీసికొని పొమ్మని యాజ్ఞాపించుటయు సంతోషించుచు ఫణిదత్తుడు రాజునకు నమస్కారము గావించెను.

తండ్రిమాటలు రుక్మవర్మ కించుకయు నిష్టములేదు. కాని నృపతియొద్ద నేమియు బలుకనేరక కాశీనగరంబున కరుగుట కంగీకరించి వేరు తన ప్రయాణ సన్నాహము గావించెను.

అని యెరింగించి వేళయతిక్రమించుటయు —

## 259 వ మజిలీ

# మల్లుల కథ

పాటలీపుత్రనగర వ్యాయామశాలలో జదువుచున్న ప్రౌఢులగు యోధులందరు రాజపుత్రునితోగూడ దురగారూఢులై యెకనెర విడిదలు గావింపుచు గొన్ని ప్రయాణంబులకు గాశీనగరంబుచేరిరి. కాశీరాజు వారిరాక విని పరిజనుల నెదురుపంపి తగినట్లు సత్కరింపుచు ననురూపములగు నెలవులలో బ్రవేశింప జేసెను.

అందుగూడ రుక్మవర్మ ఫణిదత్తుని గలిసికొనక విద్యార్థుల సందడిని గని దెసకు జేర్పుకొని కుట్రలు పన్నుచుండెను. సుబాహు ప్రముఖులు ముప్పురు మాత్రము రాజపుత్రునితో గలియక ఫణిదత్తునితో గూడి తిరుగుచుండిరి. మరియు నానాదేశములనుండి పేరుపొందిన వస్తాదులు వేనవేలువచ్చి యప్పట్టణ మలంకరించిరి.

సీ. ఒడలెల్ల బంగారు తొడవుల బిరుదముల్
        ధరియించి వీధులదిరుగువారు
    గండపెండేరముల్ దండిగా గాళుల
        దగిలించి మెల్లగా దలరువారు
    దర్కా శ్రవణకుండలాంక ప్రతీతములందు
        మణిభూషలాడంగ మసలువారు
    చిత్రచిత్రాంబరాంచితము లంగీలు వేసి
        తగదాల్చి హరులెక్కి తగులువారు

గీ. అరుణకిరణ ప్రసార భాసురములైన
కనులబరికించి మూగిన జనుల వెఱపు
గదుర దరమగ దగువారు బెదురఖంద
సదృశులందు జరింతు వస్తాదులహహ!

ప్రారంభ దివసము మొదలుకొని యారుమాసములు జెట్టిపట్టులు జరిగి నవి, రుక్మవర్మ రహస్యముగా వణిదత్తుని సాధసమర్మమల నితరయోధులకు మిత్రముఖముగా దెలియజేయుచు నతనిని జయించినవానికి దానుగూడ బారితోషిక మిత్తునని వర్తమానములు పంపుచుండును.

ఆ ద్వంద్వ యుద్ధములో గెలిచిన యోధు డోడుదనుక కుస్తీ చేయుచుండ వలయును. ఓడినవానిని తిరుగా రానీయక లాగివేయుదురు. ఒకని గెలిచినవానితో మరియొక వీరుని గూర్చుచుందురు.

అందు వీరమల్లుడను వస్తాదు దాక్షిణాత్యుడు. మహాబలశాలి. భీమసదృశుండు. కూర్చిన మల్లులనెల్ల బరాజితులం గావించుచు నొక్కడే యారు మాసములు నిలబడియుండెను. వాని కుస్తీపటిమ సభాసారు లక్కజముగా జెప్పికొన దొడంగిరి. నానాదేశస్థ పాఠశాలా మల్లప్రవరులెల్ల వీరమల్లునిచే నోడిపోవుటయు గ్రమంబున బాటలీపుత్రనగర పాఠశాలా విద్యార్థులకు వంతు వచ్చినది.

కాశీరాజు రుక్మవర్మం బిలిపించి రాజపుత్రా! ఇప్పటికి వచ్చిన వారిలో వీరమల్లుడే జయమందెను. అన్ని పాఠశాలలవారు వానికి దాసోహమని పలికిరి. మీ పాఠశాల మిగిలియున్నది. మీలో వీరమల్లునితో బోరగలవారిం బేర్కొనుము. రేపు గలుపుదుమని యడిగిన రుక్మవర్మ యిట్లనియె.

దేవా! మేము వీరమల్లుని ప్రతాపము చూచుచున్నాము. అతని దేహము వజ్రపు ముక్కగాని చర్మాస్థిమయము కాదు. ఆరు నెలలనుండి పోరుచున్నాడు. ఇంచుకయు జెక్కుచెదరలేదు. వానితో బోరదగిన మల్లుడు మా పాఠశాలలో లేడు. గండపెండేర మాతనికీయవచ్చును. అని చెప్పిన విని కాశీరాజు వెరగు పాటుతో నేమీ! మీ పాఠశాల చాల పేరు పొందినదే. ఇట్టి పిరికిమాట లాడు చుంటివేల? గట్టిదనియే చివర మీ పాఠశాలకు వంతువైచితిమి. నిజము చెప్పుము. సమర్థు లెవ్వరునులేరా! అని యడిగిన నతం డిట్లనియె.

దేవా! నాకీయూరు వచ్చినదిమొదలు నిరుపడక దేహములో స్వస్థత లేదు. "అపండితానాం మౌనమేవ భూషణం" అనునట్లు వానితో బట్టి యోడిరని పించుకొనుటకంటె వానిజోలికి బోకుండుటయే శ్రేయము. నిరాటంకముగా వానికి గండపెండేర మిమ్మని యొత్తి చెప్పెను.

ఆ మరునాడు కాశీరాజు సభకుబోయి మల్లురెల్లరు విన జేయెత్తి యిట్లు చెప్పెను.

ఓ మహా యోధులారా! ఇందువచ్చిన మల్లురందరు నిరుపమాన బాహాబల గరిష్ఠులని చెప్పుటకు సందేహము లేదు. అందు వీరమల్లుడు ఆరు మాసముల నుండి యిట్టిరీతి పోరుచున్నాడు. వానిని మీరినవాడింతవరకు కనంబడలేదు. మిగుల ప్రఖ్యాతిగాంచిన పాటలీపుత్ర పాఠశాలా విద్యార్థులుకూడ నతనికి గండపెండేర మీయవచ్చునని యభిప్రాయమిచ్చిరి. ఆ జెగజెట్టితో బట్టువాడుండిన ముందరకు రావచ్చును. లేకున్న నిప్పుడే గండపెండేర మిచ్చుచున్నారమని యెలుగెత్తి పలికిన విని ఫణిదత్తుడు మిత్రులతో ముందరికివచ్చి దండ మిడుచు—

సీ॥ పాటలీపుత్ర నగరస్థ పాఠశాల
జదువు విద్యార్థు లతనితో జాలరనుచు
నెవరు సెప్పిరి మీతోడ నెవకమాలి
బొంకులాడంగ నెవ్వారు పూనుకొనిరి? 13

ఉ॥ పిలుతువు వంతువచ్చిన ప్రవీణత జూపగవచ్చునంచిటన్
నిలిచితి నింతదాక హరునిం గణియింపము పోరవచ్చినన్
గలబరి వీరమల్లు డనగా మరియెంతటివాడు మాకు దో
ర్బల మదరంగజూడు డిట రాతువు కాళుల ద్రొక్కి వ్రేల్మిడిన్.

అపుడయ్య నా మాటలువిని కాశీరాజు వెరగుపాటుతో గానిండు నెవ్వరనగ నేమి! పోరుసేయుడు మీకాజ్ఞ యిచ్చితినని చెప్పుటయు ముందుగా సుబాహుడు వానితో గలియబడియెను. ఇరువురకు నెల దినములు మల్లయుద్ధము జరిగినది. హెచ్చుతగ్గులు గానంబడలేదు. తరువాత సుబాహుడు పదియేడు దివసంబులును మఱి యిరువదియెనిమిది వాసరంబులు నొకరొకరు నా వీరునితో పోరుచేసిరి కాని జయాపజయములు లవలేశము గలుగలేదు.

వానిని ప్రశంసింపుచు గాశీరాజు పిమ్మట ఫణిదత్తున కుత్తర మిచ్చుటయు నూతనోత్సాహము గలిగినవాడు ప్రచండదోర్దండ ప్రతాపమేపార భుజాస్ఫాలనంబు గావింపుచు నా వీరమల్లునితో గలియబడి లంఘనతాడన సంకోచన విస్తృతాది మల్లవిద్యాపాటవంబున తేటపడ మూడుదినములు పోరాడి వీరమల్లు నెత్తివైచి చిత్తువేసి గెలిచితినని పలుకుచు మల్లచరుచుటయు సభాస్తారుల జయజయ ధ్వానములు మిన్నుముట్టినవి.

అప్పుడు కాశీరాజు ఫణిదత్తుని గౌగలించుకొని ముద్దుపెట్టుకొనుచు ప్రశంసించి సగౌరవముగా నిట్టి మల్లకంఠీరవుడు మీకడనుండ నెవ్వరులేరని చెప్పితివేం! ఏమి వేసంగవా? అని నా రాజపుత్రుకిట్లనియె

గీ॥ శ్వాతలేశ్వర యేడు మాసములనుండి
పోరుచున్నాడు విడువక వీరమల్లు
దలయక కుండెనె యెప్పటి కట్టివాని
గెలిచె ఫణిదత్తు డిదియొక్క గెలుపుగాదు. (15)

చ॥ ఎరుగనె నేను మాఘటు నహీన పరాక్రమశాలియంచు నే
దెర వినుతింప మీరనుమతింతురె వీడు వీరమల్లుడు
క్కరనని సేసి చేసి చలకంబడియుండగ బట్టివీడు చి
చ్చురపిడుగాతడిట్టి ! లకూమడు ధామణియందు గల్గునే. (16)

అనుట యు గటకటంబడి ఫణిదత్తుడు—

గీ॥ ఓర్వలేమిగాక యొరుల నగ్గించుట
వాసియొక్కొ యక్నవర్మ నీకు !
సేదదీర్ప తెప్పదేసిమీ వీరుని
బంపుదప్పుడు తెలియబడదె ఱంము ? (17)

వీరమల్లుడు పూర్తిగా విశ్రాంతి వహించిన తరువాత గ్రమ్మఱ ద్వంద్వ యుద్ధమునకు బంపుడు అప్పుడిట్లు గెలువకుండునేని వాని చెప్పులు శిరంబున దాల్చుచుండెద నిదియే శపథమని పలికిన విని యెల్లరు విస్మయముతో నామాట లంగీకరించి యొకనెల గడువిచ్చిరి. అంత దనుక నందువచ్చిన మల్లురెల్ల సుఖముగా భుజించుచు స్వేచ్ఛగా విహరింపుచుండిరి.

ఒకనాడు ఫణిదత్తుడు సుబాహు ప్రముఖులు సఖులు సేవింప గంగానది మీద నౌకావిహారము గావించెను. తరంగాంతరముల నుయ్యేలలూగుచున్న జల విహంగములం జూచి యానందింపుచు గల్హారకైరవ ప్రముఖ కుసుమవాసనా చోరకము లగు మందమారుత కిశోరములు హాయిసేయ దిరుగుచుండ నౌకదండ మఱియొర్తు సుధాకర బింబసదృశమగు మొగంబు తటాలున నీటిపైనదేల్చి యంతలో మునింగి రత్నకంకణాంగుళీయక భాసురంబగు కరంబు పైకెత్తి తన్ను రక్షింపుడని యంగుళులతో సూచించినది.

అవ్వింత కన్నులారజూచి సుబాహుం డోహో ! యెవ్వతెయో జవ్వని యివ్వనరాశింబడి మునిగినది. పాపము రక్షింపుమని ప్రేళ్ళగదిపినది. యోడ నిలుపుడు. జాడల బరికింపుదని నావికులకు ప్రబోధించుటయు వాండ్రు బాబూ ! వలదు వలదు. అది మొసలివంటిది. దిగిన వానింపట్టిచంపును. పెక్కండ్రిట్లే జాలిపడి దుమికి తిరుగరారైరి. అప్పుడప్పుడిట్లే ప్రవాహములో నీవింత గనంబడు చుండునని చెప్పిరి.

ఆ మాట విని ఫణిదత్తుడు అయ్యో ! నేనా వింత చూడలేదు గదా ! ఎట్లున్నది చెప్పుమని యడిగిన సుబాహుడు మిత్రమా ! నీటిపై ప్రతి ఫలించిన చంద్ర బింబమోయని మొదట భ్రమపడితిని. నేత్రాది చిహ్నములవలన యువతీ వదనంబని తెలిసికొంటి. దెప్పునదేలి యంతలో మునిగి చేయిపైకెత్తి యంగుళులతో దన్ను రక్షింపుమని సూచించినది. ఏను దుముకదలచుకొన నావికులు వలదు అది ప్రమాద మని వారించిరి. నీవు మిత్రులతో ముచ్చటింపుచుండుటజేసి పరాంగ్ముఖుడవైతివి. అని

చెప్పిన నతం దది యెక్కడ తేలినది చూపుమనుచుండ దటాలున క్రమ్మర నమ్మగువ గ్రుడ్డమ్మివలె నా నెమ్మొగంబు నీటిలో దేలించి యంతలో మునిగినది. కంకణ ఝుణఝుత్కారంబులెసగ రెండు కరంబులు పైకెత్తి రక్షింపుమని సూచించినది.

ఫణిదత్తు దప్పుడెవ్వరికిం జెప్పక ఏమిగను సవరించక గుభాలున నీటిలో దుమికి యా చేతులు రెండును బట్టుకొనియెను. అయ్యంగనయు నినుపగుండువలె బరువై యతని నీటి యడుగునకు లాగికొనిపోయినది.

ఆపు వెంటనే సుబాహుడు లోనగు మిత్రులందరు నా ప్రవాహములో దుమికి యీదుచు వారి నన్వారిలో వెదకిరి. ఎవ్వరు నెందునం గనబడలేదు. అక్కటా! నావికులు చెప్పుచునేయున్నారు. ఇది మాయావిని పెక్కండ్రినిట్లే మునిగినది. ఫణిదత్తుడు సదాలింపక రక్షింప దుమికెను అరక్షింతయై మునుగుచుట్లు రక్షింపబోలు! అక్కటా! ఇక మనకు దిక్కెవరు? నిష్కారణ మంచివాడు కరము బైనని విచారించుచు స్నేహితులందరు సందంద యీదిపోవుచుండ్రి యడ్డుచేరి దుఃఖముతో ఫణిదత్తునివార్త కాశీనేతకుం దెలియజేసిరి. ఆ భూపతి మిక్కిలి పరితపించుచు వెంటనే గంగానదిలో వలలు వేయించి వెదకించెను. గాని యతని దేహము దొరకలేదు. ఆ వార్తవిని రుక్మవర్మ ప్రముఖశత్రుకోటి యానందించినది. వైరియైనను వీరమల్లుడు ఫణిదత్తుని మల్లసాధనము గురించి మెప్పుగా నుపస్మరించెను.

అప్పుడు ఫణిదత్తుడు మృతినొందెనని నిశ్చయించి కాశీరాజు మరియొక నెలచేసి వీరమల్లునకు గండపెండేర మిచ్చుటకు నభ్యంతరము కలదాయని సుబాహు ప్రముఖుల నడిగెను. అందులకీయకొనక సుబాహుడు మహారాజా! మమ్మతడు మరువలేదు. వీరులో సముడమైతిమి. ఇప్పుడు మిత్రశోకవ్యాకుల చిత్తులమగుట గ్రమ్మరజాసితో పెనగుటకు నోపము. గడువిచ్చిన వత్తుమని చెప్పుటయు రుక్మవర్మ యాదేశమున లాలసించుచు నిప్పుడే వీరమల్లునకు గండపెండేరమీయక తప్పదని నిర్బంధించెను.

అట్టి మిత్రుడే పోయినప్పుడీ బిరుదములు తమ కెందులకని యుపేక్ష చేయుచు సుబాహుడు సుప్రహస్తుడు వజ్రికాయుడు వీరు మువ్వురు ఫణిదత్తుని మరణమునకు సంతసించుచున్న రుక్మవర్మతో గలియక యటగదలి తమదేశమునకు బోయిరి.

రుక్మవర్మయు వీరమల్లునికి గండపెండేర మిప్పింప తనకు హృదయ శల్యమగు ఫణిదత్తుని మృతి కానందించుచు నతనిమిత్రులం బిలువక నాప్తజనముతో గలిసి నానావిధ వైభవం బడసి పాటలీ పుత్రనగరంబున కరిగెను.

అని యెఱింగించునప్పటికి గాలాతీతమైనది. తరువాత కథ పై మజిలీ యందు చెప్పదొడంగెను.

## 261 వ మజిలీ

# వరుణకన్యకల కథ

క. ఉదధిజలంబున మునిగిన
నదినీటంబడిన గానసుండైనన్
దుదిఁబూర్వపుణ్య ఫలగతి
వదలక భద్రములుఁ దోడ వచ్చుంగాదే. (18)

ఫణిపతుఁడట్లు గంగలోఁ దుమికి యారమణీమణికరంబులు బట్టుకొనుటయు వానిం బాతాళలోకమునకుం లాగికొనిపోయి చేతిపట్టు విడలించుకొని యదృశ్యమైనది. అతం డొక యుద్యానవనములో నిలువంబడి యుండెను. వికసిత లలిత కుసుమదళకలిత తరులతావిశేషములచే నొప్పుచున్న పూఁదోటంజూచి విస్మయాయత్తచిత్తుండై యప్పటి తన యవస్థ యెట్టిదో తెలిసికొనఁజాలక యందలివింతలు చూచుచు గొంత దూరము పరిక్రమించెను.

ఆ యుద్యానవనమధ్యమున స్ఫటిక శిలాసోపాన భాసురంబగు సరోవరము పశ్చిమతీరంబున దివ్యమణి ఘంటికాటంకార నాదమోదితం బగు శివాలయ మొకటి వానికి నయనోత్సవము గావించినది. నానారత్న విచిత్ర సమున్నత ప్రాకార మంటపాదులచే నొప్పారు నక్కోవెల యావరణములోనికింజని ప్రదక్షిణ పూర్వకముగా ముఖమంటపము దాపుచేరి యందు శివలింగము చెంత గూర్చుండి భక్తిరస వివశయై వీణాగానము చేయుచున్న నారీమణి యొకర్తు వాని కన్నులఁబడినది.

ఆమెనుజూచి యతఁడు మేను పరవశము నొంద దన్ను జూచుకొనుచు నిట్లు తలంచుకొనియె. ఆహా! నే నిప్పుడు నిద్రవోవుచు నిట్టి కలఁగంటినా? మేల్కొనియుంటినా? నే నీ రమ్య ప్రదేశమున కెట్లు వచ్చితిని? ఎందుండి వచ్చితినో జ్ఞాపకములేకున్నదే! ఔను స్వప్నమునకు తుద మొదళ్ళుండునా? ఏది యెట్లయినను గన్నుల కలిమి సార్థకము నొంద నీ యదృష్టపూర్వవిషయంబులం జూచితిని ఇది భూలోకమా? భూమి యందింతలేసి రత్నములుండునా? ఓహో! తెలిసినది. ఇప్పు డంతయు జ్ఞాపకము వచ్చినది.

ఇది కలకాదు. సత్యమే. నేను మిత్రులతో గంగాజల విహారము గావించితినా? అంటొక యబల తేలి మునింగిన నామెకై నీటిలో నురికితినా? అత్తరుణి నెత్తలేక నిరువురము నడుగునకుం బోయితిమా? ఎవ్వడైన నీటిలో జాముకన్న నెక్కువ నిలువఁగలఁడా? నే నందు ప్రాణములు బాసితిని కాబోలు పరోపకారమునకు దేహత్యాగము చేసినందులకు పుణ్యలోకమున కరుదెంచితిని. ఆ యువతియు గంగాగర్భంబున చచ్చుటచే సాయుజ్యము నొందినది. మరియు-

బలవంతమున గంగబడి పొందితిని నీదు
కైవల్యమికనంత కన్న గలదె
వసుధ నామరణంబులవలన మజ్జనయిత్రి
యును మిత్రులును గుందుచుండ్రు మిగుల
విహితులెల్లో శోకవిముఖులౌదురుగాని
తల్లి మదేక సంతానయగుట.

గీ. గుండెపగులంగవిని చావకుండదకట
యాపెబతితోడ గూర్చియే యాపదలను
బొందకుండగ సౌఖ్యము లందజేయు
మిదియె నా కోర్కిదయ సేయవే మహాత్మ. (౨౦)

అని యమ్మహాదేవి వినుతించుచున్న సమయంబున నందున్న చిన్నది పీఠం గట్టిపెట్టి ప్రక్కకుటిలోనుండి లేచి యెక్కడికో పోవ బొడంగినది. ఆ భువనైక సుందరింజూచి ఫణిదత్తుడాశ్చర్యపడుచు నీ మోహనాంగియు నేను నొక్క తేపయే మృతినొంది నొక్కతేపయే శివసాలోక్యము బొందితిమి. ఇప్పుడక్కలికి యెక్కడికో పోవుచున్నది. ఇంతకంటె నెక్కుడు పుణ్యస్థల మన్యుల నేదేని యున్నదేమో! నేనుగూడ బోయి చూచెదగాక. అని తలంచుచు నా చంచలాక్షి కించుక యెడముగా నడిచి పోవుచుండెను.

అమ్ముద్దియయు పెద్దదూరము పోయిపోయి యాపూదోటలో నొక్కచోట నిలువంబడి యెవ్వరినో పిలిచినది. అప్పు డక్కడనున్న యినుప కవాటము తెరచి కొని భూమిలోనుండి యిరువురు సుందరు లీవలకువచ్చి యామెకు గైదండయొసగి లోపలికి దీసికొనిపోయిరి. ఫణిదత్తుడును చోరవద్మై నా తలపు మూయకుండ సందలి మెట్లగుండ క్రిందికిదిగి కొంతదూర మేగినప్పటికి రత్నచయకాంతులచే ధగద్ధగాయ మానంబగు నొక ప్రాసాదంబతనికి గన్నులపండువు గావించినది. అందు నిలిచి యాతడు సూచుచుండ నా మేడనుండి నేగురు రూపవతులు ఈవలకు వచ్చి యామచ్చె కంటికి గైదండ లిచ్చుచు లోపలికి దీసుకొనిపోయిరి.

ఫణిదత్తుడును విడువక వారి పిరుందన యా మేడనెక్కి యొక్క చక్కిం గూర్చుండెను. అందున్న సుందరులందరు సమానరూపవయో విశేషముల నొప్పుచుండుటం బట్టి గుడిలో దనకు గనంబడిన చేడియ యెవతెయో తెలిసికొనలేకపోయెను. దివ్యమణి భూషాంబరంబులు దివ్యమాల్యానులేపనంబులు గైనేసి భూషణప్రభల బరిహసించు మేని కాంతులతో నొప్పుచు గన్నులకు మిరిట్లు గొలుపుచున్న యన్నారీ రత్నంబులనెల్ల విలోకింపుచు వ్యాఖ్యానించుచుండె వసతం వీట్లు తలంచెను. ఔరా! గుడిలో గనంబడిన చేడియయెక్కడతయ సుక్షుహాలసు కొంటిని. వీరందరింజూడ నా డెందము సందేహదోలికయెక్కి యూగుచున్నది. ఏటిలో మునిగిన చిన్నది యిందు

గాటించి కొండును. ఇది స్వర్గలోకమేమో? వీరందరు నప్సరస్త్రీలా ? ఇవ్వనము సంగనవగు గాక ; స్వర్గపట్టణమవ్వల నెక్కడనో యుండబోదు. నాక మేగిన వానికి దంభాదు లెదురవచ్చి యాదరించి తీసికొనిపోవుదురని చెప్పుదురు. వీరు నా దెసయే గూడను. నాతో మాటాడరు. ఇది యెట్టి మోక్షమో తెలియదు. కానిమ్ము, మానుష దుర్లభమగు యైశ్వర్యముల గనుంగొంటిగదా ; వీరాడుకొనుమాటలు కొన్ని విన్నట నేనే పరికించెదంగాక యని తలంచుకొనుచు బొలుతి బూబోటలోచూచి గోసి తెచ్చిన విచిత్ర ప్రసూనము నుండిడుకొని తత్ప్రతిభావిశేషంబుల విమర్శింపు చుండెను.

ఒకతె—అక్కా! దిక్కుమాలి మన మెన్నిదినము లిందుండవలయును. మన లిప్పుడు లప్పుడుపోవును. చండిక నంపితివా ? ఏమి జరిగినది ?

అక్క—పంపితిని. చండిక బొలుత కాశీపురంబునకరిగి ప్రచ్ఛన్నముగా తిరుగుచు నొకబలశాలి నెరిగి మాయబన్ని యీ లోకమునకు దీసికొనివచ్చినదట.

ఒకతె—వాడేడే? ఇందు రాలేదేమి ?

అక్క—ఆమాట తెలిసికొనుటకై శివాలయమున కరిగి చండిక నడిగితిని. అతడిందు వచ్చెనని స్పష్టముగా జెప్పినది. వాడెందో మసలియుండును.

మరియొకతె—అతనివలన మనకు గావలసిన యుపకారమేడి ?

అక్క—సింహమును జంపి యప్సర విప్పించుటయే ?

ఒకతె—అట్టి సామర్థ్యము లేనిచో నేమగును.

అక్క—వెనుకటివానివలెనే మడియును.

ఒకతె — అదిగో! ఆ ప్రక్కను గూర్చున్నవాడు మనుష్యకుమారుడు దగ నున్నాడే !

అక్క—ఔనౌను. మనము చూడనేలేదు. "అని దిగునలేచు చున్నది. అంతలో సందరులేచి నిలవంబడిరి." వారంజూచి ఫణివత్తునుడ లేచి నిలువంబడెను. అప్పుగండలి యేలినసాని వాని నికటమున కరుదెంచి నమస్కరించుచు మహాభాగ ! స్వాగతమా యని యడిగినది. అతండు ప్రతినమస్కారము చేయుచు గంగాంగ! పరిహారితకల్మషుండనగుట స్వాగతమే నీ పేరేమి ? రంభ నీ కేమగును ? ఈ సుందలందరు నప్సరలా? యని యడిగిన ముసి ముసినగవులు నవ్వుచు నా జవ్వని పుణ్యపురుషా ! ఇది నాకము గాదు. అథోలోకము. మేము వరుణ గన్యకలము. నా పేరు వారుణియంద్రుడు, వీరందరు నా చెల్లెండ్రుడు. నీ నిమిత్త మెదురు చూచుచుంటిమి. అనవుడు నాతం డిట్లనియె.

మత్తకాశినీ ! కాశిలోజచ్చినవారు నాకమున కేగునని వింటిని. ఇది వరుణ లోకమా ? తెలిసినది. జలమన్మరణమైన వరుణలోకము సంప్రాప్తించును గాబోలు ?

అది యట్లుండె నాతో గంగలోమునిగింప బసరా లేలోకమున కేగినది? ఇందుకా లేదా. నే నిందు జేయదగిన పనులేమి? అని యడిగిన నావారుణి యిట్లనియె.

సౌమ్యా! అబోటిమాట అనక జెప్పెదనులే. నీ విందు జేయవలసినపని చాల గొప్పది. అందులకే నిన్నిందురప్పించితిని. నీ రూపము జూడజాలినవాడ వని తోచుచున్నది. వినుము మేము వరుణుని దౌహిత్రికలము. మాకును నా గుల కును సంబంధము కలిసియున్నది. బలిచక్రవర్తి పౌత్రుడు శంబరుండనువాడు శ్రీ విష్ణునితో గలహించి పాతాళలోకమున బ్రొక్కపడియెను. మేము మణిమంతమను నగరమున వసింతుము. ఆ దానవుడు మమ్మొక్కపరిజూచి పెండ్లియాడుమని నిర్బంధించుచుటయు నందులకు మే మంగీకరించితిమిగాము దానం గోపించి యా పాపాత్ముండు మయమాయా బలసహాయంబున మమ్ము జెజదెచ్చి యీ సౌధంబునం దెచ్చి కట్టడిజేసెను. మేమిటనుండి యవలకు బోకుండ నాగలోకపు పొలిమేరలో నొక సింహమును గాపుపెట్టెను. నాగలోకమునకు వరుణలోకమునకు నడుమ నొక శార్దూలమును నిలిపెను. ఆ రెండుమృగంబులును దేవదానవులకు నజేయములై సురగరుడోరగాదులకు నసాధ్యములై యివ్వలవారినవ్వలకు నవ్వలవారి నీవలకు రాకుండ నాటంకపరచుచున్నవి. ఆ పాపాత్ముడు మా కిట్టి నిర్బంధము కల్పించిన కొండికాలములోనే వాసుదేవునిచే హతుండయ్యెను. వాడు చచ్చినను మా కీ మృగావ రోధము తప్పినదిగాదు.

మే మందలి శివాలరామున కేగి బంధ విముక్తికై యా స్వామి నారాధింపు చుందుము. చండికయను శివశక్తి భూలోకమున కేగి బలశాలి నేరి తీసుకొనివచ్చుచుం డును. తదా నీతులగు జోదులు పెక్కండ్రా సింహముతో బోరిచంపబడిరి. ఆ మెకం బులు సురగరుడోరగాది దేవతల కవధ్యంబులై నను బలవంతుడైన మనుష్యునిచే జంప బడునని మయుడు మొదటనే యానతిచ్చెను. దానంజేసి మనుష్యుని రప్పించుకొమ్ము. కాశీనగరంబున నీడోదుతనంబు ఎల్లరు బొగడవిని చండిక నిన్ను గంగలో ముంచి యిందుదీసికొని వచ్చినది. నీవది చావనియు నిదిక్రైవల్యమనియు దలంచు చుంటివి. రెండునుంగావు నీవా దేహము తోడనే యిందువచ్చితివి. చూచుకొనుము. నీవా సత్వంబుల రెంటినిం బరిగొని మా యవరోధంబు వాపితివేని నీమేలెన్నటికి మఱచు వారము కాము. మేమునిత్య యౌవనులము మాకు జరలేదు. అవివాహితలము.

అమ్మంగాంత కుండే నాగలోక చక్రవర్తియగునని చెప్పుచును ఇందులకే నిన్నిందు రప్పించితిమి. మాకీ యుపకారము చేయుమని ప్రార్థించుటయు ఫణిదత్తుం డాశ్చర్యపడి యప్పరతి కిట్లనియె, నాతీ! మీ తాత వరుణుండు పశ్చిమ దిక్పాలుండు అమృగావరోధమే మాన్పలేక పోయెనా? కానిమ్ము అది వర ప్రభావమంటివి నన్ను ధన్యుని జేయుటకే నాకీ పని కల్పించి యుంటిరి. సింహ వ్యాఘ్రంబుల నవలీలం

బోమార్చి మీ యిక్కట్టు బాపెద! ఆ సింగం బిక్కడి కెంత దూరములో నున్నది? ఏమి చేయుచుండును? దాని తెఱ గెఱిగింపుమని యడిగిన వారుణి యిట్లనియె.

పురుషసింహా! ఆ సింహము సీమాంతరము విడిచి నటు నిటు రాజాలదు. నాగపురమునకు బోవు దారిలో గాచికొని యుండును. దానికడ శంఖమును ఘటికయుం గలిగియున్నవి. వానిం గైకొనిన నా మెకంబు సులభముగా వధింపబడును. ఎంత బలశాలియైనను వానిం గొనకున్న దానికి వశమగును అది యెఱింగి పోరలవయును. అని చెప్పినది. ఫణిపత్తుండు భుజాస్ఫాలనము గావింపుచు పరమేశ్వరుని యనుగ్రహ మందిన సింగము, గింగము, పులియుం, గిలియునెంత! అర నిముసములో వానిని పడియింపగలను. తెరువెఱింగింపు డిప్పుడే పోయెదనని పలికిన గులుకుచు నక్కలికి తన చెలియం దొక్కొండుం దారిజూప నాతురుని వెంట నంపినది. ఖడ్గమాత్రసహాయుండై యా మృగేంద్రమున్న తావున కరిగెను.

ఆ పంచాస్యంబు సముజ్జ్వల జ్వాలాభీల పటాభీషణాస్యంబై దూరము నం దతనిం జూచి నోరప్పళించుచు నద్దెకేరి యావులించి చరణ చతుష్టయంబు సాగ సుంకించుచు దోక నిక్కబెట్టి నొక్క పెద్దకేక బెట్టినది ఆ ధ్వని విని యతని వెనుక వచ్చుచున్న పడతులు మతులు చెదర బెదర గదుర బిదురు పాతంబుననుంబోలె వెఱచి కాలి కొలదిం బఱచిరి.

ఆ వీరుండు నొకచేత గరవాలంబు నొకచేత గదాదండంబునంబూని యనూన చక్ర చంక్రమణముల నక్కేసరి పరిసరంబు నకుంబోయి హర్యక్షమా! రమ్ము రమ్ము నీ పీచ మందచెద రమ్ము నీ యాయువుడిగినది రమ్ము! అని దానిం జీరుటయు నది నోరుదెఱచికొని చరమచరణంబుల నిలువంబడి త్రిశూలలాగా ఖీలము లగు నఖర శిఖరముల వానిం గ్రుచ్చుటకు మీదికి లంఘించుటయు నాదండి మగండు ప్రచండ దండాఘాతంబున ముందరి కాళ్ళదులియ నేసి నోటిలో మేటి యడిదంపు కొనం జొనిపి నాలిక చీలికలగా గోసి దాని బరవశము నొందజేసెను. అది యొన రిల్లుటయు మోసమెఱింగి దాని యొడిలో నున్న యడిదమును శంఖమును లాగి కొనియెను.

ఆ మేటి మెకంబు నోటినుండి వెల్లువగా నల్లగాఱ వికృత స్వరంబున నార్చుచు వాడి కోరల నా వీరు నుదరంబున గ్రుచ్చ వచ్చిన నచ్చతురుండు దండ ఘాతంబుల దానింబడనేసి విడువక మెడపై గాళ్ళ ద్రొక్కి దండంబుల శిరంబు జిదియం గొట్టి కత్తితో నంగముల నరికి శంఖంబు పూరించెను. తద్ధ్వానంబువిని మణి మతంబునగల నాగులు విస్మయ వివశ మానసులై యది యేదియోయని తర్కించిరి.

వారుణీ ప్రభృతి యువతిమ దల్లుల దూర దూరముల నుండి వాని యుద్ధ పాటవంబు చూచుచు సింహము సమయుట దెలిసికొని యొక పెట్టున వానిం జుట్టుకొని

జయ ఫణిదత్తా! యని కేకలు పెట్టుచు నతనిపై బుష్పవర్షము గురిపించిరి. పిమ్మట వారుణి యా పీఠికి నమస్కరించుచు మహా సత్త్వా! నీవీ సత్వంబును బంచత్వము నొందించుటచే నీ సత్వము సర్వ సుపర్వ పూర్వామర సంస్తుత్యమై యొప్పు చున్నది.

మొదట నీతో జెప్పమఱచితిని. ఈ మృగద్వయ హంతకుని మేము మనః కాంతునిగా జేసికొన నిశ్చయించు కొంటిమి. మా కందఱకు బ్రాణ నాయకుండై మమ్మేలికొనుమని పలికిన విని యతడు చిరునగవుతో బోటీ! నీ మాటలు వినిన నక్కజమగుచున్నది. ఒక్కనికి వేయిమంది భార్యలుగా నుండుట యసమంజసము. ఇది లోక విరుద్ధమని పలికిన నక్కలికి మనోహరా! మేము మానవాంగ నలవంటి వారము కాము. నిత్యయౌవనులము. అనుదినము మా ప్రాయము క్రొత్తక్రొత్త యగుచుండును. బలప్రదలమగుట మాతో గ్రీడ మీకు పీడాకరముగా నేరదు. పతివ్రతలమై భర్తృ చిత్తవృత్తి ననుసరించి యుందుము. అని యేమేమో చెప్పుచుండ నతండు కానిండు ఆ శార్దూల మెందున్నదో తెలుపుడు దానిం గూడ గడతేర్తునని చెప్పెను.

అంతలో సింహవధ విని మణిమంతుని మంత్రు లచ్చోటికి వచ్చి చచ్చిన సింహమును దద్రుధిరసిక్తాంగుడై యంగారకుని చందంబున బ్రకాశించుచున్న ఫణిదత్తుని జూచి యాశ్చర్యమందుచు మహానుభావా! నీ ప్రతాప మేతన్మాత్రముగాదు. దేవ దానవ దుర్జేయమైన హర్యక్షమును బరిమార్చి వరుణ నాగలోకముల కుపకారము సేసితివి. ఆ పులిని గూడ సులభముగా జంపగలవు. దేవతాంశవలన జనించిన మనుష్యుడు గాని యీ మృగంబులం జంపజాలడు అని మయుడు వరమిచ్చెను. నీవట్టివాడ వనుటకు సందేహము లేదు.

మా ఱేడు అవసరము వచ్చి భూలోకమున కరిగెను. మూడు వాసరములలో రాగలడు. సింహవధ విని చాల యానందించును. ఈ లోపల బులిం జంపుడు. అతి రయంబున నడువగల యీ హయం బెక్కి యందుబొండు. మా భటులు మార్గము చూపుదురని చెప్పి దారి చూప నూరుగురు వారవపు రౌతుల నియమించి నిలయంబులకు బోయిరి. వారుణియు నతనికి జెప్పవలసిన మాటలు జెప్పి చెల్లెండ్రతో గూడ వెనుకటి మేడలోనికి బోయిరి.

అని యెఱిగించునప్పటికి గాలాతీతమైనది. తదనంతరోదంత మవ్వలి మజిలీయం దిట్లు చెప్పుట మొదలు పెట్టెను.

261 వ మజిలి

# అ ప రా ధ ప రి శో ధ న ము

భోజభూపుడు నందభూపతి యంపిన పత్రికం జదివికొని కోపరసావేశిత చిత్తుండై యవ్విషయము విమర్శింప నొకనాడు ధారానగరములో గొప్పసభ గావించెను. ఆ సభకు గాళిదాసాది మహాకవులు, చతుశ్శాస్త్ర పండితులు, వేదవేదాంగవేత్తలు, హిత పురోహిత మంత్రి సామంతాది రాజపురుషులు వచ్చి యలంకరించిరి.

అప్పుడు ప్రధానామాత్యుడు లేచి యెల్లరు విన నిట్లనియె మహాభాగులారా! లోకులు యశస్సుకన్న నపయశము చెప్పుటకును వినుటకుగూడా నెక్కుడు ప్రీతులగు చుందురు. ఈ నగరంబున సిద్ధశ్రోత్రియుడగు నగ్నిశిఖుడను బ్రాహ్మణుడు కాళిదాసకవి భోగ్యగా నలిచెనని యా పౌరున కీయూరివారెల్ల వెలివేసిరట. తత్కావ్యసార్వభౌముని యాశ్రయించిన నా భూసురవర్యునకు సంగతిగలుగుట దెలిసియు వారిపై నీవు మోసరిరాదు.

తరువాత బెండ్లి కాకుండ గుంతివలె దేవాంశవలన బుత్రునిగనుటయు వారలెల్లరు నిందింప గాళిదాసకవివలన నిజమెరిగి మన ప్రభువుగారా సాదుశీలం గుమారునితో గూడ బోషించుటయు వీరందరు నెరింగినదియేకదా?

పిమ్మట నాకొమ్మ యిందలి తుంటరులకు వెరచి తల్లి పుట్టినిల్లగు పాటలీపుత్రనగరమున కరిగినదట. అందు నా సుందరి పిరదన చని యెవ్వడో యయ్యింద పనిన తన భార్యయని నందునకడ నభియోగము దెచ్చెనట.

ఆ నందుడు స్త్రీతుద తశీలము గురించి మాకు వ్రాయ యదార్థము తెలియ నసిగిము. మరియు నీ గ్రామ సభాపతిగారికిగూడ వ్రాయ నా పౌరుడీ పత్రిక వ్రాసెను. ఆ బాలుడు పితృసత్త వావివర్తనలులేక సంచరించినది. కన్యకయై పుత్రుం గనినది దానికి మగడులేడు. ఇప్పుడు కామందకుడను వానిని దీసికొని యెక్కడికో లేచిపోయినది. ఆమె యిక్కడ వెలిలోనున్నది. అని నందునకు తెలియజేసిరి.

ఆ భూజాని యాజాబు మాకనుపుచు బరస్పర విరుద్ధార్థములుగల పత్రికల గురించి యదార్థము తెలియజేయుడని మాకు వ్రాసిరి. అందులకే సభ గావింపబడినది. కాళిదాసకవి వాక్యమున కన్యథాత్వ మిదివర కెన్నడును గలుగలేదు. అది యట్లుండ సభాధిపత్యము వహించిన యా బ్రాహ్మణ శిరోమణి నంద నృపాలున కేమని వ్రాసెనో యుత్తర మీయవలసియున్నాడు అని చెప్పి కూర్చుండ నంత సభాపతి యచ్చటలేచి యెల్లరు విన జేతులెత్తి యిట్లుపన్యసించెను.

యున్నది. కాళిదాసు మహాకవియగుగాక! కులోచితధర్మంబుల విడుచుటచే పాడు లతని పంక్తిని భుజింపరు. భుజించిన యగ్నిశిఖుని వెలివేయుట మా తప్పుకాదు.

అది యట్లుండె పితృదత్త యన్నలచే పోషింపబడుచు పెండ్లి కాకుండ గర్భవతియై పుత్రుఁగనినది. అది శాస్త్ర విహితమైన యాచార మేమో యెఱిగిన వారిని జెప్పుమనుడు. కాళిదాసకవి సమస్య పూర్తి గావించినంతనే పితృదత్త నిర్దోషు రాలగునా? నిజముదాచనేల? కవిగారి కగ్నిశిఖునియందు గల యభిమానంబునంజేసి యగ్నిమిత్రునిచే పోషితుండై యట్లు సమస్య పూర్తికావించెనని రూఢిగా జెప్పగలము. ఎట్లయిన భుజంగ సంపర్కముననే యామెకు గర్భమైనది. నిద్రలో గలసినవాడె మేల్కొని యీ యూరినుండి లేవదీసుకొనిపోయెను. దారిలో వారియువురకు నేమిటికో కలహము వచ్చిన వాని నవ్వల బొమ్మన్నది. వాడా రాజుకడ దగవుపెట్టిన నిక్కడికి వ్రాసిరి. పనము యదార్థము తెలియజేసితిమి. పై పేరు నాదేకాని యందందరు సంతకములు చేసిరి. దాని బంపితిమి. ఇందు మా తప్పేమియున్నదియో దేవర పక్షపాతము విడిచి సెలవిచ్చిన శిక్షాపాత్రుల మగుదుమని సభాపతి యుపన్యసించెను.

అప్పుడు భోజుండు కాళిదాస కవీంద్రుని మొగంబు పరీక్షించుచు మహాత్మా! మీ రిచ్చిన సమస్యాపూరణము కల్పితమనుచున్నారు. అందులకు నిదర్శనము చూపుదురేయని యడిగిన నమ్మహాకవి కనులు మూసికొని చేతులు జోడించి——

శ్లో. ఏహ్యేహి మణిమన్ సర్ప దర్శనందేహి సాంప్రతం
భింది సభ్యైరుపన్యస్తాం పితృదత్తాయశః ప్రదాం.

మణిమంతుడా! వేగమువచ్చి దర్శన మిమ్ము. పితృదత్తయొక్క యపఖ్యాతి పోగొట్టుము అని చదివినంత——

క. మణివర భాసితసుఫణా
గణభూషణ కిరణరుచులు గ్రాల సభాగ్రాం
గణమునకు వచ్చి నిలిచెను.
మణిమంతుడు దివ్యరూప మహితుం డగుచున్, (31)

సహస్ర ఫణామండితుడగు నాదిశేషునివలె వెలుగుచు సభ్యులకెల్ల గనంబడ యంతలో నా రూపమును మార్చి మనోహరాకార శోభితుండై శిరోమణి రుచినిచయములచే సభ్యుల దృష్టులకు మిరుమిట్లు గొలుపుచు సభా మంటప మధ్యంబునకువచ్చి నిలువంబడుటయు దదాగమనమునకు నద్భుత రసావేశ మానసులై సభాస్తారులెల్ల లేచి జయఫణీంద్రా! జయకవీంద్రా! యని మిన్నుముట్ట గేకలువెట్టిరి.

అప్పుడు భోజభూభుజుం డాఫణిరాజునకు నమస్కరించుచు నిట్లు సంభాషించెను.

భోజుడు——మహాభాగా నీ వెవ్వడవు? నీ పేరేమి?

మణిమంతుడు — నేను వాసుకి మనుమడ. నా పేరు మణిమంతుడందురు.

భోజ—నిన్నిక్కడికి రమ్మని యెవ్వరు పిలిచిరి? ఎట్లు వచ్చితివి?

మణి—ఎవ్వడో మహామహుఁడు నన్ను మంత్రబద్ధుంజేసి మెడకు త్రాడు కట్టి యీడ్చికొని వచ్చినట్లు లాగికొని వచ్చెను. తదాహ్వాన శక్తివలన నిలువలేక యిందు వచ్చితిని.

రాజు—మీరిదివఱ కెన్నడైన నీ నగరము వచ్చితిరా?

మణి—వచ్చితిని. ఇది రెండవసారి. అప్పుడు స్వేచ్ఛగా, యిప్పుడు బలాత్కారముగాను—

రాజు—వచ్చి యేమి చేసితివి?

మణి—కామరూపుడ నగుట మనుష్యరూపముదాల్చి యీ యూర విహరించితిని.

రాజు—విహరించి! తరువాత నిజము చెప్పుడు.

మణి—నదీతీరమున నొక చక్కని యుత్పలదళాక్షిం జూచి మోహించి విరహాతురుడనై రాతిరి దానింటికిబోయి నిద్రలో గలిసితిని.

రాజు—అది యా చిన్నది యెఱుంగునా?

మణి—ఎరుగదు. స్వప్నప్రాయముగా గూడి మోహము తీర్చుకొంటిని.

రాజు—క్రమ్మఱ నా కొమ్మకడ కెన్నడైన వచ్చితివా?

మణి—రాలేదు ఆ మాటయే మఱచితిని.

రాజు—మీ యట్టి దేవకల్పులు సాధుచిత్తలం దెలుపక కలియుట తప్పుగదా? మీ కతంబున నా యెలనాగ నిందా పరంపరలచే గప్పబడుచున్నదే?

మణి—బాల్య చాపల్యంబున నట్లు చేసితిని. నాదేతప్పు. ఇప్పుడామెను ధర్మపత్నిగా స్వీకరింతు ననుమతింతురా?

రాజు—అనుమతించెడి వారెవ్వరు? ఇదివరకే యిమ్మాటమె భర్తయని నిశ్చయించుకొన్నది (కాళిదాసకవిం జూపుచు) మీ రహస్యక్రీడ యీ మహానుభావుని వలన వెల్లడియైనది. లేకున్న నాకన్నె యధోగతిం బొందవలసినదే! అని యా గథ యంతయు జెప్పెను.

మణి—నా పాపము క్షమించుగాక. నే నీ విషయమై మహాపరాధినైతిని. ఆమహాసాధ్వి యిప్పు డెందున్నది. వేగపోయి సపుత్రకముగా నామెం గారవింతునా?

రాజు—పాటలీపుత్ర నగరంబున దగవులో నపరాధినియై యున్నది పొమ్మని పోయి నాడుడు.

భోజుడు—మా ప్రతిక లసత్యములు. మా గ్రామ సభాపతిగారి నడుగ వలయును. ఇప్పటికైన పితృదత్త యుత్తమురాలని యొప్పుకొనునేమో? సభా పతియు నితర బ్రాహ్మణులు నా మాటని చెంపలు వాయించు కొనుచు మహారాజా! కాళిదాసకవి ప్రభావ మీ గ్రామవాసులమై యుండి యు దెలిసికొనలేక పోయితిమి. పరమసాధ్వీ తిలకమగు పితృదత్తను జారిణియని నిందించితిమి. మా కెట్టిగతి గలుగునో తెలియదు. మా యపరాధముల క్షమించి మాకు నిష్కృతిగావింపుడు అని యందున్న బ్రాహ్మణు లందరు పశ్చాత్తాప మందుచు గాళిదాసకవికి సాష్టాంగ నమస్కారములు గావించిరి.

అప్పుడు భోజుడు వారికి బుద్ధివచ్చినదని సంతసించుచు మణియొక లేక వ్రాసి యా మణిమంతుని చేతికే యిచ్చెను. అం దిట్లు వ్రాయబడినది. నందభూభుజా! మీ రెండవ సందేశ మందినది. అందుల గుఱించి గొప్పసభ చేసితిమి. అందు వాదోపవాదములు జరిగినవి. వెనుక గాళిదాసకవిని నిందించినవారే యిపుడు స్తుతి యింపుచు పితృదత్త యుత్తమురాలని యొప్పుకొని ప్రతికల వ్రాసియిచ్చిరి. వాని నన్నియు నిందుతో బంపితిని. పితృదత్త భర్త మణిమంతుడే. యిప్పుడు మీ కడకువచ్చినవాడు పితృదత్త నితని యధీనముజేసి యసత్యమాడిన కామందకుని శిక్షింపుడు.

ఇట్లు మీ మిత్రుడు భోజుడు.

ఆ ప్రతికం దీసికొని మణిమంతుడు కాళిదాసకవికి నమస్కరించుచు నట గదలి మరునాడు మధ్యాహ్నమునకు బాటలీపుత్ర నగరమున కరిగి, పితృదత్త యున్న గృహము చేరికొనియెను. అప్పుడా యింటి ముంగల జనులు గుంపులుగా గూడి కొని యేదియో కోలాహలముగా జెప్పుకొనుచుండిరి. రాజభటులు నిలుచుటకు వీలు లేదు. వెంటనే పంపివేయుడని బలవంతము సేయుచుండిరి. గృహయజమానుడు అయ్యా! ఆమె పుత్రశోకమున గుందుచున్నది. నాలుగు దినము లాగుడు తరువాత రాగలదని రాజప్రతినిధుల బ్రతిమాలుకొనుచుండెను. జనపతి యిది నా భార్యయని యుత్తరమిచ్చెను. గడియ యుందుండుటకు వీలులేదు. వాడు నాకుమాత్రము పుత్రుడుగాడా! పుత్రశోకము నాకునుం గలిగియున్నది. ఏమి చేయుదుము. పూర్వ కర్మఫల మనుభవింపక తీరదుగదా! అని కామందకుడు నిర్బంధించుచుండెను. వీడు నా భర్తగాడు. నేను వీనితో బోవను. బలవన్మరణమునొంది నా పుత్రునితో గలిసికొందును. అని పితృదత్త దుఃఖించుచున్నది. రాజశాసనమైనది. బల వంతమున జచ్చితివేని నిన్ను పరాధీనగానెంచి శిక్షింతురు. పద పద పోవక తీఱదని దండనాథుడు పలుకుచుండెను.

అయ్యో! లనకంబడి భోజునకు వ్రాసినవ్రాతకు బ్రత్యుత్తరము రాకుండ గనే పితృదత్త నెవ్వరితోనో పొమ్మని చక్రవర్తి తీర్పుచెప్పుట యనుచితమని పెద్ద

మహాపుల్లలు నిందింపుచున్నారు. ఆ మాటలన్నియు నాకర్ణించుచు మణిమంతుడు నలదున్న వారినెల్ల నొత్తిగించుచు వినుండు వినుండు. పిత్రృదత్త నా భార్య నేను మణిమంతుడనువాడ భోజనృపతి ధారానగరంబున సభచేసి యీ ప్రతిక వ్రాసి నా కిచ్చిరి. సంఘాలుగారున్నారా? ఈ గొడవలేమని యడిగిన విని అందరు తెల్లబోయి చూచుచు ఓహో! ఇది మరియొక విచిత్రము. పిత్రృదత్త కెందరు మగ లుండిరి? అని కొందరు పరిహాసమాడిరి.

మరికొందరు రతనికరమన్న ప్రతికను జదివికొని పాప మీతడే మొదటి మగడు. రుక్మవర్మ అన్యాయపుతీర్పు చెప్పెను. ఇప్పుడైన మించినదిలేదు. మీరీ ప్రతికం దీసికొనిపోయి రుక్మవర్మకు జూపుడు. అతడు తన శాసనమును రద్దుచేసి రొసగగలడు. అని మణిమంతున కుపాయము చెప్పిరి. ఆ వార్తవిని సంతసించుచు పిత్రృదత్త [illegible] కడు వెంటనే మణిమంతుని వెంటబెట్టుకొని రాజసభకు దీసికొనిపోయి యితడు పిత్రృదత్తమగడని చెప్పుచు ధారానగర వాస్తవ్యులగు సభ్యులిచ్చిన ప్రతికలను భోజనృపతియిచ్చిన లేఖయు నితని కర్పించి న్యాయము చెప్పుడని కోరి కొనియెను.

రుక్మవర్మ యీ ప్రతికలం జదివికొని యవ్వలబారవైచి మేలు మేలు బోటాడు గడుసరియే సభాపతికి లంచమిచ్చి యిట్లు త్రిప్పివ్రాయించెనుగాబోలు. కాకున్న మొదట పిత్రృదత్త పుంశ్చలియని వ్రాసి యిపుడు మహా పతివ్రతయని పొగడునా? ఇంతలో మారి పోయినదా? అయ్యా! వినుడు. ఈ ప్రతిక మా తండ్రిగారికి వ్రాయబడినది. ఆయన స్వర్గమలంకరించి రెండుమాసములు కావచ్చినది. ఆయనకున్న ధాంద కలిమి మాకు లేదు. ఈ ప్రతికతో మాకు నిమిత్తములేదు. నిన్న నేడియో తీరుపుచెప్పితిని దానిం ద్రిప్పకాలము. ఆ ప్రకారము జరగవలసినదే. పిత్రృదత్తను నిన్న కామందకుని భార్యగా నిశ్చయించి వానితో బోవునట్లు ఆజ్ఞాపించితిమి. ఈతడు నిజముగా పిత్రృదత్తకు మొగుడైన వాడైనచో నిన్న నాళ్ళేమిటికి జాగుసేయవలయును. సమయము మిగిలిపోయినది. ఇకమీ కేమియు నుపకారము జరుగదు. పో పొండని బలికిన మణిమంతు డిట్లనియె.

దేవా! నృపతికి దిక్పాలకులయంశము గలిగి యుండును. న్యాయము తెలిసి తీరుపు చెప్పవలయును. నేను పిత్రృదత్త భర్తనని యనేక నిదర్శనములు చూపుచుండ తీరుపు త్రిప్పనని యనియెద రేమిటికి? యా దొంగవానిని బిలిపించి వెంకిము నా యెదుట విచారింపుడు. నిజ మెరింగి యపరాధిని శిక్షింపుడు అని పలికిన రుక్మవర్మ యుక్తముగా లేకున్నను నమాత్యుని నిర్బంధమున నందుల కంగీకరించి యప్పుడే కామందకుని సన్నిధికి రప్పించుకొనియెను. రాజసమ్ముఖమున మంత్రియిట్లు విచారించెను.

మంత్రి—కామందకా? నీకు పిత్రృదత్త భార్యయగుటవి. ఎట్టిభార్య? పెండ్లి యాడితివా?

కామంద—అగ్నిసాక్షిగా పెండ్లియాడితిని.

మంత్రి—ఎందు?

కామ—ధారానగరమున.

మంత్రి—ధారానగరవాస్తవ్యు లందరు పితృదత్తమగడు ఈ మణిమంతు డేయని పత్రికలు వ్రాసియిచ్చిరే? అందుల కేమందువు?

కామం—వట్టిది వట్టిది. ఈ పత్రికలందలి వారు వ్రాసియిచ్చినవి కావు. ఈతడు కల్పించి తెచ్చెను.

మంత్రి — నీవు బాలికవవుగా నుంటివే? భోజభూభుజుండు తన ముద్రికల నద్దిన లేఖతో నా పత్రికలిందుబంప సృష్టించినవని చెప్పెద వేమిటికి? నీవు బొంకరివి. అని వాని సాక్ష్యము ఖండింపుచుండ వారించుచు నమాత్యునకు రుక్మవర్మ యిట్లనియె.

ప్రధానీ! ఇందలి ప్రధానాంశము నేను గ్రహించితిని. భోజునకు పితృదత్తయందు పక్షపాతము గలిగియున్నది బ్రాహ్మణుల పిలిపించి మండలించి క్రమ్మఱ నిట్లు వ్రాయించెను. కావున నీ పత్రికలను నమ్మి నిన్న చెప్పిన తీరుపు త్రిప్పజాలను. ఇది నీ భార్య తీసుకుపొమ్మని చెప్పి యిప్పుడుకాదని మరియొకని కిప్పించినచో నస్థిరుడని ప్రజలు నన్నాక్షేపింపక మానరు. ఇక వీరిని పొమ్మనుము. అనుటయు నమాత్యుం డిట్లనియె

దేవా! మీరు చిన్నవారలు. రాజ్యధర్మము లేవియు మీకు దెలియదు. భోజుడన సామాన్యుడు గాడు.

ఉ॥ భోజన రేంద్రచంద్రుని ప్రభుత్వ మహత్వము సన్నుతింప నం
భోజభవాదులుం దగరుపో చతురబ్ధిపరీతభూతల
భ్రాజితకీర్తి యానృపుని రాజ్యమునందు జతుష్పదస్థయై
రాజిలు ధర్మదేవత సురక్షితజం బతదర్థికోటికిన్. (౩౭)

అట్టివాడు పక్షపాతము చేసెననుట యప్రాజ్ఞతగాక మరియేమి? తెస్సగా విమర్శించి చెప్పవలయును. చెప్పినది తప్పని యెరింగినప్పుడు దానిని ద్రిప్పికొనవలయును. ఇది రాజనీతి అని చెప్పిన మఱిపిరిగొను కోపముతో రుక్మవర్మ యిట్లనియె.

ఓహో! నీవే రాజువలె మాట్లాడుచున్నావు. నీ యాటలు మా తండ్రి గారికడ సాగినవి కాని నాకడ సాగవు ఏది యెట్లయినను సరే నే జెప్పిన తీరుపు ద్రిప్పజాలను. వీరిని పొమ్మనుము పోకున్న గెంటింతును. ఎవరక్కడ అని పలుకు చుండగనే మణిమంతునకు క్రోధమావేశించినది. పడలుపెంచి నిజస్వరూపము వహించి పడగలు విప్పుచు నాలుక లప్పళించుచు బుస్సుమని రొద సేయుచు గుభాలున బోయి యాభీలహాలాహల జ్వాలామాలికల వెల్రగక్కుచు నొక్కుమ్మడి యా రాజ

పుత్రుపయింబడి కఱచి కఱచి యఱనిముసములో వానిని గతాసుం గావించుచు వెంటనే యా బ్రాహ్మణ పుత్రునింగూడ మూడు కాటులువైచి ప్రేతపతిపీటికతిథిగా జేసెను. ఆ యుపద్రవము చూచి, యందున్నవారెల్ల పికాపికలై తలయొక దెసకుం బాఱిపోయిరి.

మణిమంతుడంతటితో గోపమడంచుకొని రివ్వున పితృదత్తయున్న నెలవునకుబోయి వెనుకటి రూపముతో నెదుర నిలువబడి ప్రేయసీ! నన్నిటు చూడుము. నే నెవ్వడనో తెలిసికొంటివా? అల్లనాడు నదీతటంబున నిన్నుజూచి వలచి కామ రూపంబున రాత్రి నీతో కలిసికొనిన మణిమంతుడ. భోజకాళిదాసాదులు నన్ను రప్పించి యదార్థము తెలిసికొని నీవు మహాపతివ్రతవని వ్రాసి యిచ్చిరి. నిన్ను గామించిన బ్రాహ్మణ బ్రువుడును, అన్యాయపు తీరుపు చెప్పిన రుక్మవర్మయు మదీయ విషజ్వాలానలముపాలై మ్రగ్గిరి. ఇక మన వీటికిం బోవుదము రమ్ము అని పలికిన నక్కలికి తెలిసికొని యతని పాదంబులంబడి నమస్కరింపుచు నిట్లనియె.

మహాత్మా! మీరు గూఢముగా వచ్చి నాతో గలియుటచే నాపై బ్రజలనే నిందలు మోపిరి. సోదరులు విదేశముల పాలైరి. ఆ పురినున్న నా ముద్దుల పట్టిం జంపట్టి గోవాండ్రు చంపుదురని వెఱచి యీ యూరువిడిచి యిందు జేరితిని. ఆపదలు వెన్నంటక విడుచునా? యెవ్వడో దుర్మార్గుడు నావెంటవచ్చి నన్ను పెక్కుచిక్కుల బెట్టెను. అని యన్నియు నట్లుండ నాముద్దుల బాలుడు లోకాతీతబల ప్రభావసంపన్నుండై మల్లులనెల్ల జయించి గండపెండేరము బొందనున్న సమయంబున నెవ్వతెనో రక్షించుటకై గంగలో దుమికి మునిగిపోయెనట. భాగీరథీ మహాదేవియు వాని సుగుణంబుల కానందించి యైక్యము చేసికొన్నది కాబోలు. నాకట్టి పట్టి నిలుచునా? నేను పట్టి నిర్భాగ్యురాలను ఇక నాకు బ్రతుకం దాసలేదు. కాశికిబోయి గంగలోబడి కుమారునిం గలిసికొనియెద. మీకొక నమస్కారము. నా యపనింద బాపితిరి. ఇదియే పదివేలు. అని పలుకుచు గోలున నేడువ దొడంగినది.

అంత గోటలో గగ్గోలుగా శోకారావములు వ్యాపించినవి. అదేమియో యని జనులారక వీధులం బరువిడ దొడంగిరి. రాజపుత్రుడు పాము కఱచి చచ్చెనను వార్త బయలు వెడలినది. హాహాకారముగా బౌరులు రుక్మవర్మ చావును గుఱించి విచారించుచుండిరి. రుక్మవర్మ చచ్చెనను వార్తవిని పితృదత్త భర్తతో వాని మీరేనా కడతేర్చితిరి? అయ్యో పాపము! అని పలుక మణిమంతుడు అక్కడ జరిగిన సంవాదమంతయు జెప్పి యిక మన మిందుండరాదు. పోవుదము రమ్మని చేతులు సాచుచు నక్కలికి నక్కునం జేర్చుకొని యదృశ్యుండై గసియలో నిజనివాసంబున కరిగెను. అని యెఱింగించి—

262 వ మజిలీ

# మిత్రసమ్మేళనము

**సుబాహుడు :** మిత్రమా ఫణివత్సల! తరువాత వృత్తాంతమెట్టిదో చెప్పుము అని యడిగిన ఫణిదత్తుండు మొగంబున దైన్యంబుదోప వెంతయు నిట్లనియె. నేనట్లు వరుణ కన్యలచే ననిపించుకొని శార్దూలమును జంపుటకై మణిమంతుని మంత్రులర్పించిన గుఱ్ఱమెక్కి పరిజనులు మార్గమెఱింగింప వరుణలోక సీమాంతంబున కరిగితిని. అదిగో పులి యని చూపి యా పరిజనులు దూరముగా బోయిరి. నే నప్పుడా గుఱ్ఱముదిగి గదాఖడ్గంబుల రెండు చేతుల ధరించి మల్లపరివర్తనముల దత్సమీపమున కరిగితిని. ఆ వ్యాఘ్రంబు గాండ్రుమని యఱచుచు నోరు దెఱచుకొని నామీద బడవచ్చినది. దండముతో గోళ్ళు రాలగొట్టి నోటిలో గత్తి జొనిపి నాలుకం జీల్చితిని. అది మఱి నెగసి లంఘించుటయు బాటవంబున దానియేటు దప్పించుకొని కరలాఘవంబు జూపుచు బది నిమిషములు దానితో మల్లయుద్ధముచేసి గుదియతో బాది కత్తితో బొడిచి గడియలో మడియ జేసితిని.

అది పీనుగై నేలంబడినతోడనే దానివళములోనున్న తాళము చెవియు నాగమణియు సంగ్రహించి వారుణి యెఱింగించిన గురుతులు చూచుకొనుచు గొంతదూరము పరిక్రమించినంత, నందొకచోట నయఃకవాటము గనంబడినది. అదియే వరుణలోక మార్గమని తెలిసికొని యూరకొనలేక యందలి వింతలు చూచుతలంపుతో నాచెవి యా బీగమునకు దగిలించి త్రిప్పినతోడనే యా తలుపులు రివ్వున పైకెగసినవి. క్రిందికి సోపానములు గనంబడినవి. సాహసముతో బడిమెట్లుదిగి చూడంజూడ రెండు దారులు గనబడినవి. కుడివైపు దారింబడి దిగితిని. కొంచెముదూర మేగగనే చీకటిపోయి వెలుగు వచ్చినది. ఆ ప్రాంతమందు నానాలతావితానావృతమై స్ఫటిక శిలాఘటిత సోపానమై యొప్పు సరోవరం బొకటి నాకు గన్నులపండువ గావించినది. వ్యాఘ్రంబుతో బోరి యలసియున్నకతంబున తద్రుధిరసిక్తాయణంబులకు వస్త్రంబులతో నాయాసంబుదీర నందుస్నానము చేయవలయునని నాకు బుద్ధిపుట్టుటయు గుభాలున ఖడ్గకంఠంబుల విడువకయే యందు మునిగి లేచి చూచినంత—

క॥ హరహర శంభో శంకర
గిరిజా ప్రాణేశ పాప గిరిదంభోళీ
కరుణాకర శశిశేఖర
ధరణీధరవాస శూలధర విశ్వేశా. (౩౩)

అనుత్తైత్తిరికుల స్తోత్రపాఠముల నాలింపుచు విశ్వనాథుని దేవళము వెనుక భాగమున నిలుబడియుంటిని. కన్నులందెరచి నలుమూలలు బరికించి యది కాశీనగర

మును మునింగి విస్మయ భ్రాంత స్వాంతుండవై యంతకుమున్న వేజేసిన పనులన్నియు దలంచికొని స్వప్నోపగతములని యూహించియు జెంగున మూటగట్టబడియున్న ఖడ్గ కంకణములం జూచి యది యింద్రజాలమని నిశ్చయించుకొంటి. కొంతసేపు విమర్శించి యోహో యిదికల యు నింద్రజాలముగూడగాదు. నిజమే వరుణ లోకస్థులు ఆ గంగానదిలో మునింగి కాశీవిశ్వనాథు నారాధింప నిందు వచ్చుచుందురు. ఆ రహస్యము వరుణ కన్యవలననే వినియు మరచిపోయితిని.

ఉ॥ అక్కట దాయరూప విభవాంచితలై తగు దేవకామినుల్
చిక్కగనావెపోయి పులిజేరపడిజేసె వధూసమక్షమున్
గ్రక్కున జేరశేఫటికో కావగబోతి నయంత వాటపుం
జిక్కికి పోయియున్నది విచారము సేయక క్రుంకవచ్చునే. 24

ఉ॥ ఇస్సిజన్మమునందు జాతు నాకా యాయింటివరాక్షి కదం
బకమున్ దివ్యసుగంధబంధుర సుమ భ్రాజత్తదుద్యానము
ద్యత్సచ్చూరిమణి ప్రభాలలిత సౌధశ్రేణి విద్యుల్లతా
నికరంబోయనబొల్చు దానకటా నిర్వాణతుల్యస్థితిన్. 25

ఏదియు లేకపోయినది ఇందుజేరి విశ్వనాధునికి నమస్కరింపుచు నేనిట్లు నన్నుకసుముస కెక్కించి నేలం బడద్రొబ్బుదువే. మొదట నాకా విశేషము లన్నియుం జూపనేల? యిపుడు వానిం బాపనేల? విధి పరిపాకమిట్టిది కాబోలు. ఎప్పటికైన నగ్గమ్మర నన్నా వరుణ కన్యలతో జేర్తురా? అని ప్రార్థించి యీవలకు వచ్చునంత నీవిందు గనంబడితివి.

మిత్రుడు: నిన్ను జూచుటచే నాయాత్రము కొంత తొలంగినది. ఇది నా వృత్తాంతము. మాయావ కుశలినియై యున్నదా? తక్కిన మిత్రు లందఱున్నారు? వీరమల్లునకు గండపెండేర మిచ్చిరా? తరువాత విశేషము లన్నియు జెప్పుము యనిగిన సుబాహుం డిట్లనియె.

సుబాహుడు: నీవు గంగలోబడి మునింగినంత నదలుచు మేము ముప్పూరము నీకొఱకు పెద్దతవు వెదకితిమి. నీ జాడ దెలిసినది గాదు ఓడయెక్కి తీరము చేరి యందఱతో నీ వృత్తాంతము చెప్పితిమి. అతండు గండపెండేరము రుక్మవర్మ వీరమల్లునకే యిచ్చివేసెను. రుక్మవర్మ మమ్ము విడదీసి యితరుల తోడ్కొని పాటలీపుత్ర నగరమున కరిగెను.

మేము భవద్వియోగ దుఃఖానలమున మ్రగ్గుచు నాస తీరక కొన్నిదినములీ గంగా నదీ తీరంబున దిరుగుచు విమర్శింపుచుంటిమి. తరువాత మీతల్లి క్షేమము తెలిసికొన వేడుకపడి పాటలీపుత్ర నగరమున కరుగ బయలుదేరి కొన్ని పయనముల నరిగితిమి. ఒకనాడు మన పాఠశాలలో జదువుచున్న విద్యార్థి యొకడు దారిలో గనంబడి మమ్ముం జూచి సౌహార్దమున బ్రకటింపుచు వృత్తాంతము: నగర విశే

షములేమి ? రుక్మవర్మ యెటులున్నవాడు ? నందునికి భద్రమా ? పణిపత్తుని తల్లి నెయంగుదునా ? ఆమె క్షేమముగా నున్నదిగా ? పణిదత్తుని మరణవార్తవిని నందభూపతి యేమనుచున్నాడు ? అని యడిగిన నాట్లనియె

అయ్యో ! మీ కా వార్త తెలియదా ? పెద్దరాజు కాలధర్మము నొందెను. రుక్మవర్మ పట్టాభిషిక్తుడై ప్రజలం బాలించుచున్నాడు. పణిదత్తునందుగల విరోధముచే ధారానగరమునుండి పత్యుత్తరము రాకుండగనే పితృదత్తను నగవుబెట్టిన బ్రాహ్మణునికి భార్యయని తీరుపు చెప్పెను. పౌరులందరు నవ్విషయమై గగ్గోలుగా జెప్పుచున్నారు. పుత్రశోకవ్యాకుల చిత్తయగు పితృదత్తకు నిదియొక యాపత్తు వచ్చినది. యింతవట్టు చూచి నాటి రాత్రియే బయలుదేరి వచ్చితిని. తరువాత నేమి జరిగినదియో నాకు దెలియదని యెఱింగించెను.

అప్పుడు మేమేమి జేయుటకుం దోచక పితృదత్త యా గ్రామంబు విడిచి వెళ్ళునని నిశ్చయించి యందు బోబుద్ధి పుట్టక నేను తిరుగా నీయూరు వచ్చితిని. తక్కినవారిద్దరు అక్కడనుండి యుజ్జయినీ నగరంబున కరిగిరి. నా పూర్వపుణ్య వశమున నీ విందు గనంబడితివి. నా యునికి సఫలమైనది. అని యతండు తన వృత్తాంతమంతయు నెఱింగించుటయు పణిదత్తుడు వేడి నిట్టూర్పు నిగిడించుచు క్రూరాత్మా ! రుక్మవర్మా ! నిన్ను బొట్టబొక్కి చంపకున్న నా బలపరాక్రమము లేమిటికి ? అయ్యో ! నా తల్లిని దుర్మార్గువెంట నంపుటకు నాజ్ఞ యిచ్చితివిగా ? ఆమె బలవన్మరణము నొందునుగాని వానివెంట బోవునా ? అక్కటా ! ఆమె కెట్టి యిక్కట్టు వచ్చినది అని దుఃఖించుచు వయస్యా ! మనమిప్పుడు ముందుగ బాటలీపుత్రనగరంబున కరుగవలసియున్నది. అంబవృత్తాంతము వినువరకు నా హృదయము తొట్రుపడుచున్నది. లెమ్ము యిప్పుడే పయనము గావింతమని చెప్పిన నతం డొప్పికొనియెను.

వారమ్మరునాడే కాశీనుండి బయలుదేరి కాలినడకను ప్రయాణము సేయు చుండిరి. అక్కడికానగరము యిరువదిదినముల పయనములో నున్నది. దానిలో ననేక పర్వతములు నరణ్యములు మహానదులు గలిగియున్నవి. చిన్నపల్లెలేగాని పడుమ పెద్దపట్టణములు లేవియు లేవు. అట్టి మార్గంబునంబడి పోవుచు నొకనాడొక పల్లెలో నివసించుచుండ పాటలీపుత్రనగరమునుండి వచ్చుచున్న బేహారి యొకడు వారికి దారసిల్లెను. ఒకచోటనే గూర్చుండి మాట్లాడుకొనుచు సుబాహుడు వానితో బరిచయము గలుగజేసికొని యిట్లనియె. వర్తకుడా ! మీది పాటలీపుత్ర నగరమే కాదా ? అక్కడ బయలుదేరి యెన్నిదినము లయినది ? రుక్మవర్మ పాలనమెట్లున్నది? అందుల విశేషము లేమని యడిగిన నక్కిరాటకుం డిట్లనియె.

అయ్యా ! నే నక్కడ బయలుదేరి పదిదినములయినది చచ్చి బ్రతికిన తరువాత రుక్మవర్మ పాలనము చాల న్యాయముగా నున్నది. మొదట యౌవన

పిశాచములచే దల్కిందులుగా మంత్రులమాట వినక తనకు దోచినట్లు చేసెను. ఆపద తొలంగుటచే నా వికారములన్నియు మానినవని చెప్పగా వెరగుపాటుతో సుబాహుం డిట్లనియె. అయ్యో! ఆ రుక్మవర్మ యెట్లు చచ్చెను? యెట్లు బ్రతికెను? చచ్చినవాడు బ్రతుకుట యెట్లు? నా మాటవింతగా నున్నది ఆ వివరం బెఱింగింతువే యనుటయు నా భేరి యిట్లనియె

అదియొక చిత్రమైనకథ వినుండు. వారితండ్రి నందుడు రాజ్యము సేయుచుండ నెచ్చటినుండియో దంపతులు వచ్చిరి. అతడు నా భర్త కాడని భార్య తిరస్కరింప భర్త నందునియొద్ద తగవుబెట్టెను. అతండాతగవు విచారించుచు నిజము తెలిసికొనుటకై యేనృపతియొద్దకో ప్రతికనంపెనట. ఆ జాబు వచ్చు లోపల నందుడు చచ్చుటయు రుక్మవర్మ రాజయ్యెను. వెంటనే తగవుబెట్టిన బ్రాహ్మణుడు వచ్చి చెప్పగా నాతని నతని యాధీనము చేసినట్లు తీరుపు చెప్పెను.

ఆ చిన్నది వానితో బోవుట కొప్పుకొనక చిక్కులు పెట్టుచుండ నింతలో నెవ్వడో వచ్చి యచ్చిగురుబోడి తనభార్యయని నిదర్శనములు చూపుచు రుక్మవర్మతో నప్పుడొసగ దాను చేసినశాసనము త్రిప్పనేరనని వానింగెంటించుటకు బంటులం బిలువగా గోపించి యా పురుషుండేదియో ప్రయోగము చేసెనని చెప్పుదురు. వెంటనే పెద్ద బాము వచ్చి యారుక్మవర్మను, తగవుపెట్టిన బ్రాహ్మణునింగూడ గఱచి జంపినది. తరువాత విషవైద్యు డెవ్వడోవచ్చి రుక్మవర్మను మాత్రము బ్రతికించెనట. ఆ వెంటనే యతడు నా బ్రాహ్మణు డెక్కడికో తీసికొని పోయినట్లు చెప్పిరి. అప్పటినుండియు రుక్మవర్మ బుద్ధిగలిగి మంత్రులు చెప్పినట్టు వినుచున్నాడని యా వృత్తాంతమంతయు నెఱింగించెను.

ఆ కథవిని జనాంతికముగా పణిపత్తుడు మిత్రమా! వీనిమాటలవలన మా కిప్పు డుండు లేనట్లు తెల్లమైనది. తొందరపడి ముందుగా మనమందుబోనేల? ఉజ్జయిని కింకొకసారి మిత్రులం గలిసికొని వారిని వెంటబెట్టుకొని పిమ్మట బాటలీపుత్రమునకేగి రుక్మవర్మచర్యలు విచారింతముగాక. వాడు రాజైయున్నవాడు మనము తగిన సహాయులతో బోయిన గాని వానిం జెనకరాదు. నా కిట్లు తోచినది. నీవేమని యెదవు? యనుటయు సుబాహుం డదియే లెస్సయని చెప్పెను. వారిరువురు నక్కడనుండియే మరలి యుజ్జయినీ మార్గంబుబట్టి కొన్నిదినముల కా పట్టణము చేరిరి.

అందున్నమిత్రులు సుప్రహస్తుడు వజ్రకాయుడు తమనిచ్చాయము చేరిన వారలంజూచి సంభ్రమాశ్చర్య కలితమతులై వారిం గౌగలించుకొని కనుల నానంద బాష్పములుగార బెద్దతడవెలుంగురాక గద్గదస్వరముతో నిట్లనిరి. ఓహోహో! నేడెంత సుప్రభాతము. వయస్యా! ఈ మిత్రరత్నము నీ కెక్కడ గలిసెను? ఏ ట్లు బ్రతికివచ్చెను? మా కిట్టి సంతోషము మరియెప్పటికిం గలుగ నున్నదా? వీని నిమిత్తమే విచారించుచు నే పనియుం జేయలేక నిర్వ్యాపారులమై

కూర్చుంటిమి. మీ వృత్తాంతము చెప్పుమని యడిగిన సుబాహుండు పణిదత్తుండు గంగలో మునిగి విశ్వేశునియాలయ ముఖమంటపములో దన్ను గలిసికొని పలకరించిన దనుక నతండు సేసిన పనులన్నియు జూసగ్రుచ్చినట్లు పక్కాణించి వారి నాశ్చర్యపారావారవీచికల దేలించుచు మరియు నిట్లనియె.

మే మిరువురమును కాశినుండి పాటలీపుత్రనగరమునకు బోవుచుండదారిలో నాకు గలిగిన పెద్దగండ మొకటి యీతండు దప్పించెను. లేకున్న నాకు మిమ్ము జూచు భాగ్యము కలుగక పోయెడిదే వినుండు. మే మొకనా డొక యడవిలో నడచుచుండ దారి కించుకెడముగా నొక తలోదరి తలవిరియబోసికొని దుఃఖించుచుండెను. మే మా పడతి కడకుబోయి శోకకారణం బడిగితిమి. తన మగడును దానును తురగము లెక్కి యీ తెరువున తమపురమున కరుగుచుండ బులియొకటి మా కెదురుపడినది. నా భర్త దానిందరిమికొనిపోయి రెండువారములైనది ఇప్పటికి నతనిజాడ గనంబడలేదు. నా హయంబు పులికి భయపడి పారిపోయినది. అందులకై దుఃఖించుచున్నానని చెప్పినది.

పణిదత్ డతెరవ నూరడించుచు వెరవకుము. మాతో రమ్ము. నిన్ను మీ మాళవదేశము జేర్చి భర్తతో గూర్తుము. మమ్ము తోబుట్టువులుగా భావింపుమని పలికిన నక్కలికి యనుమతించి మా వెంట రాదొడంగినది. మాళవదేశమునకు దాను మార్గ మెరుగుదునని చెప్పి మమ్ము దారితప్పించి పెడదారింబెట్టి చీకటిపడునప్పటికి నొక విజన గ్రామమునకు దీసికొనిపోయినది. ఆ యూరిలో గృహములు చాల గలవు. అరుగులును ద్వారములును రమ్యములుగాగనంబడుచుండెను మనుష్యు లెవ్వరును లేరు. పశుపక్షి మృగాదులుంగూడ గనంబడవు. లోపలికి బోయిచూడ గృహోపకరణములన్నియు మాసి దుమ్ముపట్టి యున్నవి. వీధులయందు మనుష్యాస్థిపుంజములు రాసులుగా ప్రోగుపడియున్నవి. దానింజూచి వెరగుపాటుతో మేము ఇది యేయూరు? ఇట్లున్న దేమని యామె నడిగితిమి నా కేమియు దెలియదని సమాధానము జెప్పినది.

ఆ రాత్రి మే మవ్వలబోజాలక ఒకయింటి యరుగు బాగుచేసికొని యందు బండుకొంటిమి. ఆ చిన్నది రెండవయరుగుమీద బండుకొన్నది కొంతదడవా గ్రామశూన్యత్వమును గురించి ముచ్చటించుకొనుచు నంతలో నిద్రబోయితిని. అర్ధరాత్రి సమయంబున పణిదత్తున కేమిటికో మెలకువ వచ్చినది. కఱకఱయను చప్పుడు వినంబడుటయు నతండదరిపడి లేచిచూడగా నా చేడియ భయంకరాకారము దాల్చి నా యవయవములు నోటిలోనికి ద్రోసికొనుచు పడియములవలె నమలుచు నెముక లుమియుచుండెనట. అపుడు పుప్పిరిగొను కోపముతో లేచి పిడికిలిబట్టుకొని హనుమంతుండు లంకిణింబోలె దానిమీద కురికి వెండ్రుకలు బట్టుకొని తిరుగుచు బ్రహ్మరంధ్రము పగుల నొకగుద్దు గుద్దెనట. ఆ దెబ్బవలన నాసా రంధ్రమునుండి

గర్భాగార వివశయై మొత్తోయని యరచుచు మహాత్మా ! కొట్టకుము. నీ దెబ్బవలన నాకు బూర్వస్మృతి కలిగినది. నేను దేవకాంతను. ఋషి శాపంబున నిట్టిరూపము ధరించితిని. ఇందలి జనులనెల్ల నేను భక్షించి యీ గ్రామమును శూన్యము చేసితిని. నీ వలన నేటితో నాకు శాపవిముక్తి కలిగినది. నే బొల్లింటి రూపముదాల్చి దివి కేగుచున్నదానను. నీ కేదేని యభీష్టమున్న జెప్పుము. సమకూర్చెద నని పుడు వారలు దిట్లనియెను.

దేవీ ! నా కే కోరికయును లేదు. నా ప్రాణమిత్రుని నీవు మ్రింగితివి సామర్థ్యము గలిగియున్న వానిని బ్రతికింపుము. బ్రహ్మకూకటి ముట్టినంగాకయని యాసుందరియు నా వరపత్రిని యవ్వరమిచ్చి నన్ను బ్రతికించి దీవించుచు నాకమున కేగెను. నేను నిద్ర లేచినట్లులేచి యవ్విధమేమియు నెరుంగక మిత్రమా అక్కామిని యేమాయెను. ఇందులేదేమని యడిగితిని. అతండు నవ్వుచు నా కా వృత్తాంత మంతయు నెరింగించెను. మనకు పణిదత్తుడు పూర్వపుణ్యావశంబున మిత్రుడుగా దొరకెను. కాని వీని ప్రభావము అత్యద్భుతము వీడు దేవతాంశసంభూతుండని పొగడెను. పణిదత్తుడు వారించుచు మిత్రులతోగూడ కొన్నిదినము లాయూరవసించి కాల క్షేపము గావించెను.

అని యెరింగించునప్పటికి గాలాతీతమయ్యెను. పై కథ తర్వాత మజిలీయం దిట్లు చెప్పదొడంగెను.

## 263 వ మజిలి

# శశాంకవతికథ

పణిదత్తుడు మిత్రగృహంబున వసించునప్పుడు వారి దారిద్ర్యమును జూచి జాలిపడుచు వారి కెట్లయిన ధనము సంపాదించి యీయవలయునని బుద్ధిపుట్టుటయు సుబాహునితో నిట్లనియె సఖుడా ! వణిక్కాయ సుప్రహస్తుల తల్లిదండ్రులు చాల వృద్ధులై యున్నారు. వీరి యిబ్బడిచూడ నాకు జాల జాలి కలుగుచున్నది. ముందుగా మనము కొంత ధనము సంపాదించి వీరి కంపి తరువాత బాటలీపుత్ర నగరంబున కరుగుదముగాక. ధనార్జనోపాయ మేమియో యూహింపుము అని యడుగుటయు సుబాహు డిట్లనియె.

అవును నాకును నట్టి యూహమే కలిగినది. ధనము సంపాదించుటకు ననేక మార్గములు కలవు. మనము నలువురము బయలుదేరి పాటలీపుత్రనగరమునకు నరుగుదము. చక్రవర్మ తల చిదియగొట్టి బలవంతమున సౌమ్య దోటి యిక్కడకు బంపుదము. వీరిరువురు నా పయనమునకు తొందరపడుచున్నారు. రేపే బయలుదేరుదము గాక. నావుడు సంతసించుచు కానిమ్ము దారిలో నేదైన సాధనము

దొరకకపోవునా ? అంతదనుక నుండనేల. యీ లోపలనే పంపవచ్చునని పణిదత్తు దొప్పుకొని యప్పయనము నిశ్చయించెను.

వారు నలువు రా మరునాడే పయనమై పాటలీపుత్రనగరమున కరుగుచుండ నొకనాడు దారిలో సురపద్మినమను రాజధాని వారికి నేత్రపర్వము గావించినది. భూరి శ్రవుండను రాజు ఆ దేశము పాలింపుచుండెను. పణిదత్ డా పట్టణమున గూలియైన చేసి ధనము సంపాదించి మిత్రుల తల్లిదండ్రులకు బంపవలయునని నిశ్చయించుకొని మిత్రులతో గూడ గొన్నిదినము లాయూర వసించెను.

అందు నెట్టి సాధనములను దగినధనము సంపాదించుట కుపాయము దోచక యొకనా డిట్లు వితర్కించుకొనిరి.

సుబాహుడు-పణిదత్తా ! నీ వానతిచ్చిన వడువున రాజుగారి మల్లులతో బోరి పన్నిదములవైచి గెలుతుమని తలంచి విమర్శించితిని గాని ఈ నృపతికడ మల్లులే లేరట. ఇక నెట్లు !

వజ్రికాయుడు-సుబాహూ ! తఱచు వేశ్యలు ప్రజల వంచించి యెక్కువ ధన మార్జింతురు. వారి యిండ్లకు కన్నమువైచి దోచిన దప్పేమి ?

పణిదత్‌డు - ఛీ! ఛీ! వారిధన మపాత్రమైనది. ఆ పని నా కిష్టము లేదు.

సుప్రహస్తుడు - కన్నము వేయదలచిన నల్పుల యిండ్లకేల వేయవల యును ? రాజుగారి ధనాగారమునకే వేసినచో వలసినంత ద్రవ్యము దొరకును గదా ?

సుబాహుడు - అది పౌరుషమైనపనియేకాని పాషాణలోహాదులచే గట్టబడిన కుడ్యములు సులభసాధ్యములుగావుగదా ?

వజ్రికాయుడు - వైరిమిత్రుడా ? గోడలకు గన్నము వేయుపని సామాన్యులు చేయుదురు. దూరమునుండి ధనాగారముక్రిందికి నేల సొరంగము త్రవ్వి నచో నన్ని గృహములు సులభసాధ్యములే, అట్టి పాటవము నాకు గలిగి యున్నది.

సుబాహుడు-అది మంచి సాధనమే. రాజుల ద్రవ్యములు ప్రజలవే కావున మనకప్పనివలన దోసములేదు.

పణిదత్‌డు-ఆ మాట వాసవమే. వింతలుచూచు నెపంబున గోటలోనికరిగి ధనాగార మేమూలనున్నదో తెలిసికొని గురుతుగా నూరిబయటనుండి సొరంగము త్రవ్వవలయును.

అనుటయు నా పని కందరు సమ్మతించిరి. మరునాడు చిత్రశాలం చూచు నెపంబున వారే కోటలోని కరిగి గోపురమెక్కి మిట్టపల్లముల దెలిసికొని యొక్కచ

ముందు చక్కపరికించి నా దెల్ల నందులకు గావలసిన సాధనములు సంపాదించు
కొనిరి.

ఆ నగరమున కుత్తరముగా క్రోశము దూరములో జిన్న మెట్టయున్నది.
అందలి పల్లపునేలనుండి సొరంగము త్రవ్వుట ప్రారంభించిరి. వజ్రకాయుడు
మూషకముఖముతో సొరంగము ద్రవ్వుచుండ తక్కినవారు మన్నివలకులాగి పాఱ
వైచుచుండిరి. వారు నిరూపించుకొనిన పద్ధతి ప్రకారము నెలదినములకు బొక్కసము
క్రిందకు గురుతుచూచుకొని సొరంగము త్రవ్వఁగలిగిరి. కాని వారిగురుతు లించుక
తప్పుటచే బొక్కసముక్రిందికిగాక యొక సౌధాధోభాగమున కా దారిపోయినది.
అందలి నేలం గూర్పబడిన స్ఫటికశిలాకుట్టిమమందు తగిలినతోడనే నాటికి త్రవ్వుట
నిలిపి వజ్రకాయుం డెరింగింప నందరు నీవలకు వచ్చిరి.

పణిపత్రా ! బిలఖననము పూర్తియైనది. కుట్టిమశిలలం గదిపి తప్పించు
కొని లోపలకేగి ధనము తేవలసియున్నది. అందుల కెవ్వఁడోపునని వజ్రకాయుం
డడిగిన నే దెత్తునని పణిపత్డుత్తరమిచ్చెను. అందులకందరు నియ్యకొనిరి.

మరునాడు అర్ధరాత్రమున బిలములోదూరిరి. ముఖంబున సుబాహుండును
నడుమ సుప్రహస్తవజ్రకాయులుం గాచియుండ పణిపత్డు కుట్టిమశిలలం దప్పించు
కొని మెల్లగా నా గదిలోని కేగెను. అది భాండాగారముగాదు. ఒక సుందరమైన
యంతఃపురమందిరము. పట్టపవలుగా విద్యుద్దీపములు వెలుగుచున్నవి. కాంచన
దర్పణఘటితంబులగు చిత్రపటంబు లనేకములు కుడ్యముల నలంకరింపబడియున్నవి.
విశాలరమణీయమగు నా గదిలో రత్నపర్యంకమున నొక చక్కనిచిన్నది. దాని
ప్రక్కను మరియొక పరిచారిక పండుకొన్నది. వారియవురుమాత్రమే యా గదిలో
బండుకొని యున్నారు.

పణిపత్తుడు ఔరా వజ్రకాయుడు, త్రవ్వుటలో ప్రమాదము జెందెను. ఇది
బొక్కసముకాదు. రాచస్త్రీల యంతఃపురము. ఈ చిన్నది రాజపుత్రిక గావచ్చును.
ఈమె మేన వెంగల రత్నభూషణములు చాలా గలిగియున్నవి. ఈ చిన్నది
కన్యయో మగనాలియో తెలియదు. దీని భూషణములు దొంగిలించుకొని పోయిన జాల
సొమ్మువచ్చునుగాని అది ప్రమాదాస్పదమైనపని అయ్యో! నేను తమ బ్రాహ్మణకులం
బునంబుట్టి యిట్టినికృష్టపు చౌర్యవృత్తికి సిగితినేమి? ఈ తుచ్ఛపుపని కెంత ప్రయత్నము
చేసితిమి! మావంటి వీరభటులు చేయదగినపని యిదిగాదు. యింతకంటె యాచించుట
లెస్స. అని చిత్తంబున నివృత్తిదోప సందేమియు ముట్టక గిరుక్కున మరలి
బిలములోదిగి స్ఫటికశిల సవరించి యీవలకువచ్చి మిత్రులతో నిట్లనియె. మిత్రు
లారా! మనము దారితప్పితిమి. బొక్కసము క్రిందికి మారుగా నంతఃపురము
క్రిందికి త్రవ్వితిమి. అదియొక రాజపుత్రిక శుద్ధాంతము అందేమి ధనముండును? అని
యనుగాక వజ్రకాయుని బిలము త్రవ్వుటకై చాల శ్రమపెట్టితిమి కాని చౌర్యక్రియ

మనబోటివారికి దగదు. నే నాగదిలో బ్రవేశించినతోడనే నా మనసున నివృత్తి పుట్టినది. కావున నీ దారివిడిచి ధనార్జనమునకు మరియొక తెరవాలోచింపవలయు నీయిష్టము నీ వెట్లు చెప్పిన నట్లు నడుచుకొందుము అని యనుమతించిరి.

అనిలముఖం బను నొక పాషాణ మద్దుపెట్టి వెండియు బట్టణములో బ్రవేశించిరి. మరియొకనాడు వీధిలో హాహాకారములు సేయుచు జనులూరక ప్రవాహావలె నెక్కడికో పరుగెత్తుకొని పోవుచుండిరి. అప్పుడు వా వల్లులు నలువురు వారికడ్డము నిలిచి మేమి యుపద్రవము వచ్చినది? అందరు నిప్పుడిట్లు పరుగెత్తుకొని యెక్కడికి పోవుచున్నారు. చెప్పుడని యడిగిన వారిలో నొకవృద్ధుం డిట్లనియె.

అయ్యో! మారాజుగారి కొక్కగానొక్క కుమార్తె అ చిన్నది నిన్న యుద్యానవనమున కరిగి సఖులతో బుష్పాపచయము సేయుచుండ నొక పూపొదరింటిలో ద్రాచుపాము గరచినదట. వెంటనే స్పృహదప్పి పడిపోవుటయు బరిచారికలు మోచికొనిపోయి నిమ్మకట సౌధంబున బండుకొన బెట్టిరట. ఆ వార్తవిని దండ్రి భార్యాబంధుమిత్రపరివారముతో నార్తనాదములు సేయుచు విషవైద్యుల వెంటబెట్టుకొనివెళ్ళి యనేక మంత్రములు వేయించిరట. యేమియుం బ్రయోజనము లేకపోయినది. అనుపాణి బ్రాణము లప్పుడే పోయినవట. నట్టిగా గరచిన పాము కాటునకు మంత్రమున్నదియా! కరచినవేళ దాటినది. ఇక బ్రదుకదు దహన సంస్కారము గావింపవచ్చునని జాంగలికులు చెప్పగా నామెతల్లి గుభాలున నందలి నూతిలోబడి వెంటనే తీయబడినది. కాని నీరు త్రాగుటచే నింతను స్మృతిరాలేదట. ప్రాణభయములేదని చెప్పుచున్నారు. రాజపుత్రిక శవమును మేడనుండి క్రిందికిదింపిరి. చూడదగినవారెల్ల బోయిచూడుడని చెప్పుటచే యిప్పుడిందున్న రాజబంధువులందరు దుఃఖింపుచు నొండరగా నందుబోవుచున్నారు. వారివెంట బ్రజలుపోవుచున్నారు. ఇక్కడికా యుద్యానవనము రెండు క్రోశముల దూరములో నున్నది. అనిచెప్పి యావృద్ధు డవ్వలబోయెను.

ఆ వార్తవిని పణిత్తు డుబ్బుచు సఖులారా! ధనము దొరకుటకు మనకు మంచి యాధారము దొరికినది. నేనా చిన్నదానిం బ్రదికింపగలను శార్దూలముఖ. బంపినప్పుడు దానికడనున్న నాగమణిం గైకొనుమనియు నది విషచికిత్స కుపయోగించుననియు వరుణకన్యలు చెప్పియున్నారు నే నప్పుడా నాగమణిని సంగ్రహించి చిటికిన వ్రేలియుంగరములో నమరించుకొనియున్నాను. దీని ప్రభావ మత్యద్భుతమని చెప్పుచు మిత్రులతోగూడ నప్పుడే పణిదత్తుడా యుద్యానవనమున కరిగెను.

పెద్ద దూరము వరకు శోకారవములు గావింపుచు జనులు మూగియుండిరి. వారిం దప్పించుకొని శవము సమీపమున కరుగునప్పటికి వీరికి రెండు గడియలు పట్టినది. లోపల బ్రేతస్నానము చేయించుచున్నారని విని పణిదత్తుడు చేతులెత్తి ఆ, అ. వలదు వలదు. ఆపుడు. విషవైద్యులము అని కేకలు పెట్టెను. తెల్లపోయి యెల్లరు వారివంక జూచుచుండిరి. క్రొత్తవిషవైద్యులు వచ్చిరి.

మంత్రవాదులు వేయింపుడని సామంతులు చెప్పగా భూరిశ్రవుడు చాలుచాలు యింకె క్కడి వచ్చెదరు. దాసిదానినది బోయినది అని విలపించుచు నుపేక్షజూపుటయు మంత్రగులు ఇంతలో బోయినదేమి? మంత్రించి చూడుదమని నియమించిరి. అప్పుడు ఫణి దత్తుడు అయింతిచెంత కరిగి యామెమేనును తడియంతయు నొత్తించిచూడ గుందనము వంటి దేహచ్ఛాయ యంతయు రాహుగ్రస్తమగు చంద్రలేఖపగిది నల్లబడి కళదప్పి వికారముగా నుండినది. ఆ కొమ్మను గ్రొమ్మర మంచముపై బండుకొనబెట్టించి యెదుటనుండున్న వారినెల్ల దూరముగా బొమ్మని బంధువును గూడ దాపున నుండనీయక నాగమణియు క్రమముగ నంగుళీయకము నయంగనమేనికి దగిలించిన తోడనే విషము పరిగి [illegible] వెన్నెలవలె నక్కలికి మేని [illegible] తళుక్కుమని మెఱయుచు దేహమునందు లావణ్యము వ్యాప్తము కాజొచ్చినది. క్రమమున నాడులుకదల బ్రాణము చేరినది. చాలుచేతులు కదలింపుచు మూలిగి కన్నులందెరచి దాహమిమ్మని కోరినది. యింతలోపలనే ఫణిదత్తుడామె మంచముపై గూర్చుండెను. తనయుంగరమామె వ్రేలికి దగిలించెను.

రాజపుత్రికకు బ్రాణములువచ్చినవి దాహము కావలెనట. తెప్పింపుడని పలికిన యతనిమాట విని హర్షపులకితగాత్రులై యందున్న వారెల్ల సముద్రమువలె పొంగుచుండిరి. ఆ వార్త విని రాజపత్ని హఠాత్తుగా లేచి యేదీ నాముద్దులపట్టి బ్రతికినదా! అని రోదనము చేయుచుండ వారించుచు భూరిశ్రవుడు దాహము త్రావించి కూతు [illegible]న్నదని యడిగెను. వ్రేలితో ఫణిదత్తుం జూపుచు నీతని దయవలన బ్రతికి [illegible] సూచించినది. ఆ వెంటనే భూపతిహూతు నంపలమెక్కించి నంతఃపురమున [illegible] ఫణిదత్తుం గౌగలించుకొని మహాత్మా! నీవు మనుష్యుడవుకావు యిట్టి శక్తి [illegible] గలవాడు. నాకు బుత్రికాభిక్ష పెట్టితివి. నీ యభీష్ట మెద్దియో చెప్పుము. నీ [illegible] నెన్నటికి మరువనని స్తుతించుటయు నతండిట్లనియె.

మహారాజా! నాకేకోరికయును లేదు మీరు సంతోషించి పారితోషిక మేమి [illegible] స్వీకరింతును. మీ యనుగ్రహమే కావలసినదని ప్రత్యుత్తర మిచ్చెను. [illegible] గోటలోనికి గొనిపోయి నాటిరాత్రి పెద్దవిందుచేసి దేవునివలె బూజించెను. [illegible] ఏనుగు నెక్కించి యూరంతయు నూరేగించి గొప్పసభ చేసి యతని [illegible] మండపమునకో గూర్చుండబెట్టి కోటిదీనారము లతనిపై నభిషేకము చేయించి [illegible] యతనికి గానుకగా నర్పించెను. ఫణిదత్తుడు వెంటనే యా సొమ్మంతయు [illegible] సుమిత్రునకు తలిదండ్రులకు నంపించి వారి దారిద్ర్యముదొలగజేసెను [illegible] నప్పటిది కాలకీతమైనది.

## 264 వ మజిలీ

# శశాంకవతీ సంయోగము

రాజసిర్బంధమున విందులారగింపుచు వారానగరమున గొన్ని దినములు నివసించిరి. ఒకనాడు కుమారవతి యను యువతి వారి వసతి కరుదెంచి పణిదత్ నేకాంతమునా జీరి సౌమ్యా! మీకు నమస్కారము. నేను మీరు ఙ్రితికించిన రాజపుత్రిక సఖురాలను. నాపేరు కుమారవతియందురు. ఆమె సందేశ మొండు మీకు నివేదింప వచ్చితి వినుండు. మీరామె కొ మణియుంగర మిచ్చితిరట. దానిని మరల మీకీయుటకిష్టపడక దానికి మారుగా తన వేలి యుంగరము మీ కిమ్మని యంపినది. యిదిగో గైకొనుడు ధరింపుడని పలికుచు నతని వ్రేలిం దగిలింపబోయినది. వలదు, వలదు, ఆమె కృతజ్ఞతకు జాల సంతసించితిని. ఆమె చికిత్సకు దండిగాను తగిన సపర్యలు చేసియే యున్నారు. కావునదానికి బదులు దీని నీయనక్కరలేదని చెప్పిన నప్పడతి యొప్పుకొనక బలవంతమున నతని వ్రేల దగిలించి యవ్వల బోయినది.

పిమ్మట పణిదత్తుడు మిత్రులతో వయస్యులారా! మృగాంకవతి మంచి రసికురాలివలె దోచుచున్నది. నా యుంగర మీయక తన వేలి యుంగర మంపినది. ఇందు భావసూచన యున్నదిచుడీ. సర్పదష్టయగుటనప్పు దమ్మగువ మొగ మంత విమర్శించి చూడలేదు. అంతఃపురములో బరకీయయని పరికించితినికాను. ఇదియొక తగులము పొసగునట్లుతోచు చున్నది. పెండలకడ నీ యూర దాటిపోవుట లెస్స యని పలికిన విని సుబాహు డిట్లనియె

వయస్యా! దివ్యకాంతాదర్శ నోత్సవ మనుభవించిన నీ నయనములకు మానవాంగనల సోయగం బచ్చెరువు గలుగజేయునా? అని సంభాషించుచున్న సమయంబున రాజభటు డొకడువచ్చి సలాముసేయుచు మొన్న రాజపుత్రికకు విష చికిత్స చేసిన వైద్యుని దీసికొని రమ్మని మా యేలిక సెలవైనది. విచ్చేయుడని చెప్పిన పణిదత్తు డొక్కండె యాస్థానమున కరిగెను. రాజు సగౌరవముగా సౌమ్యా! శశాంకవతికి రాత్రి గుండెలో బరువెక్కినదట. కఱచినచోట గొంచెము మంట పెట్టుచున్నదట. తిరుగబెట్టదుగద. మరియొకమంత్రము వేయుదురా? అని యడిగిన పణిదత్తుడిట్లనియె.

దేవా! అది గట్టిపాము. దాని విషము శల్యాశల్యమునకు నెక్కినది. మూడునెలల వఱకు నప్పునప్పుడా చిహ్నములు కనంబడుచుండును. ప్రమాద మొండదు. అయినను మణియొక మంత్రమువేసెదంగాక. అని చెప్పినవిని నృపతియయ్యతిప యతనిజూచి వలచునేమోయని వెఱచుచు గుమారవతిని రప్పించి యోసీ! అమ్మాయికి నే డెట్లున్నది? గుండె బరువు తగ్గినదా? అని యడిగిన నది దేవా! ఏమియు దగ్గలేదు. హెచ్చుగానే యున్నదని చెప్పినది.

అప్పుడు రాజు విధిలేక వాసివెంట బెట్టుకొని యంతఃపురమున కరిగి దూరు చటువు వెనుక నిలిపి కాలుసాచుమని నియమించెను. అమ్మో! అట్లు నిలువ గలదా! కాలుకూడ బయవెక్కినదట మంచము దిగలేదని కుమారవతి చెప్పినది. సరే పుసిగిడుకొని పండుకొనమనుము. కాలికి మంత్రము వేయుదురని చెప్పినసది యుప్పుడవతిపై సన్నని వలిపెపువలువగప్పి కాలివలకు సాచింపజేసి లోపలికి రమ్మని పిలిచినది. పణిదత్తుడు ధూర్తశవుని యాశయము గ్రహించి అమ్మనేజెల్ల! నే దిశ డి బోటి కెట్టి కట్టుపాటు చేయుచున్నాడు! మొన్న నీయవ చర్మనత్వమంతయు నేచుసట! అని నవ్వుకొనుచు మెల్లన లోపలికిబోయి కాలిమీద వ్రేలుమోపి కుట్టిన చోట నొక్కినంత మొత్తో! మంట పెట్టినదని యఱచుచు నత్తెఱవ ముసుగుకాఱు బిరాలుపలేచి కూర్చుండెను.

రాజు మోము చిట్లించుకొనుచు నీ మాత్రపు బాధయు సైరింపలేవా? పండు కొనుమను యదలించుటయు దాది మెల్లగా బకొంచబెట్టి ముసుగువైచినది పణిదత్తుడు పుండు మంత్రులువై చి యా బాధయంతయు గపటమని గ్రహించి యిప్పుడు గుండె లలో బరువెట్టున్నదని కుమారవతిచే నడిగించుటయు మొదట మంత్రముతోనే సగము తగ్గినది. తక్కిన రెండుమంత్రములతో నిశ్శేషముగా బోయినదని చెప్పినది.

ఇక రాదని చెప్పుచు పణిదత్తుడు రాజుచే ననుజ్ఞాతుండై బయలోని కరిగి సుబాహునితో నిట్లనియె. సోదరుడా! మృగాంకవతి దేవకన్యకలకన్న జక్కనిదిసుమీ! దాని తళుకు మెఱయ నెంత చమత్కారము చేసినదను కొంటివి? రాజు ముసుగు విడిచి కాలికి మంత్రమువేయ మనియె. దాని మొగము చూడవలయునని నా కభిలాషగా నున్నది. నా యాశయ మెట్లు గ్రహించినదో బాధ నెపంబున గుభాలున లేచి ముసుగు మరసినట్లు నా కన్నులకు మిరుమిట్లు గొలిపినది. అయ్యారే! ఆ లావణ్యలి మంచి సోయగము గలది. ఏమోయనుకొంటినని యా బాల్యంటి నూరక తుటుతింగుచుండ సుబాహు డిట్లనియె.

మిత్రుడా! నిన్నుజూచి దేవకాంతలు వలసిరనిన నీ శశాంకవతి వలచుట యొక్కయుచ్చరమా! నీ విష్టపడిన రాజే నీకిచ్చి పెండ్లి చేయునేమో! యనవుడు తల ప్రక్కనున్న నాతసమతి గ్రహించితినిగా! అంగీకరింపుడని చెప్పుచు దన యంగీజేబులో నుంచెనంత నేదియో పత్రిక తగిలినది. దాని బెకిపీసి చదువ నిట్లున్నది.

సీ. సౌమ్య! నీవలనాడు శమనలోకాంతిక
సీమకేగిన నన్ను సేమమమర
మరల దెచ్చితివిందు మహితమంత్రప్రౌఢి
నీ మహత్వంబు వర్ణింపదరమె
మఱియు నిప్పుడు నాసు మరణప్రదుండవ
య్యెడ వంచుదలపోతు నెదనదేమొ

యనఘ నిన్నే వేళ గనుఁగొంటినో కాని
మఱిమఱిజూచి నా మది దలంచు

గీ. సిగ్గువిడనాడి నా యభీప్సితము తాత
కెఱుఁగఁజెప్పిన నంగీకరింప డాత
డేమిసేయుదు సాధనం బేది బ్రతుక
దారిఁజూపుడు మీకు వందన మొనర్తు 26

మీ రీ యూరినుండి రెండు మూన్నాళ్ళలో నింటికింబోవ నున్నారని వింటి. నా బ్రతుకు తెరువెద్దియో చెప్పి యరుగవలయునని యున్న యా జాబు చదివికొని పణిపకుఁడు తమ్ముడా ! సుబాహూ ! ఈ చోద్యము వింటివా ? నేను మంత్రము వేయుచుండ రాజును గన్నుగిఁగి యీ పత్రిక నా జేబులో నెప్పుడు వైచినదో నేను దెలిసికొనలేదు. ఆహా ! స్త్రీలమాయలు సృష్టించిన విరించికే తెలియ వసిన పెరవారిమాటయేల ? ఈ పత్రికలో నెంత భావగర్భితముగా వ్రాసినదో చూచితివా ? దీని మాటలు కావ్యాలాపములువలె వ్యంగ్యప్రధానములై యున్నవి. సిగ్గు విడిచి తండ్రితో జెప్పినను నత డంగీకరింపడట. "ఏమని చెప్పవలయునని" చూడవలయుననియా ! పెండ్లియాడవలయుననియా ? అందు రెండర్థములు సూచించు చున్నవి. తెలిసికొంటివా ? అని పణిపకుఁడు నా యుత్తరము చదివికొని యుత్కృత్త వికారములతో నా మాటలకు వ్యాఖ్యానము సేయుచుండెను.

అప్పుడు సుబాహుఁడు చిరునగవుతో వయస్యా ! యా నారీమణి నిన్ను దారి చూపుమని కోరుచున్నదిగదా ! నీవు మనసు వేసిన దారి బోయి యిదియే దారియని చెప్పరాదా ! అనవుడు నతడు స్మృతి నభినయించుచు మంచిమాట జ్ఞాపకము చేసితివి. కానిమ్ము. ఇట్లు చేసెదనని యూహించి మున్ను తాను త్రవ్విన బిలముఖంబునందలి రాయి తొలగించి యా మార్గంబునబోయి రాల దప్పించుకొని లోపలికిబోయి యొక పత్రికవ్రాసి యది యమ్ముదితప్రక్కలో బడవైచి యథాప్రకారములేచివచ్చి మిత్రులతో గలిసికొనియెను.

మరునా డుదయంబున శశాంకవతిలేచి తవ ప్రక్కలోనున్న పత్రికంజూచి వెరగుపాటుతో విప్పి చదువ నిట్లున్నది.

గీ. దారిజూపుమటంచు నన్గోరినావు
కలదు నీ గదిక్రిందనే బిలముదారి
దారులకునేమి యభిలాష తీరవలయు
ననిన మానసజాత సాహసమెదారి. 27

ఆ జాబు చదివికొని యన్వసితారత్నము కుమారపతీ ! యుటు, ఈ పత్రిక యెవ్వరు వ్రాసిరి ? నా శయ్య కెట్లు వచ్చినది ? ఇది పణిపకుఁడు వ్రాసి నట్లున్నదే ? ఆతడు పాము మంత్రమేకాక యింద్రజాలముకూడా నెఱిగిన ప్రౌఢ

వల గనబడుచున్నాడు. ఇది మనమిచ్చిన లేఖకు బ్రతిలేఖ దీనియర్థము గ్రహించితివా ? గద్దెకింద బిలముదారి యని వ్రాసినది. యేమియో నాకు విడిపోవకున్నది?

తక్కిన వాక్యము లర్థమైనవి. సాహసముగలిగియున్న బయలుదేరి రమ్మని సూచించుచున్నది. అది యట్లుండె. నీపత్రిక యిక్కడి కెట్లు వచ్చినది. మంత్రించి యుగ్గడు. పరపసెనేమో యనుకొనిన మనకాబెప్పుడు చూచెను ? దానిజూచి యిది వ్రాసినట్లున్నది. కుమారవతీ : ఇక నీ కడదాచనేల వారెప్పుడు పోవుదురో తెలిసికొనుము. తెంపుచేసి వెనుక బోయెదం గాక అని తన యభిప్రాయము సూచించినది.

కుమారవతి యాజాబందుకొని మరియు మణియుం జదువుచు గదికింద దారి యున్నదని వ్రాసియున్నవాడు. యేమియో యని యాగది నలుమూలలు త్రొక్కిచూచిరి. ఒక మూల నడుగిడినతోడనే కుట్టిమశిలలు సడలి యుండుటచే దడదడమని గలబడి యడుగు దిగజారి కడుగుజారి క్రుంగినది. ఆ పాటు జూచి శశాంకవతి యదలుచు గదు పడి పోనీయక పడబోయి అందుబడి యున్నదాని చేతులతో నెత్తి లేవదీసెను. ఇరువురుం గలిసి యా సొరంగము తెఱంగరయుచు దీని నెవ్వరు త్రవ్విరని వితర్కించుచు ఫణిపత్తుడే త్రవ్వించెనని తెలిసికొని పరమానందభరిత హృదయయై సఖి గాలి కౌగ్లించియె.

కుమారవతీ : ఆతండీదారిని వచ్చి మనకు తెలియకుండ యీ పత్రిక యుంచి పోయెననుకొందును. అతం డింద్రజాలాది మహావిద్య లెఱింగిన ప్రోఢవలె గనంబడుచున్నాడు. కానిమ్ము. మనయత్నము సఫలముకాగలదు. నిన్నవచ్చినవాడు నేడేల రాకుండెనిని? నేటిరాత్రి కాచికొని యుండవలయునని బోధించుచు నాకన్నముపై మూతవెట్టిరి సమయము వేచికొనియుండిరి.

ఫణిపత్తుడు మిత్రులతో నాలోచించి నాటి యర్ధ రాత్రంబున గ్రమ్మఱ నా గిరిమార్గమ్మున నయ్యంతఃపురి కరిగి యందలి శిలలు జారియుండుటయు నది మూయబడి యుండుటయు జూచి వారది గ్రహించిరని తెలిసికొని, మెల్లగా సందు చేసికొని యా గదిలోని కెక్కెను. మృగాంకవతి మేల్కొనియుండి యతని రాక జూచియు దొంగ నిద్రబోవుచు గుఱ్ఱుపెట్టుచుండెను. కుమారవతి పర్యంకమున దిండ్లపైపు బండుకొని యుండెను. పరిమళ ద్రవ్యముల వాసనలు నాసా పర్వముగా వెలువడుచుండెను.

నాగవల్లి దళంబులు చిత్రవిచిత్రములుగా జుట్టబడి కనక పాత్రంబుల యమర్చబడి యున్నవి. పెక్కురకముల వంటకములు నానా విధ పాత్రలలో జేర్పబడియున్నవి. ఆ విశేషము లన్నియు జూచుచు నతండు తనరాక తెలిసికొని వారట్లమర్చిరని గ్రహించి మురియుచు నల్లన నత్తలో దరిదరి కరిగి తన్ముఖ విలాసముల నిగిరించుచు ఏనంబులకు లుబ్ధవిల్లి నంటుటకు శంకించుచుండెను.

అప్పంకజముఖి మొదట నతండేమిచేయునో చూచుదనుకి గదలననితలంచి కొనియు నంతలోనేమి నిలుపజాలక తటాలున నతని చేయిబట్టుకొని కుమారవతీ! దొంగ దొరకె నిటు రాయని పిలచినది. అదియు మెలకువగా నుండుటచే సత్వరమ లేచివచ్చి ఫణిదత్తుంజూచి నగు మొగముతో ఓహో మోహనాంగా! నీవిక్కడి కెట్లు వచ్చితివి ? యీ కన్నపు దొంగ తన మెప్పుడు నేర్చికొంటిరి. మీరు సకల గుణాలి రాములు గదాయని పరిహాస మాడుచు శశాంకవతి కిట్లనియె సుదతీ! యింటికి వచ్చిన యతిథి యెట్టివాడైన నను పూజింపవల యు చేయివదలుము. లేచి యర్చింపుము. అని యుపదేశించుటయు నా చంచలాక్షి మంచము దిగి యతని పాదములకు నమస్క రించినది.

అప్పుడు కుమారవతి యతనికి మహోవిల సంగతి మృతి కాధూళి దూసర ములైన వస్త్రము లూడ్చించి నూత్నాంబరా భరణంబులు దాల్చ నిచ్చి పర్యంకోపని ష్టం గావించినది. అప్పుడు మృగాంకవతి కెక్కడ నుండి వచ్చెనోసిగ్గు మోమునంచు కొని సఖీ! బలవంతమున శయ్యాంతికమున కరిగి మిమ్మాయాస బెట్టిన నా తప్పులు క్షమింపుడు. స్వతంత్రించి వరించితినని యాక్షేపింపక గాంధర్వ విధి నన్ను ధర్మ పత్నిగా బరిగ్రహింపుడు అని యామెచే బలికించి యతనిచే నోంకార ముచ్చరింపజేసి వారి చేతులకు ముడివైచి యాకాశాయవ్వల బోయినది.

తరువాత వారికి మారుండే పురోహితుండై తరువాత కృత్యము లన్నియు నిర్వర్తింపజేసెను.

అని యెరింగించు నప్పటికి గాలాతీతమయ్యెను. తరువాత కథ పిమ్మట నగు మజిలీయం దిట్లు చెప్పదొడగెను.

## 265 వ మజిలీ

# శశాంకవతి ప్రవాసము

అట్లు కొన్నినాళ్ళరిగిన వెనుక ఫణిదత్తు డొకనాడు మిత్రులతో నిట్లనియె. సోదరులారా! మనమిక నీ యూరునుండి తొలగిపోవలయును. మృగాంకవతికి నెల తప్పినదట. ఇది యొక విడువతి తగులముగా నున్నది. దాని సౌహార్దాకిది గుణంబులు కజావులై కదటనీయకున్నవి. మరియొక యుపద్రవమురానై యున్నదట. ఆ యువతి గర్భవతియైనదని సిద్ధాంత చారిణుల కంచుకు దెలిసినదట. కిట్టని వారెవ్వరో నృప తికి పేరు లేని చీటి వ్రాసిరట.రాజు పూర్వాదార పరాయణుం డగుట సత్యమెరింగినచో దన్ను జంపునని యితెజవ వెజుచుచున్నాడు. అనర్థము రాకమున్నే ప్రతీకారము సేసి కొనవలయును. కావున రేపు మంచి వాసరము. దానికి గుఱ్ఱమెక్కు పాటవము గల దట. భూవిరము నుండి యవ్వేదండగ మనము రేపు రాత్రి యిందు తీసికొనివచ్చెద.

గుఱ్ఱము లెక్కి మీరు ముగ్గురు దానివెంట బెట్టుకొని నాలుగు పయనములు

గావించి యటనిలువుడు! నే నిందు మూడు నాళ్ళుండి యిచ్చట విశేషములం దెలిసికొని మిమ్ము గలిసికొనగలను. నాకు దారి దెలుప నొకడు వెనుకకు రావలయునని నియమించుటయు వా రంగీకరించిరి మంచి గుఱ్ఱముల నాలిగిటి నా యత్నము చేసికొని ।లముఖంబున వారు గా కొ, యుంత ఫణిదత్తుడు మరునా దర్ధరాత్రంబునం బోయి కుమారవతికిం జెప్పవలసిన మాటలం జెప్పి యప్పన్నగివేణిని మెల్లగా సౌరంగమున డింపి నడిపించుచు వివరముఖంబునకుం దీసికొని వచ్చి యందా యత్త పఱచి యుంచిన మంచి గుఱ్ఱము పైనెక్కించి చేయిపిసరుటయు నబ్బిసరుహాక్షితో గూడ నా జోదులు వారువములం దోలికొని యుత్తర ముఖముగా బోయిరి.

మరునాడు ఫణిదత్తుడు యెరుగనివాడుం బో(|నోలగంబున కరిగి కూర్చుండుటయు నంతఃపురమున గోలాహలము వ్యాపించిన గడియలో గుమారవతి సభకు బరుగిడు కొనివచ్చి మహాప్రభూ! శశాంకవతి వేకువజామున నేమిటికో యుప్పరిగిపెకి పోయినది. అప్పుడెవ్వడో యాకసము నుండివచ్చి సందిటం బట్టి నామె నెత్తుకొని పోయెను. మేము చూచు చుండగనే యంతర్ధానము నొందెనని బుడిబుడి దుఃఖముల నభినయించుటయు నయ్యోధయుండు విభ్రాంతుడై ఏమీ! శశాంకవతిని గగనచరు డెత్తికొని పోయెనా! ఇట్టి విచిత్రము లెప్పుడును వినయుంద లేదు. నీవు చూచితివా? వాడే దెసకు బోయెను. అని యడుగ నది దేవా! వానిం గన్నులార జూచితిని. కేకలు వైచితిని. తరువాత నందరును వచ్చిరి. వారి కేమియు గనబడలేదు. అప్పటికే యంతర్ధాన మయ్యెననుటయు దాని యభినయమునకు ఫణిదత్తుడు వెఱగుపడుచు బాలా! నీవు చూచిన పురుషు డెట్లుండెను? భీకరుడా! సౌమ్యుడా! ఆమె నేమైన బాధపెట్టునట్లు గనంబడినదియా! అని యడిగిన లేదు సామీ లేదు. అతనిమేని యాభరణ కాంతులు మెఱయుచు నా కన్నులకు మిరుమిట్లు గొలిపినవి. అతడు దివ్యపురుషుండని తలంపనగు అని చెప్పిన విని రాజిట్లనియె.

ఓహో! దేవతలు మనుష్యకాంతల నెత్తికొని పోవుట నెన్నడును వినియుండలేదు. ఇక్కాలమున నింతల వినవచ్చెనని యచ్చెరువు పడ ఫణిదత్తుండు భర్తృదారిక చక్కనిదగుట నే వేల్పో వరించి తీసికొని పోవచ్చునని తాత్కాలోచితమైన మాటలచే నతనికి శోకోపశమనము కొంత గావించెను. పిమ్మట నా కొమ్మ నతండెం దేనిదింపునేమోయని మేటి రౌతుల జవనాశ్వముల నెక్కించి నలుమూలలకుం బంపెను. ఫణిదత్తుని ప్రార్థించి యుత్తర దిక్కునకు బోయి యామెజాడ దెలిసికొని రమ్మని కోరికొనుటయు నతం డనుమోదించి మంచి గుఱ్ఱమెక్కి యుత్తరాభిముఖుండై మూడు దినంబులు హూటాహూటిపయనంబులు గావించెను కాని మిత్రులజాడ యేమియు గనంబడినదిగాదు.

అతండు మరలి వెనుకవచ్చి మరియొక దారి నహోరాత్రములు గుఱ్ఱముల నడిపించినంత నొ: మార్గాంతరమున మువ్వురు మిత్రులు మేనులు నొవ్వ దెబ్బలుతిని

పండుకొని మూలుగుచుండిరి. ఫణిదత్తుడు వారింజూచి పరితపించుచు సోదరులారా! మీరిట్లుంటిరేమి? ఎవరైన మిమ్ము బరిభవించిరా? నా ప్రాణనాయకి మృగాంకవతి యేమైనది? యెరింగింపుడని గుఱ్ఱము దిగి యడిగిన సుబాహుఁ డెట్టకేల కిట్లనియె. దైవప్రతికూల దినములలో నెంత వారును నేమియుం జేయఁజాలరు. మేము కొంత దూరము వచ్చిన తరువాత నడవిలో రెండుదారులు గనంబడినవి. ఒకటి యరణ్యము: ఒకటి జనపదము. ఈపరము దెలియక మే మరణ్య మార్గముననే గుఱ్ఱములను మరలించితిమి. ఇందు దొంగలు గుంపులుగా దిరుగుచుందురని మే మెరుంగము. రాత్రింబవలు విడువక పయనములు చేయుటచే మాహయంబులు రయంబుడిగి బడలి యిట నుండి గదలలేక పోయినవి. మే మందుదిగి వానిని మేతకు విడిచి కూర్చుంటిమి. మిత్రమా! ఏమని చెప్పుదుము.

వేయి గుఱ్ఱముల సమూహము ప్రవాహము వలె నీ దారిని వచ్చుచుండెను. మేము భయపడి దారి కించుక కెవమగా నొదిగిల్లి చూచుచుండ నారౌతులందరు నవ్వల బోవుచుండిరి. వారిలో నొకరౌతు యధికారికాబోలు శశాంకవతి నెగాదిగజూచి గుఱ్ఱము నాపి గుభాలున నురికి యా సుందరిని సందిట బట్టి గుఱ్ఱమెక్కించుకొని యామదవతి రోదనసేయుచుండ లక్ష్యపెట్టక తన గుఱ్ఱమును దోలికొనిపోయెను. అప్పుడు మేము దలుచు పరిపరి విలువిలమా చెలువం గొనిపోయెదవేమని యడిగిన గుఱ్ఱపు డెక్కలచే మమ్ము ద్రొక్కించి రౌతులచే గశలం బాదించి లేచిపోయెను. వేయి మందితో మేము ముష్కరము బోరాడగలమా? మా దెబ్బలకన్న శశాంకవతిం గోలుపోయి నందుకు నెక్కువగా దుఃఖించుచు గదలలేక నీ రాకకై వేచియుంటిమి. నేటి యుదయముననే నాసాతు అటుపోయినది. సాయంకాలము లోపున నీవు గలసికొనగలవు వేగము పొమ్ము. మేము నెమ్మదిగా రాగలమని పలికిన శోకావేశంబున నొంతలెరుంగక యేమియు బలుకక వెంటనే యా వారువము నెక్కి యతివేగముగా నా దిక్కునకరిగెను.

సంజవేళ కాసాతు వానికి నేత్రపర్వము గావించినది. అతండా రౌతులలో గలసి కొంతదూరము వారువమును మెల్లగా నడిపించుచు శశాంకవతి యెందున్నదో యని విమర్శింపుచుండ నయ్యంబుజ యాస యన్నహయం బతనికి నయనోత్సవము జేసినది. అప్పుడించుక చీకటి పడుచున్నది. మెల్లగా దన గుఱ్ఱము వాని గుఱ్ఱము దాపునకు దోలిలంఘించి యొక్కతన్ను వానిందన్ని నేలంబడద్రోసి తా నా గుఱ్ఱ మెక్కి రివ్వున నెగయదోలి నాహయమును గడియలో నా సంఘమును దాటించెను.

క్రిందబడిన రౌతు వివశుండగుచు గుఱ్ఱపుడెక్కలచే ద్రొక్కబడి ప్రాణముల బాసెను. చీకటిగానుండుటచే నా రహస్య మా సాతులో వారెవ్వరుం గ్రహింపలేకపోయిరి. ఫణిదత్తుండు దారి తప్పించి వారువమును పెడదారి నడిపించెను. కొంతదూరము పోవునప్పటికి జీకటిలో దెరువుగానక నడువజాలక నొక్కచోట

గుంపునునాపి మృంగాంకవతిం డింపి యూరడింపుచు నా రేయియెల్ల నిద్రబోక తెల్ల వారచ్చెను.

కుమారవతి పన్నిన వ్యూహము పతివలనవిని యక్కజమందుచు రౌతు పరివారములోనున్నప్పుడు తానుబడిన విచారము నుగ్గడింపుచు సతసమిత్రులు పొందిన గాసిపలసనుంచు దెలియజేయుచు నాటి రాత్రి సంతోషముతో వెళ్ళబుచ్చెను. తెల్ల వారినంతనే వెండియు గుఱ్ఱమెక్కి వారాయరణ్యము దాటవలెనని వేగముగా బోలిరి. కాని యా యడివికి దుదిమొదలు గనంబడలేదు. ఇరువుర మోసి మోసి పెద్దదూరము నడచుటచే నా వారువ మలసియలసి యొకచో నేలబడి గిలకిల గొట్టుకొని ప్రాణ ములు విడిచినది అప్పటికి జాముప్రొద్దున్నది. పైనడువలేక నారందువసించిరి. శశాంకవతికి దాహమగుచుండ నీరెంతదూరములో నున్నదియో యని యతండొక చెట్టెక్కి చూచును. దాపుగనే తటాకమున్నట్లగపడెను. చెట్టుదిగి జలములిందే దెచ్చెదను. త్వరలో దీసికొనివత్తు భద్రముగానుండుమని జెప్పి శంఖమునుగైకొని యరుగుదెంచుసగా బోయెను.

దారిలో నేరులద్దముగా నుండుటచే జలాశయముచెంత కరుగునప్పటికి చాల ప్రొద్దుపోయినది. శంఖమున నీరుపట్టి తిరుగా వచ్చునప్పుడు దిగ్భ్రమగలిగి తానే దారిని బోయెనో యెందుండి వచ్చెనో తెలిసినదికాదు. ఆ యడవిలో దెల్లవారు వరకు తిరుగుచునే యుండెను. ఆ చీకటిలో మృంగాంకవతి గుండెదెదరి ప్రాణములు పిలుచుచున్నయని వెరచుచు దనయావచ్చ కిందిరిగి యా ప్రదేశము కనుగొనలేక పోయెను. అంతలో దెల్లవారినది. కాని యప్పుడుగూడ తానువచ్చిన జాడతెలియక సుడిగుండమువలెం దిరుగుదారువుంటోలె పోయినచోటికే పోవుచు జూచినతావే చూచుచు నెట్టకేలకు నా ప్రదేశము చేరగలిగెను.

అందుగుఱ్ఱము చచ్చిన చిహ్నమును గనంబడినవి. దానిదేహమేమృగమో తినివేసినది. అందు శశాంకవతింగానక వద్దిల్లుచు పెద్దయెలుంగున హా ప్రేయసీ ? శశాంకవతీ ! అని చీరుచు ప్రతివచనముగానక సీతను గురించి శ్రీరాముడువలె శోకించుచు నా యడవియంతయుందిరిగెను. ఆమెజాడ గనంబడ లేదు. శంఖములో నెక్కించిన నీరు చిమ్మకుండ నొక యిసుకదారిలో గ్రుచ్చి యందు పెట్టి మద్దిచెట్టెక్కి చిట్టచివర కొమ్మలనుండి నిక్కి నలుమూలలు పరికింపు చుండెను.

ఇంతలో నా దారిని బదుగురు కిరాతులు సేవింప నొక శబరపతి యరు గుచు యిసుకలో గ్రుచ్చబడిన శంఖమునుజూచి యిది యెవ్వరిదోయని యెత్తి పరికింపుచుండ చెట్టుపైనుండి చూచి పతిపతుడు వేగదిగి యీ శంఖము నాది నేనిందుంచితిని. నీవేల యెత్తితివి ? అనియడ్డగించి యడిగినసక్కిరాతపతి నీవెవ్వడవు ? ఈ విపినాంతరమున కేమిటికి వచ్చితివనావుడతండిట్లనియె. నేనొక బాటసారిని. నా భార్యతోబోవు

చుంద నీటికై పోయి యామెతో విడిపోయితిని. ఆ సుందరి నీకెందైన గనఁబడలేదు గదా! యని యడిగిన వాడిట్లనియె

అరే! ఆమె నీ భార్యయా! నీవు వీరివెంట మా యింటికింబొమ్ము, నీ భార్యను నీకు దీసికొనివచ్చి నీకర్పింతునని పలుకుచు దనపరిచారికలతోఁజెప్పి యతనిని వారివెంట శబరపల్లెకనిపెను. శంఖమిమ్మని యడిగిన నేదీసికొనివచ్చెద పదపద యనుటయు వానిమాట సత్యమని నమ్మి శబరి పల్లెకరిగెను. ఆ రాత్రి వానికి నానా విధోపచారములు చేసిరి. మరునాడుదయంబుననలేచి చూచునప్పటికి బాహంబులకు నిగళంబులు దగిలింపఁబడియున్నవి. అతండదియెఱింగి యోహో! మోసపోయితి. వాడు నన్ను గపటముచేసి యిందు దీసికొనివచ్చెను. గ్రహచారము చాలదుగాబోలు! ఆపదపై నాపదలు వచ్చుచున్నవి. అని దుఃఖించుచు నొక చెఱసాలంబడియుండెను.

అని యెఱింగించునప్పటికి వేళ యతిక్రమించినది.

265 వ మజిలి

# శ బ రి క థ

ఒకనాడు చెఱసాలలోనున్న పణివతునకు పుళిందుని పరిచారిక యన్నము దెచ్చిపెట్టుచు వానియందముజూచి మెచ్చుకొని పురుషుడా! నీవెవ్వడవు? ఈ శబరపతిచేతిలో నెట్లుపడితిని? నాకు నిన్నుజూడ జాలి కలుగుచున్నది గదా! ఇక నీకాయువు మూడు మాసములే యున్నది. ప్రతివత్సరము విజయదశమినాడు నీవంటి యౌవనపురుషుల నూర్వురదెచ్చి యీపుళిందుడు దుర్గకు బలియిచ్చుచుండును. నిన్నందులకే తెచ్చెను. అని చెప్పుచు నన్నమిడుటయు నానార్త వినుటచే వాని కాహారము నోటికెక్కినది గాదు. నా దాతండు భుజింపక తన స్థితిని గురించి వితర్కించుచు నుపవాసమే చేసెను.

ఆ పరిచారిక తెచ్చిన యన్నమంతయు మెండియుం దీసికొనిపోయి పుళిందాధిపతి కూతురు శబరి యనుదానితో అమ్మా! మంచి చక్కనివాడు తొలిప్రాయములో నున్నవాడు. బలిపురుషునిగాదెచ్చి చెఱసాలలో బెట్టించెను. అట్టివాడు నీకు మగడైన నెంతయో యుచితముగా నుండును గదా? అని వాని సోయగము నూరక స్తుతియించుటయు నా శబరకన్య మరునాడు భోజనము దీసికొనిపోవు వేళకు నా పరిచారికవెంట దానుగూడ వానికడ కరిగినది. పణిదత్తుంజూచి మోహవివశయైనది. దివ్యకాంతల మోహింపజేసిన పణివరుని చక్కదనమొక శబరి కన్యను వలపించుట యబ్బురముగాదు.

నాడుగూడ విచారముతో నతండన్నము తినకున్న శబరి పరిచారికాముఖమున దన్ను బెండ్లియాడిన బంధవిముక్తుంగావింపజేయుదు అన్నము దినకి యూరక విచా

రింపన ప్రయోజనమేమి ? యని యడిగించుటయు నతండు కాలోచిత మాలోచింప వలసినది అను నార్యోక్తి ననుసరించి యంగీకరించెను. ఆ శబరి రాత్రులవచ్చి వానితో గలిసికొనిపోవుచుండెడిది. అట్లు కొన్నిదినములు జరిగిన నదియుం గర్భవతి యయినది. అతండు నిత్యము తన బంధవిముక్తికై దానిం గోరుచుండ నతండు పోవువని కాలహరణము చేయుచుండెను.

ఒకనాడు శబరితల్లి కూతుంజూచి ఓసీ ! నీవెట్టిపని జేసితివి. దుర్గకు బలిసీయదలచికొనిన బద్ధపురుషునితో గలిసికొంటివదేమి ? వానింజంపిన వైధవ్యవ్యథ నెట్లు ధరింపగలవు ? అని యడిగిన నా శబరి యిట్లనియె. అమ్మా ! మీరు వానిం జంపిన నేనుగూడ జత్తును. నాకు వానితోడిదగతి. కడచినదానికి వగచిన ప్రయోజనములేదు. పాపము మా తండ్రి వాని నన్యాయముగదెచ్చి చెఱసాలంబెట్టించెను. వాని నెదిరించి పోరి పట్టితెచ్చిన పీటబలము తెలిసిపోవును. నా తండ్రి కొలది దినము లలో నింటికి వచ్చును. నా యభిమతము నీవు తీర్చదలచుకొంటివేని నీలోపల వాని సంకెళులు విప్పించి తోలివేయుము. లేకున్న నీ యిష్టము వచ్చినట్లు చేయుము. అని పలికిన బిడ్డమాటలు మన్నించి వెంటనే పణిదరినొద్దకరిగి యిట్లనియె. వత్సా ! నీవు మాకల్లుడవైతివి. నీ భార్య గర్భవతియయినది. నా మగడు వచ్చిన నిన్ను బ్రతుకనీయడు. నీకట్లు విప్పింతు. నీవిటనుండి యెందేనిం బారిపోయి విజయ దశమిదాటిన తరువాత గ్రమ్మర నిటకురమ్ము. రాకున్న నీ భార్య చింతించుంజుమీ ! యని పలుకుచు రహస్యముగా నతనికట్లు విప్పించి యవ్వలకు సాగనంపినది.

అతండు బ్రతుకుజీవుడాయని తలంచుచు నచ్చోటు దాటి శశాంకవతిం దలచుకొనుచు నయ్యంతి నా ప్రాంతములయం దెక్కడనైన దిరుగుచున్న దేమోయని భ్రాంతిపడుచు నా యడవిలో మునుపు పెట్టి వెదక మొదలుపెట్టెను. మూడు దినములకు గుఱ్ఱము జచ్చినతావు గనంబడియెను. అందు రాచపట్టి నిందు విడిచిపోయితినని యామెందలచుకొని దుఃఖించుచు నంతొక చెట్టుక్రింద గూర్చుండెను. అప్పుడొక కిరాతు డక్కడికివచ్చి పణిదత్తు నెడదిగం జూచి పరిశీలింపుచుండెను. అంత నాజెట్టి పిడికిలిం బట్టుకొనిలేచి శబరాధ మా నాడు నీవు మాయచేసి తీసికొనిపోయి కట్టించితివి. ఇప్పుడు కాచికొమ్ము. నాతో మల్ల యుద్ధమునకురమ్ము. నీ పీచమడంచెదనని హుంకరించుటయు వాడు నవ్వుచు నిట్లనియె.

అయ్యా ! నేను నీతో నేమియు మాటాడనిదే నన్ను గొట్టవచ్చెదవేల ? నేను నీపైగత్తి గట్టితినా ? నేను నీవనుకొనిన శబరాధిపతినిగాను. నీవు పణికర్త దలచినను పిమస్కరించి చూచితిని. అని పలికిన పణిదత్తుడు, ఓహో ! నను బట్టి కొనిపోవుకై శబరిపతి నిన్ను బంపెను కాబోలు. ఎట్లయినను నీవు హంతవ్యుడవే. నా

పేరుతో నీకేమి పని రా రమ్ము. మల్లయుద్ధము సేయుదమని పిలిచిన నయ్యెఱుకు డిట్లనియె.

సామీ! నే మీకు విరోధుడనుగాను. అప్పుడు శశాంకవతి నీ భార్య గాదా? ఆమె నే నెఱుంగుదును. అందులకై యడిగితినని పలికిన నతండు నక్కుఱుంగనయన నీ వెట్లెఱుంగుదువు? నీ కెందు గనంబడినది? బ్రతికియున్నదా? నిజము చెప్పుమని యాతురతతో నడిగిన నక్కిరాతు డిట్లనియె

సామీ! ఆమె బ్రతికి సేమముగా నున్నది. ఇంక నూరేండ్లు బ్రదుకగలదు. వినుడు. నేనొకనాడీ యడవిలో దిరుగుచుండ నామె యెవ్వరినో వెదకుచుండెను, నేను దాపునకుంబోయి నీవెవ్వతెవని యడిగితిని. నన్నుజూచి జడిసి వెనుక వెనుక కొదిగినది. నేను విడువక వెండియు బాలా నీవెవ్వతెవు? ఒక్కరిత నీ యడవి నడుమకేటికి వచ్చితివి? నీ యాప్తు లెందున్నారని యడిగిన బెదురుచు నా కిట్లనియె.

ఓయీ! నేనొక బాటసారిని. నా భర్తయు నేనును వచ్చుచుండ నిక్కడ నాకు దాహమగుటయు నా భర్తయు నీరు దేవ నరిగి యింతవరకును రాలేదు. దారి తప్పిరనుకొనుచున్నాను. నీ కెందేని గనంబడలేదు గదా? అని యడిగినది. ఆ మాటవిని నేను అమ్మా! నాకెవ్వరును గనంబడలేదు. కాని నీవాడుదానవు. ఇది కిరాత దేశము. చిన్నదానవు. ఇందున్న భిల్లులందరు చాల క్రూరులు. నిన్ను జూచిన నవమానముసేయక విడువరు. ఇన్ని వస్తువులతో నీ వడవిలో దిరుగుట ప్రమాదము. నీ పుణ్యము మంచిది. తొలుత నా కన్నులం బడితివి. నీకేమియు భయము లేదు. నావెంట మా పల్లెకు రమ్ము. మా యింటబెట్టుకొని కాపాడెద. నీ మగని వెదకి తీసికొనివచ్చెదనని నమ్మకముదోప బలికిన వేఱొక గతిలేదగుట ననుమానించినను నావెంట మా యింటికి రాక తీరినదిగాదు.

ఆ వస్తువులన్నియు నాకిచ్చి పుణ్యాత్మా! నన్ను నా భర్తతో జేర్చుము. వీనిని గానుకగా దీసికొనుము. ఫణిదత్తుని వెదకి దీసికొని రమ్ము. నీ యుపకార మెన్నటికిని మరువనని వేడికొనినది. నేనామెం దగిన ట్లూరడించితిని. నా పెండ్లాము మొదట నామెపై నీసుబూనినది కాని తొడవులిచ్చిన తరువాత సంతసముతో నాదరించుచుండినది. నేను నిత్యము నీ యడవికి వచ్చి మిమ్ము వెదకి వెదకి పోయి చెప్పుచుండువాడను.

మా పల్లె చాల చిన్నది. అందున్నవారు కడు క్రూరులు. ఆమె మా యింట నున్నదనియు తొడవు లిచ్చినదనియు నసూయపడి కొందరు బోయలు నాతో నితో జెప్పుటకై శబరాలయమున కరిగిరి. నేనా వార్తవిని జడియుచు నామెతో బల్లీ! భిల్లపతికి నీ యునికి దెలుపుటకై కొందఱరిగిరి. నీ ఘోష విసినవాడు నిన్నట్టిక విడువడు. ఇప్పటికి నీ భర్తజాడ యేమియుం దెలియదు. నీ విక నిందుండిన ప్రమా

దము జరుగును. సుముఖ మను నగ్రహారమున నా యొజ్జ విశ్వనాథభట్టను బ్రాహ్మణుం డొకఁడుగలఁడు. ఆయనయొద్ద నే నుపదేశమైతిని. నాఁటి నుండియు జీవహింస మానితిని. నిన్నాయనకడకు దీసికొనిపోయి యప్పగించెద. నా మాట మన్నించి కాపాడఁగలఁడని చెప్పి యొప్పించి నాఁటిరేయి నెవ్వరికిం దెలియకుండ నామె నా యగ్రహారమునకు దీసికొనిపోయి వారింట బ్రవేశపెట్టితిని. మా గురువు నావలన నాఁడు వృత్తాంతమంతయు విని జాలిపడుచు నామె కభయహస్తమిచ్చి మిమ్ము వెదకి తీసికొని రమ్మని నాకు నియమించెను.

వెంటనే నే నింటికి వచ్చునప్పటికి మా శబరపతి నాకై వేచియుండి నన్ను జూచి ఓరీ! నీ వెవ్వతెనో చిరుత దాఁచి పెట్టితివఁట. అది యేదీ యని యడిగిన స్వామీ? నా కేమియుం దెలియదు. ఒకనాఁటిరేయి బాటసారి యెవ్వతెయో వచ్చి మా యింట బండుకొని వేకువజామున జెప్పకయే లేచిపోయినది. అని బొంకితిని. వాఁడే మియ్యూరు జాడలు తెలియక చెప్పినవారిం గసరి యింటికి బోయెను. పిమ్మట మిమ్ము వెదకుచు నీ యరణ్యములో దిరుగుచున్నవాఁడ. నేఁటికి మీ రిందు గనంబడితిరి. నా యత్నము సఫలమైనదని యా కథ యంతయుం జెప్పెను.

అప్పుడు ముప్పిరిఁగొను సంతసముతో నతండు వానిం గౌగలించుకొని మిత్రుఁడా! నీవు కిరాతకులంబున బుట్టినను మహర్షితుల్యుండవైతివి. నీవు గావించిన యుపకారమునకు గృతజ్ఞుండనగుట తప్ప బ్రతిక్రియ నేమియు జేయజాలను. చల్లనివార్త చెప్పితివి. బాబూ! ఆ యగ్రహార మిక్కడ కెంతదూరమున్నది? నన్నందు దీసికొనిపోయెదవా! యని బ్రతిమాలికొనగ వాఁడు నవ్వుచు నిట్లనియె. అయ్యా! నన్నిందుల కింత బ్రతిమాలవలయునా? ఆ యూరిక్కడికి నాలుగు పయనముల దూరములో నున్నది. మీ వెంటవత్తు పదుఁడు. అని పలుకుచు నప్పుడే ప్రయాణము చేసెను. వా రిరువురు నట్లు మాట్లాడుకొనుచు బోవుచుండ వెనుకటి కిరాతపతి కతిపయ శబర పరివృతుండై వారి కెదురుపడెను.

అప్పుడు ఫణిదత్తునితో వాఁడే నిన్న గట్టించిన పుళిందుఁడు వెండియుం బట్టఁగలఁడు జాగ్రత్త! అని చెప్పి యయ్యెరుకు చెట్లమాటునకు బోయెను. భిల్లపతి దారసిల్లి ఫణిదత్తుంజూచి గురు తెరుగక నీ వెవ్వరవు? ఎందుబోవుచున్నావు? అని యడుగుటయు నా జోలి నీకేల? నీ వెవ్వరవు? ఎందుబోవుచున్నావో? ముందు జెప్పుము! తరువాతనే జెప్పెదనని ఫణిదత్తుం డుత్తర మిచ్చెను.

దానం గోపించుచు ఓహో! వీఁ డెవ్వఁడో పొగరుపట్టి యుండెనే! వీనిం బట్టుకొని కట్టివేయుఁడని కింకరుల కాజ్ఞ యిచ్చెను. వారు వానిం బట్టుకోఁబోగా గిరిపాద ప్రహారణంబుల నతిలాఘవంబున వారిం జెదియఁగొట్టెను. అంత భిల్లపతి వానితో గలియఁబడియెను. పెద్దతడ విరువురకు మల్లయుద్ధము జరిగినది. ఫణిదత్తుఁడు వానిం

గ్రిందబడ బ్రొవ్విపై కెక్కి యమలోకము చూచివచ్చునట్లు గ్రుడ్డి వివశుంజేసి చచ్చెగా నిశ్చయించి మిత్రశబరునింజీరి పెపయనము సాగించెను.

వానారుదినముల కాయూరు జేరగలిగిరి. వానిగురువు విశ్వనాథ భట్టు నింటికిం దీసికొనిపోయి వాకిట నిలిచినంత శిష్యులకు బాఠము జెప్పుచు గురుడు వానిం జూచి యేమిరా వచ్చితివా? ఫణిదత్తుడు గనంబడెనా యని యడిగెను. సామీ! గనం బడిరి. తీసికొనివచ్చితిని. వాకిటనున్నారు అని చెప్పుచుండగనే ఫణిదత్తుడు లోప లికిం బోయెను. వానింజూచి యతం డాశ్చర్యపడుచు బాబూ! నీవేనా ఫణి దత్తవు కూర్చుండుము. అని గౌరవించుటయు ఫణిదత్తుం డతని యడు గులంబడి మహాత్మా; నా భార్యం గాపాడిన పుణ్యాత్ముడవు. నీ యుప కార మెన్నటికి మరువను. అనుగ్రహించి యా చంచలాక్షి యెందున్నదో చూపెదరా యని యడిగిన లేవనెత్తి యాదరించుచు నిట్లనియె సత్పా! ఫణిదత్తా! నీ సుగుణం బులు నీ భార్య వల్లవింటి ఆమె మహాపతివ్రత మీ యనురాగ మపూర్వమని యెరుం గుదును. ఇది చిన్న గ్రామము నీ భార్య మిక్కిలి చక్కనిది. ఆమెంజూచ నేదియో నెపంబున నిత్యము మా యింటికి కోడెకాండ్రు రాక వచ్చుచుండిరి. వారి నెదిరించు పెద్దలిందులేరు. వారికిడకిసి నీ భార్య నిటనుండి మధురాపురంబున కనిపితిని. అందు నాకు బంధువులు మిత్రుడునగు సుబంధుండను పౌరునింటికడనున్నది. అతండు నా సందేశము విని చాల సంతోషించుచు నామెను భద్రముగా గాపాడెదనని నాకు ప్రత్యు త్తరము వ్రాసె నిదిగో చూడుమని యాచీటిం దెప్పించి వానికిచ్చెను.

ఆ లేఖ చదివికొని యతండు అయ్యో! నా ప్రేయసి నిప్పుడే చూతునని గంపెడాసతో వచ్చితిని. ఇంకను నా కట్టి భాగ్యము పట్టలేదు. స్వామీ! మధురాపుర మిక్కడి కెంతదూరములో నున్నది? దారి యెట్లు? అని దైన్యముదోప నడిగిన విని యా విప్రుం డిట్లనియె. సౌమ్యా! నీ భార్య భద్రముగా నున్నది నీవు నే డిందు విశ్రమించి రేపందుపోవుదుగాక దానిఁజూప నా శిష్యుని సహాయమిత్తును. ఆరుదినము లకు బోవచ్చును దారిలో నదవియున్నది. రాచబాటలుగలవు. అని యూరడం బలుకుచు నాడు శబరునితో గూడినాతనికతి కృత్యములం నిర్వర్తించెను.

మరునాడు ఫణిదత్తుడు శబరునకు గృతజ్ఞత దెలుపుచు వాని నింటికిం బొమ్మని చెప్పి విశ్వదత్తు శిష్యుడు వెంటరా, నతని యానతిగైకొని మధురాపురమున కరుగుచు దారిలో విద్యార్థితో నిట్లు సంభాషించెను.

ఫణిదత్తుడు—అబ్బాయీ! మీ యింటనుండు కళాంకవతి నెప్పుడైనం జూచితివా?

విద్యార్థి—కళాంకవతి యన నెపుడు తీసుకొనివచ్చిన చిన్నదియా.

ఫణి—అవును ఆమెయే. ఆమె పేరు నీ వినలేదా?

విద్యా—వినలేదు. పలుమారు చూచితిని

పణి–ఎట్లున్నది ?

విద్యా–ఆమె మేలిముసుగువైచుకొని యొక గదిలో గూర్చుండునది. ఎట్లున్న దియు నాకు దెలియదు.

పణి–పోనిమ్ము. ఆ కొమ్మ సంతతము ఏమిచేయుచుండునది ?

విద్యా–మాగురుపత్ని కిడగూర్చుండి యామెతో మాట్లాడుచుండునది.

పణి–ఆమెను మధురాపురము పంపునపుడు వెంట నెవరుపోయిరి

విద్యా–మఱియొక విద్యార్థులు పెద్దవాండ్రు నలుగురు.

పణి–నీవు మధురాపురము కెన్నడైనబోయితివా? సుబంధు నెరుగుదువా ?

విద్యా–ఎరుగుదును. మా యుపాధ్యాయునితో నొకప్పుడు పోయితిని.

అని ఫణిదత్తుడు శశాంకవతిని గురించి యడుగుచు నా విద్యార్థితో గొన్ని ప్రయాణములు గావించెను. ఒక మహారణ్యములో బోవుచుండ నలుగురు తస్కరు లెదురుపడి నిలు నిలుడు మూట నందుబెట్టుడని యదలించుటయు ఫణిదత్తుడు తనచేత నున్నదండముతో వారిలో నొకనిం గొట్టి వివశుం గావించెను. వాని పాటుచూచి తక్కిన వారు ముగ్గురు రివ్వున నెగసి వారిపై నురికిరి. అతం డొక్కండయ్యును మల్ల యుద్ధ నైపుణ్యంబున దండము ద్రిప్పుచు వారి ముగ్గురం గూడనంగంబులచిదియ గొట్టి నేలం బడవైచెను. ఆ సందడిలో నతని వెంటవచ్చిన విద్యార్థి దొంగలకు జడిసి యందు నిలువక మరలి గురువు గారూరికి పరుగెత్తుకొని పోయెను.

ఫణిదత్తుడు దొంగలనట్లు పరాభవించి విద్యార్థిజాడ గానక నలుమూలలు వెదకి, పెద్ద యెలుంగున పిలిచియు ప్రతివచనంబు వినయక యతండు ముందరిగెనని నిశ్చయించి కతిపయప్రయాణంబుల మధురాపురంబున కరిగెను.

అని యెఱింగించునప్పటికి కాలాతీతమైనది.

266 వ మజిలి

## సుబాహు ప్రముఖుల కథ

నాడు రౌతులవలన దెబ్బలుతిని సొగిలియున్న ఫణిదత్తుని మిత్రులు ముగ్గురు కొన్నిదినము లమ్మహారణ్యములోనే విశ్రమించి యక్షత గాత్రులైన పిమ్మట బయలు దేరి అయ్యగవి నడుమ ఫణిదత్తునిజాడ నరయుచు గొన్ని ప్రయాణములు సాగించిరి. ఒకనాడు ఫణిదత్తుని బట్టికొనిన శబరపతి వీరికెదురుపడి మీ రెవ్వ రెందు బోవు చున్నారని యడిగిన సుబాహుండు మేము బ్రాహ్మణులము. దూరదేశస్థులము. మా మిత్రుడొకడు భార్యతో నీ యరణ్యమార్గమున వచ్చియున్నాడు. నీ కెందైన గనంబడ లేదుగదా ? నావుడు వాడు నవ్వుచు ఓహో ! ఆయన మీ మిత్రుడా ! కనంబడకేమి ! భార్యతో మా యింటియొద్ద మీ రాక వేచియున్నాడు. మీరిప్పుడు మా యింటికి

బడుదు. వారింజూపగలవని యొక పరిచారకునితో వారిం దీసికొని పొమ్మని చెప్పెను.

ఆ మాట సత్యమని నమ్మి వారు మువ్వురు వా శబరకింకరుని వెంట వాని యింటికిం బోవుచు దారిలో నోయీ! మా మిత్రుడు పణిదత్తు నీ వందు జూచితివా? అతనివెంట భార్యయున్నదియా? ఇందు వచ్చి యెన్నిదినములైనది? ఇక్కడికా పట్టణ మెంతదూరములో నున్నది? ఆ దంపతులు వెంటనే మా కడ గనంబడుదురా? అని యత్యంతాసక్తితో నడిగినవాడు నవ్వుచు నిట్లనియె. అయ్యా! మీరు పణిదత్తుని మిత్రులా? యేమి? మీ పుణ్యము మంచిదే లేకున్న మీ వెంటనున్న బంధక మరియొకనిం బంపును. అతండు లోలెమీరుకూడా ప్రాణాంతకమైన యాపదలంబొంది తీరుదురు. మీ మిత్రుడు నాకును మిత్రుడే. మీ చరిత్రమంతయు నా కతం డెరింగించెను. శశాంకవతిని చెరపట్టిన గజ్జపు రౌతును హతముగావించి ఆ దంపతులీ యడవిలో బ్రవేశించిరి. పణిదత్తుడక్కిరాతపతి మాయా వాగురలంజిక్కి పట్టువడెను. దైవకృపగా నతనికూతురివలన విముక్తి నొందెను. అని తరువాత జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పి మీరా పల్లికి రావలదు. ఇక్కడనుండియే సునాభాగ్రహారమున కరుగుడు. అందు విశ్వదత్తుగారింజూచి తరువాత వృత్తాంతము దెలిసికొనుడు ఈ దారిం బొండని చెప్పిన సుబాహుండు వానిం గౌగలించుకొని యోరీ! నీవు కులంబునకు గిరాతుండవుగాని సుగుణపుంజములం మహర్షులు నీకు సాటిరారు. ఇదివరకు మేము నలువురమే మిత్రులము. ఇప్పుడు నీ వయిదవ వాడవై మా కెనలేని యుపకారము గావింతివి. నీ మేలెన్నటికి మరువరాము కామని స్తుతియింపుచు వానివలన ననిపించుకొని వాడు తిన్నగా సునాభాగ్రహారమున కరిగిరి.

అందు విశ్వనాధ దత్తుగారింజూచి నమస్కరింపు దనవృత్తాంతము చెప్పి పణిదత్తుని వార్త యేమైనం దెలిసినదా యని యడిగెను. ఆయన విద్యార్థివలన తాను విన్న మాటలం జెప్పుచు తరువాత మాకేమియుం దెలియలేదని యెఱింగించెను. వారాయన యనుమతి వడసి వెంటనే బయలుదేరి పదిదినంబులకు మధురాపురంబు చేరి యందు సుబంధుండను రాజ పురోహితుని యిల్లెక్కడవని యడుగుచు వారింటికిం బోయిరి. అయ్యాహితాగ్ని వారిని సత్కరించుచు శిష్టపరోవిష్టులై యున్నంత మీ రెవరు? యిందేమిటికి విచ్చేసితిరి? మీ వృత్తాంతము చెప్పి నా కానందము గలుగజేయుడు అని వినమ్రుడై యడిగిన సుబాహుండిట్లనియె.

మా కాపుర ముజ్జయినీపురము. విశ్వదత్తుగారు మీ యింటికి పంపిన శశాంకవతీభర్త పణిదత్తుడు మాకు మిత్రుడు. మేమతనితో నొక యడవిలో విడిపోయితిమి. మా మిత్రుడు విశ్వదత్తువలన తనభార్య మీ యింట నున్నదని విని యిందున వచ్చెనట. అతండు భార్యతో గలిసికొనియెనా? ఆ దంపతులు మీ యింటనున్నవారా?

యంటనియుం బోయినా? యని యడిగిన నతం డొక్కింతతడవు ధ్యానించి కన్నీరు గార్చుచు నిట్లనియె.

అయ్యా! నేను నామమాత్రముననే సంబంధుడను గాని ఆ క్రియ నా యంటేమియు వినియోగపడలేదు. కాంతాకనము లొంటిగా గనంబడినప్పు డెట్టి యాపత్సమయమునకైన సంగ్రహింపవలయునని యాస జనింపక మానదు వినుండు. ఇంత వరకు మీ మిత్రుడు మా యింటికి రాలేదు. వానిజాడ నా కేమియుం దెలియదు. విశ్వపతి కడునుత్తముడు. వాకు బంధువుడు. నేను ఒద్దశ్రోత్రి యుండగదా యని యా సుద్ధియ నా యొద్ద కనిపెను. అనాటిని పుత్రికాసర్వశేషముగా జూచి కాపాడుచుంటిని. నీ భర్తను వెదకి తెప్పించెదనని యోదార్చితిని. ఆమె సుగుణంబులు వర్ణనాతీతంబులు, నా భార్యయు దానిం గన్న కూతురువలె నాదరించు చుండినది.

ఇట్లుండ మొన్నటివసంతఋతువులో నప్తోర్యామమను యాగమే సేయ వలె పెట్టితిని. అందులకు సరిపడిన ధనమంతయు మారాజు సుయజ్ఞు డిచ్చుట కొడం బడెను. ఆ భూపతి దగ్గఱయుండి సవన సంకల్పముగావింప జేసెను. అన్నము సుప్రయోగముగా జరుచుండ నతండు నిత్యమువచ్చి ప్రవర్గ్యము లోనగు హోమవిశేషము లన్నియుం జూచుచు దవర్థాన భోధనము చేసికొనుచు నైదు దినములు నందేవసించెను. శశాంకవతియు నాయా కళాకాలయందు సర్వదా సోమిదేవియొద్ద గూర్చుండునది. అలంకారములు లేకున్నను సహజ సౌందర్యము వెల్లడికాకుండునా? ఆ వాల్గంటి యా దినములలో నెప్పుడో రాజుకంట బడినది. తదీయ రూపాతిశయ మాతనిహృదయ మాకర్షించినది. బ్రాహ్మణకులంబున నిట్టి చక్కని యువతి యుండుట యరుదు. ఈ చిన్నది యెవతెయని యెవరినో యడిగెనట. విదేశమునుండి కొన్నిదినముల క్రిందట మీయింటికి వచ్చినదని చెప్పిన నతండు విస్మితుండై యజ్ఞమైన తరువాత నన్ను గొన్నిదినముల కడకు దనయింటికి రప్పించుకొని యిట్లనియె.

గురువరా! మీ యింట నొక తరుణీరత్నముంట గంటి. ఆ వాల్గంటి యెవ్వతెయ? మీ యింటికెప్పుడు వచ్చినది? కులమెయ్యది? భర్త యెవ్వడు? అని నన్నడిగెను. మొదట నా కుమార్తెయని బొంకితిని గాని నాకు సంతతిలేదని నెరింగినవాఁ డగుట నమ్మాట నమ్మలేదు. చివర కతనికి యదార్థము చెప్పక తప్పినదిగాదు. అది రాచబిడ్డ యని యెరింగినపిమ్మట నా కొమ్మనుగురించి తానుబడిన వలవంత యంతయు నేకాంతముగా నాకుం జెప్పి యప్పడుచుం దెచ్చి నా కప్పగింపక తప్పదని బలవంత పెట్టెను.

రాజా! నీ విదివఱకిట్టి యన్యాయకృత్యంబులఁ జేసియెఱుంగవు. ఆ యువతి ధర్మమతి. పతివ్రత. నియతవ్రత. అట్టిదాని నీతో నెట్లు సంఘటింతువని జెప్పుదు? నాలుగు దినములు తలదాచి కొనుటకు మిత్రునిచేఁ బంపఁబడిన సుశీలను వ్రతభంగము చేసికొను

మనియెట్లు నియమింతును! అని యెన్నియో నీతివచనములు శ్లోకములు కథలు చెప్పి తినిగాని యానృపతి మరి తిరిగినదికాదు. అప్పుడు నేను కర్తవ్య మేమియో తెలియక యాలోచించి యాలోచించి యిట్లంటి.

రాజా! నానోఁటితో నామె నీ పనికి నియోగింపజాలను. నా భార్యతోఁ బేరంటము నెపంబున మీయింట కనిపెద. తరువాతి కృత్యము నీవె నెరవేర్చికొనుము. అని చెప్పిన నతం డొడంబడి వెంటనే నన్నింటి కనిపెను. ద్రవ్యాశ యెట్టి నీచకృత్యములఁ జేయించునో చూచితిరా! జీవి కాభంగమునకు వెఱచి యిట్టిపనికి నుద్యోగించితి. నాకర్మతత్వము కాల్పనా? అని నిందించుకొనుచు మఱియు నిట్లనియె.

మరునాఁ డుదయమునకే సిద్ధాంతమునుండి పేరంటమునకుఁ బిలుపు వచ్చినది. నా భార్యం జీరి నేఁడు శశాంకవతిం గూడ నగరికిఁ దీసికొనిపొమ్ము. ఇందు విద్యార్థులు మసలుచుందురు. అది యొంటరిగా నిందుండఁగూడదు. అని నియమించితిని. నా భార్య యరుగనప్పుడు అమ్మా! మృగాంకవతీ! నేను నగరికిఁ బేరంటమునకై పోవుచుంటి నొంటిగా నిందుండవలదని మీ యయ్యగారు చెప్పిరి. నాతోవత్తువా? అనవుఁడు తల్లీ! నీ వెట్లు చెప్పిన నట్లుచేయుదానను రాజభార్యలలో నా వృత్తాంతము చెప్పవలదుసుమీ! అని పలుచు బండియెక్కి నా భార్యతోఁ గూడ నంతఃపురమున కరిగినది.

సుయజ్ఞుని తాంబూల కరండవాహిని నీలవేణి మంచిజాణ. ఆ పరిచారిక వీరి నంతఃపురమునకుఁ దీసికొనిపోయి నూత్నాంబరాభరణాదులనిచ్చి సత్కరించినదఁట. కాని శశాంకవతి వాని నేమియు నందుకొనలేదు. అంతఃపురములో వింతలం జూపునెపంబున నీలవేణి జాణతనంబున శశాంకవతిని లోపలి గదిలోనుండి వేరొకగదిలోనికి మెల్లగాఁ దీసికొని పోయినదఁట. పెద్దతడ నప్పుడఁత్రీ నా భార్యచెంగు బట్టుకొని నడచుచునే యున్నది. ఎట్లో మి తభేదముచేసి యాసకియను లోబలఁజెట్టి నా భార్యతో విడదీసినది. నా భార్య మొరపెట్టుచుండ నామె నానకజం పెద ఘోషమ్మని గెంటించినది. అది యింటికివచ్చి నాతోఁజెప్పి పరితపించుటయు నేను సుయజ్ఞుని యుద్యమ మెరింగించి దాని నూరడించితిని. అది నోరుమొత్తుకొనుచు నే మేమియో చెప్పఁబోయిన వారించి పతివ్రతలఁ జెఱపదలంచిన వాఁడు కానే భ్రష్టుఁడగును. నీవు నిందింపవలదని సమాధానము చెప్పితిని. తరువాత నేమి జరిగినదియో నాకుఁ దెలియదు.

నాఁటినుండియు నేను గోటలోనికరుగుట మాని వేసితిని. విశ్వాసఘాతుకుండ నై తినని దుఃఖించుచు నాపాతకము వాయ కుటుంబముతోఁ గాశికేగ వలయునని తలంచుచుంటినని కన్నీరుగార్చుచు నతండా శశాంకవతి వృత్తాంతమంతయు వారి కెరింగించెను.

ఆహా! సంసారప్రవాహము పురుష నాపత్రమగ్నుంజేసి, త్రిప్పుచుండును

ఫణిదత్తుఁడు శశాంకవతితోఁ బడిన సుఖము తక్కువ. దుఃఖ మెక్కువగా నున్నది. దివ్యశక్తి సంపన్నుండయ్యు నిట్టిడుమలు గుడుచుటఁజూడ లోకమున నెంతవారికి నాపదలు తప్పవని తెల్లమగుచున్నది. అతం డీయూరువచ్చి సుబంధు నేమిటికి జూడకుండెడిని? దారిలోఁ దస్కరులచే హతుం డయ్యెనా? అట్టిబలశాలి యొరులకు లొంగునా? ఏదియో మిత్రభేదము జరిగినది. వానిగురించి యీనగరమున వసించి పరిశీలింతముగాక. శశాంకవతివార్తయుఁ దెలిసికొనఁ దగియున్నది. అని యాలోచించుచు సుబంధుని సెలవుగైకొని యా రాజధాని వీధులందిరుగుచుఁ గొన్నిదినములు వసించిరి. అని యెఱింగించునప్పటికి వేళ మిగిలినది. తరువాతికథ పైమజిలీయం దిట్లు చెప్పం దొడంగె.

## 267 వ మజిలి

## ఫణిదత్తుని బంధవిముక్తి

సుబాహుప్రముఖులు నలువురు మథురాపురము రాజవీథులలోఁ దిరుగుచుండ నొకనాఁడు సాయంకాలమున ఫణిదత్తుని కాళులకు సంకిళులు దగిలించి బద్ధునిఁగా రాజభటు లూరిబయలునకుఁ దీసికొని పోవుచుండిరి. సుబాహుం డతని గురుతుపట్టి విహ్వలుండై అయ్యో ! ఇతని ప్రారబ్ధ మింకను విడవకున్నదే ! అక్కటా ! వీఁడేమి యపరాధము చేసెనని వీని బంధించిరి ? ఆహా ! కాలమహిమ. కలిసి యడుగుదమన్న మనలఁగూడఁ బట్టుకొందురేమో ? అని వెఱచుచు వెనువెంట దూర దూరముగా బోవుచుండిరి.

ఫణిదత్తుఁడు వారింజూచియుఁ బల్కరింపక రాజభటులకుఁ దెలియకుండ నేదియో సంజ్ఞ గావించెను. ఆ సంజ్ఞ సుబాహుఁడు గ్రహించి మిత్రులకుఁ దెలియఁజేయుచు నా సన్నవర్తులంజూచి అయ్యా ! ఆబద్ధ పురుషుఁ డేమి యపరాధము చేసెను. వాని రూపుచూడ గొప్పవాఁడువలెఁ గనంబడుచున్నాఁడు. అని యడిగిన వారిట్లనిరి.

ఆ వయసుకాఁడు గజదొంగయఁట. ఒక గృహస్థునింటఁ గన్నము వైచి రత్నాభరణములెన్నియో దొంగిలించెనఁట. ఒక హారము మాత్రము వానికడ దొరికినదఁట. తక్కిన వస్తువుల జాడయు మిగిలిన దొంగల పేరులు చెప్పుమని రాజభటు లెంత నిర్బంధించి యడిగినను జెప్పఁడఁట. నా కేమియుం దెలియదని యొకటే మాటమీఁద నున్నాఁడఁట. వీనిజట్టు యెక్కడనో దాగియున్నదఁట. వారింగూడ బట్టుకొనుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఇంకను దొరకలేదఁట. [illegible] చోరులు పగలు గౌరవవేషములువైచి రాత్రి దొంగిలించుచుందురు. అని ఆ కథ చెప్పుచుండ విని సుబాహుండు ఔరా ! కాలమా ! యెంతచెడ్డదానవైతివి. [illegible] గొప్పగాఁజూచిన మహానుభావుఁడు కన్నమువైచి యొరులసొమ్ము దొంగిలించునా ? కానిమ్ము. నిజము బయల్పడకపోదు. ముందు వీని విడిపించుట కర్జము. అని

యాలోచించి బంధనాగారమును గురుతుచూచుకొని యూరిబయటనుండి కన్నము త్రవ్వుట ప్రారంభించిరి.

అందు వజ్రకాయుండు సూకరముఖుండై మూషకాకారము వహించి మన్ను దొలుచుచుండ దక్కిన మిత్రు లిర్వురు కరలాఘవంబున దానినెత్తి దూరముగా బోయుచుండిరి. వా రిరువది దినముల కా వివరము పూర్తి చేసిరి. రాత్రి వేళ గుట్టిమ శిథిలం దప్పించుటయు మేల్కాని యన్వేషయంబుల గనుపెట్టుచున్న ఫణిదత్తు డద్దిగ్రహించి యారాలదప్పించి యందున్న బద్ధులకుం దెలియకుండ మెల్లన నాబిలములో దిగి మిత్రులతో గలిసికొని యావల బడెను. మిత్రులతని గౌగలించుకొని వయస్యా ! నీ విట్లు బద్ధుడ వైతివేమి. దారిలో జోరులతో బోట్లాడుచుంటివన్నంతవఱకు నీ వృత్తాంతము వింటిమి. తరువాత నేమి జరిగినది చెప్పుమని యడిగిన నతం డిట్లనియె.

సోదరులారా ! నేను బద్ధుండగుట నిది రెండవసారి. గ్రహచార దోష మేదియోకాని యాపదలమీద నాపదలు వచ్చుచున్నవి. శంఖము పరహస్తగతంబై నది మొద లిట్లేయున్నది. నేను తెరవులో దస్కరుల బరిభవించిన కొన్ని దినముల కీయూరు సేరితిని. అప్పటికి మిక్కిలి యెండగానున్నది. ఆ తపతప్తుండ నగుట నెందేని స్నానముచేసి సుబంధు నింటికిం బోవలయునని తలంచితిని. ఈ నగరమున కల్లంతదవ్వులో నిర్మల జలపూరితంబగు దిగుడుబావి యొకటి నా కాహ్లాదము గలుగజేసినది. అందుదిగి యాప్యాయనముగా స్నానము చేసితిని. దేహము చల్లబడుదనుక మునుగుచుం దేలుచుం దీర్థములాడుచుండ నా యుత్తరీయ మందుజారి పోయినది. అప్పుడు నేను దరిబడుచు నా వాపీజలంబుల మునింగి నేలం దడిమి నంత నొక సన్నని జల్తారు చలువ వలువ నా చేతికిదగులుకొన్నది. దాని బైకిదీసి పిండి యొడలు దుడుచుకొంటి. నా బుద్ధియంతయు శశాంకవతి నెప్పుడు చూతునని యానాతిపై బరుగులిడుచుండుటంజేసి యా యుత్తరీయము నాదియో యితరులదియో పరికింపనైతి. దాని చెంగునంగల మూటయుం దెలిసికొనలేక పోయితిని.

ఆ యెండలో దానిపయిం గప్పుకొని పట్టణములో బ్రవేశించి రాజమార్గమున నడుచుచుంటి. ఒకరిద్దరిని సుబంధుగారి మందిర మెందున్నదని యడిగితిని. ఉత్తరముగా బొమ్మసి చెప్పిరి. నేను తదేకదృష్టితో బోవుచుండ నొక యింటికడ గొందరు గృహస్థులు గూర్చుండి యెందులకో వితర్కింపుచుండిరి. వారిలో నొకడు నేను గప్పికొనిన యుత్తరీయము జరీపట్టంచుగనిపెట్టి తటాలునలేచి నా కడ్డమైనిలిచి నా పైవలువ లాగుచు నీ యుత్తరీయము నాది. మొన్న మా యింట గన్నమువేసి యెత్తికొనిపోయిన వస్తువులలో నిది యొకటి. దీని చెఱంగున చిన్న హారపు మూటగట్టి నాటిరాత్రి దలక్రింద బెట్టుకొని పరుంటి. ఇది నీ కెట్టువచ్చినది. నీవే దొంగవు. అని దానిలాగి చూడ జెంగున మూటయుం గనంబడినది. దాని విప్పి

హారము పైకిదీసి "దొంగదొరకె రండు రండ"ని కేక పెట్టుటలో నలువులు ప్రోగు పగి నన్నుఁ బట్టుకొనిరి. అయ్యా నే దొంగను కాను ఊరిబయటనున్న దిగుడు బావిలో నాకు దొరికినదని యెంత చెప్పినను వారు వినిపించుకొనక నన్నప్పుడే తీసి కొనిపోయి రాజభటుల వశము చేసిరి. నా యుత్తరీయము ముతుకది. అది నన్నని పరిపెపుటుత్తరీయము. బెంగన బరువగు హారము కట్టఁబడి యున్నది. అట్టి దానిం గనిపెట్టలేకపోవుట గ్రహచార దోషముగాక మఱియేమి? రాజభటులు మిగిలిన వస్తువులఁ దెమ్మనియుఁ గడమ దొంగల పేరులు సెప్పుమనియు నన్ను నిత్యము నిర్బంధించుచుండ నా కేమియు దెలియదనుమాటతప్ప వేరొకమాట యెట్లుచెప్పదును. అట్టి యిక్కట్టులం బడుచు మీ రాక కెదురు చూచుచుంటినని తన వృత్తాంతమంతయు నెరింగించి మీ రెప్పుడీయూరు వచ్చితిరి? సుబంధునింటికిం బోయితిరా? శశాంకవతి యందున్నదియా? యని యడిగిన సుబాహుం డిట్లనియె.

వయస్యా! చెడ్డదినములలో మంచి యెట్లుకలుగు? శశాంకవతి నీ పట్టపుచాఱు వరించి తీసికొనిపోయెననఁట అమె వార్త తరువాత మా కేమియుం దెలియ లేదు. అని తమ వృత్తాంతముతో సుబంధుం డెరింగించిన విశేషములన్నియు నెరిం గించుటయుఁ బక్కున నవ్వుచు ఫణిదత్తుఁ డిట్లనియె. ఓహో నేను గడుపునం బడినది మొదలన్నియు దగవులే అన్నియు నిక్కట్టులే దేవకాంతలఁ దృణముగా జూచిన నే నీ శశాంకవతి గుఱించి యిన్ని పాటులు బడయనేల యని యందు రేమో ఆశ్రిత పరిత్యాగంబు మహా పాతకమని తిరుగుచుంటి. పాప మా చిన్నది నా నిమిత్త మింద్రభోగముల విడిచి యడవుల పాలై పెక్కిడుములం గుడుచుచున్నది. బల వంతమునఁ బట్టునుగాని యా భూకాంతునికి వశముకాదు. మన మిప్పు డాపె వృత్తాంతము దెలిసికొనవలసియున్నది. నే నిందుఁ దెల్లముగా మసలరాదు. రేపు చెఱసాలలో నన్నుఁ గానక బిలము వరికించి నన్నుఁ బట్టుకొనుటకు బెద్ద ప్రయత్నము సేయుదురు. కావున నే నిందుండను. ఇప్పుడే బయలుదేరి పాటలీపుత్ర నగరమున కరిగెద. ఇందు మీరుండి శశాంకవతి వృత్తాంతము సాంతముగాఁ దెలిసికొని యందు రండు. అంతదనుక నే నందుండి దుర్మవర్మచర్యలు బరీక్షించుచుండెదంగాక అని చెప్పి వారి నొప్పించి యప్పుడే యతండు పాటలీపుత్ర నగరమున కరిగెను.

అని యెరింగించునప్పటికి గాలాతీతమైనది. తదనంతరోదంత మన్పలి మఱలీయం దిట్లు చెప్పం దొడంగెను,

## 268 వ మజిలీ

# కుమారవతి కథ

మరునాఁడు చెఱసాలలో నున్న గజదొంగ సొరంగము ద్రవ్వికొని పారిపోయెనను వార్త యూరంతయు వ్యాపించినది. జనులు గుంపులు గుంపులుగాఁ బోయి బిలమును జూచి యా చోరుని సామర్థ్యము నూరక పొగడుచుండిరి రాజప్రధానులు సామంతులు దండనాథులు వచ్చి చూచి యా బిలము నాద్యంతములు పరీకించి ఓహో! యిట్టి నేల సొరంగము త్రవ్వుదురనుమాట వినుటయే గాని యెప్పుడు చూచి యెరుంగము. అయ్యో! ఇట్టి చోరుని గన్నులారాఁ జూడకపోతిమే యని రాజప్రధానులు పశ్చాత్తాపపడుచుండిరి. వానిం బట్టి యిచ్చిన వానికి వేయి దీనారములు కానుక లిత్తుమని సాటింపించిరి పది దినముల దనుక స్త్రీలును బురుషులును వాహనము లెక్కియు బండ్లెక్కియుఁ బోయి యా సొరంగమును జూచుచుండిరి. అది యొక తీర్థముగాఁ గొన్ని నాళ్ళు జరిగినది.

సుబాహు ప్రముఖులు మువ్వురును యెరుఁగని వారుం బలె నా బిలము కడకుఁబోయి ప్రతి దినము జనులాడుకొనుమాటలు వినుచుండిరి. ఒకనాఁడు శశాంకవతి సఖురాలు కుమారవతి బండియెక్కి యా వివరమును జూచి వచ్చుచు దారిలో గవాక్షముల సందు నుండి సుబాహు ప్రముఖుల మువ్వురం జూచి గురుతుపట్టి బండి నిలిపి సుబాహుం జీరియిట్లనియె. అయ్యా! మీ దేయూరు? మీ పేరేమి? అని యడిగిన మే మొక బాటసారులమని తన పేరు సెప్పక కపటముగా బ్రత్యుత్తర మిచ్చెను. అప్పు డప్పరిచారిక మరియు సవిమర్శముగాఁ బరికించి మీరు ఫణిదత్తుని మిత్రులు కారా? అని యడిగిన సుబాహుఁడు తెల తెలఁబోవుచు మిత్రులమే. మమ్మెట్లెఱిఁగితివి. అనవుఁడది నేను శశాంకవతి సఖురాలను కుమారవతిని. నన్ను మరచితివా యని చెప్పినది. వారామాట విని విస్మయ మేపార ఓహో, కుమారవతీ! నిన్నెరుగక పోవుదుమా? నీ వెప్పు డిక్కడికి వచ్చితివి? ఇందు బరిచితు లెవ్వరు? అని యడిగిన నప్పడఁతి "నా వృత్తాంతము చాల గలదు మనము సావకాశముగా మాట్లాడవలసి యున్నది. మీరు సాయంకాలమునకు గోపురద్వారము కడకు రండు. మీ సమీపమున నే నందు వేచియుండెద" నని చెప్పి యప్పడఁతి బండి దోలించుకొని యవ్వలఁ బోయినది.

వారు దాని వృత్తాంతము వినుటకు మిక్కిలి యాతురపడుచు నది చెప్పిన వేళకు నా చోటునకుం బోయి గూర్చుండిరి. అంతలో నొక పరిచారిక వచ్చి వారిని లోపలికిఁ దీసికొనిపోయి యొక పూఁదోటలోఁ గూర్చుండ బెట్టినది. పిమ్మట కుమారవతి యొక శిశువు నెత్తుకొని ముద్దు పెట్టుకొనుచు వారికడకు వచ్చి నమస్కరించి తదాశీర్వాదముల నంది తన కథ యిట్లు చెప్పందొడంగెను.

ఆర్యులారా! విధి విచిత్ర సంఘటనలం గావింపుచుండును. వినుండు.

శశాంకవతి యరిగిన మఱునాఁడు దివ్యుఁ డెవ్వఁడో వచ్చి యామె నెత్తికొని పోయెనని యభినయించితిని. తరువాత మా రాజామె జాడ దెలిసికొని రమ్మని మంచి గుఱ్ఱమిచ్చి మీ మిత్రు నుత్తరముగాఁ బంపెను. తరువాతి వృత్తాంతమంతయు నతని వలన మీరు వినియే యుందురు. నా ప్రాణసఖి లేనిదే నా కాయూరిలోఁ దోచునా! ఒకనాఁ డెవ్వరికిం జెప్పకుండ మీరరిగిన దిక్కుఁ గని దాన నగుటఁ బురుషవేషము వైచికొని యిల్లు వెడలి యత్తర మార్గంబునం బడి పోవుచుంటిని. ఆ దారిలో నెక్కడను గ్రామము గనంబడ లేదు అక్కడక్కడ పట్టణములు మాత్రము కలిగియున్నవి. అయ్యడవిలో నున్న శబరులు వ్యాఘ్రములవలెఁ దయాదాక్షిణ్యములు లేక మనుష్యులం బట్టికొని చంపుదురు. నేను ఒకారి వేషముతో నా యరణ్యములోఁ బోవుచుండ నొకచో కొందరు పుళిందులు వచ్చి నన్నుఁ బట్టుకొని బలాత్కారముగా శబరపల్లికిం దీసికొనిపోయిరి.

అప్పుడు పెద్దయుత్సవము జరుగుచుండెను. విజయదశమి నాఁ డందలి దుర్గకు నూర్వురను పశువుల బలియిత్తురఁట. నవమినాఁటికే నన్నందుఁ దీసికొని పోయిరి. బలిపురుషుల కందఱకుఁ దలయంటు చుండిరి. నాకుఁగూడ నభ్యంగనము సేయఁ బ్రయత్నించిన నేనాఁడుదానను నన్ను ముట్టకుఁడని స్త్రీరూపము ప్రకటించితిని ఆ కాళికి నాఁడు దానిం బలియియ్యరఁట నన్నుఁ బరికించి వదలివేసిరి. నేనా పల్లెలో నుండియే వారు చేయు వింతలన్నియుఁ జూచుచుంటి. దశము నాఁడు బలి పురుషుల కాళ్ళకు త్రాళ్ళు గట్టి మొగంబులకు వేపరొట్ట జుట్టి బండ్లెక్కించి డప్పులు వాయించుచు నూరేగించిరి. బండ్ల వెంట స్త్రీ బాలవృద్ధులు బారులు గట్టి నడుచుచుఁ గ్రోశదూరములో నున్న దుర్గ గుడికిం దీసికొనిపోయి కిరాతపతి తనచేత నొక కత్తిబూని కాళీ! నమస్కరింపుచు.

క. తల్లీ! దుర్గాంబా నీ
యుల్లంబలరంగ మొక్కులుత్సవముగ నేఁ
జెల్లించుచుంటి గృపసం
ధిల్లగమముఁ బ్రోవవలయు దేశముతోడన్.

అని పలుకుచు నొక్కొక్కని తలనఱకుచుఁ దద్రుధిరం బమ్మవారి విగ్రహముపైఁ జల్లి నైవేద్యము పెట్టుచుండెను. ఆ ఘోర కృత్యము చూడలేక గోలున నేడ్చుచుఁ గన్నీరు విడుచుచుంటిని. కిరాత కాంతలు తలనఱికినపుడెల్ల జయదుర్గాయని యఱచుచుఁ జప్పటులు గొట్టుచుండువారు.

నా యేడుపు చూచి యెరుకు తెఱవలు కసరుచు హౌహొమ్మ నీ వెక్కడ దానవు యేడ్చిన దుర్గకుఁ గోపము రాదాయని నన్నందుండి గెంటివైచిరి. నేను మెల్లన బల్లెలోనికి వచ్చితిని. అప్పుడా పల్లె యంతయు జనశూన్యమై యున్నది. అందు శబర పుత్రిక యొక్కతే మాత్రమున్నది. గర్భవతు లాబలిం జూడఁగూడదఁట. ఆమె గర్భవతి యగుట యందునిలిచినది వీధి నుండి దుర్గదెస జూచుచుండ నేనామె కడకు

బోయి నిలువంబడితి. నీ వెవ్వతెనని నన్నడిగినది నా వృత్తాంతము కొంత కొంత చెప్పి శశాంకవతీ ఫణిదత్తుల వెదుకఁ బోవుచుండ నీ దుండగులు నన్నుఁ బట్టుకొని యిందుఁ దీసికొని వచ్చిరని చెప్పినది.

ఫణిదత్తుఁడా! ఫణిదత్తుఁడా! నీ సఖురాలిమగఁడు ఫణిదత్తుఁడా ఔను ఆ వార్త నేనును వింటి నా వాల్గంటిని వెదకుచు నతండు మాయింటికి వచ్చి నన్ను బెండ్లి యాడెను. అని తన కథ యంతయుం జెప్పినది. నేను విస్మయపడి యతం డిప్పు డెందున్నవాఁడో యెఱుంగుదువా? భార్యతోఁ గలసికొనియెనా యని యడిగిన నప్పు డతి యతండామెను వెదికికొనుచు మధురాపురంబున కరిగెనని యొకశబరుం డెఱిం గించెను. ఇదిగో యీ శంఖ మతనిదే. మా తండ్రి బలవంతమున లాగికొనియెను. ఈ శంఖము దీసికొనిపోయి యతనికి గురుతు చెప్పి వాని నిటకుఁ దీసికొనిరమ్ము. నీకు మంచి పారితోషిక మిప్పింతు. నీ విక నిందుండరాదు. కిరాతులువచ్చి స్త్రీ పురుషులు ద్రాగి యొడ లెఱుంగక నర్తనములు సేయుదురు. కట్టు గుడ్డల నెఱుంగక నొకరిపై నొకరుపడి కొట్టు కొందురు. నీ విటనున్న నవమానము సేయుదురు. వేగబొమ్మని పలికి యక్కలికి నాకా శంఖమిచ్చి సాగనంపినది. నేనటఁగదలి దారిలో ననేక కష్టములుపడి యెట్టకేలకీనగరము చేరితిని. ఈ నగరాధిపతి సుయోజ్ఞుఁడు మృగాంకవతి పిన తల్లి కల్లుడు. అతని భార్య ఈమెకు పిన తల్లి కూతురే. ఆ బంధుత్వమే నెఱింగినదాననగుట గోటముంగల నిలిచి రాజపత్ని కొక చీటి వ్రాసి పంపితిని. నా జాబుం జదివి కొని వెంటనే యిరువురు పరిచారికల నాకడ కనిపినది. వారు నన్నంతఃపురమునకుఁ దీసికొనిపోయిరి. నన్నామె జూచి కౌగలించుకొనుచుఁ గుమారవతీ! ఎప్పుడు వచ్చితివి. మనవా రందరు సేమముగానున్నారా! శశాంకవతి కెందైన వివాహము కుదిరినదా? అని యడిగిన నే నిట్లంటి.

అమ్మా! అందరు కుశలముగా నున్నారు. శశాంకవతి యుప్పరిగపై నుండ నొకదివ్యపురుషుఁ డెత్తికొనిపోయెను. ఆమెను వెదుకుటకై నే నిందు వచ్చితిని. అని సంక్షేపముగాఁ జెప్పినది. అయ్యో! ఆ తొయ్యలిని దివ్యపురుషుఁ డెత్తికొని పోయెనే? ఇట్టి చోద్యము లెప్పుడును వినలేదు. ఎట్లెట్టు వెండియుం జెప్పుము. అని యడుగుచుండ నంతఃపురములో నొకమూలఁ గోలాహలము వినంబడినది. అది యేమియో చూచిరమ్మని యొకదాది నంపినది. అది పోయివచ్చి అమ్మా! నీలవేణి యెవ తెనో తలుపువైచి యదలించుచున్నది. ఆ చిన్నది రోదచేయుచున్నది. నావుఁడు సరిసరి నీలవేణి రాజుగారికిఁ దాసపుడుకత్తె. ఏ తొత్తునో తీసుకొనివచ్చినది కాబోలు చూతము రాయని నన్ను వెంటఁబెట్టుకొని యా గదిలోనికిఁ బోయినది.

తలుపుతీయుము. నేను మా యమ్మతోఁ బోయెద. అడ్డము లెమ్మని యొక కలికి బలుకుచుండఁ బోవలదు. అనక నిన్నంపెద నిలునిలుమని తలుపువైచి నీలవేణి! యడ్డముగా నిలువంబడియున్నది. ఆ యల్లరిచూచి రాజపత్ని అ ఆ నీలవేణీ!

యిటురా ఆ సతి యెవ్వతె? ఛీ! రండా! నీ కెన్నిసార్లు చెప్పితిని. బుద్ధిలేదే అని కేక
పెట్టినది నీలవేణి యేమియు మాటలాడక చల్లగా నవ్వలికి జారినది. ఆ ప్రోయాలు
మేలిముసుంగుతో వ్ర రాజపత్ని పానంబులంబడి తల్లీ! నన్ను సుబంధుగా రింటికిం
బంపుము పోకుండ నీకంత యాటంక పెట్టుచున్నదని వేఁడికొనినది నేను స్వరము
గురుతుపట్టి ముసుంగు తొలఁగించి చూడ నామె శశాంకవతియే అమ్మనే జెల్ల
శశాంకవతీ! నీ విచ్చటి కెట్లు వచ్చితివి? అని పలుకుచు గ్రుచ్చి యెత్తితిని. రాజ
పత్నియు నేమీ! ఈమె శశాంకవతియా! చెల్లీ! నన్ను గురుతుపట్టలేదా? నీ
యొక్కను విద్రుమోష్ఠిని యిప్పుడె నీ మాట నీ సఖురాలి నడుగుచుంటిని. నేఁ డెంత
సుదినము. నీ వెక్కడనుండి వచ్చితివి? ఈ నీలవేణి చేతిలో నెట్లు పడితివి. నీ
రాక మా కెంతో విస్మయము గలుగఁజేయుచున్నదే! నిన్నెత్తుకొనిపోయిన దివ్యుఁ
డిందు పడిచెనా? నీ వృత్తాంతము చెప్పుమని యడిగిన శశాంకవతి యిట్లనియె.

అక్కా! యిక్కుమారవతి యిక్కడికి వచ్చుట యాశ్చర్యముగా నున్నది.
నా కథ చాలవలసఁ గొంతవిని యేయుందువు దివ్యుఁడన కేవలము దివ్యుఁడుగాడు.
దివ్యసద్పురుడు. ప్రాణదాతయైన యొకపురుషుని వరించి గర్భవతినై తండ్రికిఁ దెలియ
కుండ నీయుపిడిచి వానివెంట వచ్చితిని. దారిలోఁ బతితో విడిచిపోయితిని. ఒక
బ్రాహ్మణునిచే నీ యారు సుబంధునింటికిఁ బంపఁబడితిని. ఆతని యిల్లాలితో మీ
యింటికి పేరంటమునకు వచ్చితిని. ఈ నీలవేణి నన్నుఁ బట్టుకొని నిర్బంధించు
చున్నది. అని తనకథయంతయు శశాంకవతి విద్రుమోష్ఠికిఁ జెప్పినది. నేనుగూడ
నా వార్త శశాంకవతి కెఱింగించి శంఖ మిచ్చితిని విద్రుమోష్ఠి మా యిరువుర చరిత
ములు విని పరమానంద భరితహృదయమై మమ్మాదరింపుచుండ నింతలో శశాంక
వతికిఁ బ్రసవవేదన యావిర్భవించి మంచిలగ్నమునఁ గుమారుఁడుదయించెను. విద్రు
మోష్ఠి చిన్న కూఁతునకుంబోలె శశాంకవతికిఁ బురుడు పోసినది. ఇప్పటికి నాలు
గయిదు నెలలయినది. శశాంకవతి పతిదర్శనలాలసయై పరితపించు చున్నది.

కారాగారమునకుఁ జోరుఁడెవ్వడో నేల సొరంగము ద్రవ్వి పారిపోయెనని
యెల్లరు వింతఁగా జెప్పుకొనుచుండ నట్టిపని మీ వలనంగాని యితరులకు శక్యముకాదని
తలంచి యా బిలము చూచి రమ్మనుమని నన్నంపినది. నే నా కన్నము చూచి
మీరు త్రవ్వినదిగా నిశ్చయించి వచ్చుచుండ దారిలో మీరు గనంబడితిరి. మీ వార్త
చెప్పినంత శశాంకవతి బ్రహ్మానందము చెందుచుఁ దరువాతి వృత్తాంతము వినుటకు
వేగిరపడుచున్నది. ఇదియే మా కథ వీఁడే నీ మిత్రుని పుత్రుఁడు. చూడుమని చేతి
కందిచ్చినది. వా రా శిశువు నెత్తికొని ముద్దాడుచు వాని మొగంబున ఫణిపత్తుని
చిహ్నములుండుట కనుపించి మరియుచు నిట్లనిరి.

కుమారవతీ! మనయిష్టము లిప్పటికి గట్టెక్కినట్లు కనంబడుచున్నవి.
లేనిచో నిట్టి చిత్రసంఘటనము కానేరదు. శంకముదొరకుట శుభసూచకము. మే

మిప్పుడపోయి ఫణిదత్తున కీ వార్త జెప్పియిందుఁ దీసికొనివత్తుము సెలవిత్తువేయను టయుఁ గుమారవతి అయ్యలారా ! మీతో నొకమాట చెప్ప మఱచితిని సుయజ్ఞుఁడు శశాంకవతి వృత్తాంత మంతయు విని సంతసింపుచుఁ గుమారుఁ డుదయించిన పిమ్మట ధూర్జటికవున కీవార్త దెలియఁజేసెను. అతండు తొందరపడుచు బిల్ల వాని కైదవమాసము మిగలకుండనందు బంపుమని నా పులనిందుఁబంపియున్నవాడు. నాలుగు దినములలో శశాంకవతి పుత్రునితోఁగూడ నందలమెక్కి సురప్రస్థ నగర మున కరుగును. కావున మీరు మీ మిత్రునకీ వార్తచెప్పి సురప్రస్థనమునకే తీసు కొని రండు. ఇదిగో మీ మిత్రుని శంఖము తీసికొని పొండు. అని వారికిచ్చి వారితోఁ గొంతసేపు ముచ్చటింపుచు గాలక్షేపము చేసినది.

తరువాత నానాటి యాడింభకు నందికొని వారిచే ననిపించుకొని లోపలికిఁ బోయినది. సుబాహు ప్రముఖులును ఆ శంఖమును గైకొని సంభ్రమముతో నాఁటి పేకువజామున బయలుదేరి పాటలీపుత్ర నగరమున కరిగిరి. అని యెరింగించునప్పటికి వేళ మిగిలినది. పై కథ యవ్వలి మజిలీయం దిట్లు చెప్పం దొడంగె.

269 వ మజిలీ

# గుణవర్ధనుని కథ

ఫణిదత్తుఁడు చెరసాలనుండి తప్పించుకొని మారువేషముతో పలుహాపంటి పయనంబునఁ గొన్నిదినంబులకుఁ బాటలీపుత్ర నగరంబునకుఁ జేరెను. అందు చక్ర వర్మ రాజ్యము సేయుచుండెను. అతని ధర్మప్రవృత్తి జనులారత పొగడుచుండిరి. ఆ స్తుతి పాఠములు విని ఫణిదత్తుఁ డాశ్చర్యమందుచుఁ బరమదుర్మార్గుఁడగు చక్ర వర్మ కిట్టి స్వాత్వికబుద్ధి యెట్లు కలిగినదని తలంచుచుఁ దనపేరు ప్రకటింపక వేరొక పేరుతో దిన్నగా మల్ల శాలకరిగి పరిశీలించెను. అందుఁ దన్నెఱింగిన వారెవ్వరును లేరు. అదియు బాడుపడియున్నది. అటకదలి తల్లి మాతామహు నింటికి వచ్చెను. వృద్ధుఁడు పరలోకగతుండగుటయు నతనిభార్యమాత్ర మందున్నది. ఆమె కడకుఁ బోయి అవ్వా ! కుశలముగా నుంటివా ? మా తాత కాలధర్మము నొందెనా ? అని యడిగిన బాబూ నీ వెవ్వడవు నీ పేరేమి ? అనుటయు నేను పితృదత్ పుత్రుఁడ. ఫణి దత్తుఁ దనువాఁడ మా యమ్మ యెందుఁబోయినది ? చెప్పుమని కన్నీరుగార్చుటయు నా వృద్ధ యిట్లనియె.

బాబూ ! నీవు గంగలోఁబడి మునిఁగితివని చెప్పిరే ! యెట్లు బ్రతికివచ్చి తివి ? యెప్పుడు వచ్చితివని గౌఁగిలించుకొనియడిగిన అవ్వా ! నా కథ తరువాతఁ జెప్పెదంగాని నా తల్లి యేమయినదో నుడువుము నీ యడుగులకు మ్రొక్కెద ననవుఁడు నా ముసలమ్మ యిట్లనియె. అప్పా ! మీ తల్లి మా యిల్లాలుఁ దా !

పెద్దరాజు చచ్చినపిమ్మట నీతల్లిని తగవుపెట్టిన బ్రాహ్మణుని పెండ్లాడమని రుక్మవర్మ తీర్పు చెప్పెనట. అంతలో మీ తండ్రి నాగరాజు వచ్చి రాజపుత్రునొద్దఁ దగవుపెట్టితో పొమ్ము అని గెంటించెనఁట బాబూ! పైన నేను చెప్పుదును ? అతం డేదియో ప్రయోగము చేసెనని చెప్పుదురు. గడియలో నొక పెద్ద పాము వచ్చి రుక్మవర్మను నా బ్రాహ్మణునిం గఱచి ప్రాణములు పోగొట్టినదఁట కోటలో గగ్గోలు పడుచుండ నాగరాజు మనయింటికి వచ్చి రా రమ్మని పిలిచి నీ తల్లి నెక్కడికో తీసికొని పోయెను. అంతలో వానిం బట్టుకొందుమని రాజభటులు మా యిల్లు ముట్టడించిరి. మా కేమియుం దెలియదని తప్పించుకొంటిమి. ఇదియే నీ తల్లి వృత్తాంతమని చెప్పఁగను ఫణిదత్తుడు అవ్వా! రుక్మవర్మ చచ్చెంగదా మరల నెట్లు బ్రతికె నా వృత్తాంతము చెప్పుమనవుడు వృద్ధ యిట్లనియె.

బాబూ! అది యేదియో గొప్పగాథవలెఁ జెప్పుకొందురు. రుక్మవర్మ చచ్చిన వెంటనే మంత్రులు విషవైద్యుల నెక్కుడుగ రప్పించి చికిత్స చేయించిరి. ఏమియుం బ్రయోజనము లేకపోయినది. అప్పుడు వానిం గట్టి స్మశానమునకుఁ దీసికొని పోవుచుండ నిప్పుడు మంత్రిగా నున్న గుణవర్ధనుఁడను బ్రాహ్మణుఁడు వచ్చి యా విషము నాఁటిం బఱచి పాముగఱచినవానికి బదిదినములవరకు వెండ్రుకనంటి ప్రాణము లుండును. అంతదనుక మంత్రములు వేయుచుండవలయుఁ గాని దేహమును దహింపఁ గూడదు. ఈ నృపుని నేను బ్రతికించెద నింటికిం దీసికొని పొండని మరలించుటయు రాజబంధువులందరు ప్రహర్షమందుచు నా శవము నింటికిఁ దీసికొనిపోయి మంచముపై బరుండఁబెట్టిరఁట. వెంటనే గుణవర్ధనుఁడు మూడుమంత్రములు వేసిన తోడనే రుక్మవర్మ లేచి కూర్చుండి మాటాడెనఁట. ఆ పారునకుఁ మూడుకోట్లధనము కానుకగా నిచ్చుటయేగాక యనిం బ్రధానిగాఁ జేసికొనెను. వెనుకటి మంత్రి యంతఁ దన మీఁద వలవని యాటంకపరచినందులకు వాని నుద్యోగమునుండి తప్పించెను. ప్రస్తుతమంత్రి బోధచే విరక్తిగలిగి రుక్మవర్మ న్యాయముగా రాజ్యము సేయుచుండెను. ఇదియే నే నెరింగిన కథ యని ముసలమ్మ చెప్పినది.

ఆ వార్త విని పితృదత్తుడు మిక్కిలి యక్కజమందుచు గుణవర్ధనునిఁజూచి యా మంత్రప్రభావము దెలిసికొనుటకై యొకనాఁడు మంత్రిగారింటికరిగి యతనికి నమస్కరించెను. ఆ ప్రధాని తదీయాకారలక్షణంబులు పరీక్షించి నీ వెవ్వఁడవు ? నీ తల్లిదండ్రు లెవ్వరు? ఇక్కడి కేమిటికి వచ్చితివి ? నివాసదేశమేది? యని యడిగిన నతం డిట్లనియె, దేవా! నా జన్మభూమి ధారానగరము. నా తల్లి పేరు పితృదత్త. తండ్రి పేరు నాగరాజు. నా పేరు ఫణిదత్తుఁడు. మీరు ధర్మాత్ములని మీ ఖ్యాతివిని మిమ్ముఁ జూడవచ్చితిని. మరియు మీ రాజు రుక్మవర్మను నే నెఱుఁగుదును. నే నీ కుమారు నతనితో మల్లవిద్య నేర్చుకొంటి. అప్పు డతనిచేష్టలు కడుహేయములుగా నుండును. ఇప్పుడు మీ సహవాసంబున ధర్మాత్ముం డయ్యెనని వినుచున్నాఁడ.

అని యేమేమో చెప్పుచుండ నా సచివుండు నలుమూలలుచూచి యందెవ్వరు లేకునికి తటాలున వానిం గౌఁగిలించుకొని యిట్లనియె.

బాబూ! నీవు పితృదత్తకొడుకువా! నేఁ డెంత సుదినము. అని కన్నీరు గార్చుచు వాని శిరంబు తడిపెను. అయ్యా! తమ రెవ్వరో నే నెరుంగను. బంధువుల వలె నాదరించుచున్నారు. మీ పేరును బంధుత్వమును దెలిపి నాకు శ్రోత్రానందము గావింపుడు. అని వేడుకొనిన నతండొక యేకాంతప్రదేశమునకుఁ దీసికొనిపోయి తన వృత్తాంతమిట్లు చెప్పెను.

వత్సా! మా చరిత్ర మింతవరకు గోప్యముచేసి యెవ్వరికిం దెలియనియ్య లేదు. నీవు నాకు మేనల్లుఁడ వవుదువు నీ తల్లి పితృదత్త మాకు జెల్లెలు నా పేరు సుమతియండ్రు. మా తమ్ముఁడు ప్రమతి. మేమిద్దరము దుర్దోషంబునంజేసి గర్భవతి యగు నీతల్లిని విడిచి యొక్కనాఁడే దేశాంతర మరిగితిమి. నేను తిన్నగాఁ గాశీపురంబు చేరి కొంతకాల మందు విద్యాభ్యాసము గావించితిని. తరువాతఁ గొన్ని దినములు తీర్థయాత్రలు చేసితిని. ఒకనాఁడు కేదారములో స్వామిని సేవింపుచుండ నా యాలయములో ధారానగర వాస్తవ్యుండగు బ్రాహ్మణుం డొకండు నాకుఁ గనంబడెను. వాని యుదంతము తెలిసికొని మీ రగ్నిశిఖు నెరుంగుదురా? వారికి సంతాన ముండవలె. ఇపు డెట్లున్నారని యడిగితిని. అతండు మేమువచ్చిన తరువాఁత జరిగిన కథ యంతయు బూసగ్రుచ్చినట్లు తెలియజేసెను.

అపుడు నేను గాళిదాసకవిం గొనియాడుచుఁ దమ్మునిపై నింద మోపినందులకు చెంపలు గొట్టికొనుచు బశ్చాత్తాపసంతప్తుండనై నాపేరు సెప్పక యతనికిఁ దత్కాలోచితములగు మాటలచే సంతృప్తి కలుగ జేసితిని. తరువాతఁ గొంతకాలము త్తర దేశారణ్యము లన్నియు దిరిగితిరిగి యొకనాఁడు హరిద్వారములో బ్రహ్మకుండమునస్నానము చేయుచుండ నా తమ్ముఁడు ప్రమతి నాకుఁ గనంబడియెను. గడ్డము పెంచుకొనుటచే వాని గురుతు పట్టలేక పోయితిని. నన్నును వాఁడుతెలిసికొనలేదు. మేమిరువుర మొకచోటఁ గూర్చుండి పితృతర్పణములు సేయుచు నందుచ్చరింపబడిన పేరులు విని మీ దేయూరు మీ రెవ్వరని యొండొరుల మడిగికొంటిమి. అప్పుడతండు నా తమ్ముఁడగుట దెలిసికొని నతనిం గౌఁగిలించుకొంటి నీ వింటికడనుండలేదా? యిక్కడి కెప్పుడు వచ్చితివని తమ్ముఁడు నన్నడుగ నా వృత్తాంతము ధారానగర వాస్తవ్యుడగు బ్రాహ్మణుఁడు చెప్పిన వృత్తాంతమును చెప్పితిని.

ఆ కథవిని వాఁడు విస్మయపడుచు బితృదత్త విడిచివచ్చినందులకు బశ్చాత్తాపపడుచు నే నడుగఁ దన వృత్తాంత మిట్లు చెప్పెను. అన్నా! నేను నీవలెనే యనుమానపడి యిల్లువిడచి యాత్రలు సేవింపుచు గొన్నిదినంబులచే హరిద్వారము చేరితిని. అప్పుడే తీర్థంబున కుంభ మేళనపర్వము జరుగుచుండెను. ఆ పుణ్యకాలమునకు మహారణ్యములోఁ దపము చేసికొనుచున్న మహాత్ములు సన్యాసులు బైరాగులు అవధూ

తలుగోసగు విరక్తులెల్ల వచ్చి యీ బ్రహ్మకుండంబున మునింసి పోవుచుండిరి. వారిలో నొక యవధూత మహాత్ముడని నాకు దోచినంత నతండు గంగోత్తర కవ్వలనున్న మహారణ్యములలోఁ దపము చేసి కొనుటకై పోవుచుండ శుశ్రూషసేయుచు నే నతని వెంటఁబడితిని.

నిష్కాపట్యముతో జేయుచున్న నా యుపచారముల కాతండు మెచ్చి కొసుచఁ గొంతకాలమున కొకనాఁడు నీ కామితమేమని నన్నడిగెను. నేనేమియుంగోరక వైపల్యమార్గదర్శకమగు పరతత్వముపదేశింపుమని కోరితిని. అతండు నవ్వుచు నీ కింకను లోకవాసనలు వదలలేదు. కొంతకాల మరిగినంగాని విరక్తిగలుగదు. అని పలుకుచు లోకరంజనకరములైన విద్యలలో మిదటిదగు పరకాయ విద్య నా కుపదేశించెను. అప్పుడు నే నతనికి మ్రొక్కుచు మహాత్మా! యిందులకు మీకు గురుదక్షిణ యేమి యర్పింపవలయునో చెప్పుడు తీసికొనివత్తుననవుఁడు నాకు సొమ్మేల సమలోష్టకాంచనులమని యెఱుఁగవా? అని కసరిన నే నిట్లంటి. మహాత్మా! గురునకు ఋణముపడిన వాఁడు మహా పాతకుఁడని చెప్పుదురు తృణమైన నిచ్చి ఋణము తీర్చుకొన వలయును. ఏదియో కోరుఁడని నిర్బంధించితినని ఆయనకు నాపై గోపమువచ్చి యట్లయిన మూడు కోట్ల ధనము తెమ్మని యాజ్ఞాపించిరి. చిత్తమని యొప్పుకొని యీవలకు వచ్చితిని. ధనార్జనోపాయ మరయుచు నరణ్యములు తిరిగిన నేమి ప్రయోజనము? పట్టణసంచారము సేయదలంచి యడవులవిడిచి మొన్న నీ యూరువచ్చితిని. ఇందు నీవు గనంబడితివి. ఇదియే నాచరిత్రము అని నా తమ్ముడు తన కథయంతయుం జెప్పెను. ఇరువురము ప్రహర్షసాగరంబున మునుంగుచుఁగొన్ని దినము లందుండి గురుదక్షిణ సంపాదించు తలంపుతో నటగదలి గ్రామములమీఁద సంచారము గావించితిమి. మూడుకోట్లధనము సామాన్యమా! ఎవ్వరి నడిగిన నెవ్వరిత్తురు. కొఱవిచే దలగోకికొనినట్లు గురునడిగి యీ యాపదదెచ్చుకొంటి. అని విచారింపుచుఁ గొంతకాలము దేశాటనము గావించితిమి. ధనమించుకయు బ్రోగుపడినదికాదు. యాచకులంజూచి లోకులు పిశాచములకు వెరచినట్లు తొలఁగుచుందురు సీ! యాచనావృత్తికంటె లాఘవము మరియొకటి లేదు.

దైవికముగా మార్గవశంబున మే మొకనాఁ డీయూరు చేరితిమి. ఈ దేశాధిపతిని యాచించు తలంపుతో వాని వృత్తాంతమడుగ బౌరలు నవ్వుచు నతండు పాము గరచి నాలుగు దినముల క్రిందట పరలోకమున కేగెను. నేఁడే స్మశానవాటికకుఁ దీసికొనిపోవుచున్నారు. శ్రాద్ధదివ సంబుదనక నిలుతురేని యప్పుడు సంభావనలిత్తురు అని పౌరులు పరిహాస మాడిరి. ఆ వార్తవిని నాతమ్ముఁ డేకాంతముగా నా కిట్లనియె.

అన్నా! ధనము సంపాదింప నాకిపుడొక తెరవు గనంబడుచున్నది. వినుమేను నామేనొకచోదాచి రాజదేహములోఁ బ్రవేశించెద. నీవు పాముమంత్రముమంత్రించి బ్రతికించెదనని చెప్పుము. నే నా దేహములోఁ బ్రవేశించి రాజునై నీకు గానకగా మూడుకోట్ల ధనము సమర్పింతు. తరువాత నా దేహము విడిచి నా దేహములో బ్రవేశించి

గురుదక్షిణ సమర్పింతముగాక. ఇది యుచితముగా నున్నదియాయని యడిగిన నే నా యుపాయమునకు సంతసించుచు వెంటనే నేనే నాశవము నాటంకపరచి యింటికిఁ బంపించితిని. నా తమ్ముఁడు తన దేహమొకచో దాచి యతని దేహములోఁ బ్రవేశించు సమయమెరింగి నేను వెంటనే మంత్రించితిని. మంత్రప్రభావము వలననే యతండు బ్రతికెనని దెలియజేయుచుండ నతండులేచి నలుమూలలు పరికింపుచు నెంత నిద్రవోయి లేచితినని పలుకుచుండ బంధువు లందరు మూఁగి కొని నన్నగ్గింపుచు నతనికి మరణ వృత్తాంతము దెలిపి యనేకోత్సవములు గావించిరి.

అతండు బ్రతికిన మూడవనాఁడే నాకుఁ గానుకగా మూఁడుకోట్ల ధనము సమర్పించెను. ఆ ధనమీయవలదని యభ్యంతరపరచిన మంత్రి నధికారమునుండి తొలగించి యాసచివత్వమునుగూడ నాకేయిచ్చివేసెను. నా తమ్ముఁడు భోగానుభవం బలవాటుపడుటచే వెనుకటి దేహముమాట మరచియేపోయెను. పాడు దేవాలయములో దాచిన యా వికృతాంగమును గాచి పసులకాపరులు రాజభటుల కెరింగింప వారాదేహమును దహింపఁజేసిరఁట దానంజేసి నా తమ్ముఁడీ రాజ్యంబున స్థిరుండయ్యెను. అప్పటి నుండియు నేను మంత్రిగానుంటి. ఆ ధనమంతయు గంగోత్తర కవ్వలనున్న యా తపస్వికడకుఁ దీసికొనిపోయి సమర్పించితిని. ఆ విరాగి నవ్వుచు నప్పుడే యా ధనమందలి బైరాగులకుఁ బంచిపెట్టించెను. నే నింటికివచ్చి తమ్మునకా రహస్యమెరింగించితిని. ఈ రహస్యము మా యిద్దరికిఁగాక యితరులకుఁ దెలియదు. అని తమ వృత్తాంతమంతయు నివేదించిన ఫణిదత్తు డిట్లనియె.

మామా! నా కష్టములిప్పటికి గట్టెక్కినవి. ప్రాణబంధువులతోఁ గలిసికొంటి. ఇక నాకే కొదువయు నుండదు. నేను లోకోత్తరములగు వైభవముల ననుభవించితి. హీనులకన్న హీనములగు కష్టములఁ బొందితిని. రెండు సారులు చెఱసాలం బెట్టబడితి. ఇప్పుడందుండియే తప్పించుకొని వచ్చితినని తన వృత్తాంతమంతయు నెరింగించి విస్మయసాగరములో ముంచివైచెను. మరునాఁడు మేనల్లుని రుక్మవర్మయొద్దకుఁ దీసికొనిపోయి రహస్యముగా నతని తెలంగంతయు నెరింగించెను. అతండు మేనల్లునిం గ్రుచ్చియెత్తి శిరస్సాఘ్రాణించుచు నెక్కుడుగా గారవించెను.

ఫణిదత్తుఁడు మేనమామల మన్ననల వడయుచు కొన్ని దినములందుండి మిత్రులరాక నరయుచుండెను. అంతలో సుబాహుప్రముఖులు మువ్వురువచ్చి యతనితోఁ గలిసికొనిరి. వారి మొగంబులు చూచి ఫణిదత్తుఁడు శుభసూచనలు గ్రహించి మిత్రులారా! శశాంకవతికథ తెలిసినదా? నేవచ్చిన తరువాత నేమిజరిగినది చెప్పుఁడని యడిగిన మోము వికసింప సుబాహుం డిట్లనియె వయస్యా! శశాంకవతి సేమముగా నున్నది. నీకు కుమారుం డుదయించెను. మేమా శిశువు నెత్తుకొని ముద్దుగారించితిమి. నిన్ను బంధించిన రాజు శశాంకవతికి పినతల్లి యల్లుడు.

కుమారవతియందుఁ జేసినది. సుబంధునింటనుండి నా సుందరిం దీసుకొనిపోయెనని యిదివరకు నీకుఁ జెప్పితిమిగదా మన సారంగమే మన జాడలు దెలిపినది అని యక్కడ జరిగిన వృత్తాంతము కుమారవతి చెప్పిన విశేషములు సాంతముగాఁజెప్పి కుమారవతి యిచ్చిన కంబళ మతనికి సమర్పించిరి. ఆ కంబళమును గైకొని ప్రహర్ష వివశమానసుండై మిత్రులారా! ఈ కంబళము నాచేయి విడిచినది మొదలన్నియు నాపత్తులే కలుగుచున్నవి. ఇప్పుడన్నియు శుభసూచనలే తోచుచున్నవి. ఇప్పుడు మనకు మంచికాలము వచ్చినది. యక్షపతి నాకుఁ బంధువుఁడే యయ్యెను. అని తాను మేనమామవలన వినిన వృత్తాంతమంతయు వారికిఁజెప్పి వారినిగూడ నానంద సాగరములో నీఁదులాడించెను. అని యెఱింగించునప్పటికి కాలాతీతమైనది. తరువాతి చరిత్రము పై మజిలీయందిట్లు చెప్పెను.

270 వ మజిలీ

## వరుణకన్యా వివాహము

ఫణిదత్తుఁడు కుమారాలోక నౌత్సుక్యముతో సురప్రస్థ నగరంబున కరుగుటకు దొందరపడుచు మేనమామకుంజెప్పి మువ్వుర మిత్రులతో నొక శుభముహూర్తంబున గుఱ్ఱములెక్కి బయలుదేరెను. నలువురు రౌతులు పాటవంబేపార వారువంబుల విచిత్ర గమనంబుల నడుపుచు దేవప్రస్థ నగరమార్గంబునఁబోవ యత్నింప దైవికముగా దారి తెలియక కాశీపురమార్గంబున నడిపింపం దొడంగిరి. పెద్ద దూరము పోవువఱకు వారి కానియమము తెలియనేలేదు. ఒకపల్లెమీఁదుగా బోవునప్పుడు సుబాహుం డంపలివారి నీదారి సురప్రస్థమున కరుగునాయని యడిగిన "నరుగదు. ఇది వారణాశీనగరంబునకుం బోవు"నని చెప్పిరి. అప్పుడు సుబాహుఁడు ఫణిదత్తునితో నా ప్రమాదముజెప్పి మరలిపోవుదమని పలికిన ఫణిదత్తుండు పెద్దదూరము రానేవచ్చితిమి. పోనిమ్ము కాశికింబోయి విశ్వనాథు నారాధించి యక్కడనుండియే సురప్రస్థమున కరుగుదముగాక యనుటయు నతండంగీకరించెను. వారునలువురు హాటాహుటిగమనంబున నాలుగు దినంబులకు నవిముక్తక్షేత్రంబు జేరఁగలిగిరి.

గంగాస్నానము చేయుచుండ ఫణిదత్తునకు వరుణకన్యల వృత్తాంతము గుప్పున జ్ఞాపకము వచ్చినది. మొగంబున విన్నదనంబుదోప సుబాహునితో వయస్యా! మన మొకసారి వెనుకటివలెనే గంగానదిమీఁద నౌకావిహారము సేయుదమా? చండిక వచ్చి నన్నుఁ దీసికొనిపోవునేమో? అని చెప్పిన నతం డొప్పుకొనియెను. ఆ మరునాడే యోడదెప్పించి వారు నలువురు గంగమీఁద విహరింపుచుండిరి. అతండనుకొనినట్లే వెనుకటివలెనే నీటిపై నొకబోటి మోముదేలించి యంతలో మునిఁగి చేతులెత్తినది. ఆ వింత చూచినవెంటనే నలువురు నీటిలో దుమికిరి. ఫణిదత్తుడే దానిచేతులు

పట్టుకొనెను. తక్కిన మువ్వురకు నేమియుం గనంబడలేదు. వారీదియా౯ది నోట నీరెక్క నుక్కిరిబిక్కిరిచెంది యొడయెక్కి రేవుచేరి మూడేసి లంఘనములుచేసి జలపాతవ్యథ మాన పుకొనిరి. పణివత్తుని గురించి విచారింపక తదాగమన మభిల షించుచుఁ గాశీపురంబున వసించిరి.

పణిదత్తుడను పూర్వమువలెనే మునింగి యుద్యానవనమధ్యమున నిలువం బడియెను. అప్పుడతనికిఁ గలిగిన సంతోష మిట్టిదని చెప్పఁజాలము. అయ్యుద్యాన వన విశేషము లన్నియుం జూచుచు శివాయతనము దాపునకుంబోయి యందెవ్వరిం గానక యమ్మహేశ్వరుని స్తుతియించుచు నటకదలి దక్షణముగా బోయెను. అవ్వన మతనికి నదృష్టపూర్వకముగాఁ దోచినది. అందు దిరుగుచు వరుణకన్యకల సౌధము లెందున్నవోయని యరయుచు వానింగానక దిగ్భ్రమజెంది నేలకవాటమమాట మరచిపోయి పోయినచోటికే పదిసారులు పోవుచుండెను. అట్లు తిరుగు చుండ నొకచోట దైవికముగా బిలద్వారము గనంబడినది. దానింజూచి యోహో! తెలిసినది. దీవిమాట మఱచి యూరక తిరుగుచుంటి. ఈ తలపు తెలిచికొనకాదే యు తరణి లోపలికిఁ బోయినదని స్మృతి నభినయించుచు నా తలుపు గడియదెరిసికొని మీటనొక్కిన తివ్వన నెగసినది. అందలి సోపానములవెంబడి క్రిందికిదిగి కొంతదూరము పరిక్రమించినంత కైలాస శిఖరమువలె వరుణకన్యకల సౌధము లతనికి నేత్రోత్సవము గావించినవి. వెనుకటి మేడ గురుతు చూచుకొని నడుమనున్న ప్రాసాదమెక్కి పరికింపనం దెవ్వరుం గనంబడలేదు. వారువారు శయనించు శయ్యలు పీఠములు నలంకారములు మాత్రము గనంబడినవి. వానిఁ జూచుచు నతం డామేడలన్నియు విడువక పరికింప నంతొక సౌధాంతరమున రత్న పర్యంకంబునం బండుకొని యేదియో ధ్యానించుచున్న వారుణీ తరుణి యతనికిఁ గన్నులపండుగ గావించెను.

అమ్మ తకాశిని పణిదత్తుంజూచి త త్తరముతోలేచి శయ్యదిగ్గనుదిగి "ఓహోహో! మా ప్రాణబంధుఁడు పణిదత్తుఁడే యితఁడు. నేడెంత సుప్రభాతము మీ నిమిత్తయై యెన్నియోసారులు చంద్రికను గంగాగర్భమున కనిపితిమిగదా! మీ దర్శనమే దొరక లేదు. ఎట్లో యిప్పుడు వలవెచి తీసికొని వచ్చినది. మేము ధన్యులమైతిమి. పులింజంపి యెక్కడికి పోయితిరి? అందలి వారుణీహ్రదంబున మునిగితిరా యేమి? మీ వృత్తాంతము చెప్పుడని యడిగిన పణిదత్తు డిట్లనియె.

తరుణీమణీ! యెప్పుడును కర్మానుగుణ్యమైన బుద్ధిపుట్టుచుండును. పులిం జంపి మరలిరాక తాళముచెవి గైకొని యయస్కవాటము దీసి తెలియక వారిణీ హ్రదంబున మునింగితి. కాశీపురంబున కరిగితిని తరువాత ననేక కష్టసుఖంబుల ననుభవించితి. నా చరిత్రయంతయుఁ బిమ్మట జెప్పెదంగాని నీ చెల్లెండ్రందరు నేమైరి? నీ వొక్కరితవే యుండుంటి వేమి? అని యడిగిన నా వారుణి యిట్లనియె.

మనోహరా! వారందరు నేడే మణిమంత నగరంబున కరిగిరి. అందు మణిమంతుఁడను నాగరాజింట మహోత్సవము జరుగుచుండెను. ఓహో! మరచి నాగరాజను చున్నాను. అతఁడు నీ తండ్రియే యగుఁగాదా? నీ తల్లి పితృదత్త నతండు దీసికొనివచ్చెను. తరువాత మాకా చుట్టరికము తెలిసినది. మేమామె నత్తగారని పిలుచుచుంటిమి.

మరియు సింహవ్యాఘ్రములఁ నీవు జంపినపిమ్మట మేమా మణిమంతము నకు సంతసముగాఁ బోవుచుంటిమి. భూలోకమునుండి యప్పుడే మీ తల్లిం దీసికొనివచ్చి యుత్సవముఁ జేయుచుండెను. మాకాఁ జూచి యతండు వెరగు పడుచుఁ బడఁతుకలారా! మీరీపురికెట్లు రాఁగలిగిరి. సింహమేమైనదని యడిగిన చండిసంపి భూలోకమునుండి ఫణివత్తుఁడను వీరుని రప్పించుకొంటిమి. అతండా సింహవ్యాఘ్రములఁ బరిమార్చెనని నీ వృత్తాంతము సంక్షేపముగాఁ జెప్పితిమి. పతివ్రతలారా! ఫణివత్తుఁడా! యని యతం డాశ్చర్యపడుచు మమ్ము నీ తల్లికడకుఁ దీసికొనిపోయి ప్రేయసీ, వీరు నీ కోడండ్రు, నీ కొడుకు గంగలోబడి మడిసెనని నీవు విచారించుచుంటివి. అతండున్నతస్థాన మలంకరించెను అని యా కథ యంతయుఁ జెప్పఁగయు నామె ముప్పిరిగొను సంతోషముతో మమ్మాదరించి నా ముద్దులపట్టి యందున్నవాఁడా! ఇందేమి చేసెనని యడిగినది నీ వృత్తాంతమంత యుంజెప్పి యతండు తెలియక వరుణ హ్రదంబున స్నానముచేసి యుండుటను. భూలోకమునకేగఁగలఁడు. వానిం గ్రమ్మర రప్పించు నుపాయ మరయుచుంటిమి. అని చెప్పిన నీ తల్లి యమృతంపునెల్లి మునింగినట్లు చెనంగుచు బోటులారా! వాని వేగనిందు రప్పింపుఁడని బ్రతిమాలికొనినది.

అత్తా! నీ పట్టి యంత చిన్నవాఁడా! ముద్దులనాయన యని పిలుచుచుంటివే అని పరిహాసమాడుచు మే మామెవలన సెలవు పొంది శార్దూలమున్న కోటి కరిగితిమి పులి వచ్చినది. తాఁము చెవియు నీవును గనంబడలేదు. తలుపురాదు. ఏమి చేయుదుము? వరుణ లోకమున కరుగు భాగ్యము దొరకక వెనుకకుమరలి యత్త మామలకుం జెప్పి నీరాకం గోరుచు నీ మేడలం బడియుంటిమి. ఇప్పటికి సంఘటితమైన యీ కథా వృత్తాంత మంతయుం జెప్పినది.

అతం డత్యంతానురాగముతో విని తలిదండ్రులం జూడ నప్పుడే మణిమంతపురమునకుం బోవుటకు దొందర పడుటయు వారు నివారించుచు మనోహరా! నీ విప్పుడు పోవలదు. మా చెల్లెండ్రందరు నేటి రాత్రికి రాఁగలరు. వారిం జూచి యాదరించి రేపు పోవుదుగాక అని చెప్పిన నతం డిట్లనియె. వారుణీ! ధారుణి యందున్న కొక్కరితియే భార్యగా నుండును. నన్ను మీ రందరు పెండ్లియాడుమని కోరుచుంటిరి ఎట్లు ధరింపగలను. అని యడిగిన నప్పడఁతి నవ్వుచునిట్లనియె. సుందరా! ఇక్కడికి నక్కడికిఁ జాల తారతమ్యముఁ గలదు. ఇందు భోగమే

ప్రధానము. జరారోగములు లేవు. అక్కడ భోగములు తక్కువ, రోగము లెక్కువ. భోగతారతమ్యము గలిగియున్నది. అది బలనాశనము. ఇది బల్మిప్రదయి వెలయు ఫల దని యుపదేశించినది. అంతలో సాయంకాల మగుటయు నా కాంతలెల్ల మణిమంతమునుండి విద్యుల్లతిక లోయన లందు వచ్చిచేరిరి.

వారుణి వారికి ఫణిదత్తుం జూపుచు నతని వృత్తాంతము చెప్పుటయు వారందరు సంతోషాతిశయము ప్రకటింపుచు పుష్పదామంబుల నతనిగట్టి వైచి యిఁక నీనిం గదలనీయగూడదు వదలిన పారి పోవునని పరిహాసవచన రచనలచే నతనిమతి గలఁగఁ జేసిరి. అతండు వారి కందఱకుం జెప్పి మణిమంతమునకుఁ బయనమవుచుండ నప్పుడే యా వార్త తెలిసి మణిమంతుఁడు వానిం దీసికొని రమ్మని పదువుర నాగ కుమారులఁ బంపెను. వెంటనే ఫణిదత్తుండు వారివెంట నాగ నగరి కరిగి శుద్ధాంతములో నున్న తల్లికడ కేగి యానంద బాష్పములు గ్రమ్మ అమ్మా వచ్చితి. నీ కుమారుండ ఫణిదత్తుఁడ నని పలుకుచుఁ జరణంబుల పడి సమస్కరించుటయు నాయమ్మ వాని నక్కునం జేర్చుకొని ముద్దాడి యానంద బాష్పములచే శిరంబు తడుపుచు "నాయనా! నీవును నేనును సంసార సాగరంబునఁబడి తిరుగుచుంటిమి. నీవు గంగలోఁబడి సమసితివని దుఃఖించినయది దిప్పటికిని వదలకున్నది గదా! నీ విందువచ్చి వరుణకన్యకల నాటంకము మాన్పి క్రమ్మఱ భూలోకమున కరిగితివఁట. అందేమి చేసితి" వని యడిగిన తాను కాశీపురము చేరినది మొదలు నాటితుది వఱకు జరిగినకథ యంతయు నెరింగించెను.

అందుఁ దనయన్నలు సుమతి ప్రముఖులు రాజులై మహోన్నత పదవి ననుభవించుచున్నారని విని వారిం జూడ వేడుక పడినది. అంతలో వరుణకన్యకలు పదకట ఝణఝణత్కారంబు లేపార నా యంతఃపురమున కరుదెంచి తమయభిలాష నయ్యోషామణి కెరిగించిరి. మణిమంతుడును పుత్రుని పరాక్రమ విశేషంబు లగ్గింపుచు వరుణ కన్యకలకును దమసంగల బంధుత్వం బుగ్గడించి వారిం బెండ్లియాడుమని కుమారుని బ్రేరేపించెను.

అతండు తలిదండ్రులయాజ్ఞ మన్నింపుచు నంగీకరించినంత ననంత వైభవముతో మణిమంతుఁ డొక శుభ ముహూర్తంబునఁ బుత్రునకు వరుణ కన్యకలను బాణిగ్రహణ మహోత్సవము గావించెను. ఫణిదత్తుఁడు నా వరుణ కన్యకలతో దివ్య భోగము లనుభవించుచు భూలోక వృత్తాంతము మఱచికొన్ని దినంబు లందువసించెను అని యుపన్యసించి వేళ మిగులుటయు మణిసిద్ధుండు తరువాయి కథ పై మజిలీయం దిట్లు చెప్పందొడంగెను.

271 వ మజిలీ

# ఫణిదత్తుని రాజ్యప్రాప్తి

వరుణకన్యా సంభోగ సుఖం బనుభవించుచు ఫణిదత్తుఁడు మిత్రులమాట కళత్రము మాట పుత్రుని మాటయు మఱచి యున్మత్తుని క్రియ వర్తింపు చుండ నొకనాఁడు పితృదత్త వానింజేరి నాయనా! భూలోకములో శశాంకవతియను రాజపుత్రికం బెండ్లియాడి పుత్రుం గంటినని చెప్పితివి. మిత్రులు నీ నిమిత్తమె వేచియుండు మానరు. నీ మేనమామలు నీ వరుగునప్పుడు వెంటనే రమ్మనిరని తెలిపితివి. నీ విక్కడ భోగముల మరిగి భూలోకము మాటయే మఱచితివి. ఆ వాల్గంటి శశాంకవతి నిమిత్తము పెక్కిడుముల గుడిచి యిట్లుపేక్షించుట తగదు నాకును మా యన్నలం జూడ వేడుక గల్గుచున్నది. భూలోకమున కొకసారి పోవుదము వత్తువాయని జ్ఞాపకము చేసిన నతఁడు పశ్చాత్తాపముతో నిట్లనియె.

అమ్మా! నేను వట్టి కృతఘ్నుండనైతిం గదా! భార్యాపుత్రుల మాట యట్లుండనిమ్ము. నాతో నడవుల వెంబడి తిరిగి సమదుఃఖసుఖులైన సఖులు మువ్వురు నా కొఱకు కాశీపురంబున వేచియుందురు. అయ్యయ్యో! వారిమాట యించుకయు జ్ఞాపకము లేక యిందు దివ్యభోగము లనుభవించుచుంటి. మిత్రులకు గాని నా వైభవము కాల్పనా! వారికిఁ బెండ్లియైనఁ జేయకపోతినే! పాపము శశాంకవతియు నాకొఱకవపుం బాల్పడి పెక్కు కష్టము లనుభవించినది. దానిం జూడకపోవుట మహాపాతకము. ఇఁక నేనిందు గడియ నిలువఁ జాలను. నేఁడే పోవుచుంటి. నీవు గూడ వచ్చిన రమ్ము అనుటయు నామెయుఁ బయనమైనది. ఆ వార్త విని వరుణకన్య కలందరును నందుగనే ప్రయాణమై కూర్చుండిరి.

ఫణిదత్తుఁడు వారినెల్ల వెంట బెట్టుకొని వరుణహ్రదంబున మునింగిలేచి చూచునంత గాశీపురంబున విశ్వనాథుని యాలయము పెరటలోఁ నిలువంబడియుండిరి. ఆ దేవతా స్త్రీ సమూహమును జూచి ప్రజ లాశ్చర్యపడుచు వారి మేననున్న యాభరణములలోని రత్నము లొక్కొక్కటియే భూలోకైశ్వర్యమంతకును సరిపడునని పొగడుచు జక్రవర్తి యెవ్వఁడో వచ్చెనని చెప్పుకొనుచు వారి వెను వెంటఁ దిరుగ జొచ్చిరి. వారందరు గంగానదిలో దీర్థము లాడి యనేక మహాదానములు గావించుచు లోకులచే స్తుతింపబడుచుండిరి. ఫణిదత్తుం డందున్న తన మిత్రుల వెదకుచుండ వారు నా వైభవ మంతయుం జూచి మరి యెవ్వరో యనుకొని పరిశీలింపరైరి. ఫణిదత్తుం డొకచో వారిం గురుతుపట్టి వారిం గౌఁగలించుకొనుటయు వాని యాకారము మారుటచేఁ బేరు సెప్పుదనుక నతనిఁ దెలిసికొనలేక పోయిరి.

మిత్రులకు ఫణిదత్తుఁడు తన వృత్తాంతమంతయుం జెప్పుచుఁ గళత్రములఁ జూపించి మాతృపూజ సేయించి యప్పుడే వాహనములమీదఁ వారినెల్ల నెక్కించి

యటవెడలి తొలుత గొన్ని దినంబులకు బాటలీపుత్ర నగరంబున కరిగెను. అందు విశ్వదత్త యన్నలంగని వారిచే మన్ననలఁ బడసి గొన్ని దినంబులందుండి తాను బడిన బన్నములన్నియు వారికిం జెప్పుకొనుచు నానందించినది.

తరువాత ఫణిదత్తుఁడు మాతులదత్తములగు చతురంగబలములతో స్త్రీ సహస్రము సేవింప మిత్రులఁ గూడుకొని యటనుండి సుర్వస్తనగరమున కరిగెను. అందు భూరిశ్రవుండు వారి రాకవిని శత్రురాజనుకొని భయపడుచు సంధికై మంత్రుల నెదురుపంపించెను. వారు ఫణిదత్తుని మార్గమధ్యమునం గలిసికొని అతండు శశాంకవతి మగండని తెలిసికొని యా వార్త భూరిశ్రవున కెరింగించిరి. అతండది ఫణిదత్తునివలన ఫణిదత్తుని వృత్తాంతము వినియున్నవాఁడగుటఁ బ్రీతుండై సపరివారముగా వారి కెదురుపోయెను. దేవతాస్త్రీల యలంకార వైభవముసూచి యతండు సిగ్గుపడుచు సగౌరవంబుగా నల్లునిం దోడ్కొనిపోయి విడిదలం బ్రవేశపెట్టి సత్కరించెను.

శశాంకవతియుఁ బతిరాక కానందించుచుఁ గుమారునెత్తుకొని కుమారవతి తోడరా, భర్త యున్న విడిదలోనికింబోయి యతని పాదంబులంబడి వియోగశోక మభినయించుచు బాష్పములఁబడి గురిపించినది. అతం డామె నాదరింపుచుఁ గుమారు నెత్తుకొని ముద్దాడుచుఁ దల్లికి శశాంకవతింజూపి యామె చరిత్రమంతయుఁ గ్రమ్మఱ దెలియజేసెను. వరుణకన్యకలు శశాంకవతివార్త వినియున్నవారగుట నామెంజూచి తదీయ సౌందర్యాతిశయంబులకుఁ శిరఃకంపముచేయుచు నామెకు నమస్కరించి పుత్రు నెత్తుకొని ముద్దాడ దొడంగిరి. ఒండొరులుపడిన కష్టసుఖంబులం జెప్పుకొనుచు నా దంపతులు హృదయానురాగంబుల వెల్లడింపుచు నాఁటి దినంబెల్ల సుఖముగా వెళ్ళించిరి. మరునాఁడు భూరిశ్రవుఁడు సభచేసి యందు ఫణిదత్తుని చరిత్రమంతయు వెఱగు బ్రజలు పడునట్లుపన్యసించెను.

అందు ఫణిదత్తుఁ డా రాజ్యమందు నరణ్యమధ్యమున శబరపతి చేయు ఘోరకృత్యముల నుగ్గడింపుచు వానింబట్టి తెమ్మని కొందరు వీరభటుల నంపెను. అప్పటికి పుళిందభర్త కాలధర్మము నొందెను. వాని మనుమఁడే రాజయి పాలించు చుండెను. వీరభటులుపోయి వానిం జీరినవాఁ డెదిరించుటయు వారికిని వీరికిని పెద్ద యుద్ధముజరిగినది. అందు రాజభటులే యోడిపోయిరి. మరలివచ్చి యా బాలుని పరాక్రమంబు ఫణిదత్తున కెరింగించిరి. ఫణిదత్తుఁడు మిత్రులతోఁగూడికొని చతురంగబల పరివృతుండై వెడలి యా యడవిలో నొకచోట విడిసి మున్ను తన కుపకారముచేసిన శబరునియింటికి వార్తనంపి వాని రప్పించి యాదరించుచు నిట్లనియె.

నీవు నన్ను గురుతుపట్టితివా ? నీవలన మహోపకారమందిన ఫణిదత్తుని జ్ఞాపకమున్నదా ? యని చెప్పినవాఁడు వెఱఁగుపాటుతో జూచి సామీ ! నీకీ రాజ్య మక్కడిది ? అమ్మగారు సేమముగా నున్నారా ? ఆమెతోఁ గలిసికొంటిరా ? అని

యడిగిన నతఁడు నవ్వుచు నీ దయయే యామె సేమమునకుఁ గారణము లేకున్న నా చేడియ నాఁడే యెరుకులచేఁజిక్కి మడియును. అది యట్లుండె. మీ రేఁ డెట్లున్నవాఁడు? దొరలు కొట్టుచున్నారా? బలు లిచ్చుచున్నారా? అని యడిగిన వాఁడు సామీ! వాఁ డప్పుడే గడసెను. వాని మనుమఁడు రాజుగాఁ గలడు. వాని కిప్పుడు బదియేండ్లున్నవి. బాబూ! వాడు చాల బలవంతుఁడు. మొన్న నెవ్వరో రాజభటులువచ్చి బెదరించిన నూచలచే నొవ్వఁగొట్టి పారఁదోలెను. అనవుఁడు నవ్వుచు నతం డిట్లనియె.

ఓరీ వాఁడు శబరి కొడుకేనా? అట్లయిన నా కౌరసుఁడే. నీ కా చిన్నది నా వార్త చెప్పలేదా? ఆ చిన్నది సేమముగా నున్నదియా? యని యడిగిన వాఁ డిట్లనియె. సామీ! జ్ఞాపకము వచ్చినది. ఒకప్పుడు మీ వార్త చెప్పినది. అందులకే యంత బలవంతుఁ డయ్యెనని మురియుచు నయ్యెరుకు వేగమ యాభిల్లపల్లె కరిగి యా వార్త శబరి కెరింగించెను. ఆ యువతీమతల్లియుఁ బిల్లవాని వెంటఁబెట్టుకొని బిల్లాంగనలు సేవింప ఫణిదత్తుఁడున్న పట కుటీరమున కరుదెంచి పుత్రునితోఁ గూడ నతని యంఘ్రులంబడి వియోగదుఃఖమును ప్రకటించినది. అతండు వారి నూరడించుచు నయ్యడవిఁ బాలింపఁ దనకొడుకు కెదుగువరకుఁ దగుమంత్రుల నియమించి వారినెల్ల వెంటబెట్టుకొని క్రమ్మఱ సురప్రస్థమున కరుదెంచెను. తల్లియు నిల్లాండ్రును సపుత్రకముగా నాశబరిం జూచి యామెచేసిన యుపకార మగ్గడింపుచుఁ దద్దయ ప్రేమతో వారి నాదరించిరి.

ఇంతలో మేనమామలు వానికొక పత్రిక నంపిరి అం దిట్లున్నది. "భాగినేయా! మాకు రాజ్యకాంక్ష లేకున్నను నిది ప్రారబ్ధముగాఁ దగిలికొన్నది. దీనినే సుఖప్రారబ్ధమందురు. మేము పెద్దవారమైతిమి. మాకు సంతతిలేదు. ఈ రాజ్యము నీకు వ్రాసియిచ్చితిమి వెంటనేవచ్చి దీనిం గైకొని పాలింపుము. నీవు వచ్చిన దివసమే మాకు తపోవనప్రయాణ దివసము. ఆ పత్రికం జదివికొని మిత్రులతో నాలోచించి భూరిశ్రవుఁడు అపుత్రకుం డగుట తద్రాజ్యంబు తన కొడుకు పాలించు ననియు శబరి రాజ్యమునకు శబరికుమారుం డధికారియనియు నిరూపించి భూరిశ్రవునకుం జెప్పి సుబాహుని కుమారరక్షణార్థమై సురప్రస్థమున మంత్రిగానుండ నియమించి శబరపుత్రకుని వజ్రకాయున కప్పగించి సుప్రహస్తుని వెంటఁబెట్టుకొని పాటలీపుత్ర నగరమున కరిగి మేనమామవలనఁ దద్రాజ్యము స్వీకరించి సుప్రహస్తుని మంత్రిగాఁ జేసికొని ధర్మమున ప్రజలం బాలించుచుండెను.

మఱియు శబరియు శశాంకవతియు భూలోకమున దేవేరులైయుండ వరుణకన్యకలు పాతాళమున ప్రీతిగలుగఁజేయ నారేని ఘనసము లందందు వసించి యతండు రెండు దేశంబులు పాలించుచుండెను అని యెరింగించి మణిసిద్ధుండు నవ్వుచు గోపా! కథా ప్రాచుర్యంబునంజేసి నీ వడిగిన ప్రశ్నముకద నిలుపక యెక్కుడగాఁ

చెప్పవలసివచ్చినది. తెలిసినదియా! నీ వడిగిన సమస్యకుఁ గాళిదాసకవి పూర్తి జేసిన విషయములే యీ కథా బాహుళ్యమునకు హేతువులగుచున్నవి. అని చెప్పిన విని వాఁడురముపైఁ జేయిడికొని అహా! మహానుభావుఁడు కాళిదాసకవిగాక యీ రహస్య మెవ్వరు సెప్పఁ గలరు? అయ్యారే! ఈ సమస్యవలన నెంత కథ పొడమినది. నేఁడు దీని వినుటచే నా స్వాంతము మిక్కిలి యుత్సాహపూరితమై యున్నది. ఇట్లు చెప్పుట మీకుఁగాక యొరులకు శక్యమాయని పొగడుచు——

చ. మునివర! కాశికానగరమున్గనుఁగొందు మీఁ కెన్నినాళ్ళక
య్యసిమిషగంగనెప్డు హృదయం బలరంగమునుండి విశ్వనా
ధుని గనులారఁ జూతుమొకొ దుర్గమ మార్గము లెల్లదాటి ప
త్తనముల మీఁదఁ బోదుముగదా? ఇఁక వింతలు చూడగల్గగన్.

క. అని యడిగిన విని యతి గో
పునిమాటల కలరి యింక మూఁడునెలలలో
పునఁ జేరగలము కాశిప
యనము లేవదవు నమరుం బురముల్.

అని సెప్పి మణిసిద్ధుం డంతేవాసితోఁగూడి క్రమంబునఁ దదనంతరావసథంబుఁ జేరెను.

ఓం

శ్రీరస్తు.

శుభమస్తు — అవిఘ్నమస్తు

# కాశీమజిలీకథలు

## పదునొకండవ భాగము

### 272 వ మజిలీ

## బంగారు మూషికము కథ

క. గురువర! యీ పురిలోనికి
నరిగితి వింతలఁ గనంగ నా యాబోట్లన్
దిరిగితి మఱి చెప్పందగు
పరమాశ్చర్యంబు గానఁబడ దెచ్చోటన్. 1.

క. విను పొంకయంగడిలో వెం
డిని జేయంబడినబోను నిలుపంబడె నం
దున రత్నఖచితమగు కాం
చన మూషిక మొగటి గ్రాలు సద్రుచిమీఱన్. 2.

గీ. తొలుత వర్తకుఁ డంగడి దులిపి బోను
సరిపి వాకిట భక్తిఁబూవులను బూజ
సలిపి పిమ్మట వాణిజ్య సరణిఁ జరపు
ననుదినము దప్పకుండ నేనది యెఱిఁగి. 3.

చ. ఎలుకను బూజసేసెద వదేమయ విఘ్నపతిన్ హరిన్ హరున్
దొలుత భజింతురెందునను దొంగవలెన్ గృహకుడ్యభాగము
ల్దొలిచెడునెల్క కేటికిబలుల్ మఱి వేఱొక హేతు వేదియేఁ
గలుగునె తెల్పుమన్న విని కౌతుక మారగ జేరియిట్లనున్. 4.

ఉ. కారణమేమొ నే నెరుగఁగా చిరకాలమునుండి దీని మా
వారలు పూజసేయుదురు వంశపరంపరగా మదాలయ
స్థోయకులాధిదేవతగ నూని యొకంగము దీని నెప్పు డె
వ్వారిటుసేసి నిల్పిరొ ప్రధనంబుగ మాసదనాంతరంబునన్. 5.

క. అని చెప్ప నొరుల నడుగఁగఁ
బనియేమిఁక నయ్యవారు పైనుండగా
ననిమరలివచ్చినాఁడను
వినిపింపుఁడు నేఁడు తత్త్వవృత్తి మహాత్మా ! 6.

అని యడిగిన నప్పుడు నయ్యతిపతి మణి ప్రభావంబున దదుదంతమరసి శిరఃకంపన పూర్వకంబుగా నిట్లు చెప్పఁదొడంగెను.

ఉజ్జయినీపురంబునఁ గుమారదత్తుఁడను వైశ్యోత్తముఁడు రమాదత్తయను భార్యతోఁ గాపురము సేయుచుండెను. అతం డంతభాగ్యవంతుఁడు గాకపోయినను న్యాయమైన వాణిజ్యముఁ జేసి జీవనోపాధికి లోపము లేని యాస్తి సంపాదించి కాలక్షేపము సేయుచుండెను. కొన్నినాళ్ళ కతనిభార్య గర్భవతియైనది. కాని కుమార ముఖావలోకన సుఖం బనుభవింపకయే యతండు నాకలోక మలంకరించెను. జ్ఞాతులచే నతని సొమ్మంతయు నపహరింపబడినది. అతనిభార్య దీనురాలై యెట్లో కృచ్ఛ్రక్రియవలన కాలము గడుపుచుండ నొక శుభముహూర్తంబున నామెకుఁ గుమారుఁ డుదయించెను. వాని యాకారము సులక్షణ లక్షితమై దర్శనీయమై యొప్పుచున్నది. ఆ సాధ్వి దారిద్ర్యముచేఁ బీడింపఁబడుచున్నను వానికేమియు లోపము లేకుండ గష్టపడి పెంచుచుండెను. యుక్తకాలమున బడిలోవైచి గణితమును లిపులు లోనగు చదువు వాణిజ్యమున కుపయుక్తమగు దానిని జెప్పించినది.

వానికిఁ గ్రమంబున నీడువచ్చినది. ఎన్నినాళ్ళు తల్లి సంపాదించిపెట్టును ? ఏదైన కులవృత్తి చేసికొని జీవనము గడుపుమని యెఱింగినవారు వానిని మందలింపుచుండిరి. వాఁడేమియు నా యాటలు వినిపించుకొనఁడు. అకారాయితనంబున నూరంతయుఁ దిరుగుచుండును. క్రమంబున యౌవనవిలాసంబు లతని హృదయంబున నావేశించినవి. అద్దము చూచుకొని మీసములు దువ్వుచుఁ గన్నులు చిట్లించుచు వెఱ్ఱి వికారములు ప్రకటింపుచుండును.

ఒకనాఁ డతడు మహాకాళుని యాలయంబునకరిగి దేవతాదర్శనము చేయ వచ్చిన యువతుల సౌందర్యచాతుర్యంబుల వర్ణించుచు నందందుఁ దిరుగుచుండెను. అందలి ముఖమంటపమున సాంద్రస్ఫటిక శిలాస్తంభకళలకంబున నొక విద్యాధర కన్యక విగ్రహము చక్కఁగాఁ జెక్కఁబడియున్నది. అందు నిలువంబడి తదవయవముల తీరు విమర్శించుచు నిటునటు చూచి యందెవ్వరు లేకునికి మోహావేశములో నా విగ్రహమును గౌఁగిలించుకొనియెను.

అంతకుమున్న రాగవతియను విద్యాధరకన్యయొర్తు యదృశ్యముగా మహాకాళనాథు నారాధింప నయ్యాలయమునకు వచ్చి స్వామి నర్చించి యా స్ఫటిక స్తంభమునఁ జెక్కఁబడియున్న విద్యాధర కన్యకా విగ్రహమును జూచి తలయూచుచు విద్యామహిమచే నందావేశించి యదృశ్యయై విశ్రమించియున్నది.

మదనాంకుఁ డిట్లు గౌఁగలించి యా విగ్రహము మోము ముద్దుగొనుచుండ నందావేశించియున్న విద్యాధరకన్యక యతని సౌందర్యంబున కచ్చెరువందుచు రత్నకంకణాంకితమగు తనకరంబు ప్రకటింపుచు నతని బుగ్గ గిల్లినది. అతం డదరిపడి యందెవ్వరని గానక యక్కరము మాత్రము చూచి తటాలున నా చేయి గట్టిగ బట్టుకొని యుండ అప్పుడా చిన్నది యంతర్హితయై యుండియే "మహాభాగ! నే నపరాధినైతి నా తప్పు క్షమింపుము. నా చేయి విడువుము." అని పలికిన నతండు వెరగుపడి "నీ వెవ్వతవో కనంబడకుంటివి. మాట వినంబడుచున్నది. ప్రత్యక్షమై యథార్థము చెప్పితివేని నిన్ను విడిచెద; లేకున్న విడువ"నని చెప్పుటయు గుప్పున నప్పడతి వాని యెదుట ప్రత్యక్షమై నిలువంబడినది.

తత్సౌందర్యాతిశయంబు చూచి భూషణప్రభలు కన్నులకు మిరుమిట్లు గొలుప మోహవివశుండై యొక్కింత తడవునకుఁ దెలిసి విభ్రాంతితోఁ జూచుచుండెను. అప్పుడా కాంతారత్న మతనికిట్లనియె. "సుందరుఁడా! నేను విద్యాధరుండను విద్యాధర చక్రవర్తి కూఁతురను. నా పేరు రాగవతి యండ్రు. హిమవన్నగపార్శ్వంబు నంటిలి పుష్కరావతియను పురంబు మా కాపురంబు. నేనీ మహాదేవు నారాధింపనపూర్వముగా నిందు వచ్చితిని. ఈ స్తంభమునమత్కాల కన్యకారూపంబుండుట తిలకించి యదృశ్యనై యందు విశ్రమించితిని. నీ వా విగ్రహమునే మోహమగ్నమగుచుండఁ గౌఁగిలించు కొంటివిగదా! స్త్రీ స్వభావమునం జేసి మదనుని మోహనాస్త్రము వల నొప్పుచున్న నిన్నుఁ జూచి నేను మోహించుట యబ్బురమా? ఆ విగ్రహ చేతనంబగుట నీకుఁ బ్రతిచేయలేకపోయినదని తలఁచుచు నాకు దోఁచిన చిట్టకంబు సమర్పించుకొంటి ఈ తప్పు మన్నింపుమని వేఁడుకొనుచున్నదాన. ఇది నేఁజేసిన పని గాదు. ఆ విగ్రహము పై నీవు జూపిన యనురాగమునకు మారుగా నేను దాని వైపున నుండి నీ చెక్కు మీటితి ఇంత సెలవిమ్ము. పోయివత్తు"నని పలికిన నతండు తదాలోకన రజ్జువులచేఁ గట్టఁబడి మోహావేశముతో నిట్లనియె.

"చండీ! నా హృదయము లాగికొని యింటికిం బోయెదనని పలికితి విది యెంత యుచితముగా నున్నది. నన్నుఁ గామాగ్ని పాలుచేసి యేగుట న్యాయమా? నీ కరగ్రహణము చేసితినిగదా! పాణిగ్రహణమైన పిమ్మట సతి పతిని విడిచిపోవుట తగుదుగదా!" అనుటయు నా యువతి యిట్లనియె. "సుందరుఁడా! నా డెందము నీ యందుఁ దగిలికొన్నది. కాకున్న నేనట్లు చేయుదునా? మెమెంతదేశము దిరిఁగినను రాత్రికి మా యూరు నేరకున్న మా వారు దండింతురు, కావున నే నిందు మసలలేను. నీవు నన్నుఁగూడ నభీష్టమేని మా యూరు రమ్ము. అందు నీ కోర్కెఁ దీర్చుదాన"నని పలికిన నతం డిట్లనియె.

"తరుణీ! వట్టియాస పెట్టి పోయెదవమిటికి? మీ నగర మెందున్నదియో నే నెఱుంగుదునా? నన్నూరక యేల యలయించెదవు. ఇష్టమున్న నన్ను వెంటఁ

బెట్టుకొని పోరాదా ! నేనెక్కడ ? మీ లోక మెక్కడ ? వచ్చుట యెక్కడ ? చాలుఁ జాలు ! నీ దర్శనము నామరణమునకే వచ్చినది" అని పలికిన నక్కలికి యిట్లనియె.

"మనోహరా ! అట్లనరాదు. కార్యసాధకులకు దుర్గమములు లేవు. ఎట్టి వానినైన సాధింతురు. నే నిప్పుడు నిన్ను వెంటబెట్టుకొని పోరాదు దారిలోఁ గొందరు విద్యాధరులు నాతోఁ గలిసికొందురు ? వారుచూచిన ప్రమాదము రాఁగలదు. స్థిరసంకల్పులకు దుష్కరము లుండవు. తప్పకరమ్ము నేను పోయివత్తు" నని చెప్పి యాచంచలాక్షి యంతరిక్షమున కెగసి తననగరమున కరిగినది.

మదనాంకుం డాచిన్నది పోయినవంకఁ జూచుచు నా యన్నుల మిన్న రూపు కన్నులఁ గట్టినట్లుండ నమ్మాటలం దలంచుకొనుచు రత్నకంకణ మనోహర కర పల్లవస్పర్శ మభినయించి మేను గరుపార సీ ! సీ ! నేను పట్టి మూర్ఖుండనైతి. లబ్ధ నాశనమున నిట్టిదే. పట్టినచేయి విడువఁదగినదా ? అయ్యయ్యో ! యెంత తెలివితక్కువ వాఁడనైతిని. దానికి నాయం దనురాగము గలుగదా ? చేయిపట్టు వదలక గట్టిగా నిర్బంధించిన గాదు గదల్పఁగలదా ! వట్టివెఱ్ఱినైతి. ఎక్కడి పుష్కరావతీనగరము. యెట్లు పోఁగలను? అని తలంచుచు నింటికింబోయి యేమియుందోచక తద్గతమానసుండై యున్మత్తుండువోలె నిదురింపక పలవరింపుచుండెను. తల్లి అన్నము తిను మని యెంత బ్రతిమాలినను గుడువకయ్యో యతని పలవరింతలు చూచి దయ్యము సోకినదని దిగదుడిచి యంగరక్షలు గావించినది.

అతండు తెల్లవారినతోడనే యెట్లో భుజించి యెవ్వరికిం జెప్పక హిమవంత ముత్తరదిక్కున నున్నదని తెలిసినవాఁడగుట నటఁబయలుదేరి యేకరీతి నడుచుచు నిట్లు తలంచెను. నన్నాచిన్నది తన దకు రమ్మన్నది నే నందు బోయెద. గమ్యస్థానము చేరినం చేరుదుఁగాక లేకున్న దారిలో నశించెదను. ఇంటికడనున్న నీమేస కాతలు నన్ను బ్రతుకనిచ్చునా ? యెట్లయినను జావుకు సిద్ధమే అని తలంచుచుఁ దలవంచుకొని యుత్తరాభిముఖుండై పోవుచుండెను.

దారిలో నట్టివారే దేశాటనము చేయుచున్న మువ్వురు యువకులు వానితోఁ గలిసికొనిరి. నలువురుసుఁ గలసి వినోదములగు మాటలాడికొనుచు దేశవిశేషములం జూచుచుఁ బోవుచుండిరి. ఒకనాఁడు వారు మ్లేచ్ఛజనపాలితంబగు పట్టణములోఁ బ్రవేశించిరి. అందు వసింపవగిన తావేదని యరయుచు వీధింబోవుచుండ వారింగాంచి యందలి తురకలు వారి నొకచోట నిలువంబెట్టి మీ రెవ్వరు ? ఎందు బోయెదరు ? హిందువులీపురము ప్రవేశించినచో సుంక మీయవలసియున్నది. ఆ సొమ్మిచ్చితిరా? అని యడిగిన అయ్యో ! ఇట్టి విశేషములెందుచుం జూడలేదే ! బండ్లకును గుర్రములకు సుంకములుగాని మనుష్యులకు సుంకమేమి ? మాకడ నిచ్చుట కేమియు లేదు. ఏదినమున కాదినము యాచించి భుజించుచుందుము. అని పలికిన నా ముష్కరులగు

తురుష్కులు పదుఁడు. పదుఁడు గుడిపింతుము మిమ్ము గుడిపింతుమని గెంటికొని దండనాథునింటికిం దీసికొని పోయిరి.

అతం డప్పుడు వారి తీర్పు విచారించుటకు సమయము కాకుండుటం జేసి వారిని చె సాలం బెట్ట నియమించెను. తదాజ్ఞను తురుష్కులు వారి పాదంబులకు నిగళంబులం దగిలించి యా రాత్రి బందీగృహంబునం బడవైచిరి.

అప్పుడు మదనాంకుఁడు తక్కినవారితో మిత్రులారా! మన మీ నిర్బంధమునకు వగచుట ప్రయోజనములేదు. ఇది దైవకృతము సొమ్ములేక దేశసంచారము సేయుట కష్టము. నా వలెనే మీరును విత్తహీనులై వచ్చితిరి. కానిండు. ఇప్పుడు మనము ఆ సర్వమోచనియగు దుర్గాదేవి నారాధింతము. ఆ యంబ మన కష్టములఁ దొలఁగింప గలదు. ఇంతకన్న వేఱొక సాధనములేదని వారితోఁ గూడ నద్దేవి నిట్లు స్తుతించెను.

శ్లో. నమస్తుభ్యం మహాదేవి పాదౌ తే యాపకాంచితౌ ।
మృదితాసురలగ్నాస్రపంకా వివ నమామ్యహం॥
పరిత్రాతస్త్వయాలోకో మహిషాసురమర్దిని।
పరిత్రాయస్వమాం భక్తవత్సలే శరణాగతం॥ 7.

అని యనేక ప్రకారంబుల దుర్గాదేవిని స్తుతించి నిద్రవోవుటయు నద్దేవి కటాక్షంబున వారి పాదములందలి నిగళంబుల చీలలూడి పడియున్నవి. అది యెఱింగి వారు గొలుసుల సడలించుకొని తలుపుల ద్రోసి యా వలఁబడి యూరుదాటి తెల్లవారు నప్పటికిఁ బెద్దదూరము పోయిరి. అప్పుడు సహకారులు మదనాంకునితో మిత్రుఁడా! అయ్యుత్తరదేశమంతయుఁ దురుష్కులచే వ్యాప్తమైయున్నది. వీరికి దయా సత్య శౌచములులేవు. మే మిదివఱకు మూఁడుదిక్కులు తిరిగి చూచితిమి. యిట్టి చిక్కు లెన్నఁడుం బడియుండలేదు. గొప్పగండము గడచినది. రాత్రియందు దాటి రాకున్న మనలను సురిదీయించుట నిశ్చయము. చాలు మాకీ దిక్కు చూచుట చాలు. మరలి పోవుదము. నీవుకూడ రమ్ము అని యడిగిన నతం డిట్లనియె.

నేను హిమవత్పర్వత ప్రాంతమున కరుగవలసియున్నది. మీరు మరలిన మరలుఁడు. నాకు భగవంతుఁడే తోడు కాఁగలఁడు. అని పలికి వారిని విడిచి యాగపతిపాలబద్ధుండై యొక్కరుఁడే యుత్తరాభిముఖుండై పోవుచుండెను.

మరికొన్ని పయనములు సాగించి పోవుచుండ దారిలో నలువురు పరివ్రాజకులు వానికిఁ గనంబడిరి. వారినిజూచి మీ రెందుండి వచ్చి యెందుఁ బోవుచున్నారని యడిగిన దేశములన్నియు మావే యిప్పుడు హిమవత్పర్వతమున కరుగుచుంటిమని చెప్పిరి. నేను ధన్యుఁడనైతిని. మంచి సహవాసము లభించినది. నన్నుఁగూడ మీతో నబటికిఁ దీసికొనిపొండని మదనాంకుఁడు కోరుటయు వారంగీకరించి వానితోఁగూడ బోవుచుండిరి. క్రమంబున ననేక నదీనదంబులు పర్వతంబులు మహారణ్యములు

దాటిపోవుచు నా బైరాగులు ఒకనాఁడు సాయంకాలమునకు వితస్తయను నదికిం జేరు కొనిరి.

దానిని దెప్పలతో దాటి యవ్వలిరేవు చేరునప్పటికి సూర్యాస్తమయమగు చుండెను. అందులకు వెఱవక యతెఱవరులు నంటొక దారింబడి నడువ బ్రారం భించిరి. అంతలోఁ గాష్ఠవాహకులు కొందరు కట్టెలమోపులు నెత్తిపై బెట్టుకొని వారి కెదురువచ్చి వారి పయనము చూచి అయ్యా ! చీకటిపడుచున్నది. మీ రిక్కెక్కడికి పోవుచున్నారు. యీ పైన నూళ్లేమియు లేవు. అంతయు మహారణ్యమే. కొంత దూరములో నొక శూన్యాలయము మాత్రమున్నది. రాత్రియందు బండుకొనిన బాట సారులను శృంగోత్పాదిని యను యక్షిణి వచ్చి చంపి తినుచుండును. కావున వెను కకు మరలుఁడు. అని చెప్పినమాటలు విని నవ్వుచు పరివ్రాజకు లిట్లనిరి.

ఓహో ! మా సామర్థ్య మీ రెఱుఁగక యిట్లనుచున్నారు. మే మందఱి వంటి వారము కాము వ్రతస్థులము. నిత్యము రాత్రుల శ్మశానములలో శయనింతుము. భూత భేతాళములు మమ్ముఁ జూచి పాఱిపోవును. అందుమా కేమియు భయము లేదని పలుకగా గాష్ఠ వాహకులు మేము నిజము చెప్పితిమి. తర్వాత మీ కర్మమని చెప్పి వారవ్వలఁ బోయిరి.

మదనాంకుడించక వెఱచుచు స్వామువారా ! అందుఁ బ్రమాదమున్నదని చెప్పుచుండ నందే పోవలయునా ? నేఁ డీ వితస్తా తీరమున వసించి ప్రొద్దున లేచి పోవగూడదా ? అనవుఁ డా యతు లిట్లనిరి. మదనాంకా ! ఇందులకు నీవును వెఱచు చుంటివా? మే మా శృంగోత్పాదినికి శృంగ భంగము చేసి పరిభవింపక పోవుదుమా ! పదపద ఆ వింత యేదో చూతముగాక ! అని పలికి వాని నొప్పించి అందరు గలిసి యాదారిం బోయిరి. రెండు క్రోశముల దూరమేగునప్పటికి శూన్యాలయము గనంబడి నది. ఆలయము చుట్టును కొంతదూరము బయలుగా నున్నది. మనుష్యుల యెముకలు రాసులుగా నక్కడక్కడ ప్రోగుబడి యున్నవి. వారంటొక ప్రదేశము బాగు చేసికొని యందు విభూతిచే మండల మేర్పరచు కొని మధ్య కుండము త్రవ్వి యగ్ని వేల్చుచు రక్షామంత్రంబుల జపించుచు నిద్రవోక నాయక్షిణి యెట్లు వచ్చునో యని నిరీక్షించు చుండిరి. అర్ధరాత్రమైనంత——

సీ. కంకాళకిన్నర కరమున ధరియించి
  యింపుగాదాని వాయించికొనుచు
నెర యశృంగోత్పాదినీ యక్షగామిని
  గగనమార్గమున నక్కడకువచ్చి
కనిపరివ్రాజకులనుఁ బ్రీతినచ్చోట
  హర్షంబుతో నాట్యమాచరించి

హుంఫటుస్వాహా సహస్రయతాంశిరః
శృంగాపటన్ మంత్రచింతనంబు
గీ. సేయుచుండొక యతినివీక్షించునంతఁ
దలఁగొమ్ములు మొలువంగ దద్దరిల్లి
యతఁడు వివశాత్ముఁడై లేచి యాడియాడి
పడియెనయ్యగ్నిఁ దత్కళేబరముమాడ.

అర్ధదగ్ధంబగు నతని గాత్రంబు నయక్షిణియెత్తి భక్షించి వెండియు రెండవయతిపై దృష్టులు వ్యాపింపఁజేయుచు గిన్నెర మీటి నాట్యము సేయుచు నా మంత్రంబు జపింప వానికిని కొమ్ములు మొలిచినవి. యంతలో నొడలు దెలియక లేచి వాఁడును నాడియాడి యాయగ్ని కుండములోఁ బడియెను. సగము కాలినవాని శరీరము తీసి యక్షిణి భక్షించినది. ఈ రీతి నలువురు సన్యాసులఁ గబళ న్యాసము గావించి తన్మాంస భక్షణంబున మత్తిల్లి యూరక నాట్యము చేయుచుండెను.

అప్పుడు మదనాంకుఁడు యింక తన పనిగూడ బట్టఁగలదని వెఱచుచు అయ్యో! ఈ బ్రష్టుల మాటవిని వీరి వెంటవచ్చి యిక్కడఁ జచ్చుచుంటి. వీరి ప్రగల్భముల నిజమనుకొంటి. కాష్ఠ విక్రేతలు పాపము పోవలదని చెప్పియే యున్నారు. కాలము మూడిన నీ రేమిటికి విందురు? ఇప్పుడు నాకీ దానెట్లు తప్పును? సాధనమేమనియాలోచింపుచుండ నా యక్షిణిమత్తిల్లి నొడలు దెలియక గంతు లిడుచున్న సమయంబున దాని చేతనున్న కంకాళకిన్నెర జారి నేలంబడినది. అది యెఱుంగక యక్షిణి నృత్యము చేయుచుండ మదనాంకుఁడు తటాలునఁ బోయి యా కిన్నెరం గైకొని యతి వాయించినట్లు వాయించుచు నది పఠించిన శృంగోత్పాదినీమంత్రంబు విని యున్నవాఁడగుట తానుగూడ హుంఫటు స్వాహా శృంగావుత్పాదయతాం అని పఠించుచు నృత్యము సేయుచుఁ దనచూపు లా యక్షిణిపై వ్యాపింపఁ జేసెను. అప్పుడు దానికిం గొమ్ములు మొలువ నారంభించినవి. మేను వివశమగుచుండఁ దెలిసికొని అది ప్రాణభయమునఁ గొట్టుకొనుచు వాని కిట్లనియె.

మహాసత్వా! నీ సాహస మక్కజమైనది. యమ్మంత్ర పఠనంబు విరమింపుము. విరమింపకున్న నేనుగూడఁ జత్తును. నాఁడు దాననిన్ను శరణుచొచ్చితి. రక్షింపుమని యడుగులంబడ వేడికొన్నది. ద్రోహురాలా! నీ దావునకింత వెఱచెదవా? ఇతరుల వడియముల వలె నమలివేయుదువా? నీకున్న భయము వారికేమిటి కుండదు? భూతదయ లేక నెన్ని హింసలు గావించితివో నిన్నుఁ జంపిన నాకుఁ బుణ్యమేగాని పాపములేదు. నీ వధచే లోకోపకారమగునని పలికిన నదలుచు నయ్యక్షిణి యిట్లనియె.

మహాసత్వా! నన్ను జంపకున్న నీకొక యుపకారము గావించెద వినుము. నీవు రాగవతి నిమిత్తమై హిమనగరంబున గరుగుచుంటివి. కాలినడకతో నీవెన్నాళ్ళకైన నందుఁబోఁజాలవు. నేనొక రాత్రిలో నిన్నందుఁ జేర్పగలను నన్నుఁ జంపకు

మని వేడుకొనుటయు విని యతండు సంతసించుచు నట్లు చేయుటకు దానిచేఁ నొట్టు పెట్టించుకొని యమ్మంత్ర పఠనంబు విరమించెను. వెంటనే యా యక్షిణి మదనాంకుని భుజముపై నెక్కించుకొని యాకాశమార్గమున నుత్తరముగాఁ బోఁదొడగినది.

సూర్యోదయమైన తోడనే యొకగిరి శృంగంబున వానిని దింపి మహాభాగా! మాకు రాత్రిగాని గగన సంచార సామర్థ్యము విశేషముగా నుండదు. మీరీ పర్వతమున సాయంకాలము వరకు వసించి యిందలి జలంబులం ద్రాగి ఫలంబులనుభవింపుఁడు. రాత్రి పడినతోడనే క్రమ్మఱ జనుదెంచి నిన్నా పుష్కరావతి నగరంబునకుఁ దీసికొని పోయెద నని చెప్పి యొప్పించి యప్పడతి నిజనివాసంబున కరిగినది

మదనాంకుఁడును నందున్న జలాకర తీరంబునకుఁ బోయి జలంబులం బరిశీలింప పైకిఁజూడ స్వచ్ఛములుగా నున్నవి. దోసిలితో నెత్తి విమర్శింప విషమిళితములై యున్నట్లు కనంబడినవి. రాగస్త్రీ చిత్త మిట్లేయుండునని తెలుపఁబడునట్లు అంతఃకలుషములగు నా జలంబుల ననుమానముతోఁ గ్రోలక యవ్వలఁ బాఱజిమ్మి జలము లరయుచు నాగిరి శృంగ ప్రదేశమంతయుఁ బరికించి చూచెను. ఒకచో భూమిలో పద్మరాగమణులవలె నరుణ కాంతు లీనుచు రెండు గుండ్రని గోళములు ములు గనంబడినవి. వానిని జూచి యవి యేమియోయని యాలోచింపుచు నేదియో సాధనము దెచ్చి త్రవ్వి పై మన్ను తొలగించినంత బ్రతికియున్న కోఁతి యొకటి యా గోతిలోఁ గనంబడినది. దాని కంటి గ్రుడ్లే యట్లు ప్రకాశించినవి.

ఔరా! నీ మంటిలో నీ కోఁతి యేమిటికి చిక్కుకొన్నదియో యని యాలోచించుచుండ నా వానరము నర వాక్యములతో నిట్లనియె అయ్యా! నేను మనుష్యుండ బ్రాహ్మణుండ కోఁతి నైతిని. నన్నిం దుండి పైకి తీయుము. నా వృత్తాంతమంతయుం జెప్పెదంగాక యని వేడుకొనిన నతండంవలి మన్నెట్లో త్రవ్వి యాగోతినుండి నా కోఁతిని బైకిటీసెను. యవ్వానర మతని యడుగులంబడి మహాత్మా! నీ వెక్కడ నుండియో దైవమువలె వచ్చితివి. ఇక బడి దినము లాలస్యమైన నేను యమలోకమున కరుగవలసిన వాఁడనే. నీ వొక్కండ వీనిజన ప్రదేశమున కెటుల వచ్చితివో వింతగా నున్నది. అది యట్లుండె. నాకు మిక్కిలి యాకలియగు చున్నది. అవ్వలఁబోయి యందలి ఫలంబులందిని నిర్మల జలంబులం ద్రావి తృప్తులమగుదము. నీ కతంబునఁ జిరకాలమునకు నాకు నీ యాహారము లభించుచున్నది నా పుణ్యవశంబున నీవా తటాక జలంబులం ద్రాగితివి కావు నయమే యవి విషపూరితములై యున్నవని చెప్పుచు నితనితో గూడ పై భాగంబునకుఁ జని యందలి మధురతరు ఫలంబుల రాల్చి వాని కర్పించినది. ఇరువురు నా ఫలములందిన్నిరి. అందలి జలంబులం గ్రోలి విశ్రమించిన తరువాత మదనాంకుఁ డిట్లనియె. వానరోత్తమా! నీ వాక్యంబులు విన విచిత్రముగా నున్నవి. నీవు బ్రాహ్మణుండనై యీ మర్కట రూప మెట్లు వహించితివి. నీ వృత్తాంతము చెప్పుమని యడిగిన యతం డిట్లు చెప్పఁదొడంగెను. అని

యెరింగించునప్పటికి వేళమిగిలినది. మణిసిద్ధుఁడు పిమ్మట మరియు నిట్లు చెప్పం దొడంగెను.

273 వ మజిలీ

# చంద్రస్వామి కథ

కాశీపురంబున సోమస్వామియను బ్రహ్మణోత్తముండు గలఁడు. అతడు వేద వేదాంగముల నెఱింగిన ప్రోఢయని వాడుక వడసెను. అతనికి ముదిమియందు నే నొక్కరుండ కుమారుఁడునా నుదయించితి. సఖుడా! నాకుఁ జంద్రస్వామి యను పేరు బెట్టిరి. వయసు మీరిన తరువాత జనించిన వాడనగుట నా తల్లిదండ్రులు నన్నెక్కుడు గారాబముగా బెంచుచుండిరి. బాల్యమున నే నేదిగోరిన నది తెచ్చి యిచ్చువారు. నేను మిక్కిలి చక్కని వాడనని చెప్పుట కిప్పుడు మిక్కిలి హాస్యాస్పదముగా నుండును. తలిదండ్రులు గావించు లాలనల వలన నాకు విద్యయేమియు నంటినది గాదు. బడికిఁ బొమ్మనిన జ్వరము వచ్చును. పుస్తకము చూడుమనినఁ దలనొప్పి గలుగును. ఆటపాటల వలన నా దినములన్నియుం బోవును.

వీఁడు బ్రతికినంతకాలు విద్య లేమిటికని యడిగిన వారికిం జెప్పుచుందురు. అట్లు విద్యాగంధ రహితుండనై యాటపాటలకు మఱఁగి యౌవనంబున మదనిరంతుకమగు మదనా వ్యాళగజము నధిష్టించి తిరుగు చుంటి. అవినయనిదానమగు యౌవనవికారములచే నా వేశింపబడి కోడెగాండ్రం గూడి వీధులం తిరుగుచుందు. యౌవన వతులగు యువతులం జూచి యువ్విళ్ళూరుచుందు. ఈల లూదుచు నాయట్టి సౌందర్యవంతుడు లేడని సందు సందులం దిరుగుచుందును.

నేనొక నాఁడు సాయంకాలమునఁ జక్కగా నలంకరించుకొని కుచ్చుపాగ జుట్టి చేత బెత్తముబట్టి నొయ్యారముగ నొక వీధింబడి పోవుచుండ సౌధాంతరమున గవాక్షము నుండి శ్రీగర్భుడను వర్తకుని కూతురు ప్రియంవదయను సుందరీరత్నము నన్నుంజూచినది. వెంటనే తుంటవిల్కాని బారింబడి విరహమందు చుండెను. ఆ చిన్నది వరాహదత్తుడను వర్తకుని భార్య. అతని కాపురము మధురాపురము.

శ్రీగర్భునకు లేకలేక కలిగినదగుట నా కన్యకు యౌవనోదయమైనను నత్తవారింటి కనుపక కొంతకాలము పుట్టినింటే యుంచుకొనెను ఆ ప్రియంవద నన్ను జూచినది మొదలు విరహవేదనం గొట్టుకొనుచు నెట్లో నాపేరు తెలిసికొని యొకదూతిక నొకనాడు నాకడ కనిపినది కామంధురనై యొడలు మఱచియున్న నన్నాదూతిక పేరుతో బిలిచి చాటునకు దీసికొనిపోయి యిట్లనియె.

సొగసుకాడా! నీ సౌందర్యంబు యువతుల నీ యూర మిక్కిలి ధిక్కు బెట్టుచున్నదిగదా! యిందు శ్రీగర్భుడను వర్తకుని నీ వెఱింగియే యుందువు. అతనికి చిరకాలమునకు ప్రియంవద యను కూతురు బుట్టిన విషయము లోకవిదితమే. యాకో

క నని భువనైక సుందరియని మీ బోటి కోడెగాండ్రకుఁ దెలియకపోదు. యీ నడుమ భవదీయ లోకాతిశయ తనూ విలాసములు ఆ బిసరుహాక్షికి నక్షిపర్వము గావించిన వట. అది మొద లమ్మదవతి నిద్రాహారములు లేక కందర్పభల్ల విద్ధ హృదయయై కలగుచున్నది. నాకామె ప్రాణసఖురాలు. నీ కులశీల నామంబు లెరుంగ మింజేసి నీ రూపము కన్నులకుఁ గట్టినట్లుండఁ జిత్రఫలకము వ్రాసి నా చేతికిచ్చి యిట్టి వానిని దీసికొని రమ్మని యాజ్ఞాపించినది. పదిదినముల నుండి నీ నిమిత్త మీ పట్టణమంతయు వెదకుచుంటి. నేటికి మద్భాగ్యవశంబున నిన్నుఁ గొరగంటి. ఆమె హృదయమును బొంగిలించిన యా కార మిదిగో చూడుము. అని పలుకుచు నా చిత్ర ఫలకము నా కిచ్చినది.

ఆ మాట విన్నతోడనే నేనమృత హ్రదరంబున మునిగినట్లు సంతోషపారావార వీచికల నూగుచు నొడలెరుంగక కొంతసేపు వివశుండనై యాహా! నిర్హేతుక జాయమాన కరుణాధురీణుండగు కుసుమ బాణుండు నా కెట్టి యుపకారము గావించెను. అనితర సాధ్యమగు రమ్య వస్తువును దెచ్చి నా యొడిలోఁ బెట్టుచున్నాడే. ఇట్టి యాపు డెందేని గంటా? యని మురియుచు దూతికా! నేను మహాపాతకుండ నైతిని గదా! ఆ కాతరాక్షి నా కొఱకై పరితపించుచుంటఁ దెలిసికొనలేక పోయితిని. సిరివచ్చుచుంట వలదనువాఁ డుండునా? నీకుఁ బదివేల నమస్కారములు చేయుచున్నాను. నీకు దాసుండనై నీవు చెప్పినట్లె నడచువాఁడను. సంతతము నీ వాకిటఁ బడియుండెదఁ గార్యములకు నియోగింపుము. అని పలికిన నా దూతిక యిట్లనియె.

సరసుఁడా! యిప్పుడే నా వెంటఁబుమ్ము. అలసించిన నా బాల తాళఁజాలదు. విరహానమున మ్రగ్గుచున్నది. రా రమ్మని పలికి నన్ను దన యింటికిం దీసికొని పోయి యొకగదిలోఁ గూర్చుండబెట్టినది. వయస్యా! అప్పటి నా యౌత్సుక్యమిట్టిదని చెప్పశక్యము గాదు. దూతికలు చేయుపనులు బ్రహ్మయైనను జేయఁజాలఁడు. ఆ దూతిక నన్నందుఁ గూర్చుండబెట్టి యల్లనబోయి శుద్ధాంతాంతర్వర్తియగు ప్రియం వదను గడియలోఁ బండియెక్కించి నా కడకుఁ దీసికొని వచ్చినది.

ఆ చిన్నది నన్నుఁ జూచినతోడనే సిగ్గువిడిచి దిగ్గున దనహృదయంబునం గల యనురాగ మంతయుం బ్రకటించుచు నా కనను పూర్వమగు గాఢాశ్లేష సౌఖ్య మొసంగినది. స్త్రీల మీఁద దండు వెడలెడు లోకైక వీరుండగు మారుండు ఏల్యం బించి యప్పుడ మా యిరువురపై లక్షోపలక్షలుగా విరితూపుల గుప్పివైచెను.

మిత్రమా! యింక నైనదెప్ప వలసిన దేమున్నది? బ్రహ్మానం దోపమగు సంతోష మను భవించుచు నాఁటి యామద్వయము గడియలాగున వెళ్ళించితిమి. అట్లు ప్రతిదినము నేనా దూతికయింటిలో సాయంకాలపు వేళ ప్రియంవద బండియెక్కి విహారమునకై యరుగు నెపంబున నచ్చటికి వచ్చుచుండ నయ్యంద జయానతోఁ బదిమాసములు గూడుచు నొక గడియలావున వెళ్ళించితి.

అంతలో మాకు జెడుకాలము వచ్చినది. ఎట్టి వారికిని దినములు సమముగా నడువవుగదా! ఒకనాడా వేడియ క్రీడావసానమున క్రౌందమ్మి రేకుల గ్రమ్ము తుషార బిందువువలె గన్నుల నశ్రువులం గార్చుచు నాకిట్లనియె.

మనోహరా! మన సంతోషమునకుఁ బ్రతీకార శూన్యమగు నంతరాయ మొకటి సూచించుచున్నది. మా యత్తవారి యూరినుండి నిన్న నొక యుత్తరమువచ్చినది. అందిట్లున్నది. నీ కూతరకీడేరి మూడు సంవత్సరములైనది. ఇంతదనుక నింటు బంపించితివి కావు. ఎన్ని జాబులు వ్రాసినను నిదిగో యదిగో యని జరుపుచుంటివి. వయసులో నున్న పడుచు చిరకాలము పుట్టింటనుండిన లోకులు నిందింపక మానరు. నా కొడుకు మూఁడు దినములలో మీ యూరు వచ్చుచున్నాఁడు. వెంటనే వానివెంటఁ బ్రియంవద నంపవలయు నని మా మామ నా తండ్రికి వ్రాసెను. ఆ జాబు చదువుకొని నా తలిదండ్రులానాఁడు పంపుట కనుమతించిరి. నేనిఁక మధురాపురమున కరుగక తప్పదు. మన కలయికి యిక బది దినములు మాత్రమే జరుగును. నేనీ యకాండ ప్రళయ మెటుల దాఁటుదునో తెలియదు. నిన్ను జూడనొకటా ఘడియైనఁ యుగాంతరములైనట్లుండును. నిన్నువిడచి మధురాపురంబున కెట్లు పోవుదును! ఈ వియోగదుఃఖ మెట్లు భరింతునని వెక్కి వెక్కి యేడువఁ దొడంగినది.

ఆ మాటవిని పిడుగుపడి నట్లొడ లెరుంగక నేలంబడి మూర్ఛిల్లితిని. ఆ పల్లవపాణి నాపై నీళ్ళు చల్లి సేద దేర్చినది. ఎట్టకేలకు లేచి నే నెలుంగు కాల్పడ ప్రేయసీ! నీ వెప్పుడో మృతినొందెదవుగాని నీ మాటవినిన తోడనే నా కిప్పుడే మరణ మాసన్న మగుచున్నట్లున్నది. అనివేఁడి నిట్టూర్పు నిగుడించుచు మేనంతయు వేఁడెక్కఁ బొగులుచుంటి.

మే మిరువురము నొండొరుల నూరడించుకొన లేక రాఁబోవు విరహమునకుఁ గౌఁగలించుకొని దుఃఖింపుచుండ నా దాతిక మా కడకు వచ్చి మా పరిదేవనము విని యిట్లనియె.

అయ్యో! నేఁడు చాల ప్రొద్దు పోయినది. ప్రియంవదా! యాలసించిన మీ వారు శంకింతురు. మీకు వేళ తెలియకున్నది. అందులకు బ్రతీకారము రేపాలోచించుకొందముగాక. అని మందలిచ్చిన ప్రియంవద "సఖీ! నీవు మిగుల బుద్ధిమంతురాలవు. మాకీ వియోగము తప్పించు నుపాయ మేదేని యాలోచింపక పోయినచో నీకు రెండు హత్యలు చుట్టుకొనఁ గలవు." అని దానిం బ్రతిమాలుకొన్నది. సరే చూతములే నేటికి బొమ్మని పలికి యక్కలికిని బండి యెక్కించి యింటికిం దీసికొని పోయి యప్పగించి వచ్చినది.

ఆ మరునాఁడే వాని పుట్టి యంతయు మునిఁగిపోయినట్లు ప్రియంవద మగఁడు వారింటికివచ్చెను. కాని ప్రయాణసుముహూర్తము పది దినము లెడముగా నుం

దుటచే ప్రియంవద యెట్లో సందుచేసుకొని నా కడకు వచ్చు చుండెడిది. ప్రియంవద మగఁడు చాల భాగ్యవంతుఁడు. పెక్కండ్రు పరిజనులు సేవింప నాందోళికములు గుఱ్ఱములు లోనగు వాహనములతో వచ్చి మాకుఁ గంటకము గావించెను.

నేను దూతిక యిల్లువదలక తన్ముఖముగా శ్రీగర్భునిఁ గూర్చి వార్త దెలిసికొను చుంటిని. అందుల కేదేని యంతరాయము కల్పింపుమని దూతికం బ్రార్థింపుచుంటిని. దూతిక బృహస్పతి కన్న జాల తెలివిగలది. రెండుదినము లా గ్రామ మంతయుం దిరిగి యొకనాఁడు సాయంకాలమునకు నాకడకు వచ్చి మందహాసము గావించుచు నిట్లనియె.

చంద్రస్వామీ ! నీ యదృష్టము ఫలించినది. మంచి సాధన మొకటి సంపా దించుకొని వచ్చితిని. మీ పుణ్యము వలన నీ యూరి దేవాలయములోనికి మొన్న నొక యోగిని వచ్చినది. ఆమె ప్రభావము నిని, రాత్రులంబోయి మూడదినము లామె కాళ్ళు పిసికితిని. ఆమెకు నా యెడఁ గనికరము కలిగినది. నీవేమి గోరి నన్నిట్లు సేవించు చుంటివి అని యడిగినది. దాపున నెవ్వరు లేమింజేసి రెండుచేతులం జోడించి మీ యిరువుర యనురాగ ప్రకారం బంతయు నెరింగించి యిప్పుడు తటస్థించిన వియో గోపద్రవస్థితిం దెలిసి దీనిం దప్పించు నుపాయంబు సెప్పుమని వేఁడితిని.

నా మాటవిని యాయోగిని పక్కున నవ్వినది. అదియా నీ కోరిక ? ఔను లోక ప్రవృత్తియట్టిదే. దాని నిందింపరాదు. అని పలికి యించుక యాలోచించి యోసీ! యిప్పుడు నేను నీకు రెండు మూలికల నిచ్చెద. వానిం దాయెత్తులో గట్టింపుము. ఒక దానిం గట్టిన మనుష్యుడు కోఁతియగును. రెండవ దానిం గట్టిన కోఁతి మనుష్యుఁడ గును. దీనిం బట్టి మీరు గార్య సాధనమాలోచించుకొనుడు. పో పొమ్మని పలికి యా రెండు వేరులు నాకిచ్చి యంపినది.

ఇపుడే వేరొకటిగట్టి నిన్ను కోఁతి జేసి యా నాతి వెంటనంపెద అదియుఁ దన కిష్టము వచ్చినప్పుడు రెండవవేరు గట్ట నిన్నుఁ బురుషుం జేసి నీతో గ్రీడించుగాక. ఈ యుపాయ మపాయ రహిత మగునది యగునా కాదా ? అనిపలికిన నే నెగిరి గంతువైచి యిట్లంటి. బోఁటీ ! నీబోటి లోకోపకార పారీణు లుండఁబట్టియే వసుంధర నిలువంబడి యున్నది. నీ యుపాయము వలన మేము నిరాటంకముగా సుఖింతుము. అని దానికిఁ జేయవలసిన విధానమంతయు బోధించితిని.

ఆ మరునాఁడే ప్రయాణ దివసమగుట శ్రీగర్భుండు నూరు బండ్లుతో నేబది గుఱ్ఱములతో నిరువది యాందోళికములతో వెలలేని చీని చీనాంబరము లెన్ని యేని సమకూర్చి యపూర్వమగు సారె పెట్టి కూతు నత్తవారింటికనుపుటకుఁ బ్రయాణ సన్నాహము గావించెను.

ఇంతలో దూతిక నన్నుఁ గోతింజేసి భుజముపై నెక్కించుకొని కన్నీరు గార్చుచు శ్రీగర్భునొద్దకుం దీసికొనిపోయి అయ్యా ! నా సఖురాలి విడిచి నే నెన్నఁడు

గడియ యుండలేదు. ఇపు డత్తవారింటికిం బోవుచున్నది. దీనివెంటం బోవుదమన్న నాకు గొప్ప యాటంకములు గలిగియున్నవి. మే మిసవురము నీ వానరమును సమాన ప్రేమతో బెంచితిమి. ఇది మాకుం బ్రాణప్రదమైన క్రీడనకమై యున్నది. కావున నాకు మారుగా దీనిని నా ప్రాణసఖి కర్పించుచున్నాను. దీనిం బదిలముగా నాహారాదికములిచ్చి సంరక్షింపుమని యల్లునితోం జెప్పవలయు. అని శ్రీగర్భునకుం జెప్పుటయు నతండు ప్రాంతమునం బల్లకి యెక్కియున్న ప్రియంవదకడకు నన్నుం దీసికొనిపోయి దూతిక మాటలు అల్లుడు విన గూతునకుం జెప్పెను.

దూతికయుం బ్రాణసఖీ యిపుడు నీతో నేరాజాలకున్నాను. కొలది దినములలో వచ్చి కలిసికొనియెద. నీవు తల్లిదండ్రులకు గళంకములేకుండ మెలకువతో సత్తమారింట గాపురము చేయవలయు నీ శీలము లోకులు వినుతించునట్లు మెలంగవలయు. ఇదిగో మన ప్రాణబంధువు కపిశ్రేష్ఠము నీ కర్పించుచున్నాను. దీని నాకు సమముగా జూచి క్రీడింపుచుండుము. ఇది నీ చిత్తమెఱింగి వర్తింపంగలదు. అని చెప్పి నన్నా పల్లకిలోం గూర్చుండబెట్టినది. అప్పు డమ్ముద్దియ నన్నొడిలో గూర్చుండ బెట్టుకొని ముద్దులాడుచుండ ఆ అవలదు. కోతిం గూర్చుండ బెట్టుకొనరాదు. ఇది యమంగళమని పురోహిత బ్రాహ్మణుఁడు చెప్ప శ్రీగర్భుండు జామాతనుజీరి నన్నతనిచేతం బెట్టుచు ఇది నా కూతునకు ప్రీతికరమైయున్నది. దీనిం బదిలముగా దీసికొనిపోయి కాపాడుచుండుము. అని చెప్పి యప్పగించుటయు నవుడా వరాహదత్తుఁడు ప్రత్యేక మొక పరిచారకుని నియమించి నన్నతని భుజముపై నెక్కించి దీసికొని రమ్మని నియమించెను.

స్త్రీల మాయలు, శంబరునికైనం దెలియవుగదా! అంతలోం బ్రయాణ సమయమగుటయుం బండ్లుగట్టి గుఱ్ఱములందోలి యాందోళికము లెత్తించి మంగళ వాద్యములతో బయలుదేరిరి. నన్నొక భృత్యుడు భుజముపై నెక్కించుకొని వారి వెనుక నడచుచుండెను. అట్లు నాలుగయిదు దినములు ప్రయాణము సాగినది.

ఒకనాఁడు మర్కటప్రకరభీషణంబైన మహారణ్య మధ్యనుండి నడచుచుండ నంతలో కోతులగుంపులు నన్నుం జూచి యదేమి చోద్యమో సుఖముగావచ్చి పూర్వజన్మశత్రుత్వంబునుబోలె నన్నెత్తుకొని నడుచుచున్న పరిచారకునిం బట్టుకొని విడనిచ్చినవి కావు. కిలకిలారవములు సేయుచు నన్నుంగొనవచ్చుటయు వాఁడు తోసివారిం గేకలువెట్టెను. అప్పటికా పరివారమంతయు కొంచెము ముందుగా బోయినది. వానికేకలు విని వెనుకటివారలు కొందఱుమాత్రము వచ్చి దుడ్డుకఱ్ఱలతో నా కోతిగుంపులం బెదరించిరి కాని యవి వానిలక్ష్యపెట్టక యా పరిచారకుని వదలనిచ్చినవి కావు.

అందులకు వాఁడు జడియుచు నన్నందుఁబారవైచి వాఁడువ్రేల వ్రాలిపోయెను. పిమ్మట నా యవస్థ యేమని చెప్పుదును. అవి నాపైబడి పెండ్రుకలు పీకి వక్కలై

గొరికి గోళ్లతోఁజీరి నన్నుఁ బ్రాణావశిష్టం జేసినవి. అంతలో జీకటిపడినదిగాని లేకున్న నన్నుఁజంపవలసినదే. చీకటిలోఁ గోతులకుఁ గన్నులఁగనంబడవు. నేను మూర్ఛబడి పోయితిని. ఎక్కడ కోఁతులక్కడనే యణగినవి. నాకు రాత్రి రెండు యామములకు మెలకువ వచ్చినది. పూర్వజన్మ వాసనావిశేషంబుంజేసి భగవద్ధ్యానము చేసితిని.

కర్మసూత్రమహిమవలననో యెందువలననో నా కప్పుడించుక బలము కలిగినది. అప్పుడు మెల్ల మెల్లగా నా కోఁతి గుంపులఁ దప్పించుకొని నడచుచుఁ దెల్ల వారునప్పటికి నా యరణ్యము దాటి వేఱొకయడవిలోఁ బ్రవేశించితిని. అందలి ఫలములుతిని కొంతసత్వము గలుగగనటనుండి మఱియొక యటవికింబోయి పోయి క్రమంబున ననేకారణ్యములఁదాటి చివర కీకొండశిఖరము చేరితిని.

ఆహా ! ప్రియంవదయు లభించినదికాదు. మనుష్యరూపముఁబోయి కోఁతి నయితిని. స్వగ్రామము విడిచి యరణ్యము పాలయితిని. పారదారికప్రక్రియవలన నిన్ని యిడుములు గలిగినవి. ఇట్టి నాకు భగవంతుఁడు బుద్ధిజెప్పెనని చెంపలు వాయించుకొనుచు భగవంతుని స్మరించుచు నిందు గొన్నిదినములు వసించితిని. అంత టితో విడువక దైవము మఱియొక యాపద నాకుఁ గలుగఁజేసెను.

ఒకనాఁ డొక యడవియేనుఁగవచ్చి నన్ను బట్టుకొని మేదాం భస్సుచేఁ దడుపబడిన నీ జంబాలమధ్యమున నన్నడఁగఁ ద్రొక్కినది. అప్పుడు భవితవ్యతచే నియమింపఁబడినది కాబోలు నేడియో దేవత వచ్చి నన్ను జావకుండ రక్షించినది. నే నిందు ద్రొక్కఁబడియు జావక యప్పుడప్పుడు తెలివి వచ్చుచుండ దైవమును ధ్యానించుచుందు. క్షుత్పిపాసలు నాకుఁ దెలియలేదు. అట్లు జరిగి యెన్నిదినము లైనదో గ్రహింపఁజాలను.

పుణ్యాత్మా ! యిట్టి స్థితిలోవచ్చి నన్నుద్ధరించితివి. నీ చేయి తగిలిన తోడనే నాకు స్మృతి కలిగినది. నీ పుణ్యమువలన బ్రతికితిని. ఇదియే నా వృత్తాంతము. తండ్రీ ! నీ వెవ్వఁడవు ? మనుష్య సంచారశూన్యమగు నీ యరణ్యమున కెట్లు వచ్చితివి ? నీ వృత్తాంతము జెప్పుమని యడిగిన మదనాంకుం డిట్లనియె.

వయస్యా ! మనమిరువురము మిత్రులమైతిమి. నా వృత్తాంతముగూడ కొంత నీ యుదంతమునే పోలియున్నది. నీ వలెనే స్త్రీ కర్తృకములైన కష్టములు పెక్కనుభవించితిని. దైవకృపచే మరణము దాటినది. యక్షిణీ ప్రసాదంబున నిందువచ్చితి నని తన కథయంతయుఁ జెప్పెను.

వార్త విని కోఁతిగానున్న చంద్రస్వామి ముక్కుపై వ్రేలిడుకొనుచు నౌరా ! నా వలెనే నీవుకూడ చేడియ మూలమున నితలం బొందుచుంటివే ! స్త్రీయు, స్త్రీయు, నెవ్వరియెడంగూడ దిరముగా నుండవు. సంజవలె క్షణరాగిణులైయుండును. నదివలె కుటిలాశయములై, భుజంగివలె చపలశ్వాసములై, మెఱపువలె చంచలములై

చెప్పుచుండును. అయ్యో! ఆ విద్యాధరకన్యక నీయం దాక్షణము సత్యమైనం గావచ్చును. ఆ యనురాగము స్థిరముగా నుండునని తలంచను. పాపము నీ వామె కొఱకు పడరానికష్టములం బడి పోవుచుంటివి. ఆ నాతి సజాతి పురుషుని విడిచి పెర జాతివైన నీయం దనురాగవతియై యుండునా? బాబూ! కింపాకఫలతుల్యము విపాక విరసము నైన స్త్రీ నిమిత్తక ప్రయాసముల విడువుము. నీవా విద్యాధరపురమున దిరుగవలదు. యక్షిస్కంధమెక్కి రేపు మీ పురంబునకుం బొమ్ము. మిత్రుడా! నా మాట వినుము. నేను నీ వలెనే మిత్రునిమాట వినక యిన్నియిడుములం గుడిచి తిని. వినుము.

## భవశర్మ కథ

ప్రియంవదయందు నాకుఁగల యనురాగమంతయు నొకనాడు నాకు మిత్రుడు భవశర్మ యనువానితోఁ జెప్పికొని కోతినై నే నిప్పు డా నాతి వెంట బోవు చుంటినని రహస్యముగా వానికిఁ దెలియజేసితిని. నన్నతఁడు మందలించుచు నిట్లనియె.

తమ్ముడా! నీవు స్త్రీ చిత్తదోషంబులెఱుఁగవు. మిక్కిలి చంచలమైనది. దుర్గమమైనది. నీవు స్త్రీకి వశవదవు కాకుమా! అయ్యో! నీవు కోతివై యా నాతివెంట నరుగుచుంటివా! ఇంతకంటె నీచమే దైనంగలదా? పోవలదు. రూపము మార్చు కొనుము. కష్టపడియెదవు. నాకిం దనుభవము చాలగలదు. స్త్రీలవలన నే పడిన కష్టములు చెప్పెద వినుము.

ఈ కాశీపురమందే యొక సుందరమైన స్త్రీ కలదు. దాని సౌందర్యము వర్ణనాతీతమైయున్నది. నాకును దానికిని దైవయత్నమున సంయోగము కలిగి నది. మా యనురాగము లిట్టివని చెప్పఁజాలను. క్షణము చూడకున్న నిలువలేకి పోవువారము. అట్లు కొన్నిదినములు గడచినవి. ఒకనాఁడు నా కేమిటికో దానిపై కోపము వచ్చినఁ బ్రణయమున ప్రేలితో బుగ్గపై గొట్టితిని. అంత మాత్రమునకే యా క్రూరాత్మురాలు సహింపక పండ్లు కొరుకుచు నోరీ! మూర్ఖుఁడా! నన్ను నీ పెండ్లా మనుకొంటివిరా? ఇట్లు గొట్టితివేమి? ఇదివరకు నీవంటివాండ్రెందరైరనుకొంటివి! ఇఁక బుద్ధిగలిగి యుండుము. నీ పాట్లు చూచుకొందువుగాక యని దుర్భాషలాడి నది. నేను సిగ్గుపడి యేమియుఁ బలుక నేరక యూరకుంటి.

మరునాఁడు నాతో నవ్వుచు బరిహాసవచనములాడియాడి నా మెడలో నేదియో త్రాడుగట్టినది. వెంటనే నేనొక యెద్దునైతిని. అది నన్నొక సంతకుఁ దోలుకొనిపోయి పసవుల వర్తకుల కమ్మివేసినది. వాండ్రు నాపై గోనెలువైచి మోయించుచు సంతలకుం ద్రిప్పుచుండిరి. కొన్ని దినము లట్టి కష్టములు నే ననుభవించితిని. ఆ కాశీపురంబుననే బంధమోచనికయను యోగిని కలదు. నేనా గోనెల

మోసికొని పోవుచుండ నొకనాఁడు దారిలో నన్నామె చూచినది. నాయం దామెకు నిర్హేతుకముగా దయగలిగినది. నా చెంతకువచ్చి చూచిచూచి గురుతెరిఁగి నా మెడలో నున్న సూత్రమును లాగి త్రెంచిపారవైచినది. అపుడు నేను యథాప్రకారము పురుషుండ నైతి. గొప్ప వర్తకుఁడు నన్నందుఁగానక పరితపించుచు దసయెద్దు పారిపోయినదని నలుదెసలకు వెదుకఁబంపెను.

పిమ్మట నేనా బంధమోచనికకు నమస్కరించుచుఁ బెద్దగా స్తుతించితిని. నన్నామె వెంటబెట్టుకొని మాటలాడుచు బోవుచుండ దైవయత్నమున నొకచోట నాకా సోమిద యెదురుపడినది. అది నన్ను జూచి కన్నులెఱ్ఱజేయుచు బంధమోచనికతోఁ బాపీ! నీ వితని పశుత్వము వదలింతివా? వీఁడు నా యెడ మిక్కిలి యపరాధి యయ్యెం. కానిమ్ము. ఇందులకు నీవుగూడ ఫల మనుభవింతువుగాక! అని పలికి యా సోమిద యవ్వలికిఁ బోయినది.

బంధమోచనిక దానిచర్య లెఱింగినదగుట తత్ప్రతీకారమాలోచించి నాతో నిట్లనియె. ఓయీ! ఇది మహా క్రూరాత్మురాలు. పెక్కుతంత్రము లెఱింగినది. రేపిది యెఱ్ఱగుఱ్ఱమై మా యింటికివచ్చి నన్నుఁ జంపుటకు యత్నించును. నే నప్పుడు నల్లగుఱ్ఱమై దానితోఁ గలియఁ బడుదును. అప్పుడు మాకు పెద్దజగడము జరుగును. మే మెంతవారలము జయింపఁ జాలము. నీవు ఖడ్గపాణివై మా యింటికి రమ్ము. నేను సంజ్ఞచేసినపుడు కత్తితో దాని పాదముల నరుకుము. ఇదియే నీవు చేయఁ దగినదని చెప్పి తనయిల్లు గురుతుచెప్పి యంపినది.

నే నా రాత్రియెల్ల నిద్రబోక ధ్యానించుచు నెట్టకేలకుఁ దెల్లవార్చితిని. మఱునాఁడది చెప్పినవేళకు దాని యింటికిం బోయితిని. అప్పుడే రెండు గుఱ్ఱములకుఁ బోట్లాట జరుగుచుండెను. నేను వేచి యుండి, నల్లగుఱ్ఱము సకిలించినతోడనే కత్తిచే నెఱ్ఱగుఱ్ఱముకాళ్ళు నరికివైచితిని. అది నేలంబడినది. వెంటనే బంధమోచనిక దానిపైంబడి కఱచి కఱచి తన్ని తన్ని గడియలో మడియఁజేసినది.

అప్పుడు నేను తిర్యగ్జన్మభయము విడిచి యా యోగిని పాదంబులం బట్టుకొని కృతజ్ఞత దెల్పుచు స్తుతించితిని. ఆమె నన్నుఁజూచి ఓయీ! నీ వెన్నడును పరస్త్రీ సంగమమునకు బ్రయత్నింపకుము. ఇష్టమున్న నెత్తిపైఁ బెట్టుకొని సంతలో నడగఁ ద్రొక్కుదురు. జాగ్రతగామని నాకు బోధించినది. అది మొదలు పరస్త్రీ యన్న భయపడుచుందును. శాకినీ జాతిం జూచిన దరికిజేరకుందును. మిత్రుఁడా! నీవు చాల ప్రమాదమైనపని జేయుచున్నావు. ప్రియంవద శాకినీ సంబరాలని తెలియుచున్నది. దానివెంటఁ బోవుచున్నావు. ఎప్పుడో కోపమువచ్చి నిన్ను బరిభవింపక మానదు. తమ్ముఁడా పోవలదు. అని బ్రతిమాలుకొని చెప్పెను.

అతని నీతివచనములు నా మది కప్పుడేమియు నెక్కనవికావు. కాంతాసక్తచిత్తులు హితుంమాట మన్నింతురా? ప్రియంవద యట్టిదికాదు. మా స్నేహము

నీకేమి దెలియును? గడియ నన్నుఁ జూడకున్న బ్రాణంబులు విడువఁగలదు. నే నామె వెంటఁ బోవక మానను. అనవుడు నీ కర్మము నే నేమి చేయుదును. నా వలెనే కష్టము లనుభవింపగలవు. తరువాత నీకే తెలియఁ గలదు. అని పలికి వాఁడవ్వలఁ బోయెను.

వాని మాటలు విననందులకు ఫలమనుభవించుచున్నాను. మదనాంకా! నీవును రాగవతినిగురించి పెద్దదూరము వచ్చితివి. ఆ విద్యాధర కన్యక కింతకాలము నీ మాట జ్ఞాపక ముండునా! నీ వంత పోవలదు. తరువాత నీ చిత్తమనిపలికిన మదనాంకుఁ డిట్లనియె.

మిత్రుఁడా! నీ వనినమాట వాస్తవమే కాని యించుక తారతమ్యము వివరింపవలసి యున్నది. పరిశుద్ధమగు విద్యాధర కులంబున జనించి దేవకాంతకు స్త్రీవలె ద్రోహము చేయునా! అది పుంశ్చలికాదు. నన్నుఁ బెండ్లియాడు తలంపుతో రమ్మనెను. ఇంత దూరము రానే వచ్చితిమిగదా? అందుంబోయి యదియుం బరికించి వచ్చెదంగాక అని చెప్పి వాని నొప్పించెను, అట్లు వారు మాట్లాడుకొనుచుండగనే సాయంకాలమైనది. కుముదాంకునకు హితముచేయువాఁడుం బోలె మిత్రుఁడు పశ్చిమగిరి సానువుల నలంకరించెను. చీకటులు నలుమూలలు వ్యాపించినవి. యక్షిణీ దేవతరాక కెదురుచూచుచుండెను. అని తలంచు చుండఁగనే శృంగోత్పాదిని యచ్చోటి కరుదెంచినది

ఆమెం జూచి మదనాంకుఁడు మురియుచు యామె భుజమెక్కి పోవుచుండ మర్కటము మిత్రుఁడా! నీ వరుగుచుంటివి. ఒకదినము గలిసికొనినను మన స్నేహము దృఢమైనది. దేవతా స్త్రీ వ్యామోహంబునంబడి నన్ను మరువకుము. నీ వెట్లయిన నా యీ రూపుపోవు నుపాయ మాలోచింప వలయునని కోరుటయు నతం డొప్పుకొనియెను.

ఆ యక్షిణి యతని భుజముల నెక్కించుకొని గగన మార్గంబున నర్ధరాత్రమునకుఁ బుష్కరావతీ నగరంబునకుం దీసికొనిపోయి బాహ్యోద్యాన వనంబున దింపి జ్ఞానకూటంబున రాగవతి యున్న నెల వెరిఁగి చని నిద్రించుచున్న యమ్మించుబోఁడిని లేపి యిట్లనియె.

రాగవతీ! నేను మదనాంకుని పరిచారికను. నా పేరు శృంగోత్పాదిని యందురు. నే నతనిచే జయింపఁబడి వాని నిందు మోచుకొని వచ్చితి. ఊరిబయల తోటలోఁ నున్నాఁడు. నీ వెప్పుడో యుజ్జయినీ నగరంబునకరిగి వాని నిందు రమ్మంటి వట కదా! ఆ వార్త నీకుఁ జెప్పుమనియె. ఏమందువనవుఁడు నా యువతి స్మృతి నభినయించుచు ఔరా! వాఁడు విడువక యింతదూరము వచ్చెనా? వాని సామర్థ్య మక్కజ మైనదియే. అని పలుకుచు నోరు తెరుఁగకుండ దాని వెంట నా తోటలోనికి బోయినది. యక్షిణి యతనికిం రాగవతిం జూపుచు మదనాంకా! యిదిగో రాగవతి.

నే జెప్పినమాట చెల్లించు కొంటిగదా ? తెల్ల వారుచున్నది. ఇఁక నిందుండరాదు. పోవలయును అనుజ్ఞయిమ్మని పలికి యా యక్షిణి నిజవాసంబున కరిగినది.

రాగవతియుఁ జిరకాల దర్శనంబునకుంగల యౌత్సుక్యముఁ బ్రకటింపుచు గాఢాలింగనము జేసుకొని మిక్కిలిగా సన్మానించినది. అప్పు డతనికి దారిలోఁబడిన యిడుములన్నియుఁ మఱపు గలిగినవి. రాగవతి మనుష్య సంపర్కము తలిదండ్రులెఱింగిన మందలింతురని వెఱచుచు విద్యాబలంబున నతోటలో నొక గృహము నిర్మించి యొరు లెఱుఁగ దెలియకుండఁ గొన్ని దినంబు లతనితో గలియుచుండెను.

ఒకనాఁడు రాగవతితో నతండు మర్కట వృత్తాంతము జెప్పి యతని మనుష్యునిఁ జేయు సామర్థ్యము నీకుఁ గలదాయని యడిగెను. ఆ జవ్వని నవ్వుచు శాకినీ డాకిన్యాదు లట్టిపనులు చేయుచుందురు. మేమది చేయఁజాలమని పలికిన నతండు పోనిమ్ము. నా మిత్రుఁడు నా నిమిత్తమై పరితపించుచుండు. నన్నొకసారి యచ్చటికిఁ దీసికొని పోవంగలవా ? అని యడిగిన నప్పడఁతి యిట్లనియె.

మదనాంకా ! ఉత్పాతిని అవతరిణీ విద్యలు రెండు నీ కుపదేశించెద. వానివలన నీకుఁ గగనసంచారశక్తిఁ గలుగగలదు. దానంబోయి వత్తువుగాక. అని చెప్పి యా విద్య లుపదేశించినది తన్మహిమవలన నొకనాఁ డతఁడు గగనమార్గంబున మర్కటశృంగమున కరిగెను. అందు మిత్రునింజూచి గాఢాలింగనము చేసికొని వయస్యా ! సేమముగా నుంటివా ? మీ దయవలన నేను రాగవతితోఁ గలిసికొంటి. దివ్యభోగము లనుభవించుచుంటి. ఆ వాల్గంటి సౌందర్య మిట్టిదని చెప్పఁజాలను. దానిం జూచిన కన్నులతో మనుష్యుల జూచిన నేవబుట్టక మానదు. కామదవలె మోసము చేయు నంటివి. అట్టిదైన నాకీ యుత్పతనవిద్య నుపదేశించునా? నీ విషయ మంతయుం జెప్పితిని. జాలిపడినది. అని తా ననుభవించిన సౌఖ్యము లన్నియు దెలియజేసి యతని సంతోష సముద్రములో ముంచెను. అని యెఱింగించు నప్పటికి వేళ మిగిలినంత. మణిసిద్ధుం డవ్వలికథ పై మజిలీయం దిట్లు చెప్ప దొడంగెను.

## 273 వ మజిలీ

కం. విద్యుచ్చపలలు ప్రమదలు
సద్యః ప్రమదప్రవల్ విదారింపఁగ యో
షిద్భోగము సంకటమగు
విద్యాధర కన్యలైన వేలుపులైనన్. 1.

రాగవతి మదనాంకుఁ డరిగిననాఁటి సాయంకాలమునఁ దలయంటికొని దల విప్పి కొనగోళ్ళ నారవైచుచు నింటిముంగలి రత్నవేదిక ప్రక్కనున్న గున్నమామిడి చెట్టుక్రిందఁ గూర్చుండి పరికింపు చుండెను. అంతలో రాకభంజరుఁడను విద్యాధర

కుమారుఁ డాదారింటోవుచు నా పూఁబోణింజూచి మోహపరవశుండై తనవిద్యచేఁ గదు దంతయుఁ దెలిసికొని సమీపమున కేగెను. అక్కాలికయు వాని చక్కదనమున కక్కజపడుచు నట్టెలేచి సిగ్గున దలవంచుకొని లోపలకింబోయి తలుపు సగము వైచి కొని చూచుచుండెను.

అతఁడును చొరవచేసి యత్తెఱవదరికిఁ జేరి తరుణీ! నన్నుఁజూచి లోపలి కేగితివేల? నేను మీ కులమువాఁడనే. చపలయౌవ్వనులగు మనుష్యులమునుగాను. నీ యట్టి చక్కఁదనము గలిగియు విద్యాధర కన్యవయ్యు సామాన్యమానవుని వరించితి వని తెలిసికొని నిన్ను నునయింపవచ్చితిని. మనజాతికెల్ల నపఖ్యాతిఁ దెచ్చితివిగా! అయ్యయ్యో! భూలోకమెద మనలోకమేద! వారివేడుక లేవ మనవేడుకలేవ! సీ! సింహము నక్కను చేపట్టినట్లున్నది. నీవుకోరిన నే విద్యాధరకుమారుఁ డనుమతింప కుండెడిని; నిన్నుఁజూచిన నెవ్వండు వలవకుండును? నా మనసు మోహవివశమైనది. నా విద్యచే నీ వృత్తాంతము దెలిసికొంటి. ఇప్పుడైన వానివదలుము. ఇష్టమైనచో నే నిన్ను వివాహమాడెద. నా కిదివఱకెవ్వరు నచ్చలేదు. నిన్నుఁజూడ వేడుక గలుగుచున్నది. అని పలికిన విని యక్కాలికి యాత్మగతంబున నిట్లు తలంచెను.

ఈతఁడనినట్లు నేను విద్యాధరకన్యనై నీచుఁడగు మనుష్యకుమారుని వరించి ప్రమాదమే చేసితిని. ఆ మాత్రపు చక్కనివారు విద్యాధరకులంబున లేరా? స్త్రీ చిత్తమువిధ నిట్లేయుండును. కానిమ్ము. గతమునకు వగవనేల. ఈ కుమారుఁడు మారుని మీరియున్నవాఁడు. వీని మాటలు కర్ణరసాయనముగా నున్నవి. వాఁడు నా కుచితుఁడు. కాఁడు నా కుఁ బుస్తె కట్టెనా? బొమ్మనినంతో కేమిచేయును. ఇప్పుడు వీనిం బరిగ్రహిం చుటయే లెస్స. అని తలంచుచు వేడుకచూపులు వానిపై వ్యాపింప జేయుచు నిట్లనియె.

రాగభంజనా! నీవనినట్లు నేను తప్పుపనియే చేసితిని. అప్పటి పరిస్థితుల ననుసరించి యట్లనవలసి వచ్చినది. కానిమ్ము. వెల్పులకుఁ బురుష సంపర్కదోషము లేదుగదా! మీ మాటలచే వాని విడిచితిని. నన్ను భార్యగా స్వీకరింపుము. అంగీకరించితినని పలికినది. అప్పుడిరువురు నొండొరుల కంఠములలోఁ బుష్ప మాలికలు వైచికొని గాంధర్వవిధిం బెండ్లియాడిరి. పిమ్మట వారిపై శంబరారి పుష్ప బాణవర్షము గురిపించెను. ఇరువురుం గలిసికొని విలాసములతో గ్రీడించిరి.

నాఁటిరాత్రికి మిత్రునొద్దనుండి మదనాంకుఁ డింటికివచ్చెను. తలుపులు వేయఁబడి యున్నవి. అయ్యో! యింకనుం బ్రొద్దుగ్రుంకలేదే. రాగవతి పిరవ తనముచే నా కొఱ కెదురుచూచుచు వాకిట నిలువంబడి యుండుననుకొంటి. అప్పుడే పరుండుటకు బ్లవేమి? అని యాలోచించుచుఁ దలుపు సందునుండి లోపలకుఁ జూచెను. అప్పటికత యెవ్వనితోనో సుచ్చరించుచున్నట్లు వినంబడినది. బంధువు లెవరైన వచ్చిరా? తలుపులు వేయుటకుఁ గారణమేమని యాలోచించి కొంతసేపు రాగవతి

రాగవతీ యని మెల్లగాఁ బిలిచెను. పలుకలేదు. తరువాత కొంచెము స్వరము పెద్దది చేసి పిలిచెను. ప్రతివచనములేదు. కేకలు పెట్టెను. వినిపించుకొనలేదు. తలుపు గుంజగా గుంజగా గొంతసేపటికి దానికిఁదెలిసి తలుపుదాపునకువచ్చి లోపలనుండియే అప్పుడే మించిపోయినట్లే వచ్చితివే? మిత్రునికడ గడియయైన నిలువలేదా? యేమయిన నేమి? నీ రాక మా తలిదండ్రులకుఁ దెలిసినది. వారు నన్ను మందలించిరి. ఇఁక నీ విందుండరాదు. భూలోకమునకుఁ బొమ్ము. నీవు భూమి చేరువఱకు నృత్యతనవిద్య నిలుచును. పిమ్మట బోవు. ఇఁక నన్నుఁ బిలువకుము. అని లోపలికిఁ బోయినది.

ఆ మాటలు చెవులకు శూలములైనాట నేలంబడి మూర్ఛిల్లెను. రాగవతీ యని పలవరించుచు లేచి నా కిది స్వప్నమా? రాగవతి నిజముగా నన్నుఁ బొమ్మన్నదా? అట్లనదు. భ్రాంతిపడితినని మరల తలుపుగొట్టి "రాగవతీ" యని పిలిచెను. విడువక పిలుచుచుండ నయ్యంగజయాన వెండియు నక్కడికి వచ్చి "ఛీ! మూర్ఖుడా! పొమ్మనినం బోక పిలిచెదవేల? మా వారు విన్న నిన్ను శిక్షింతురుసుమీ! వేగబొమ్ము. ఇందు నిలువకు" మని కసరిపోయినది.

మదనాంకుఁడు కడఁక యా యరుగుమీఁదఁ గూర్చుండి దుఃఖించుచు నడుమనడుమ "రాగవతీ! యిట్లు చేయుదువా!" అని పలవరింపుచు నివసింప నింతలోఁ దెల్లవారు సమయమైనది. అప్పుడు రాగవతి తలుపుదగ్గరకు వచ్చి యోహో! నీ తగులము బలీయముగా నున్నదిగదా! పొమ్మనిన వదలవేమి? తెల్లవారిన నా తలిదండ్రు లిందు వత్తురు. నిన్నుజూచి కట్టింతురు. నీ కితంబున నాకుఁగూడ యాతనములు జరుగును. పొమ్మన్నఁ బోవేమికర్మము. అని తలుపు దీసికొని కాలితోఁ దన్నిపోయి తలుపు వైచికొనినది.

అప్పుడు మదనాంకుఁడు మర్కటమిత్రునిమాట తలంచుకొనుచు దాని యెడ నిరాశపడి రివ్వున నెగసి గగనమార్గంబున మర్కట కూపంబున కరుదెంచెను. ఆ వానర మతనిం జూచి మిత్రమా! నాలుగుదినములవఱకు రానని చెప్పితివే! నేడే వచ్చితివేమి? రాత్రి యింటికిం బోయితివా? రాగవతిం గలిసికొంటివా? నా కతంబున నీ సుఖంబున కంతరాయము కలుగుచున్నది. పాపము నీ మొగము చిన్నవోయియున్నదేమి? చెప్పుమని యడిగిన వాఁడిట్లనియె.

వయస్యా! నీ వాక్యమే వేదవాక్యమైనది. నీవు చెప్పినట్లే జరిగినది. ఆ యింతి నిన్నరాత్రి యెవ్వనినో యింటబట్టుకొని నన్నుఁబొమ్మన్నది. నీ వనినట్లాఁడు జాతి కడుపాపజాతిగదా? అయ్యయ్యో! అది వఱకున్న యనురాగమంతయు రాగవతికి గడియలో వదలినదే! నీతోఁ జెప్పుటకు సిగ్గగుచున్నది. ఎంతయో బ్రతిమాలికొంటి. వీధి యరుగుపైన ధూళిలోఁ బండుకొనియుండ నించుకయు జాలిలేక కాలితోఁ దన్ని యవ్వల బొమ్మన్నది. లోపల నెవ్వఁడో పురుషుఁ డున్నట్లు పొడకట్టినది,

అది: ఇడు నాయం దెంత యనురాగ మనుకొంటివి. ఒకసారి రత్నమంజీరము నా శిరముపై దగిలి టొప్పిగట్టినది. అందులకెంతయో యొదార్చినది. ఆ ప్రేమ ఆ యనురాగ మెప్పుపోయినదో? తమ్ముడా! నేను నీ వలెనే స్త్రీ మూలమున భ్రష్టుడనై పోయితిని.

నా గగన సంచారపాటవము రేపటితోఁ బోవునఁట. వేగపోకున్న నీ కొంతకాలము చుండవలసివచ్చును. అని చెప్పిన విని మర్కటము ముక్కుపై వ్రేలిడి కొని ఓహో! ఆ ప్రోధ నిన్నెప్పుడో భంగపఱచు ననుకొంటిని. వెంటనే చేసినదా! భాసిమ్ము. అందులకు వగవ బనిలేదు. ప్రాణములతో వచ్చితివి. ఇదియె పదివేలని సంతసించుచు సతని నూరడించెను.

పిమ్మట మదనాంకుఁ డామర్కటమును బుజముపై నెక్కించుకొని యుత్ప తన పిద్యచే నెగసి దక్షిణాభిముఖముగా బోయెను. ఆ నడుమ నరణ్యములు, పర్వ తములే గాని జనపదంబులేమియుఁ గనంబడలేదు. అంతలో సాయంకాలమైనది. పైన టోలేక వెలుగుండఁగనే యొక కొండశిఖరమున డిగి విశాలరమణీయమగు నా కూట విశేషంబులఁ బరికించుచు నొక శిలాభాగమున విశ్రమించెను. మర్కటమందలి ఫల ములఁ గోసికొనివచ్చి యిచ్చినది. ఇరువురు వానిందిని యాఁకలి యడంచు కొని వినో దముగా నిట్లు మాట్లాడుకొనిరి.

"మిత్రమా! మనము ముందుగా భూలోకమున నెక్కడ దిగుదము." అని యడిగిన చంద్రస్వామి మధురాపురంబునకుం బోవుదము. అందు నా రూపు వాపు కొను మనుష్యుండనైనపిమ్మట మీ దేశమున కేగుదమని యుత్తరమిచ్చెను. మదనాం కుడు నవ్వుచు ప్రియంవద నిన్నందుఁజూచి పోవలదన్న నందుండెదవా? నా వెంట వత్తువా? అనవుఁడు ఛీ! ఛీ! ఇకనే నా ప్రసంగము వినవొల్ల. అందులకుఁదగిన ప్రాయ శ్చిత్తమైనది చాలదా? అని చెప్పెను. నేనును నిక కాంతా భోగవిముక్తుండనై విరక్తిఁ దపం బాచరించుకొనియెద. నే నిల్లు విడిచి యెంతకాలమైనదో తెలియదు. నా తల్లి నా కొఱకు పరితపించు చుండునేమో నీతోఁజెప్పుట మఱచితివి. నాకు జిన్నదనము నుండె పెండ్లిచేసిరి. నా కులములోఁ జక్కని కన్య లుండరని నీ వెరింగియే యుందువు. అది కాపురమునకు వచ్చినదికాని నల్లగనున్నదనియు, జాణకాదనియు నసాపసమదంబున నే నప్పు డమ్మదవతితో నిష్టముగా నుండక తిరుగువాఁడ. ఆ చేడియయు నా దల్లియు నిప్పుడెట్లున్నారో తెలియదని చెప్పెను.

చంద్రస్వామి—ఓహో! నీవు గృహస్థుఁడవైతివా? నా వలెనే బ్రహ్మ చారి వనుకొంటి అయ్యో! కట్టుకొన్న భార్యను విడచివచ్చుట చాలతప్పు. అని యిట్లు చాల ప్రొద్దుపోవువఱకు ముచ్చటించుకొనుచు క్రూరమృగబాధ వచ్చునేమోయని మెలకువ నిద్రవోరైరి.

ఆ ప్రాంతమందలి యొక గుహలో ప్రవేశించి విద్యాధరదంపతు లిట్లు సంభాషించుకొనిరి.

విద్యాధరి—మనోహరా! విద్యాధరుని కూఁతురు రాగవతి మిక్కిలి సౌందర్యవతి యని చెప్పుకొనియెదరు దాని మనపిల్లవాని కిమ్మని యడుగరాదా!

విద్యాధరుఁడు—దానికథ నీవు వినలేదు కాఁబోలు. అది సౌందర్యవతియే కాని దాని గుణము మంచిదికాదు.

విద్యాధరి—మనవానికిచ్చినచో దాని దుర్గుణములు పోవు నట్లు నేసుదిద్ద గలను. అడిగిన నిత్తురా?

విద్యాధరుఁడు—ఓసీ! నీవు వట్టి మూర్ఖురాలవు. గుణములు సహజముగా నుండవలయునుకాని దిద్దిన వచ్చునవి కావు. రాచ బిడ్డయగుగాక, చక్కనిదగుఁగాక, దుష్టవతి యగు యువతిం జేసికొనుట కంటె కురూపియైనను శీలవతింజేసికొనుటలెస్స. ఇందులకు నీకొక కథ జెప్పెద సావధానవై యాకర్ణింపుము. అని చెప్పునప్పటికి కాలా తీతమగుటయు మణిసిద్ధుండు తరువాతి కథ పై మజిలీయందు మరియు నిట్లు చెప్పెను.

## 274 వ మజిలీ

# దుర్లలితకథ

ఒక గ్రామమందు వజ్రసారుఁడను పేరుఁడు కలడు. అతఁడు భాగ్యవం తుండు. అతనికి దుర్లలితయను భార్య పూర్వకర్మ పరిపాకంబున లభించినది. ఆమె భర్తయం దత్యంతానురాగము గలిగి మెలంగు చుండునది. తన భార్యవంటి పతి వ్రత భూలోకములో లేదని యతండనుకొనువాడు. ఆమె యేమి కోరినను దెచ్చి యిచ్చుచుండును. పరిచారకలఁ బెక్కండ్రఁ బెట్టి యుపచారముల సేయించు చుండును.

దుర్లలిత తమ్మునకు వివాహము జరుగునని మామగారు పిలువ వచ్చెను. వజ్రసారుఁడు ముందుగా భార్యనంపి తానువెనుక చని పదిదినములు మాత్రమందుండి యా యుత్సవములలో బాల్గొని యనంతర మింటికిం బోవుటకుఁ బయన మగుటయు గొన్ని దినములు కూఁతు నందుంచుమని యత్తగారు నిర్బంధించెను. వజ్రసారు డను మతించి భార్య నందువిడచి తానొక్కరుఁడే యింటికివచ్చి వ్యాపారము చేసి కొనుచుం డెను. అతని భార్య అన్న గడవునకు వచ్చినదికాదు. రోగ మనియు వ్యాధియనియు పేరులు పెట్టి జాగుచేసినది.

అప్పుడు వజ్రసారుడు తద్వియోగము సహింపజాలక లంపటుఁ డను మిత్రు నింజీరి యొకనాఁడిట్లనియె. ఓయీ! నా భార్యకు దేహములో స్వస్థత లేదని జాబులు వచ్చుచున్నవి. కార్యాంతరముల వలన నాకందుఁ బోవుటకుఁ దీరిక లేకున్నది. నీవు

చూచిన నేఁ జూచినట్లే యుండును. మా యత్తవారింటికిం బోయి నా భార్యం జూచి వత్తునే" యని చెప్పిన వాఁడొప్పుకొని యప్పుడే బయలుదేరి నాఁడా యూరి కేగెను. లంపటుఁడు మిగుల నేర్పరి. అందు వజ్రసారుని మామవలన సత్కృతులంది తాను దెచ్చిన కానుకలర్పించెను.

దుర్గలిత వానిరాక విని లేని రోగమభినయించుచు నతనితో అయ్యా! నీ మిత్రులెట్లున్నారు? నేనిక్కడ నుంటినే గాని నా పంచేంద్రియములు నక్కడనే యున్నవి యేమి చేయుదును ఈ పాడు రోగము నన్ను విడువకున్నది. మాయింటి వైద్యుఁడు నమ్మకమైనవాఁ డిందుఁ గలఁడు. కిదలఁ గూడదని చెప్పుచున్నాఁడు. సిగ్గు విడిచి నీతోఁ జెప్పుచున్నాను. ఇప్పుడు భర్తతో సంపర్కము కూడదఁట. అందుల కందు రాకున్నాను. నీ స్నేహితుని మనస్సు నీ వెఱుఁగుదువు గదా! నన్నందు లక్ష్యము సేయనీతురా! ఈ మాటయే యక్కడ సెప్పుము. మరియొక నెలకు తప్పక రాగలను. అని యెన్నియో వాక్యములు లుపన్యసించినది.

ఆ మాటలు విని వాఁడది కపటమని గ్రహించి పడినా! నీతో నొక్కరహస్యము చెప్పుచున్నాను. వినుము. నీ వందు వచ్చినచో లక్ష్యము జరుగదని సంశయింప నక్కఱ లేదు. నా మిత్రుఁ డిపుడొక వేశ్యకు గన్నెరికము చేసినాఁడు. భాగుగా నాలోచింపఁ గొనుము. నీవు రాకున్నఁ గాపురము చెడిపోగలదు. తెలిసికొనుమని పలికిన నక్కలికి గుండెపైఁ జేయివైచుకొని యిట్లనియె.

అమ్మయ్యా! యిప్పటికి నా దిగులు పోయినది. తుమ్మెద యెన్ని పూవుల మీఁద వాలదు? మగవాఁడు తుమ్మెద వంటివాఁడు. ఆమాట వినినంత నాకు సంతసము గలిగినది. నే నెన్నినాళ్ళుండుండినను చింత లేదు. ఆయన నిమిత్తమే విచారించుచుందు. ఆ కొదవ తీరినది గదా! చాలు. నారోగము పూర్తిగాఁ గుదురువఱకు రానని చెప్పుము అని పలికిన విని యతండేమియుం దోచక యందుమరి పది దినములుండి దాని చర్యలన్నియుఁ గ్రహించి యింటికిం బోయి వజ్రసారునిం జూచెను.

అతఁడు మిత్రనింగౌఁగిలించుకొని లంపటా! నాభార్యంజూచితివా? యెట్లున్నది! యెప్పుడువత్తునన్నది? మద్వియోగమువలనఁ జాల కుందుచున్నదనుకొందు. అచ్చటి విశేషములు సవిస్తరముగాఁ జెప్పుమని యడిగిన నవ్వుచు నతఁ డిట్లనియె.

మిత్రుఁడా! నీకుఁ బాండిత్యము లేకపోవుటయేగాక విద్వాంసుల సహవాసమైన గలిగినది కాదు. దానంజేసి లోకజ్ఞానము నీకంతగా లేకపోయినది.

శ్లో॥ స్వాతంత్ర్యం పితృమందిరే నివసతి ర్యాత్రోత్సవేసంగతిః
పత్యుర్వార్ధక మీశితుః ప్రవసనం సాశస్య హేతుస్త్రియః 10

అని గ్రంథములు ఘోషించుచున్నవి. అరుంధతి వంటిదైనను పైకారణము వలన పతఁతి చెడకమానదు, వానిలో నీదువచ్చిన తనువాతఁ బుట్టినింట నెక్కువ కాలముండిన మరియుం బ్రమాదము. పాప మజది పెండ్లి కాగానే నీ భార్యం

దీసికొని రాకపోవుట, మీది తప్పు. ఇప్పుడు నీతో నేమని చెప్పుదును ? నీ భార్య వైద్యునితో సంబంధము గలుపుకొన్నది. అంతటితో విడువలేదు. అంత కన్న నీతోఁ జెప్పజాలను. నీవిఁక దాని సంపర్కము వదులుట లెస్స. నీకు ప్రాణ మిత్రుఁడ గావున నింతగట్టిగాఁ జెప్పుచుంటి అని తెలుపుటయు వ్యాపారుఁడు నివ్వెర పడి యేమీ! నా భార్యయే చెడిపోవుట ? ఎట్టిమాట వింటిని. భూమి తలక్రిందైన నట్టిపని సేయదని నా యాశయము. కానిమ్ము నీ వూరక యసత్యమాడవు. నేను పోయి పరీక్షించి తీసికొని వచ్చెద. కులటయని తోచిన విసర్జించెద. అని పలికి ఆ మరునాఁడే బయలుదేరి యత్తగారింటి కరిగెను.

అల్లుఁడు వచ్చెనని మామ మిగుల గౌరవించెను. అత్తగారు చిత్తమెరిఁగి మాట్లాడి సత్కరించినది. బావమఱఁదలు పరిహాసమాడిరి. భార్య మెల్లగా దాపునకు వచ్చి బుడిబుడి దుఃఖములు ప్రకటించుచు నీరసము గలుగునట్లు మూల్గుటయు నతం డిట్లనియె. "నీకు రోగమని తెలిసినది. అదియెట్టిది ? మూల్గుచుంటివి. ఏమిబాధ ? నీ యొడలు చూడఁ జిక్కినట్టు లేదే" అని యడిగిన నవ్వేలది యిట్లనియె.

మనోహరా ! నా తెవులు మీతో నేమని చెప్పుదును శరీర మెప్పటివలెనే యుండును. కాని లోపం సారమేమియు లేదు. సంతతము కడుపులో బాధగానుండును. తలపోటునకు మేరలేదు. అన్నము సహించును. జీర్ణము కాదు. ఇందులకై మిమ్ము విడిచి యిచ్చోనుంటి. మీ నిమిత్తమే వగచుచుంటి అని యేమేమో యిచ్చకపు మాట లాడినది. ఆ మాటలు కపటములని గ్రహించి యతండు సరే కానిమ్ము. నిన్నందు తీసికొనిపోయెద. రేపు పయనము అని చెప్పుటయు నప్పడఁతి నాథా ! వైద్యుఁడు క్రొత్తమందు నిన్ననే మొదలు పెట్టెను. దాని గుణము పది దిన ములకు దెలియునఁట. నిత్యము వచ్చి నాడులు పరీక్షించుచుండవలయునఁట. అందు లకై యీ పది దినములుండి పిమ్మట వచ్చెద. అనవుఁడు కావలసిన నా వైద్యుఁ డందే రాగలఁడు. ఆ మందందే తీసికొనవచ్చును. రాక తప్పదని ప్రయాణ సన్నా హము గావించెను.

వాని యత్తమామలు అతనిమాట కేమియు ప్రత్యుత్తరమీయలేక పోయిరి. ఆ మరునాఁడే బోయీలరప్పించి పల్లకి లెక్కించి తగు పరిజనులతో భార్యం దీసి కొని తనయూరి కేగుచుండెను.

ఒకనాఁడు దారిలో నొక యడవి నడుమ బసచేయవలసి వచ్చినది. అందు సవారి దింపించి పరిజనములనెల్ల దూరముగఁ బొమ్మని భార్యను కొంతదూర మవ్వలికిఁ దీసికొనిపోయి మెల్లగా నిట్లనియె ఓసీ ! నే నిన్నొక్కమాట యడిగెద నిజము చెప్పెదవా అనుటయు నది అయ్యో ! చెప్పకేమి. యెఱిఁగిన విషయమైనచోఁ దప్పక చెప్పెదనని పలికినది.

నీవు పుట్టినింట నుండినపుడు పరపురుషులతోఁ దిరిగితివని తెలిసినది. ఆ

మాట సత్యమాయని యడిగిన నతఁడణి జంకును గొంకును లేక మంచిమాటయే యడిగితివి. అందులకు నే నేమని చెప్పుదును? మీ కెట్లు దోచిన నట్లనుకొనుడు. మీ రందు వేశ్యకన్యకకు గన్నెరికము చేసిరఁట. అది నిజమా యసత్యమా? ఇదియు నట్టిదియే యనుకొనుఁడు. అని నిర్లక్ష్యముగా నుత్తరమిచ్చినది. అతనికిఁ జాల కోపము వచ్చినది. ఓసి రండా! నా మాట కెంత గరువముతో నుత్తరమిచ్చితివి నిన్నిప్పుడు విరూపిం జేసెదఁ జూడుము అని పలుకుచు నవారీతాళ్ళుదెచ్చి రెక్కలు విరిచి యొక చెట్టునకుఁ గట్టి కత్తితో ముక్కు చెవులు గోయ ప్రయత్నించెను.

అంతలోఁ దద్దేహలావణ్యము వాని హృదయ మాకర్షించినది. వెంటనే సంకల్పభవుఁడు వాని హృదయంబునఁ బ్రవేశించుటచే సంభోగేచ్ఛ సూచించెను. ఆ జవరాలు ఛీ ఛీ నీచుఁడా? నీవు నన్ను జంపినం జంపుదువుగాక! నీతోఁ గలయిక నే నొల్లనని పెనగులాడినది. అతనికి మోహమగ్గల మగుటయు దాని యడుగులం బడి వేడుకొనియె.

అప్పు డప్పడతి నీవు మూర్ఖుఁడవు నే జెప్పినట్లు చేసితి వేని యంగీకరింతు. నీవు నన్ను గట్టిన కట్టులతో నీ చెట్టునకు నిన్నుగట్టెద. అందుల కంగీకరింతువేని పిమ్మట నంగీకరింతు. లేనిచో నొప్పుకొనను. చంపినం జంపివేయుము. అని పలికెను. వాఁడు నప్పటి యౌత్సుక్యమునఁబట్టి యందుల కంగీకరించెను. పిమ్మట దాని కట్టులన్నియువిప్పి యా త్రాళ్ళు దానికిచ్చి కట్టుమని తనయవయవముల నర్పించెను.

అప్పుడా ప్రౌఢ యారజ్జువులం దీసికొని చేతులు వెనుకకు విరిచి యిటు నటు కదలకుండఁ గట్టిగా నా చెట్టునకుం గట్టినది. ఇట్టుగొట్టుకొనుచు గదలలేక వాఁడెట్టకే నా బాధ సైరించి ఓసీ! యిక చాలదా. విప్పివేయుము రెక్కలు నొప్పి పెట్టుచున్నవని పలికిన నా చెడిపె యక్కటికము లేక యక్కడనున్న కత్తి దీసికొని వాని ముక్కు చెవులంజెక్కి ఘోరముగా రక్తముగారుచుండ నోరీ మూర్ఖుడా! ఇప్పుడు నన్ను నీవేమి చేయఁగలవు. నిశ్చయముగా పరపురుషులతో దిరిగితివి. నీ బ్రతుకింతియేయని, విప్పివైచిన వాని బట్టలు గట్టుకొని పురుషవేషమువైచికొని యెక్కడికో లేచిపోయినది.

అప్పుడు వజ్రపాలుఁడు ఘోరముగా నఱచుచు బాధం బొరయుచుండ నారొదవిని పల్లకి బోయీలును పరిజనులువచ్చి వానిం జేరికొనిరి. దిగంబరుడై ముక్కు చెవులు కోయఁబడి విరూపుండై యున్న వజ్రపాలుంజూచి పరిజనులు హాహాకారము సేయుచు అయ్యగారేమైనది? మిమ్మెవ్వరిట్లు కోసిరి? దొంగలు వచ్చిరా యేమి? అని యడిగిరి. వాఁడు నిజముచెప్పుటకు సిగ్గుపడి యేదియో బొంకెను. తరువాత వాండ్రు కట్టులువిప్పి పుట్టములు గట్టనిచ్చి యా పల్లకిలోఁ గూర్చుండబెట్టికొని యింటికిం దీసికొనిపోయిరి.

ఆ వార్త విని లంపటుఁడువచ్చి వజ్రసారుంజూచి దుఃఖింపుచు మిత్రుఁడా! నీ కీ యవస్థ యెట్లువచ్చినది? నీ భార్యం దీసికొనిరాలేదేమి? అని యడిగిన నతఁడు జరిగిన వృత్తాంతమంతయు నతని కెఱింగించెను. ఆ కథవిని యతఁడు విస్మయ శోకములతో అయ్యో! నే నప్పుడే చెప్పితిని కాదా? నా మాట వినకపోవుటచేతనే నీ కీ ముప్పు వచ్చినది. పోనిమ్ము బ్రతికి యీవలఁ బడితివి. అని యూరడింపుచు వైద్యుల రప్పించి మందు వేయించి యా వ్రణములు కొన్ని దినములకు మాన్పించెను.

తరువాత వజ్రసారుఁడు తిరుగా వివాహము చేసికొనుమని మిత్రుఁడు బోధించినను వినక స్త్రీజాతియందే ద్వేషమువహించి మరియొకరీతిగాఁ గాలక్షేపము సేయుచు దన జీవితము గడుపు కొనయెను.

దుర్గలితయుఁ బురుషవేషము వైచికొని యయ్యటవిదాటి కొంతకాలము దేశాటనము గావించెను. ఆసేతుహిమాచల మధ్యమున్న దేశమంతయు దిరిగి యందందు సుందరులైన విటపురుషులతో గలిసికొనుచు యథేష్ట కామముల నడ్డు సెప్పువారులేక ప్రవర్తించినది.

అట్లు కొంతకాలము జరిగినంత నా దుర్భర గర్భవతియైనది. ఆ చిహ్నముల దెలిసికొని కొన్ని దినంబులకు బుట్టినింటికిఁ జేరినది. దాని తలిదండ్రు లంతదనుక నత్తవారి యింటనున్నదేయని తలంచుచుండిరి. దాని రాకవిని చూచి వారు వెఱగుపాటుతో అమ్మా! ఇది యేమి! కూడ నెవ్వరులేక యంతదూర మేకాకి యొంటిగా వచ్చితివెట్లు? ఈ నడుమ నీ వార్తలే మాకు తెలియుటలేదు. నీ మగఁడు కుశలియై యున్నవాఁడా! ఏకతమవచ్చితివి, చెప్పుమని యడిగిన నా చెడిపె రహస్యముగాఁ దల్లి కిట్లనియె.

అమ్మా! నన్నుఁ జిరకాలము మీ యింటఁ బెట్టుకొనిరని మీ యల్లునకు మీపై గోపము వచ్చినది. అందులకై జాబును వ్రాయుట మానివేసిరి. ఇపుడు నేను గర్భవతినైతిని. ఆ చిహ్నముల దెలిసి నేను మా తలిదండ్రులకు వార్త నంపుదు. వారు వచ్చి నన్నుఁ దీసికొని పోవుదురని చెప్పిన ఆయన యొప్పికొనిరి కారు. మీ కీ వార్తయే తెలుపవలదనిరి. ఆ విషయమై మా యిరువురకుఁ గొంత తగవు కలిగినది. నన్ను బురుడక్కడే పోసికొనుమనిరి. నే నందుల కంగీకరింపక మా పుట్టినింటికిం బోయెద. వారు నా కెన్నియో ముచ్చటలు దీర్తురు. పోవక మానను గట్టిపట్టు పట్టితిని. పో పొమ్ము నీ కర్మము నీతో నెవరినిం బంపనని తిట్టిరి. నెట్లయినను సరేయని యొక పరిచారకుని మాత్రము దీసికొని బండియెక్కి వచ్చితిని. ఆ మాటవిని తండ్రి అయ్యో! అతనికిఁ గోపము వచ్చినదా? ఏమిటికి వచ్చితివి? ఎక్కడనైననేమి? సుఖంబున్న చాలునని యె.

తల్లి కన్నీరుగార్చుచు అయ్యో! నీ మగండెంత మూర్ఖుఁడు. రాకరాక చిరకాలమునకు నీవు నీరుమోసికొనిన నిందు బంపఁడనెనా? అవును. వానికిఁ

తోబుట్టువు లెవ్వరు లేరుగనుక తెలియదు. ఒక్క దాసినిం బంపెనా? మాకు వార్త లంపిన మే మందలము బంపక పోదుమా? పోనిమ్ము. అతఁడువచ్చి నిన్ను బ్రతిమాలుకొనువరకు వెళ్ళనేవద్దు. కొడుకుబుట్టిన నెవసికొఱకు వచ్చును. అని యుం దాప్పినది. కూతునకు కావలసిన పదార్థములు తెచ్చిపెట్టుచు యెక్కువ ప్రతి పత్తితోఁ జూచుచుండిరి.

క్రమంబున నెలలు ముడిరినవి. దశమ మాసాంతమున దుర్లలిత కుమారుని గనినది. పుత్రోత్సవము పెద్దగా పంచిపెట్టెను. అల్లున కా శుభవార్త గల పంపలయునని తలంచెగాని కూఁతు రేదియోచెప్పి తెలుప నిచ్చినదికాదు. పురిటింటికి నెలదాటినతోడనే సమయోత్సవములు చేసిరి. జాతకర్మ చేసికొనుటకు నల్లునికి వార్త సంపపలయునని తండ్రి మూడవ మాసమునందు బ్రయత్నింప దుర్లలిత వారించుచు మా యాత్త వారింట బొమ్మిదవ మాసమునంగాని బారసాల చేసుకొను వాడుక లేదట, అప్పుడు తెలియజేయవచ్చునని యాటంకపరచినది.

దుర్లలిత కుమారునకుఁ దొమ్మిదవమాసము వచ్చినతోడనే తన కలవాటు పడిన వైద్యునితో నాలోచించి యవ్వుడు వజ్రసారుని స్థితి యెట్లున్నదో తెలిసికొని రమ్మని యాయూరు పంపినది. అతండు చూచివచ్చి నీ భర్త యిప్పు డాసన్న మరణుండై యున్నవాఁడు. ఏడెనిమిది దినములకంటె నెక్కువ బ్రతుకఁడు. మంచము మీఁద నున్నవాఁడు స్నేహితుఁడు లంపటుఁడే యుపచారములు సేయుచున్నాఁడు. అని యెఱింగించెను. ఆ మాట విని యాబోఁటి యిదియే సమయమని తలంచి తల్లిదండ్రులతోఁ జెప్పి పల్లకి చేసికొని కుమారునితోఁ గూడ నత్తవారియూరు బోయినది.

లంపటునింట పల్లకి దింపించినది. అతం డప్పుడే వజ్రసారు నొద్దనుండి భోజనమునకై యింటికి వచ్చియున్నవాఁడు. బోయీల యోంకారధ్వనుల విని వాకిటకు వచ్చెను. పల్లకి దింపినతోడనే యెవరో యని చూచుచుండ దుర్లలిత కొడుకు నెత్తుకొని యావలకు వచ్చినది. లంపటుఁడు దానింజూచి యాశ్చర్యపడి యేమాటయుం బలుకనేరక తెల్లపోయి చూచుచుండ నా దుండగురాలు "లంపటా! నన్ను మఱచితివా? నీ మిత్రునిభార్యను దుర్లలితను. ఇటునటుచూచి వీఁడు నీ మిత్రుని క్షేత్రజుఁడు. నీ వెఱుంగని ధర్మము లుండవు. జరిగిన కథ నీవు వినియేయుందువు. అని కాల దుర్విశేషముకాని బుద్ధిపూర్వకముగాఁ జేసినదికాదు. తప్పులేని యాఁడువారుందరు. నీ వన్నిటికిని సమర్థుఁడవు. ఎట్లో మా కాపురము చక్కసేయుము. నీ పాదంబులం బట్టుకొనుచున్నాను. వీఁడు నీకును కుమారుఁడే" అని పలుకుచుఁగుమారునితోఁ గూడ నతని పాదంబులఁ బడి యభయహస్త మిచ్చుదనుక లేచినదిగాదు.

అతండు వెఱఁగందుచు నిట్లు తలంచెను. "ఆహా! స్త్రీలవంటి సాహసికులు మఱియెవ్వరు లేరు. ఈ రండ మగని మరణప్రాయమైన యాపద నొందింపఁ

జేసి యెందో లేచిపోయి యెవ్వరికో కుమారునింగని యిప్పు డితఁడు దావనున్నాఁడని తెలిసికొనివచ్చి యిప్పుడు తనకాపురము చక్కఁజేయుమని నన్నుఁ గోరుచున్నది. యెంతో ప్రౌఢగాకున్న నిట్లు వచ్చునా? ఇప్పుడు నేనేమి చేయుదును? మిత్రుఁడు రెండుదినములలోఁ జావఁగలడు. మరణశాసనము వ్రాసెనుగాని స్థిరపడలేదు. ఇప్పుడు స్మృతి తప్పినది. ఆస్తి దాయాదుల పాలగును. దశవిధపుత్రులలో దత్తుని కంటె క్షేత్రజ్ఞుడే ముఖ్యుఁడని చెప్పఁబడుచున్నది. సమయమునకు వచ్చినది. ఎంత చెడినను వాఁడు మెడకు మంగళసూత్రముగట్టిన పెండ్లామగుంగదా! ఎక్కడివారలో తినుటకంటె దానికిఁ బుట్టినవాఁడే తినుట యుచిత మేమోయని యాలోచించుచుండ నది పాదములు బట్టుకొని విడువక పెద్దగా స్తుతించెను.

అప్పుడతఁడు వదలుము వదలుము. నీ మగఁ డిప్పుడునిర్యాణ సన్నాహములో నున్నాఁడు వానిం బ్రతికియుండగా సుఖపెట్టలేక పోయితివి. అట్టి కరుణా కుండైన భర్తను దయలేక ముక్కునుం జెవులుం గోసి విడిచితివి. ఏ లోకమును బొందుదువోగదా? సిగ్గుచే నీ వార్త మే మెక్కడం జెప్పియుండలేదు. దొంగలు పరిభవించిరని చెప్పితిమి. ఈ సంతాన మెందుఁగని వచ్చితివి? ఇంత సిగ్గుమాలిన దాని నే నెందునుం జూడలేదె? అని మందలించిన కొంగువట్టి నీ వేమన్నను నంగీకరింతు. నీ పాలఁబడితి. రక్షించినను భక్షించినను సరేయని ప్రతిమాలుకొన్నది.

వానికిఁ గనికరము గలిగినది. అతం డారహస్య మెవ్వరికిం దెలియనీయక యా పిల్లవాడు వజ్రసారునికొడుకేయనియు నతనివార్త విని భార్యాపుత్రు లిప్పుడే వచ్చిరనియుఁ బ్రకటింపుచు నా పల్లకితోఁగూడ వారిని వజ్రసారునింటికిం దీసికొని పోయి ప్రవేశపెట్టెను. వజ్రసారుని కప్పటికి స్మృతియేలేదు. నాఁటిరాత్రియే యతండు ప్రాణములు విడిచెను.

అతని కపరసంస్కారములన్నియు వాసుదేవుఁడను పేరుగల కొడుకునే కర్తగాఁ జేసి జరుగఁ జేసెను. తరువాత నా యాస్తియంతయు వానిపేర లెక్కలలో వ్రాయించెను. దుర్లలిత పుత్రునితోఁగూడ నా యింటిలోనికి కర్త్రిణియై లంపటుని సహాయమున వ్యవహారములు సవరించుకొనుచుండెను.

లంపటుఁడు వజ్రసారునియందుఁగల విశ్వాసమునంజేసి వాని కుటుంబ మగుట వీరియందుఁగూడ నభిమానము గలిగి యెవ్వరేని యాక్షేపించిన పూఁచికొని వచ్చి యామె చెడునడత యేమియు బయలుగాకుండ కాపాడుచుండెను. వ్యవహార మంతయుఁ దనకు వశమైనది. జ్ఞాతుల తగవులు తీరినవి. భూములు స్వాధీనమైనవి. ఇంక లంపటునితోఁ బనియేమియు లేదని తోచినప్పుడు దుర్లలిత వానిపై నేవియో లేనిపోని యపరాధములు గణించి వానియింటికి రాకుండఁ జేసినది. అంత కన్న గృతఘ్నురాలుండెనంగలదా? యాపత్సమయమున వాఁడు దానిం గాపాడక

పోయినచో దానికి యాస్తి దక్కునా? ధన మత్తతచే నది వాఁడుచేసిన యుపకారమే మఱచిపోయినది.

లంపటుఁడు వారి వ్యవహారములు చూచుట మానివేసెను. కుమారుం డంత సమర్థుండు కాకపోవుటచే కాఁపులు పొలములసొమ్మి యక చిక్కులు పెట్టుచుండిరి క్రమంబున నైశ్వర్యము క్షీణదశకు వచ్చినది. కృతాంతుం డూరకుండునా? దుర్లలితకుఁ గాలమాసన్నమగుటయు యమదూతలు వచ్చి యమలోకమునకుఁ దీసికొని పోయిరి.

అప్పుడు యముఁడు సింహాసన మలంకరించి చిత్రగుప్తుల రప్పించి ఇట్లు విచారించెను.

యముఁడు—ఇది యెవతె?

భటులు—స్వామీ! దుర్లలితయను బ్రాహ్మణస్త్రీ. దీనికిఁ గాలమగుటయు లాగికొనివచ్చితిమి.

యముఁడు—చిత్రగుప్తులారా! ఇది గావించిన పుణ్యపాపము లెట్టివో వినిపింపుఁడు.

చిత్రగుప్తులు—పుస్తకములువిప్పి యిట్లు చదువుచున్నారు.

స్వామీ! ఇది బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకు జనించినది.

సీ. మగఁ డుంచికొనిన కోమలికి గర్భము వాయ
నౌషధం బిడి భ్రూణహత్య చేసె
సహమల్లుకొనలేని యపనిందమోపి తాఁ
బడసె వాగ్బ్రహ్మఘ్న పాతకంబు
పతికృతకార్య తత్పరులనుండి ధనార్థ
నా వాప్తిఁ జౌర్యక్రియాఘమంచె
బతియిచ్చినట్టి భూవసతులఁ గైకొని
దానఘ్న పాతకత్వము వహించె

గీ. అంకుతనమున కెదురిచ్చి బొంకులాడె
జేయరానట్టి చెడు పనుల్చేసె ఘోర
పాపముల కాకరంబు లోభముల కెల్ల
దానకంబీ యధర్మకృతఘ్నురాలు. 10

యముడు—ఏమీ! ఇది యిన్ని పాపములు చేసినదియా?

చిత్రగుప్తులు—స్వామీ! యింకనుజాల్గఁగలవు. చిత్తగింపుడు.

గీ. నాల్కగాదిది చర్మయంత్రంబుగాని
గడియ కొకరీతి బెక్కుమార్గంబులఁ బలుకు

నిలుకడయొకింతలేదు దుర్నీతిపరత
తావలంబపుమలకు నీ కృతఘ్నురాలు.

గీ. కార్యమున్నప్పు నిజమస్తకమునఁ బెట్టి
కొనును పనిదీరినంత నాతనినిఁ గ్రిందఁ
ద్రోయు విశ్వాస మేమఱ ద్రోహకారాలు
తావలం బన్నిటికి నీ కృతఘ్నురాలు. 12

గీ. కలదు శూర్పనఖకు దాటకకు హిడింబి
కైన నొకకొంత సాధుత్వ మరసిచూడ
లేదు దీనికిఁ గోపావలిప్తమైన
తరి మహాకాళియగు నీ కృతఘ్నురాలు. 13

యముఁడు-ఏయే దుర్లలిత! నీవు భ్రూణహత్యాది మహాపాపములు జేసితి వని చిత్రగుప్తులు చెప్పుచున్నారు. ఒప్పుకొనియెదవా ?

దుర్లలిత—రామరామ ! నేను భ్రూణహత్య యెప్పుడు చేసితినండి.

చిత్రగుప్తులు—నీ మగం డుంచుకొనిన యువతి గర్భవతి యగుడు పుండిడి దానిగర్భము నీవు చెడఁగొట్టలేదా ?

దుర్లలిత—అదియా ! నే నెక్కడనో దాటుగుండ నెవ్వరికిం దెలియ కుండఁ బెట్టినదార్థ మీ కెట్లు దెలిసినది బాబూ! ఔను! దానికి గొడుకుపుట్టిన నాయాస్తి పంచుకొనునని యెవ్వరో సెప్పఁగాఁ జేసితిని పొరబాటే.

యముఁడు—అన్ని పాపములు నిట్లే చేసితివి. బ్రహ్మహత్యయు, భ్రూణ హత్య, దొంగతనము, కృతఘ్నత్వము యీ మొదలగు దోషముల నీయం దారో పింపఁబడినవి. తెలుసుకొంటివా?

దుర్లలిత—బ్రహ్మహత్య యెప్పుడు చేసితిని ?

చిత్రగుప్తులు—ఒక బ్రాహ్మణుని జంపెనని నొకనిపై నిందవేచితివి జ్ఞాపక మున్నదా? ఏమియు నెరుఁగనివాని నంటివి గావున నిన్నా దోషమంటినది. నీ మగఁ డిచ్చిన భూములు లాగికొంటివి. మగనితోఁ బనిగలిగి వచ్చినవారికడ సొమ్ము గైకొని పతికిం జెప్పవైతివి. అది చౌర్యక్రియయైనది. అన్నింటికిం బెద్దది కృతఘ్న త్వము. నీ కొఱకై కష్టపడి పరమోపకార మొనరించిన లంపటునియెడ విరోధ మూనితివి. ఇంతకన్న దోషమేమియున్నది ?

దుర్లలిత—నే ననేక యాత్రలు సేవించితిని. ఓపినకొలఁది దానధర్మ ములు చేసితిని. ఆ పుణ్య మీ పాపంబులం బోఁగొట్టదా ? చిత్రగుప్తులు—

సీ. కాశికానగరంబు గనుఁగొంటిఁ బలుమారు
గంగలో మునుఁగంగఁ గంటిననుచు
రహి హరిద్వారంబు బ్రహ్మకుండములోన
జలికోర్కి గ్రుంకులు సలిపితిననుచు
బదరికా బ్రహ్మకపాలాది తీర్థముల్
నయమొప్ప సేవించినా నటంచు
నుడిపి రామేశ్వరా ద్యుత్తమక్షేత్రముల్
పరికించివచ్చితిఁ బరంగ ననుచు
గీ. తలఁతువేమొకో నీవు కృతఘ్నురాల!
పుడమిలో లంజ పితరులఁ కిడిదివంబు
టపగనుంగొనినట్లు సద్వృత్తిలేక
లేదు సుకృతంబు నీ కందు లేశమైన. 14.

చ. ఉత్తరముల్ ధరిత్రిఁగల యూళ్ళకునూళ్ళకుఁబోయిరావొ క్రొ
వ్వెత్తి సుషాదివార్చరము లెప్పుడు నీటమునింగియుండవో
యత్తెఱఁగెల్లఁదీర్థములకై చని వారి మునిగినంత స
ద్వృత్తి యొకింతలేక కలదే సుకృతంబు కృతఘ్నురాలికిన్ 15
అదియునుంగాక—

గీ. ద్రవ్యశుద్ధి హృచ్ఛక్తియె దాతృశుద్ధి
మొదటనే లేదు పాత్రశుద్ధిదశ సున్న
నీవుచేసెడు దానముల్ నిష్ఫలములు
తలఁప దాంభికములుగా కృతఘ్నురాల. 16

అనుటయు వారిమాట కేమియుఁ బ్రత్యుత్తర మీయలేకపోయినది. యముండు దాసిచరిత్ర మంతయు సాంతముగాఁజూచి తీర్థయాత్రలకు ఫలం బేమాత్రమైన నీయకున్న బురాణంబుల కతివ్యాప్తి వచ్చుఁగావున దీనిం బొలుత నరకం కంబులం బరవైచి పిమ్మట బుణ్యఫలం బేదో యనుభవింపఁజేయుఁడని యాజ్ఞాపించెను. కింకరులట్లు గావించిరి. ప్రేయసీ! దుష్టస్త్రీ సంబంధమువల్ల నెట్టి యాపదలు తటస్థించినవో తెలుసుకొంటివా? కావున రాగవతి మనకుమారున కిచ్చినను నే నంగీకరింపనని విద్యాధరుఁడు చెప్పెను. ఆ దంపతులు తెల్లవారువఱకు నందుండి యుదయంబున నెం దేనింబోయిరి. వారిమాట లన్నియు విని మదనాంకుఁడును చంద్రస్వామియు నవ్వుకొనుచు ఓహో మనకెందుఁబోయినను దుష్ట స్త్రీ చరిత్రలే వినఁబడు చున్నవి. కావున నిఁక మనము పత్న్యన్వృత్తికిఁ జొరఁగూడదని నిశ్చయించుకొనిరి.

అంత సూర్యోదయము కాఁగానే మదనాంకుఁడు మర్కటమును బుజముపై నెక్కించుకొని గగనంబున కెగసి దక్షిణముగాఁ బోయి పోయి సాయంకాలమునకు

జనపదంబులం బ్రవేశించెను. అంతటితో నతని యుత్పతనవిద్య నశించినది. అట నుండి పాదచారులై ప్రయాణము సాగించిరి మార్గమడిగి తెలిసికొనుచు, నటనుండి మధురాపురంబునకుఁ బది దినములకుఁ జనిరి. అందు వరాహదత్తుని యిల్లెక్కడ యని యడుగుచుఁబోయి తెలిసికొని ద్వారమున నిలువంబడి యిందు వరాహ దత్తుఁడున్నాఁడాయని మదనాంకుఁడు కేకవెట్టెను. లోపలనుండి యెవ్వడో పరిచారకుఁ డీవలకు వచ్చి కోతితో నున్న యతనిం జూచి నీ వెవ్వఁడవు? అట్లరచెద వేమి? యని యడిగిన నేనుజ్జయినీ పురవాసుఁడను. కాశీనుండి వచ్చితిమి శ్రీగర్గునివార్త చెప్ప వలసి యున్నది. వరాహదత్తు నిట్లు రప్పింతురా? ఆయనభార్య ప్రియంవద లోపల నున్నదా? యని యడిగిన వాఁడు కసరుచు "పో పొండు మీరు సందర్భము లేక మాట్లాడుచున్నారు. శ్రీగర్గుఁడు చనిపోయి యారుమాసములు దాటినది. అక్కడ నుండియే మీరు వచ్చినచో ప్రియంవద యిందున్నదా యని యేల యడుగుదురు? ప్రియంవదకు పిచ్చిం జెడినది. మీరు మరియొక నాతిం బెండ్లియాడిరి. పో పొం" మని చెప్పి వాఁడు తలుపువైచుకొని లోపలికింబోయెను.

ఆ మాటవిని మదనాంకుఁడు సిగ్గుపడుచు "చంద్రస్వామీ! ప్రియంవద చరిత్రము వింటివివా? ఇందేల యుండును మగనివిడిచి పుట్టినింటికే పోయినదఁట. ఇప్పుడందుఁ బోవు మందువా" యని యడిగిన చంద్రస్వామి యిట్లనియె. మిత్రుఁడా! నన్నీరూపమునుండి తొలఁగించువఱకు నన్ను విడువఁగూడదు. ఇప్పుడు కాశీపురంబునకుఁ బోవుదము. అందా మూలిక సంపాదించితివేని కృతార్థులమగుదుము. అని ప్రోత్సహించుటయు వాని వెంటఁబెట్టుకొని మదనాంకుఁడు కొన్నిదినములకుఁ గాశీపురంబున కరిగెను.

అందు మర్కటము దారిసెప్ప నతండు తిన్నగా దూతిక యింటికిఁ బోయెను. దానిం బలుకరించి యీ వానర మెట్టిదో యెఱుంగుదువా యని యడుగుటయుఁ గోతులకు గురుతులుండునా? నే నెఱుఁగనని యుత్తరము చెప్పినది. అప్పుడా మర్కటము గబాలున నురికి దాని పాదంబులఁబడి తల్లీ! నన్ను మరచితివా? నీ చేతనే గాదె నాఁడు ప్రియంవద నిమిత్తమై యిట్లు చేయబడితిని. మరణతుల్యములైన యాపదలం బొంది యీ పుణ్యాత్మునిచే రక్షింపఁబడి యిందుఁ దీసికొని రాఁబడితిని. నన్ను వెండియు మనుష్యునిఁ జేయవా? అని బ్రతిమాలి కొనియెను.

దూతిక "ఓహో! ప్రియంవద తొలి యవ్వనము కొల్లలాడిన పల్లవుఁడవు నీవా బాలూ! ఈ తరువాత ప్రియంవదకు నీ వంటివారు పదుగురు విటులైరి. మగని విడిచి వచ్చి యిందేయున్నది. రోగములచే బాధపడుచున్నది. ఆ మూలిక యింకను దాచియుంచునా? అయ్యో! మూలిక యిచ్చిన యా యోగిని యూరికేగినది. కొన్నిదినములలోఁ దిరుగ రాఁగలదు. అంతదనుక నిందున్నచో నిన్ను

బురుషుం జేయగల"దని చెప్పినది. మదనాంకుఁడాటమా విని "దూతికా! ఆమె వచ్చుదనుక నీ వానరమును మీ యింటను విడిచెద. ఆమె వచ్చిన తరువాత వీనిం బురుషుంగావింపఁ జేయుము. ఈ లోపల నేను మా యూరు కేగి వత్తు"నని చెప్పుటయు నదియొప్పుకొనినది.

మదనాంకుడు చంద్రస్వామికిం జెప్పి యొప్పించి యటనుండి కదలి యుజ్జయినీపురంబునకుఁ బోవుచుండెను. దారిలో నొకనగరము కనుపించినది. ఆ పట్టణ వీథిం బోవుచుండ నొక యంగడి ప్రక్క-వర్తకులు కొందరు ముచ్చటించుకొనుచు లోకములోఁ దెలివిగలవాడెవ్వఁడు అని ప్రశంస దెచ్చికొని మదనాంకుని కుమారునికన్నఁ దెలివిగలవాఁ డిదివఱకు పుట్టలేదు. యికముందు బుట్టఁబోవడు. అని వాని స్తుతింపుచుండిరి. ఆ మాట లతఁడు విని వీరు మదనాంకుని కుమారుఁ దనుచున్నారు. మదనాంకుఁడు నేనుగాక మఱియొకడుండెనా? నాకుఁ గుమారుఁ డెక్కడ? అయినను వీరి నడిగెదంగాక అని తలంచి మెల్లగా వానికడకుఁబోయి యిట్లనియె.

అయ్యా! మదనాంకుఁ డెవ్వడు? వాని కుమారుఁడు మిక్కిలి తెలివిగల వాఁడంటిరి. ఆ తెలివి యెట్టిదియో చెప్పెదరే యని యడిగిన వారిలో నొకఁ డిట్లనియె.

## రత్నాంకుని కథ

అయ్యా! వినుండు. ఉజ్జయినీ పురంబున మదనాంకుఁడను వైశ్య కుమారుఁడు గలడు. అతనికిఁ జిన్నతనమునందే తండ్రి చనిపోయెను. వాఁడు తల్లిచేఁ బోషింపఁబడుచు నాటకాయతనంబునఁ దిరుగుచు యౌవన విలాసములకుఁ జొక్కి గర్భవతియైన భార్యను దల్లిని విడిచి చెప్పకుండ నెక్కడకో లేచిపోయెను. వానితల్లి చాల తెలివిగలది చూలాలైన కోడలిని విడువక కాపాడుచుండెను. దానికి రత్నాకరుఁడను కుమారుఁ డుదయించెను. వానిని రత్నాంకుఁడనే చెప్పఁదగినది. భాగ్యము లేకున్నను వాని నెట్లో పదేండ్లు పెంచినది. బడిలో వైచి వర్తకమునకుఁదగిన విద్య మాత్రము జెప్పినది.

ఒకనాఁడావృద్ధ మనుమనిం జూచి "బాబూ! మీ యయ్య మమ్ము విమర్శింపక దేశాంతర మరిగెను. నిన్నెట్లో పెంచితిమి. ఇఁక గడుపుట కష్టముగా నున్నది. కుమారపురంబున యక్షదత్తుండను వైశ్యుండు కులాభిమానంబునం జేసి వాణిజ్యము చేయగలిగిన కోమట్లకుఁ బెట్టుబడి బెట్టునఁట. నీ వతని కడకుఁబోయి మన దారిద్ర్యము తెలిపి వాణిజ్యమునకు మూలధనమేమైన యాచింపుము. అతఁడీయకమానఁడు. దాన వాణిజ్యము చేసి పొట్టగడుపు"మని ప్రోత్సహించినది ఆ మాట విని వాఁడు సంతసించుచు వెంటనే కుమారపురంబున కరిగి యక్షదత్తుని యిం

డిగి తెలిసికొని యప్పటికిఁ బోయెను. అప్పు డా ధనికుఁడు వీథి యరుగుపై నిటు నటు విహరించుచుండెను.

రత్నాంకుఁడు వారిం దెలిసికొని యెదుర నిలువఁబడి "అయ్యా! మాది యుజ్జయినీపురము. నేను కోమటిబిడ్డను. నేను బుట్టక మునుపే మా తండ్రి దేశాంతర మరిగెను. మా యమ్మయు మా యవ్వయు నన్నుఁ బోషించుటకుఁ జాల శ్రమపడిరి. ఇప్పుడు వాణిజ్యము సేయఁదలచి మూలధనము యాచించుటకై మీ ఖ్యాతిని విని మీ కడకు వచ్చితిని. మీకుఁ దోచిన సహాయము చేయు"దని కోరుటయు నా వర్తకుఁడు నవ్వుచు నా వీథిలో నొకచోట చచ్చియున్న యెలుకం జూపి పిల్లవాఁడా! నీ కదియే మూలధనముగా నిచ్చితి. దాని దీసికొనిపోయి వర్తకము చేసికొనుము. తెలివిగలవాని కదియే పదివేలగును. తెలివిలేనివానికిఁ గోటి యిచ్చినను మొదటికే హాని రాఁగలదు. అని చెప్పెను.

ఆమాట విని యాపిల్లవాఁడు మహాప్రసాదమనుచు నొకయాకు దొన్నెగట్టి దానిం దానిలోఁ బెట్టి యెలుకో యెలుకయని నా యంగళ్ళ వెంబడిని దిరిగెను. ఒక కోమటి యెలుకల బాధకై పిల్లిం బెంచుచుండెను. దానికాహారము నిమిత్తమై యా యెలుకంగొని బదులు దోసెడు సెనగలు దానికి ఫలముగా వానిచేతిలోఁ బోసెను.

వాఁడవి మూఁటకట్టుకొనిపోయి మరునాఁడు నీళ్ళలో వాని నానఁబెట్టి యుబ్బరిచేసి వానిలో నుప్పునుం గారమును గలిపి కుండతో నీళ్ళు దీసికొనిపోయి యూరిబయటకుఁబోయి యొక చెట్టునీడం గూర్చుండెను. ఆ దారి నడవినుండి పుల్లలు గొట్టుకొని మోపులు నెత్తిపై నెత్తుకొని కాష్ఠ విక్రేతలు వచ్చుచుండ్రు. వచ్చినవారెల్ల మోపులు దింపి నా చెట్టునీడ కొంతతడవు విశ్రమింపక మానరు. అట్టివారికి వాచవికిగా గుప్పెడు సెనగలును మంచినీళ్ళను రత్నాంకుఁ డిచ్చుచుండును. అందులకు సంతసించుచు మోపునకు రెండేసికట్టె లందుఁబాఱవైచి పోవుచుండిరి. సాయంకాలమున కాకట్టె లన్నియు నింత ప్రోగుచేయఁగా గావడిపేళ్ళయినవి. ఆ కావడి యమ్మింప నొకరూక వచ్చినది. దానింబెట్టి మరునాఁ డాకోమటిపట్టి రెండుకుంచముల శనగలం గొని నానవైచి వెనుకటివలెనే యా చెట్టుక్రిందికింబోయి కూర్చుండి కాష్ఠ కేతలకు దాహముతో నిచ్చుచుండ నాఁడు నాలుగు కావళ్ళ పేళ్ళు ప్రోగుపడినవి. వానినమ్మి యెక్కువగా సెనగలుకొని నీళ్ళు మజ్జిగ యిచ్చుచుండ గొన్నిదినములకుఁ గట్టెలరాసి పెద్దగా ప్రోగుపడినది. అంతలో ముసురు పట్టుటయు నూరిలోఁ గట్టెలకు కరువైనది. అప్పు డితఁ డా కట్టెలన్నియు విక్రయించుటచే నతనికి నూరుమాడలు లభించినవి. దానింబట్టి కట్టెలు నెక్కువగాఁగొని యమ్ముచుండ గ్రమంబున నెక్కువ లాభము వచ్చినది పిమ్మట నతఁడు కట్టెల వర్తకము మాని దాచ వర్తకము చేయుచుండెను. దానిలో నెక్కువలాభము వచ్చినది. అది విడిచి ధాన్యవర్తకము, దాని

పిదిచి వస్త్రవర్తకము, అట్లు క్రమంబున నంతరాంతములనుండి చివరకు రత్నవర్తకుం డయ్యెను. అతని సంపద కొలఁదికాలములోనే పెరిగినది.

అపు డా పిల్లవాఁ డాలోచించి పీసె బంగారముచే నెలుకంజేయించి యందు రత్నములు చెక్కించి దానిని వెండిబోనులోఁబెట్టి యూరేగించుచు నా యక్షదత్తునింటికిం దీసికొనిపోయెను. మేళతాళములతోఁ దనయింటికి వచ్చిన యా పిల్లవానిం జూచి యక్షదత్తుఁడు ఈ ఉంఝాట మేమని యడిగెను. అయ్యా! నీ వల్ల నాఁడు నాకు మూలధనముగా నిచ్చిన యెలుకవలనఁ గోటీశ్వరుఁడనైతిని. కృతజ్ఞుండనై యందులకుఁ జిహ్నముగా నీ కాంచనమూషికమును జేసి మీకుఁ గానుకగా సమర్పించుచుంటిని. పరిగ్రహింపుఁడని వేఁడుకొనియెను. యక్షదత్తుఁ డాశ్చర్యపడుచు వాని తెలివికి మెచ్చుకొని నా వస్తువును పరిగ్రహించి వెంటనే వాని నింటిలోనికిం దీసికొని పోయి సత్కరించుచు నెదిగియున్న తనకుమార్తెను వానికిచ్చి పెండ్లి చేసెను.

అపుత్రకుండగు యక్షదత్తుని యాస్తిఁగూడ నారత్నాంకుఁడే కర్తయయి యిప్పుడు మహావైభవముతో నొప్పుచున్నాఁడు. అందులకై రత్నాంకుఁడు తెలివి గలవాఁడని చెప్పితిని.

ఆ కథ విని మదనాంకుఁడు సంతోష పారావార వీచికలందేలుచు దన కుమారుఁ డాయూర నున్నాఁడని విని తొందరగా వాని భవనంబునకుం బోయెను. భార్యయుఁదల్లియుగూడ నందేయున్నవారనివిని పరిజనులవలనఁ దనరాక దల్లికిఁదెలియఁజేసెను. ఆమె కన్నీరుగార్చుచు వాకిటకువచ్చి కుమారునింజూచి కౌఁగలించుకొని "నాయనా! బ్రతికి యుంటివా! నేఁడు నేను ధన్యురాలనుగదా యని యశ్రుజలములచే వాని శిరము దడపినది. భార్యయు సంతసించినది.

అంతలో రత్నాంకుఁడు తండ్రివార్త విని యచ్చటికి వచ్చి నమస్కరించుచు నేను నీ కుమారుండ. దయలేక తల్లిని భార్యను విడిచి నీవు వెళ్ళునప్పటికి గర్భస్థుండనై యుంటి. పెద్దవారి దయచే నెట్లో మనంగంటి. దైవకృపచే మిమ్ముఁ గనుఁగొంటి. కృతార్థుండనైతినని పలికిన సిగ్గుపడుచు మదనాంకుఁడు వాని గ్రుచ్చియెత్తి పెద్దగా లాలించెను.

తరువాత తానుపడ్డ కష్టమంతయుఁ జెప్పి వారి కాశ్చర్యము గలుగఁజేసెను. కొన్నిదినములు పుత్రునితో ముచ్చటించుచు నందుండి చంద్రస్వామివారిఁ గలిసికొనుటకై వెండియుఁ గాశీపురంబున కరిగెను. అప్పటికే చంద్రస్వామి పురుషుండై చూతికయింటనుండ నిరీక్షించి యతని యాకృతి విశేషంబుల కచ్చెరువందుచు తన కుమారుని వృత్తాంతమంతయు వానికిఁ జెప్పి నీ వెట్లు పురుషుండవైతివని యడిగిన చంద్రస్వామి యిట్లనియె.

వయస్యా ? నీ వరిగిన వెనుక యోగిని వచ్చుట కాలస్య మగునని దూతిక ప్రియంవదకడకుఁ బోయి యొకనాఁడు నా వృత్తాంతము జెప్పినది. అది రోగపీడిత యైనను ఆ మూలిక దాఁచి యుంచినమాట మరువక వెదకిదెచ్చి దానికిచ్చినది. ఆ మూలిక దూతిక దెచ్చి నాకుఁ దగిలించినంత నేను పురుషుండనైతిని. నిన్నుఁ గూడ నుజ్జయినికి బయలుదేరునంత నీవే వచ్చితివి. అనుటయు సంతసించి మదనాంకుడు దూతికను స్తుతించుచు వానిం వెంటబెట్టుకొని కుసూరనగమున కరిగి కుమానకు వానిం జూపుచు వానికథ యంతయుంజెప్పి వానిం దన పురోహితునిగా నుంచుకొని మంచిపిల్లను బెండ్లిచేసెను. అది మొద లక్కులమువారా యెలుకబోను ప్రతిదినము ప్రాతఃకాలమున ముందుగాఁ బూజించి తరువాత వాణిజ్యము చేసుకొనుచుందురు. అదియె నీవుజూచిన బంగారుమూషికము. ఇప్పటికి నాలుగైదు తరములైనది. కావున నిప్పటివారి కా వృత్తాంతమేమియుం దెలియదు. తెలిసినదియా యని చెప్పిన గోపాలుఁడు మిక్కిలి సంతసించుచుఁ దత్కథాప్రవృత్తికిం గురుపరుని పెద్దగానగ్గించెను. అని యెరింగించి మణిసిద్ధుండు శిష్యునితోఁగూడ మరునాఁడు బయలువెడలి యవ్వలి మజిలీ చేరెను.

ఓం

శ్రీ ర స్తు

శుభమస్తు — అవిఘ్నమస్తు

# కాశీమజిలీకథలు

## పదునొకండవ భాగము

### 275 వ మజిలీ

అయ్యవసథంబున గోపాలుండు ముకుళితకర కమలుండై,

గీ. పాటలీపుత్రనామక పట్టణంబు
నౌర పలుమారు వర్ణించినారు మీరు
కథల బహుసంపదలకు నా కిరవటంచు
సత్కృపాధామ ! యతిలోక సార్వభౌమ ! 1

ఉ. పాటలీపుత్రశబ్దములు ప్రస్ఫురితార్థయుతంబు లట్టి పే
రేటికివచ్చె? దానికొక హేతువుగల్గునో? యూరకే
మాటల నట్లు వాడుదురో? మానికవుంగుఱిజూచి చెప్పు డీ
పూటకుఁ బోవఁ జాలఁ బురి పుంతల గ్రంతల వింతలారయన్. 2

క. కడుదూరము నడుచుటచే
నొడలెల్లం బడలె నేఁడు యోగీశ్వర ! యె
క్కడికిం బోవఁగలే నే
నడిగిన ప్రశ్నము నెఱింగి యానతియీవే ? 3

గీ. అనిన మణిసిద్ధుఁ డౌత్సుక్యమంది రత్న
మహిమఁ దద్రాజధాని నామప్రవృత్తి
యంతయు నెఱింగి విస్మితస్వాంతుఁ డగుచుఁ
జెప్పె నిట్లు మృగాజినాసీనుఁ డగుచు. 4

## పుత్రకుని కథ

గంగాద్వారంబున నతి పవిత్రమగు కనఖలమను తీర్థరాజము గలదు. సుదాసుండను బ్రాహ్మణుండు దాక్షిణాత్యుండు భార్యతోఁ గూడ యాత్రార్థియై యా తీర్థమునకరుదెంచి మహిమాస్పదంబగు నా ప్రదేశ విశేషముల నానందించుచుఁ గొంత కాల మందు వసించెను. సూర్యోదయము కాకమున్న స్నానముచేసి యొడలెల్ల

విభూతినలమి గంగాతీరంబునం గూర్చుండి దంబుగాఁ జపము జేసికొనుచు రెండవ వ్యాసమహర్షివలెఁ గనంబడుచు నిస్స్పృహత్వ మభినయించుచు యదృచ్ఛాలాభసంతుష్టుండనితోఁచునట్లు ముంటొకవస్త్రము పఱచుకొని కన్నులు మూయుచుందెఱచుచుఁ దైర్థికుల రాకపోకల విమర్శించుచుండును. యాత్రికు లా పటముపైఁ దమకుఁ దోఁచిన విత్తము వైచుచుందురు. వానినెల్లఁ బ్రోగుజేసికొని కుతపకాలంబున కింటికిం బోయి శిష్టకృతుగా భుజించి భార్యతో నానందించుచుండును.

అట్లుండ నా పారునకుఁ గాలక్రమమున మువ్వురు కుమారు లుదయించిరి. గంగాజలపాన మహత్త్వంబునం గాఁబోలు వారి యాకారములు దర్శనీయములై యొప్పుచున్నవి. ఆ మువ్వురకు హరిహర బ్రహ్మలని త్రిమూర్తుల నామములు పేరు పెట్టెను. వారికి రూపానుగుణములగు గుణము లంటినవిగావు. ప్రాయమున వారొక సంవత్సర మెచ్చుతగ్గు కలవారైనను బదియేండ్లు వచ్చునప్పటికి సమానప్రాయులవలెఁ గనంబడుచుండిరి. వారికిఁ గ్రీడలయందుగల యాసక్తి విద్యాగ్రహణమందుఁ గలిగినది గాదు.

సుదాముం డొకనాఁడు చీఁకటిలో స్నానార్థమై గంగ కరిగి మెట్లపై గాలు జాఱి గంగలోఁబడి గడియలోఁ బ్రాణమువిడచెను. భార్య యాయనతో సహగమనము చేసినది. అక్కుమారులు మువ్వురు తలిదండ్రులు స్వర్గస్థులైనపిమ్మట నందుఁ బోషించువారు లేమింజేసి యటవిడిచి దక్షిణ దేశమున కరిగిరి. అందలి గ్రామములన్నియుం దిరిగి తిరిగి యెందును దమకు భోజన సదుపాయము దొరకమిఁ బరితపించుచు విద్యార్థులమని చెప్పుకొనుచు సముద్రతీరంబుననున్న చించిని యను నగరంబున భోజకుండను నుపాధ్యాయుండు విద్యార్థులకు నన్నము పెట్టి చదువుచెప్పుచున్నాఁడన్న వార్త విని విద్యార్థులమని చెప్పుకొనుచుఁదిన్నగా నా యూరుచేరి వారింటికిం బోయిరి.

దివ్యరూపంబుల నొప్పుచున్న యా మువ్వురింజూచి యా ద్విజవరుండు తనయింట మువ్వురు పడుచులు పెండ్లికై యెదిగి యుండుటం బట్టి వారికిచ్చి పెండ్లి చేయ తలంపుతో వారిం పెద్దగా నాదరించి కులశీలనామంబు లడుగుటయు నాలందు విస్మయముపడునట్లు తమ వృత్తాంత మసత్య కల్పనలతోఁ దెలియఁ జేసిరి. కార్యాతురులు వక్తల మాటయందుఁగల సత్యాసత్యము లంతగా విచారింపరుగదా ! తక్కిన వార్త లట్లుండ తాను విద్వాంసుడయ్యు వారు సెప్పిన విద్యావిషయంబుల నైనం బరీక్షింపఁడయ్యెను. వారు సెప్పిన మాటలన్నియు నమ్మి వారిం ద్రిమూర్తులుగాఁ దలంచి వెంటనే కూతుండ్ర మువ్వుర వారి మువ్వురకిచ్చి వివాహము గావించెను.

పెండ్లి యైనతరువాత నిల్లుం దత్తవారింటబెట్టు చిక్కులు లెక్కింప శక్యము గాదుగదా! నిత్యము భోజన భాజనంబులయ్యుండు వారత్తమామలనేకాక వారి బంధువులం గూడ నెత్తిపొడుచుచు రాజభోగము లనుభవించుచుండిరి. కొంతకాలము మను

గురువులనియు, బంధువులనియు, వేడుకలనియు, ముచ్చటలనియు, విందులు సేయు చుండుటంబట్టి భోజకునకు వారి విద్యలం బరీక్షింప నవకాశము కలిగినదికాదు. వాండ్రు తామెకాక యందలి పాతవిద్యార్థులంగూడఁ జదివికొననీయక యాటపాటలతో మఱుఁగుఁజేసిరి

ఒకనాఁడు మామగా రల్లుండ్ర విద్యలం బరీక్షించి వారు నిస్సారులని తెలిసికొని ఓదారముతో నిట్లనియె.

మామ—వత్సలారా! మీరు మొదట నాతోఁ దర్కవ్యాకరణములు పూర్తి చేసితిమనియు భాష్యము చదువుటకు మీ కడకు వచ్చితిమని చెప్పితిరే! ఆ శాస్త్రములు మీరు చూచినట్లేలేదే ?

అల్లుండ్రు—మామా ! "వివాహోవిద్యనాశయ" యను సామెత మీ రెఱుంగనిదియా? మా చదువులు పూర్తి కాకుండా మాకుఁ బెండ్లి చేసితిరి. మా చదువులెట్లు నిలుచున ?

మామ—నవ్వుచు, పెండ్లి చేసినంతనే విద్యలన్నియు మరచితిరా ।

అల్లుండ్రు—మీరు సమస్త శాస్త్రజ్ఞులుగదా? విద్యనాశాయ యనిన నర్థమేమి?

మామ—సరిసరి! చాలుచాలు! పెండ్లియైనతరువాత విద్యాభ్యాసమునకు విఘ్నమగునని గాని చదివినవిద్యలు పూర్తిగా మరతురనికాదు.

అల్లుండ్రు—మాకు రెండునుం జరిగినవి. ఈ యుత్సవములలో జరిగిన దంతయుఁ బూర్తిగా మరచితిమి.

మామ—పోనీ తిరుగా పాఠములు చెప్పెద వల్లింపరాదా?

అల్లుండ్రు—ఎక్కడివల్లన! పెండ్లియైనతరువాతఁ జదువుసాఁగదని మీరేకదా చెప్పితిరి.

మామ—బాగు బాగు ? మంచివారే. నా యదృష్టము ఫలించినది. మీ రూపముఁజూచి మీ మాటలు నమ్మి మోసపోయితిని. మీరు జీవముగూడ నాడుచున్నా రదేమి కర్మము.

అల్లుండ్రు—మామా! మే మభిమానవంతులము. మా తండ్రిచేతనైన నెప్పుడు మాటపడి యుండలేదు. ఇష్టమున్న నుండెదము. లేకున్న బోయెదము.

మామ—చదువుమాని జూదమాడిన మోసముగాదా ?

అల్లుండ్రు—జూదముకాదు. విలాసమునకుఁ గాగిదము లాడుదుము. దానం బ్రమాదము లేదు మామా! అని వారు మామగారిని గద్దించిపలికిరి. వారిలో మధ్యముఁడు సాత్వికుండైనను నిద్దఱి ప్రోత్సాహములచేత మామతోఁ గలహింపక తప్పినదికాదు. భోజకుఁడు స్థితిమంతుఁడు. విద్వాంసుఁడు. ప్రతిష్ఠకలవాడు. అవి మృశ్యకారిత్వము వలన బంగారువంటి బిడ్డలను కతులపాలు గావించెను. క్రమ

ముగ నల్లుండ్ర దుశ్చేష్టితములు ప్రబలుచుండెను. వాండ్రు జూదగాండ్రకు మొనగాండ్రై తిరుగుచుండిరి. భార్యవస్తువు లెత్తికొనిపోయి జూద మాడుచుందురు. వారి దురభ్యాసములు చూచిచూచి మందలించిన లేచిపోవుదురను భయముతో నోర్చియోర్చి యా చింతతోనే చివికి భోజకుండును భార్యయు బరలోక మలంకరించిరి.

అతం డపుత్రకుండగుట నతని సొత్తంతకును కూతుండ్రే కర్త లయిరి. ఆ యువతులు పతివ్రతలగుట భర్తల మాటల కెదురాడక వా రడిగిన వస్తువులనెల్ల నిచ్చుచుండిరి. ఎంత యాస్తియైనను జూదమాడువారికి సరిపడునా? వారు సంతలకుం బోయియుం దీర్థములకేగియు బెద్దగానొడ్డి జూదమాడుచుండ నచిరకాలములో భోజకుని సంపద యంతయు భ్రష్టమైనది. పొలము లమ్మివేసిరి. పశువుల విక్రయించిరి. ఇండ్లు తాకట్టుపెట్టిరి. నగ లడివిగాచే పోయినవి. చివరకు తిండి కిబ్బంది పడం జొచ్చిరి.

ఆ సతీమణులు మెడకుం బసుపుకొమ్ములు గట్టుకొని రత్నభూషణము లన్నియు నిచ్చిరిగాని భర్తల నెన్నండు తూలనాడి యెఱుంగరు. తమ ప్రారబ్ధమని వగతురు కాని మగల నిందింపరు. వారిలో మధ్య యువతి లక్ష్మీ సేవకురాలు. నిష్కామ బుద్ధితో మానసికముగా లక్ష్మి నారాధించుచుండును. అట్లు కొన్నిదినములు మాత్రమే జరిగినది. దారిద్ర్యదేవత వారింట దాండవమాడుచుండెను. ఆ బ్రాహ్మణులు మువ్వురు జూదమునకు సొమ్ములేకపోవుటచే దొంగతనము కూడంజేయ మొదలు పెట్టిరి. అది యట్లుండ వారి దారిద్ర్యమునకుం దోడుగా నా దేశమున ననావృష్టి కలిగి కఱవు పుట్టినది. రవి మృగశిరయందుం బ్రవేశించినను నార్ద్రజేరినను పునర్వసు నతిక్రమించినను చిటుక్కుమని చినుకుపడదిగాదు. మబ్బులు పట్టి పట్టి గాలిచే దూది పింజలవలెం జెదిరి విడిపోవునని హాలికు లిదిగో యదిగో వర్షము కురియునని యాసపడుచుండం బరమలోభులవలె జలదము లుదక కణమునైన నొసంగినవికావు. జనులాకసము వంక జూచిచూచి విసిగిపోయిరి. వర్షకాలము నాలుగుమాసములు గతించినవి. నదు లడుగంటినవి. ఏరులు సైకతావశేషములైనవి. వాపీకూపతటాకములు నెరియలు వారినవి. కేదారముల తృణకాష్ఠాదులులేక మాడి ధూళి లెగయుచుండెను. పశువులు మేతలేక నీరు దొరకక శల్యావశిష్టమై నశింపం దొడంగినవి. ఏ చెట్టుపిట్ట లాచెట్టు ననే చచ్చినవి. ప్రజలాహాకారముతోం జలాశయములకుం జేరుకొని వెనుకటిపంటలు తిని యెట్లో కాలముం గడుపుచుండిరి.

చించిని నగరము సముద్రతీరమం దుండుటచే నీటివసతి కలిగియున్నను బంటలు నశించుటచే బ్రజలిబ్బందిపడజొచ్చిరి. ఆ కఱవులో నంతకమున్న కఱవై యున్న యింటిలో నుండనొల్లక భార్యలకుం జెప్పక యా ముప్పురుపాపులు చోరుల గుంపులోం గూడి దేశాంతరములకుం బోయి కన్నములువైచి జీవించుచుండిరి. కఠిన హృదయులకు నాశ్రితవాత్సల్యముండునా? మరునాండు భార్యలు భర్తలం గానక

జూదమాడ సంతలకుంబోయిరని కొన్నాళ్ళు నిరీక్షించుచు నెన్నిదినంబులకుం వారి రాక యాకసకుసుమమగుటయు మిక్కిలి పరితపించుచుండిరి.

వారిలో మధ్యయువతి గర్భవతియై యున్నది. ఆమె మగని పోకకుఁ దుఃఖించుచు సంగతము మహాలక్ష్మిం ధ్యానింపుచుండును. ఆ పతివ్రత లాకటవులో శీలమును గాపాడుచు క్లిష్టవృత్తులతో సగము సగముఁగా దిని కాలముఁ గడుపుచుండిరి. మధ్యమ యువతియు నొకశుభ లగ్నంబునఁ జక్కనికుమారుం గనినది. వాని తేజము జూచి చక్రవర్తి యగునని దైవజ్ఞులు కొనియాడిరి. ఆ జవ్వనులు ముగ్గురు నా డింభకు నెత్తుకొనుచు వీఁడు నా పుత్రకుడు వీఁడు నా పుత్రకుఁడని ముద్దాడుచు నురంబునం బెట్టుకొని పోషించుచుండిరి. దానంజేసి యా బాలునకు పుత్రకుఁడను నామమే వాడుకలోనికి వచ్చినది.

పిల్లవానికిఁ బాలుచాలవని తమరిద్దరు తినక పిల్లతల్లికి గడుపునిండ నాహారము దెచ్చి పెట్టువారు. వారి వాత్సల్య మెట్టిదో దా! మధ్యమయువతియు యక్కయు చెల్లెలును దన నిమిత్తమై బిడ్డ నిమిత్తమై పడియెడు నిడుమంజూచి పరితపించుచు నొక నాఁడు మహాలక్ష్మి నిట్లు స్తుతించినది.

గీ. తల్లీ! నిన్నెల్లకాలంబుఁ దలఁచుచుండు
నేలఁ గాలవో నీ భక్తురాలి నన్నుఁ
గనికరము లేదొ మా పూర్వకర్మమిదియొ
కటకటా! యెట్లు భరియింపఁగలము నెవ్వ.

ఉ. కూఁటికిలేక సోదరీలు గుందుచు వాడకువాడ కేఁగి భి
క్షాటనవృత్తితో నహరహంబుఁ జరింపఁ బెట్టరెవ్వ రె
చ్చోటను చేరెదంబలికిఁ జూచియు నీ విటు లోకమాత! మా
పాటు సహింతువే కద కృపారహితాత్మక నీకుఁ జెల్లునే.

అని ప్రార్థించుచు నా సాధ్వీతిలకంబు నిదురించినంత నిందిరాదేవి స్వప్నంబునం బొడసూపి "పుత్రీ! నీవు విచారింపకుము. ప్రతిదినము సూర్యోదయమున లేచునప్పటికి నీ పుత్రుని శిరోభాగంబునఁ బదివత్సరములు ప్రాయము వచ్చుదనుక మణుగుబంగార ముదయించుచుండును. నీ కొడుకు మిగుల ప్రఖ్యాతుండగును" అని పలికి యామె యంతర్ధానము నొందినది.

అంతలో నక్కాంతలేచి యచ్చెరువుతో గల తెఱంగు సోదరీల కెఱింగించుటయు వారు నవ్వుచు "అమ్మా! మన కట్టి యదృష్టము పట్టునా? దారిద్ర్యమును గురించి వితర్కించుచుండ నట్టి కలవచ్చినది. అయినం దెల్లవారినఁ పిదప జూతముగా" అని పలుకుచు వారా రాత్రి నిదురింపక సూర్యోదయము కాఁగానే చూడ నా బాలుని తలయంపిని మణుగు బంగారము చిన్న గుమ్మడికాయవలె మెఱయుచుండెను. అప్పుడు—

ఉ. "పెన్నిధిఁగన్న పేద మురిపెంపు వహించెడునట్టు లంచు" లో
కోన్నతసామ్యమిల్ వినమెకో మను నాగతి సూనుమస్త కా
సన్న లసన్మహారశతచారురుచుల్ మిరమిట్లు గొల్పఁగాఁ
నన్నువ లేమిసెప్ప విఃశాంగకళై పడిపోయి రయ్యెడన్.

కొంతతడవున కొడలెరింగి యప్పడతుక లా పుత్రడి సంగ్రహించి లక్ష్మి కటాక్షపాతంబున కస్పిరువందుచు నా బంగారమున లక్ష్మీ విగ్రహము జేయించి పూజించుటకు నిశ్చయించుకొనిరి. అట్లే ప్రతిదినము సూర్యోదయ సమయమునకు శిరశిరోభాగంబున మఱుగు బంగారము లభించుచుండ వారి యైశ్వర్య మెట్లుండునో యూహించు కొనవలసినది. వారా కాంచనమును ముద్రికలుగా ఎయించుచు వానికి పుత్రక ముద్రలని పేరిడి వాడుచుందురు. మరియు నిత్యము లభించు బంగారములో నాల్గవవంతు దానధర్మముల క్రింద వినియోగ పఱచుచుండిరి.

అమ్మిన మాన్యములు కొని యిండ్లు విడిపించి వస్తువులు పుచ్చుకొని గ్రామము లార్జించి మండలముల సంపాదించి పుత్రకునకుఁ బదు నెనిమిదేఁడులు వచ్చునప్పటికి దేశాధిపతికన్న నెక్కుడు భాగ్యవంతులని పేరుపొందుచుండిరి. పుత్ర కునకు జ్ఞానము వచ్చినది మొదలు దానధర్మములం దుత్సాహము కలిగియుండుటం బట్టి విద్యాలాభమంతగా గలిగినదికాదు. ఆ కఱవుదినములలో బుత్రకుఁడు తన గ్రామమున బెద్ద సత్రము గట్టించి నాలుగువర్ణములవారికి భోజన సదుపాయములు చేయుచుండెను. వేలకొలఁది జనులువచ్చి యందు భుజించుచుందురు. విదేశము నుండి ధాన్యము దెప్పించి వచ్చినవారికెల్ల లేదనకుండ నన్నము బెట్టుచుండును. దానంజేసి పుత్రకుని వాడుక దేశదేశముల వ్యాపించినది.

నానాదేశములనుండి కుటుంబములతో వచ్చి యా కఱవుకాలములో బ్రాహ్మణు లాసత్రమున గుడుచుచుందురు. పుత్రకుఁడు తండ్రులవార్త తల్లుల వలన విని సత్రమునకు వచ్చిన బ్రాహ్మణులను బరీక్షించుచుండును. తల్లుల చిత్ర ఫలకముల నద్దములఁగట్టించి నంభోక కుడ్యమున నమరింపఁ జేసెను.

హరిహర బ్రహ్మలు మువ్వురు దేశములు తిరిగి తిరిగి యా వార్తవిని యా సత్రంబున కరుదెంచి యందుఁ దృప్తిగా భుజింపుచు గొన్ని దినంబులు వసించిరి. పుత్రకుఁడు వారిం దండ్రులని తెలిసికొన లేకపోయెను. ఒకనాఁ డాపారులు మువ్వురు భార్యలచిత్రఫలకములు పరికించి నిరూపించుచుండ నందున్న కావలి వారలు వారిం బట్టుకొని పుత్రకు నొద్దకుం దీసికొనిపోయి యా వార్త యెరింగించిరి.

పుత్రకుఁడు—అయ్యా! మీ రేమిటి కందున్న స్త్రీ రూపముల సాభిప్రాయ ముగాఁ జూచితిరి. ఇది యపరాధము గాదా?

బ్రాహ్మణులు పుణ్యాత్మా! ఈ చిత్రఫలకములు మా భార్యల పోలికగా నుండుటచే చూచితిమి. మా తప్పు సైరింపుఁడు.

పుత్రకుఁడు—మీ భార్య లెవ్వరు? యెందున్నారు?

బ్రాహ్మణులు—మేమా గ్రామము పేరు మఱచి పోయితిమి. పుట్టినింటనే.

పుత్రకుఁడు—వారిని విడిచి మీ రెక్కడికి బోయితిరి?

బ్రాహ్మణులు—బాబూ! కఱవుపట్టుటచేఁ బోషింపలేక దేశముల పాలైతిని. మీ పుణ్యమున నిందు దినభోజనము దొరకుచున్నదిగాని యా కఱవులోఁ బట్టెడన్నము పెట్టువాఁడున్నాఁడా?

పుత్రకుఁడు—మరి మీరు పోయిన మీ భార్యలగతి యేమి?

బ్రాహ్మణులు—భగవంతుఁడేగతి. మేముండియు లేనివారమే యైతిమి. పాపము వాండ్రిప్పుడెట్లున్నారో? అని మధ్యముఁడు కన్నీరు విడుచుచున్నాఁడు.

అహో! మీ దుఃఖము శోచనీయమై యున్నది. అగ్నిసాక్షిగాఁ బెండ్లియాడిన భార్యలను కఱవుదినములలో విడచిపెట్టి లేచిపోయిన కఠినాత్ములెందైనం గలరా? మిమ్ము రాజు శిక్షింపఁదగినది. కానిండు. అని మందలింపుచు దయాహృదయుండగు పుత్రకుండు ఆనందముతో వారి నింటికి దీసికొనిపోయి తల్లులకుం జూపుచు వీ రెవ్వరో తెలిసికొంటిరాయని యడిగెను. దివ్యమంగళ విగ్రహములుగా నుండు నా భూసురులు తిండిలేక జీవచ్ఛవము లవలె నుండుటచే వారిం గురుతు పట్టలేక పోయిరి. పుత్రకుఁ డెరింగింప నా పతివ్రతలు పతుల పాదంబులంబడి నశ్రుధారలచేఁ బాద్యము లొసంగిరి. బ్రాహ్మణులు వారిం దెలిసికొని లజ్జాభయ విషాదములతో మొగములెత్త లేక కన్నీరు గార్చుచు భార్యల నావరించి పుత్రుం గౌగలించుకొనిరి. మరియు తాము చేసిన తప్పు క్షమింపుమని దీనత్వముతో వేడుకొనిరి.

భార్యాపుత్రులు వారియెడ నించుకయు నలుగక యాదరింపుచు రాజోపచారములచే గొలఁది దినములలో వారి కార్శ్యమంతయు నరఁ జేసిరి. పుత్రకుఁడు వారేమి యడిగినను నిచ్చుచు గొన్ని దినము లత్యంత ప్రతిపత్తితో మన్నించుచుండెను.

ఆ నగరమున వెనుకటి జూదపుమిత్రులు వారికడకువచ్చి మెల్లగా స్నేహముగలిపి యా క్రీడకుఁ బురికొల్పుచుండిరి. చాటుచాటున వారు బుత్రకు డిచ్చిన సొమ్ముపెట్టి వెండియు జూదమాడ మొదలుపెట్టిరి. క్రమమున నది యభివృద్ధి వహింప భార్యల నగలు దొంగిలించి ప్రౌఢముగా నాడదొడంగిరి. ఆ వార్త పుత్రునకుఁ దెలిసినతోడనే వారికేమియు దొరకకుండగజేసి తల్లులు వస్తువులు బదిలపఱచి యా యూరనున్న జూదగాండ్రనెల్ల లేవగొట్టించెను. దానంజేసి వారికి జూదమాడ నవకాశము గలిగినదికాదు.

దృష్టనష్టసంపన్నులు నవివేకాంధ బుద్ధులునగు దురితాత్ములకు సహజమగు దుస్స్వభావము విడువదుగదా! తమ క్రీడ కంతరాయము కలుగఁజేసెనని యా దుష్టులకుఁ బుత్రకునందునత్యంత ద్వేషము గలిగినది. ఒకనాడు వార ముప్వురు నేకాంత ప్రదేశమున వసించి యిట్లు సంభాషించుకొనిరి.

హరి—తమ్ములారా! పుత్రకుఁడు మనకెట్టి యవమానము గావించెనో చూచితిరా! మనయందాదరమున్నట్లు నటించునుగాని యించుకయు నభిమానము లేదు.

హరుఁడు—వానిది కపటప్రేమయని యెట్లు తెలిసికొంటివి.

హరి—మన మిత్రుల దండించి యూరనుండి లేవగొట్టుట మనల దండించుటగాదా?

హరుఁడు—మన సేమముకొఱకే యట్లుచేసెను. విరోధముచేతనా?

బ్రహ్మ—పదికోట్ల నిండ బంగారమున్నది. అది యంతయు నేమి చేసికొనును? మనము జూదమాడిన వాని కేమి నష్టము? మన యానందమును బాడుచేయవచ్చునా? యయాతికొడుకు తండ్రిముదిమి గొన తన పరువము వాని కీయలేదా?

హరుఁడు—జూదమాడుట కీయడుగాని త్యాగభోగములకై కావలసినంత సొమ్మిత్తునని చెప్పలేదా?

హరి—మంచిగౌరవమే. సంతసించితిమి. మా కొక సంకల్పము గలిగియున్నది. అందులకు నీ వంగీకరింతువా?

బ్రహ్మ—చెప్పవలదని కనుసన్న చేయుచున్నాఁడు. అంతటితో వారా ప్రస్తావము ముగించుకొనిరి. మఱియొకనాఁడు హరిబ్రహ్మలు కుమారునింజీరి ప్రేమానుబంధము నభినయించుచు పుత్రకా! వినుక మే మొక దేవతకు మ్రొక్కుకొంటిమి. దానిని నీవు తీర్పవలసియున్నది. వినుము యిక్కడి కుత్తరముగా నాలుగు యోజనముల దూరములో వింధ్యారణ్యమునుమించిన కాంతార మొండుగలదు. అందు దుర్గాదేవి యాలయము వెలసి యున్నది. అద్దేవి కామిత ప్రదాయినియని విని మే మొకప్పుడా మార్గమునం బోవుచు దేవీదర్శనము గావించి మాలో నెవ్వని కైనఁ గుమారుఁ డుదయించినచో వాని నొక్కని నీ గుడికనిపి వాని శిరోజములు వాని చేతనే ఖండింపఁజేసి నీ కుపహారముగా సమర్పింప జేయుదుము. అని ప్రార్థించి పోయితిమి. ఆ దేవీ కటాక్షమువలననే నీ వుదయించితివి. నీ వా మ్రొక్కు చెల్లింతువని కోరి యిట్లు తెలుపుచున్నాము. అని చెప్పిన నవ్వుచుఁ బుత్రకుఁ డిట్లనియె.

తండ్రులారా! యిందులకై నన్నింత ప్రార్థింపవలయునా? రేపేపోయి కేశప్రదానంబున నా లోకేశ్వరిని దృప్తిపరచెదంగాక! యింటికివచ్చి పిమ్మట దేవతాప్రీతికై బ్రాహ్మణులకు షోడశమహాదానములు మీరు సేయుఁడు అని చెప్పి పుత్రకుఁడు తండ్రులు చెప్పిన ముహూర్తముననే యొక్కరుఁడ గుఱ్ఱమెక్కి బయలువెడలి యక్కాంతారమున కరిగెను.

అందున్న దుర్గాలయమును గనుఁగొని ముందర తటాకజలంబున మునింగి వార్చి తడిబట్టలతో యా గుడిలోకింబోయి అంబా! మా తండ్రులు నీకు మ్రొక్కిన ప్రకారము మ్రొక్కు చెల్లించుటకై వచ్చితిని యిదిగో నీకుపాహారముగా నా శిరోజము లర్పించుచున్నాను. నా యెడ బుత్రవాత్సల్యముంచుమని యమ్మవారిని బ్రార్థించుచు చలపంచి వెండ్రుకలు గోయనుంకించునంతలో—

గీ. దుర్గ పెనువిగ్రహము వెన్కదాఁగియున్న
దొంగలిరువురు విచ్చుకత్తులధరించి
బలిమిబొబ్బలువెట్టుచు నీవలకువచ్చి
పిడుగుబడినట్లు వానిపై పడిరి కడర.

పుత్రకా! నిలునిలు. నీ యభీష్ట దేవతల స్మరించుకొనుము. నీ వాసన్న మరణుండ వైతివి. నిన్నిప్పుడు శిరశ్ఛేదము గావింతుము. అని చెరియొక చేయింబట్టుకొని కత్తులజళిపించుచుండఁ గదలక యతండు వారికిట్లనియె. తస్కరులారా! పుట్టినవారికెన్నటికైనఁ జావుతప్పదు. నా మరణంబున కించుకయు వగవను. మిమ్మొక్క విషయ మడిగెద. ప్రత్యుత్తరమిచ్చి శిరచ్ఛేదము గావింపుడు. దొంగలు సిర్ధనుని జోలికి రారను ప్రతీతిగలదు. నా కడ నిప్పుడు కాసైనను లేదు గదా! నన్నేల జంపఁబూనిరో తెలియకున్నది. వేరొక హేతువెద్దియేని కలిగినచో నిరూపింపుఁడు. అని యడిగిన యా దొంగ లిట్లనియె.

పుత్రకా! మేము నిజముచెప్పెదము వినుము. కేవలము చోరులము గాము. మా కాపురము చించిపీపురమే. మేము మీ తండ్రులకు జూదపుమిత్రులము. నీవు మాయాట కాటంకము గలుగ జేయుచుంటివి. నిన్నుఁ జంపిన స్వేచ్ఛగా జూదమాడు కొనవచ్చునని మీ తండ్రులే మమ్మిట్లు ప్రోత్సాహపరచిరి. మ్రొక్కునెపంబున నిన్నొక్కని బొమ్మని నప్పుడైనం దెలిసికొనలేకపోయితివి. నీవు సమసిన నీ ధనమంతయు వారి యధీనమగునుగదా! అప్పుడు స్వేచ్ఛగా జూదమాడు కొనవచ్చును. ఇదియే కారణము. తెలిసినదియా? అని చెప్పిన వెఱగుపాటుతో నతం డిట్లనియె.

బాబులారా! ద్యూతక్రియ మహాపాతకము దరిద్ర కారణమని పెద్దలు చెప్పుదురు అందులకై వారిని వారించితిని. కానిందు నిజము తెలిపితిరి. సంతసించితిని. మీపనిమీరుచేసి మా తల్లులకీవార్త దెలియనీయవలదని మిమ్ముఁగోరుచుంటి. మా తండ్రులతో సుఖముగా జూదమాడు కొనుఁడని చెప్పుఁడు. నా దేహమమ్మవారికి నైవేద్యము పెట్టుడు. మీకుఁ బుణ్యముఁగాఁగలదని పలికి తలయొగ్గెను.

అంతలో వారి సంకల్పములు మారిపోయినవి. పుత్రకా! నీ మాటలు వినుచునే మాకు జాలికలుగుచున్నది. మా చెప్పినట్లు చేయుదువేని నిన్ను విడిచి వేయుదుము. నీ యాస్తియంతయు నీ తండ్రులకు వదలి నీ వీ దారినే దేశాంతరమున.

కరుగుము. యెన్నఁడు మా నగరమునకు రానని యీ యమ్మవారిపాదములఁ గొట్టుము. అట్లయిన నిన్ను విడిచి పెమరిగెదము. మీ తండ్రుల యభిలాషయు దీఱగలదు. అని చెప్పిన నతండు బ్రతికియున్న నెప్పటికైన సుఖములు బడయ వచ్చునని తలంచుచు వారికిట్లనియె.

చోరులారా ! మా తండ్రులకంటె మీరే మంచివారు. మీరనినట్లు చించిని నగరమునఁ కెన్నడు నేనురాను. నా యాస్తియంతయు మా తండ్రులనుభవింతురు గాక ! ఈ యమ్మ వారి పాదముల తోడుగాఁ జెప్పుచున్నాను. ఈ దారి నెందేనియుం బోయెదనని ప్రమాణము చేయుటయు నా తస్కరులు వానిమాటనమ్మి వానిసివిడిచి సొమ్మని క్రమ్మఱ నిజపురంబున కరిగిరి. అని యెఱింగించి.........

27౦ వ మజిలీ

# నందోపనందుల కథ

క. దలిదండ్రులతో వైరము
గలుగున్ గొడుకులకు విత్తకారణమునఁ బు
త్రుల విత్తమునకుఁ జంపఁగ॥
దలఁచెదు దండ్రులను వినము ధరనెట్టైటన్.

ఆహా ! మా తండ్రులవంటి క్రూరాత్ము లెందైనను గలరా ? మొదట జూదమాడి మామగారి సొమ్మంతయు వెచ్చపెట్టిరి. కట్టుబట్టిన గట్టికొనిన భార్యల విడిచి లేచిపోయిరి. యిప్పుడిట్టి పు తహత్యకు బూనికొనిరి. కానిమ్ము మత్పురా కృత మిట్లుండ వారి ననఁ బనిలేదు. అక్కటా ! నా సంపదలెంతలో దూరమైనవి. అని యించుక విచారించి సీ ! యిట్టి యవివేకము నా కేమాటికి గలుగ వలయును. కానున్నది కాక మానునా ? అని ధైర్యము దెచ్చుకొని అరణ్యములో నొకదారినిబడి నడువసాగెను.

ఎందులను జనసంచార మున్నట్లు కనంబడలేదు. గ్రామము లేవైపున నున్నవో తెలియవు. ఫలములు దినుచు రాత్రులఁ జెట్లెక్కి కొమ్మల సందున బండుకొనుచు నాలుగు దినములు ప్రయాణముగావించెను. లలితకుసుమదళ ఫల విలసిత తరులతా మనోహరమగు నొక చిన్న మెట్ట యతనికి నేత్రపర్వము గావించినది. మెల్లగా నా మెట్ట శిఖరమునకుంబోయి పరికింప నందిరువురన్నదమ్ములు పైతృకధనము పంచుకొనుటకై యిట్లు కలహింపుచుండిరి.

అన్న—తమ్ముడా ! మన తండ్రి ఘోరతపంబుజేసి యీ మూడు వసువులు సంపాదించెను. వానిని సమముగాఁ బంచనుందువు. పాళ్ళుతెగవు. ఊమ్మడిగా నుంచిన దోషమేమి ?

తమ్ముఁడు—నా కొక్కరితో నుమ్మడి పనికిరాదు. ఎవనివస్తువులు వాని స్వతంత్రిమములో నుండవలయును. నా భాగము నాకు సమముగాఁ బంచిపెట్టక తీరదు.

అన్న—అట్లయిన జ్యేష్ఠభాగము క్రింద నా సంచి నాకు వదలివేయుము. దండము పాదరక్షలలో నీకుఁ దోఁచినదానిని దీసికొని మిగిలిన దానిని నాకిమ్ము.

తమ్ముఁడు—అబ్బో! మంచిగదసరివే? ఉన్న మహిమంతయు సంచిలోనే యున్నది. నే నాట్లొంతం బడుదును.

అన్న—పోనీ పాదుకలును దండమును చెరియొకటిం దీసికొని సంచి యుమ్మడిగా నుంచుకొందము సమ్మతింపుము.

తమ్ముఁడు—నా కుమ్మడి యేమియు బనికిరాదు. పంచక తీరదు. సంచి నా కిచ్చి తక్కినవి నీవు తీసికొమ్ము.

అన్న—ఇప్పుడు నీ వన్నమాట మఱచితివా! అది సరిభాగముకాదు.

తమ్ముఁడు—నా కది యేమియును దెలియదు. పంచువాఁడవునీవు. భాగము పట్టువాఁడను నేను. నీ యిష్టము వచ్చినట్లు భాగములు వేయుము. నా యిష్టమువచ్చిన భాగము తీసికొందును.

అన్న—నిర్భాగ్యపుతండ్రి యిరువుర కొడుకులకుఁ జెరియొక సంచియు సంపాదింపక ఒక్కటిమాత్రమే సంపాదించె నెట్లు పంచుకొందుము. కావున సంచి యుమ్మడిగా నుంచక తీరదు.

తమ్ముఁడు—సంచి యెవనికడ నుండవలయు.

అన్న—పెద్దవాఁడను నాకడనే యుండును. నీ కవసరమువచ్చినప్పుడు వచ్చి దులపుకొని రాలినసొమ్ము తీసికొనిపోవుచుండువుగాక.

తమ్ముఁడు—అది నాకడనేయుంచి నీవే వచ్చి తీసుకొనిపోవుచుండరాదా?

అన్న—మాటకు మాటచెప్పిన నే నేమందును! నీవు మంచివాఁడవే యగుదువు. నీ భార్య లేదనిన నేమిచేయువాఁడ.

తమ్ముఁడు—నీ భార్యమాత్రము నంగనాచియా యేమి? నన్ను రానీయ కున్న నేనేమి చేయుదును!

అన్న—నే నీ మూడువస్తువుల సమముగాఁ బంచజాలను బుద్ధిమంతు నొద్దకుఁబోయి వానికేమైననిచ్చి పంచిపెట్టుమని కోరదము. అందులకు నీ కిష్టమేనా?

తమ్ముఁడు—ఇష్టమేఁ పదపద.

అని యిరువురు తగవులాడుచుండఁ బ్రతకుఁడు వారి సమీపమునకుం బోయెను. వారతనిఁజూచి యత్యంత ప్రతిపత్తితోలేచి గౌరవింపుచుఁ గూర్చుండ నియోగించిరి. అందు బెద్దవాడిట్లనియె. అయ్యా! సందిగ్ధసమయములో దైవము వలె నీ విక్కడికి వచ్చేసితివి. మా తగవువిని నీకుఁ దోఁచినట్లు న్యాయముచెప్పుము.

నీవు చెప్పినట్లు మే మిరువురము నడిచికొందుము. వీఁడు నా తమ్ముఁడు నందుఁడను వాఁడు. నా పేరు నందుచంద్రుఁడు. మా తండ్రి హిమాలయమునఁ బెద్దగాలము తపము చేసి మూడు వస్తువులు సంపాదించెను. ఇది బొంతసంచి. దీని నా దండముతోఁ గొట్టి దులిపిన వలసినన్ని బంగారు నాణెములు రాలుచుండును. ఇవి పాదుకలు. వీనిని దొడిగికొని యెందుఁబోవలయునని తలంచిన ఖేచరత్వమున నందుఁ బోఁగలము. ఇది దండము. దీనితో నొక పెదగీచిన బల్లెయు నొకపెదఁగీచిన బట్టణంబును జనించును. ఈ మూడువస్తువుల మహిమ యిట్టిది. వీని యనుభవ కాలమున మా తండ్రి మృత్యుంగతయ్యెను. వీని మేము సమముగాఁ బంచికొనవలసి యున్నది. మా తమ్ముఁడు దేనికిని నొప్పుకొనఁడు. మాకుఁ బాళ్లు కుదరకున్నవి. కావున నీవు పక్షపాతమువిడిచి దేవుని మొగముఁజూచి మాకుఁ బంచిపెట్టుము. నీ వెట్లు చెప్పిన నట్లునడచుతుము. తమ్ముఁడా! ఇది నీకిష్టమేనా? అనక తగవు పెట్టువుకద. అని యడిగిన వాఁడును నీ కిష్టపడిన నేనుమాత్ర మెందుల కొప్పుకొనను. అట్లే కానిమ్మని తెలియఁజేసెను.

పుత్రకుఁడు — ఆహా! యేకగర్భజనితులగు సోదరులు పితృధనము పంచుకొనుట కెట్లు కలహించుచున్నారో కొంచె మెవ్వరికెక్కువైన నేమిలోపము! సీ సీ! ద్రవ్యమువంటి దుష్టపదార్థము మఱియొకటిలేదు. ఇప్పుడు నాకు వీరిని మోసము చేయవలయునని యూహ పుట్టుచున్నది. యిది భగవత్ప్రేరితము. కానిమ్ము అని తలంచుచు నిట్లనియె.

అయ్యలారా! మీ తండ్రి వీనిని దపముజేసి సంపాదించెను. అనుభవింపలేక పోయెను. యెవ్వని కేది ప్రాప్తియో యది వారిని జేరక మానదు. నేను ఆకసమువంక జూచి మీకు బంచెద వినుండు. మూడిటిలో సంచియే యనర్ఘమైనది. తక్కిన రెండు వినోద క్రియా ప్రదములు. వానివలన విశేషలాభము లేదు. ఈ సంచి సగముగాఁ జీల్చి పంచుటకు వీలులేదు. నేను చెప్పగా నాలోచించితిని. పాదుక లొకరు దండమొకరు తీసికొనవచ్చును. ఈ సంచిని గురించి దైవ శోధన మొందుచేసెద వినుఁడు. నే నీపాషాణమెక్కి శక్తికొలఁది యొకదండము విసరెదను. మీ యిద్దరు పరుగెత్తుకొనిపోయి ముందుగా నెవ్వరందుకొని తెత్తురో వానికి సంచి నిచ్చి వేసెదను. పంచుటకింతకన్న వేరొకసాధనము గనంబడలేదు ఇది దైవశోధనము. యిందులకు మీ రిద్దరు నంగీకరింపవలయునని పలికినవిని యిరువురు పిక్కబలము గలిగియున్నవారగుట నందుల కంగీకరించిరి.

అప్పుడు పుత్రకుఁ డొకపాషాణమెక్కి పాదుక లొకమూలను దండ మొకమూలను బెట్టి సంచినిఁ జేతఁబుచ్చుకొని యిదిగో నేను దండము విసరుచుంటిఁ గాచికొనుఁడు. దానిని దెచ్చి ముందెవ్వఁడు నా పాదములు ముట్టునో సంచి వాని

రిచ్చివేయుచున్నాను. అని పలుకుచు మూరెడు గట్టికట్టియ నొకదానిని గైకొని నిక్కి గట్టిగా విసరివైచెను. దానితోనే యిరువురు బయిగెత్తుకొని పోయిరి.

అంతలో నతండు పాదుకలను తొడిగికొని దండ మొకచేతంబట్టి సంచిని జంకకు దగిలించుకొని జయపరమేశ్వరా నేను సత్రదేశములోని లోపలయడవులలోఁ బర్వతశిఖరమునఁ జలాధారముఁగల చోటికి బోవలయును. అని కన్నులు మూసికొని తలంచి కన్నుల దెరచినంతలో నట్టిచోటునఁ బోయి నిలుచుండెను.

నందోపనందులు నిరువురు సమముగాఁ బరుగిడుకొనిపోయి ఒక్కసారియే దానిమీద చేయివైచిరి. దాని మొదలన్నయు జివర తమ్ముడును బట్టుకొని పెనఁగు లాడుచు విడువిడు నేను ముందంటితి ననియు వదులు నేను ముందు చేయి వైచితి ననియుఁ దగవులాడుచు యిరువురును దండమును విడువక గొంతతడవు ద్వంద యుద్ధముచేసి జేసి దండమును మాత్రము విడువక కొంతసేపటికా ప్రస్తరముకడకుఁ బోయిరి. అందెవ్వరును గనంబడలేదు. ఓహో! పరుగువిసరున నొడలు దెలిసి నది కాదు మన మా దెసకు బోవలసిన దీదెసకు వచ్చితిమి. దారి తప్పితిమి అని తలంచుచు దండమును విడువకయే వేరొకదెసకుఁ బోయిరి. అందునుం గనం బడలేదు వాని గేరలు పెట్టుచు దండమును విడువక నయ్యడవియింతయుం దిరిగిరి. పుత్రికుండును వస్తువులనుగూడ గనంబడలేదు.

కొంతసేపటికి వాడు పాదుకలెక్కి పారిపోయెనని గ్రహించి గోలున నేడ్చుచు నిరువురును దండమును వదలి పాలువైచిరి. అంతదనుక విడువకయే నెమకు చుండిరి. అప్పుడు నందుఁ డుపనందుని చుఱచుఱం జూచుచు.

మ. పలుగా! నాపలుకేల విందువుర సంప్రాప్తార్థముల్ పంపుకో
వలదన్నా! వలదెన్నరుఁడున్ మనము ద్వంద్వస్వామితన్ నిల్చి త
త్ఫలముల్ సామ్ముగ బంచుకొందమని చెప్పన్ భ్రష్టమయ్యెంగదా
తలపన్ గుండెలు బ్రద్దలయ్యెడు కటా! తద్వస్తుసామర్థ్యముల్.

గీ. సంచి దులుపుచు నందుచ్ఛవించు ధనము
పంచుకొందము రాయంచుఁ బలుకవలదు
వసువులు ముందు బంచుకోవలయు నెవని
కేదివచ్చిన దాని వాఁడే భుజించు.

క. అని యేడ్చితివయ్యయ్యో
జనని కడుపునందు నీవు జయింపకయుం
దిన నీ యాపద రాకుం
డునుగదరా లబ్దనాశనుఁడ వుపనందా.

అనుటయుఁ దమ్ముఁడుఁ గ! కటంబడి

ఉ. ప్రేలెదవేల నిట్లు తగు పెద్దనటంచిటఁ బైతృకార్థముల్
పాలిడుమంచుగోరుట విపర్యయమా ? యెఱుఁగవో యొవండు రా
త్రిలఁ దదర్పితం బెవఁడుచేసెను పంచుమటంచు నీవు చం
దాలుఁడవై పుట్టి చన్నను నాకు వెతల్ మరి లేకపోయెడున్.
క. ఛీ నోరుమూయి జాల్మా
చ నోరుమూయి జాల్మాచెనటీ చెనటీ
ప్రాణములు గొందు జూడుము
ప్రాణములం గొందుననుచుఁ బలుకన్ బలుకన్.
ఉ. మాటకు మాటయన్న నభిమానము చెందుచు నన్న, తమ్ముని న్
నాటఁగగొట్టెఁ జెంప రదనంబులు రాలగ వాఁడునున్ శిర
స్స్ఫోటముగాగ లఁ గ్రగద్ది యొకపో టురమందుఁ దగిల్చెఁబెద్ద పో
రాటముగల్గె వారి కపు డాగ్రహమాకృతి బూనెనోయనన్.
క. సుందోపసుందు లట్టుల
నందుఁడు నుపనందుఁడును ఘనద్వంద్వమహా
స్కందన మొనరించి మృతిన్
జెందిరి చేద్పరగ నొకనిచే నొకఁడార్తిన్.
గీ. ధనముకొఱకు నన్నదమ్ములు పోట్లాడి
భాగవిత్త మొరుల పాలుసేసి
యసువులైన విడుతు రంతియకాని తా
రసదుముట్టనీయరందు నొకని.

అని యెరింగించునప్పటికిఁ గాలాతీతమైనది. మణిసిద్ధుఁడవ్వలి కథ పై మజిలీయం దిట్లు చెప్ప మొదలు పెట్టెను.

277 వ మజిలి

## కోఁతుల కథ

పుత్రకుంకట్టు లన్నదమ్ముల నిరువుర వంచించి యా మూడు వస్తువులం గైకొని తలంచిన యట్ల ఉత్తరదేశ మహారణ్య మధ్యంబునందలి సమున్నత పర్వత పంక్తిలో నొక గిరికూట తటాక తీరమున నిలువంబడి తటాకాకరశీతల మారుతపోతంబులు మేనికి హాయిసేయఁ గన్నులం దెఱచిచూచి యప్పాదుకల ప్రభావ మగ్గించుచుఁ బ్రవరాఖ్యుని వృత్తాంతము స్మరించుకొనుచు మనంబున ననేక సంకల్పంబు లుత్పత్తిల్ల ముందుఁ జేయదగిన కృత్యంబు లాలోచించుచుండెను.

అప్పటికిఁ జాము ప్రొద్దెక్కినది. తీక్ష్ణముగా నెండగాయుచుండెను. స్నానముచేసి యందలి ఫలంబులందిని యాఁకలియడంపడలంచి కొని పాదుకలను,

దండమును, సంచియు నీటియొద్దునంబెట్టి యేటిలో డిగి స్నానముఁజేయుచు నిట్లు తలంచెను. నే నీ పాదుకాప్రభావమునఁ జాలదూరము వచ్చియుందును. యిది దుర్గమ్యప్రదేశమగుట వారిందు రాఁజాలరు. ఈ వస్తువులు నాకుఁ దక్కినవి. వీని వలన నెక్కుడు కీర్తి సంపాదింపవచ్చును. ఒకచోట మంచినగరము నిర్మించుకొని రాజునై పాలింతు. సంచి దులిపినఁ గావలసినంతసొమ్ము లభించునుగదా! పాదు కలవలనఁ భూమండలమంతయుం దిరిగి చూచెదంగాక. అని తలంచుచు నాప్యాయ నము తీరనందు గ్రుంకులు వెట్టుచుండెను.

అంతలో నొక కోఁతులగుంపు తటాకములో నీరు ద్రాగుటకై యక్కడికి వచ్చినది. అదృష్టపూర్వములగు వానర విశేషములం జూచి బెదరుచు నవి మీఁదఁ బడి చంపునేమో యని చెరువు నడిభాగమున కీదుకొనిపోయి చూచుచుండెను. ఆ కోఁతులు సహజమగు మర్కటచేష్టలం బ్రకటింపుచు నీరు ద్రావి తావి యొకదానిపై నొకటి యెక్కి యాడుచు నెగయుచు నొడ్డుననున్న పాదుకలను దండమును సంచిసిం జూచి బొరలించుచు—

సీ. ఒక్కమర్కటంబు పాదుకనెత్తి నెత్తిపై
నిడికొనియెగసె సమీపతరుల
కొకకోఁతి సంచిమూతికినున్న దారంబు
కొనలాగి మెడఁజుట్టుకొనుచు నెగసె
గడసి రెండవపాదుకను బట్టుకొని చెట్టు
కొనకేగె కొకపండుకోఁతి బలిమిఁ
దటిగ్రుచ్చఁబడిన బెత్తము లాగి మూపునఁ
బూని వానర మొండువోయె బొదల

గీ. కున్నకోతులెల్ల నొండొంటఁ బైకెక్కి
తరుముకొనఁగఁ బొదలఁ దరులఁ జరులఁ
బ్రాకి పాకి యెగసి ప్రకటించుకొనుచాత్మ
చేష్టితములఁ గొంతసేపు తిరిగె.

చ. వనచర మొక్క టెత్తుకొని వచ్చినపాదుకలాగికొంచు గ్ర
క్కునఁ దరుశాఖికాగ్రమునకుం జన వేఱొకకోఁతి వచ్చి దా
నినిం బడద్రోసి లాగికొని నిక్కి మఱొక్కలతాంత మెక్కినం
తనె మఱియొక్క వానరము దానిపయింబడి లాగి పాదుకన్.

క. దూరముగ విసరివైచినఁ
బారి వలీముఖమొకండు పట్టికొనుచు న
చ్చేరువనున్న కపిం బల
మారఁగఁగొట్టుటయు లేచి యది కోపముతోన్.

క. బంతివలె దానిగైకొని
యంతికమున నున్న కపుల నదలించుచు సా
గంతులు వైచుచు మును హను
మంతునిగతిఁ దిరిగెఁ గపిసమాజములోనన్.

క. సంచిం గింతంబునఁ దగి
లించుకొని చరించు నవ్వలీముఖమును గ
ద్దించి యడి లాగి ముసుగిడి
కొంచు న్నరిగెంచెఁ బండుకోఁతియొకఁ డటన్.

క. మూఁగి పదికోఁతులయ్యది
లాగి కపిన్ నెత్తిగోరులం గ్రుచ్చుచు వే
వేగను వెదురు పిడెంబుల
వాగునకున్ బోయెఁ గపివివర్తిత సరణిన్.

గీ. బెత్త మెత్తిపోవు పెనుఁగోతి నదలించి
పండుకోఁతి దాని బట్టుకొనుచుఁ
బసులగొల్లవోయె నెపదోసికొనిపోయె
గొండలోయలకును గోఁతిగముల.

పుత్రకుం డాకపిచర్యనెల్ల నీటిలో నుండియే పరికించుచు నమూల్యములగు నా వస్తువులు కోఁతు లెత్తుకొనిపోవుటచే గుండె జారిపోవఁ జొరవనేసి యా తడిగుడ్డలతో నొడ్డెక్కి పొదల దూరిపోవుచున్న వానర సమూహము వెంట నదలించుచు బోవుటయు నవి తిరుగఁబడి దేవమార్గమును జూపుచు కఱవవచ్చిన జారిపోయి తటాకములో దుమికెను.

కొంతసేపందుండి వెండియు గట్టెక్కి యా కోఁతులు వోయిన మార్గమనుసరించి కొంత దవ్వరిగెను. అవి కొండలనిగి కోనల లోపలకుం బోవుటచే వాని జాడ యేమియుం దెలిసినదికాదు. అప్పు డతని చిత్తవృత్తి యెట్లుండునో నుడువుట కడుంగడు కష్టముగదా! తడిగుడ్డలతో నా యొడ్డునఁ జతికిలంబడి యిట్లు ధ్యానించెను.

ఆహా! సంసార చరిత్రము తలంచికొన నతి విచిత్రముగా నుండును. గడియలో సంతోషము, గడియలో వంతయుం గలుగుచుండును. మాయాబలంబునం బొదమిన దేహాభిమానంబునం జేసి చిరకాలస్థాయివలె జనుం డక్రమకృత్యంబులకుఁ బొడంగుచుండును. ధనాశంజేసి మా తండ్రులు నన్నుఁ జంపబంపిరని వారిని నిందించుచు నేను పైత్య కథనము బంచుకొనుచున్న యన్నదమ్ముం వంచించి వారి వస్తువుల నపహరించి తెచ్చితిని. అవి నా కెట్లు దక్కును. ఆ దోషము నన్ను వెంటనే గొట్టినది. వానరకైతవంబున దైవము నా కిట్లు బుద్ధి చెప్పెను. కానిచో

నిన్ను దేశములుండ నీ యరణ్య మధ్యమునకు రావలెనని తలంపనేల ? నేనీ దుర్గమనగ శిఖరమునుండి వెలుపలికి బోవుట యెట్లో తెలియదు.

శ్లో॥ భగ్నాశ్చ్యషిర్భాగవతాభవంతి

అను నార్యోక్తి ననుసరించి నే నందు భగవంతుని బ్రార్థించుటం దప్ప వేరొకగతిలేదు. తపంబున సర్వపాపంబులు నశించును. తపము చేసి నన్నంటి యున్న మిత్రద్రోహపాతకమును నశింపఁజేసికొనియెదంగాక. తపోనిష్ఠుండనగు నా దేహము నే మృగమో భక్షించును. చివరకు నాకీ గతియే పట్టినది. అని యాలోచించుచు నతం డప్పుడే గురుననుష్ఠానము గావింప బ్రారంభించెను. ఆహార నిద్రాసమయంబులం దప్ప నహోరాత్రముల నతిదీక్షతో నా మంత్రజపము గావింపుచుండెను. గాయత్రీ కవచమును బంజరమును పఠించుచుండుటచే నతనికా యరణ్య మధ్యమున భయామనుమాటయే లేకపోయినది. అతనికడ కట్టుగుడ్డలు తప్ప మరేమియును లేవు.

ఈ రీతిఁ గొన్ని నెలలు గతించినంత నొకనాఁడతండు స్నానము చేయుచుండ నాతటాకంబున కవ్వలితటంబున నీటికై కడవలెత్తికొని వచ్చిన కొందరు స్త్రీలతనికిఁ గనంబడిరి. వారిని జూచి యాశ్చర్యపడుచు మనుష్యసంచారశూన్యమగు నీ యరణ్యమున నింతులుండుట వింతగా నున్నది. యిదివర కెన్నఁడును చూడలేదు. వీరి వృత్తాంతము దెలిసికొనుట యుచితమని తలఁచుచుండ గొందరు గోపాలుర పసవులను దోలికొనివచ్చి యా నీటిలోనికిం దోలిరి. అప్పుడతని కందొక పల్లెయున్నదని తోచినది. మెల్లగా లేచి గోపాలురకడకుఁబోయి మీ రెవ్వరు ? యెందుండి వచ్చితిరి? మీ యూరెందున్నది ? అని యడిగిన మా యూరిందేయున్నది. అందుండియే వచ్చితిమని యుత్తరమిచ్చిరి. అతండు నాఁడు జపము మాని వారున్న దెసకుఁ బోయిచూడ నా ప్రక్క లోయలో నొక పల్లె గనంబడినది. అతండు వెఱగందుచు మెల్లగ నా పల్లెలోనికిఁబోయి చూచెను. ఆ గృహములన్నియు సకలసంభార పూర్ణంబులై యొప్పుచున్నవి. అందున్నవా రందరు శూద్రులు. యాటవికులవలెఁ గనంబడుచుండిరి. వారి భాష యతనికి దెలియకున్నను సంజ్ఞలవల్ల గ్రహించి వారితో మైత్రి కలిపి తిరుగుచుండెను. జనసంపర్కంబు తపంబున కంతరాయము గదా ? నాఁడు మొదలతని జపంబు సంక్షేపము కాజొచ్చినది. కోఁతు లెత్తికొనిపోయిన దండము రెండవకొన నేల రాచుటచే నా పల్లె జనించినదని నాలుగుదినంబుల కతండు గ్రహించుకొనెను.

ఆ వస్తువులు కోఁతుల కక్కరలేదు. యితరులకు వాని మహిమ తెలియదు. అవి యంటో పడియుండును. వానిలో నొక్కటి దొరికినను జాలునని తలంచుచు నతం డాటవికులవెంటఁ గొన్నినాళ్ళరణ్య సంచారము గావించెను. తరచు కోఁతి మూకలున్న తావులకుంబోయి చూచుచుండును. యింక నవి యతని దొరకకున్ని

నిశ్చయించుకొని యా కొండవాండ్రవెంట నరవ తెరవునఁ గొండలు దిగి దిగువ జన పదంబులకు బోయిచూచెను. అందు పెక్కు పల్లెలున్నవి. అవియు బెత్తము రాపిడివలన జనించెనేమో యని యా యూళ్ళలోఁ గొన్నినాళ్ళు సంచారము గావించెను.

ఔరా! నిష్కాముండనై యరణ్యమధ్యమందు దపము చేసికొనుచుండ నీ పల్లెలు గనంబడినతోడనే తపోవిఘ్నమగుటయేగాక యాశాపాశము నన్నుఁగట్టి యిక్కడకు లాగికొనివచ్చినది. వానిం దెగగోసి కాశీపురంబున కరిగి గంగా తటా కంబునఁ దపంబు జేసికొనియెదగాక. అని నిశ్చయించుకొనుచున్నను నా ప్రారబ్ద మెట్టిదో నా బుద్ధి యా వస్తువులమీదనే వాలుచున్నది యింకను నవియెందో దొరకు నను నాస నాపదములకు సంకెలలై యవ్వలకు బోనీయకున్నవి. యిక నొకసారి వెను కకు బోయి వెదకి దొరఁకకున్న గాశికిబోయెదనుగాక. అని తలంచి క్రమ్మఱ నా పల్లెలకుంబోయి వెదకి వెదకి విసిగి నిరాశజేసి సీ! యింక నిందు నిలువను. కాశీపురంబునకుం బోయెదనుగాక! యని నిశ్చయించుకొని అటగదలి పర్వతములు దిగి పల్లెలుదాటి గ్రామములం మీఁదుగా గొన్నినాళ్లు సంచారము గావించెను.

అతండు మరల నాశజనింప గొండలకడకేగి చూచుచు నవి దొరకమి విరక్తి జెంది యావలకు వచ్చుచు నాశాపాశము వాని గవ్వమునువలెఁ జుట్టుకొని త్రిప్పుచుండఁ బదిసారులు నటు నిటు నుయ్యాలపోలిక తిరుగుచుండెను.

అతండొకనాఁడు విసిగి కాశీపురాభిముఖుండై యరుగుచు నిట్లు తలంచెను. ఆహా! ఆశకుఁ బాశమని పేరుపెట్టుట సమంజసముగా నున్నది. ఎంత విరక్తిఁ జెందుదమన్నను నన్నదికట్టి పదిసారులు వెనకకు లాగికొనిపోయినది. దానివలన నా వైరాగ్యమంతయు భ్రష్టమైనది. తపము పాడువడినది. ఆశకు మది నవకాశ మిచ్చెనేని మనుష్యుని బెక్కు చిక్కుల పెట్టుచుండును. అని యాలోచించుచు నొకనాడొక పల్లెదారిం బోవుచుండ నందొక విద్యార్థికి బడిలో నుపాధ్యాయుడు ఒక పద్య ముపదేశము సేయుచుండెను. అది

గీ. విసిగి కార్యప్రయత్నంబు విడువరాదు
పట్టుదలయున్న పొసఁగు నెప్పటికినైన
దేవదానవ లబ్ధిమధించు నపుడు
వదలిరె విరక్తి నమృతంబు వచ్చుదనుక.

పుత్రకుం డా పద్యమునువిని తదర్థావబోధము చేసికొనుచు నోహో! నాకిది యుపశ్రుతి కాదుగద. నేను పదిసారులు తిరిగి విసిగి పోవుచుండ నిట్టిమాట వినంబడినదేమి? దీని శకున మొకసారి పరీక్షజేసి చూచిపచ్చెదంగాక. అని నిశ్చ యించుకొని యతండు గిరాలున మరలి యడవులన్నియు దాటి వెనుకపల్లెలకుజేరి వీధులదిరుగుచుండెను.

ఒక కోయవాని యింటిలో నతని భార్య ప్రసవమగుటయు నా గడి గోడకు

నొకపాదుక వ్రేలంగట్టఁబడియున్నది. దానింజూచి ధూళిచ్ఛన్నమై యుండుట సందియముతో దాపునకుంబోయి నిదానించి పరికించి యల్లము ఝల్లుమన దానిపై చెయ్యిడి యది యదే యని తెలిసికొని త్రిప్పుచుండ లోపలనుండి యొక ముసలి దీవలకువచ్చి నీ వెవ్వఁడవు? చెప్పు ముట్టెదవేల? యిది సూతికా గృహము. యిందు మగవారు మసలరాదు. అవ్వలబొమ్మని పలికిన నతం డిట్లనియె.

అవ్వా! యీ పాదరక్షనాది. చెరువులో స్నానముచేయుచుండ కోఁతు లెత్తుకొనిపోయినవి. ఇది మీ కెట్లు వచ్చినదని యడిగిన నా వృద్ధ ఏమోమాకుఁదెలియదు. ఇందుండరాదనుచుండ బల్కరించెదవేల? పో పొమ్మని కసరుటయు లోపలనుండి బాలింతరాలు అయ్యా! ఇది మా కుఱ్ఱవాడు పొలమునుండి తెచ్చెను. మీదైనచో నిప్పుడు విప్పరాదు. మూన్నాళ్ళు సనినరందు పొందని పలికినది. అతండు ఆ ప్రాంతముల జరింపుచు సంజవేళకుఁ గ్రమ్మఱ వారింటికివచ్చి యప్పుడే యడవినుండి వచ్చిన దానికొడుకుం జూచి దాపునకుఁ జీరి యిట్లనియె.

బాలకా! ఆ పాదుక నీ కడవిలో దొరికినదని నీ తల్లి చెప్పినది. అది మా గురువుగారిదగుట నిత్యము పూజించుచుందును. ఆ పావుకోళ్ళను కోఁతులెత్తుకొని పోయినవి. వానికొఱకు వెదకుచుంటిని. రెండవది కూడనిది దొరికినచోటనే యుండును. ఇది యెందు దొరికినదో చెప్పెదవా అని యడిగిన వాఁడిట్లనియె.

సామీ! యిదినాకు దొరకి నాలుగు మాసములయినది. ఒకనాఁడు పేరెంట గాయుచుండ కొందరము పిల్లవాండ్రము వెదురు పిడెములనడుమ విశ్రమించితిమి. అంతలో నింమక గాలి విసరినది. గుభాలున నిది మా ముందర బడినది. వ్రేలెడు దాటినదిగాని నా నెత్తిపైఁ బడవలసినదే వెంటనే నేనందుకొని పరిశీలించితిని. ఇదియేదియో నాకు దెలిసినదికాదు. యింటికిం దీసికొనిపోయి పల్లెలోని వారికందరకుం జూపితిని. యెవ్వరును దీనిం బోల్పలేకపోయిరి. ఒక పెద్దవాడిది కాలికి దొడుగుకొనునదని చెప్పెను. యెట్లు తొడగవలయునో మాకు దెలిసినది కాదు. పెరటిలోఁ బాఱవైచితిని. చెప్పునకు మారుగా మా యవ్వ దీనిని గట్టినది. కాఁబోలు అని దాని వృత్తాంతమంతయుఁ జెప్పెను.

పుత్రకుఁడు అది జరిగిన తావు చూపుమని వానిం బొగడిన రేపురండు మేము నిత్య మక్కడికే పోవుచుందుమని చెప్పెను. అతండు పిల్లవాఁడు యడవికి పోవువేళ తెలిసికొని మఱునాఁడు వాని వెంట నక్కాంతారాంతరమున కరిగి యా వెదురు పొదలన్నియు వెదకి వెదకి పిల్లలచే వెదకించి యెందును నా పాదుకం గానక సంజవేళ కింటికిఁ వచ్చెను. అతండా పిల్లలవెంట నిత్యము పొలమునకు బోవుచు వెదకి వెదకి యెందునుం దానిఁగానక విసిగి సూతికా గృహంబునకుంగట్టిన పాదుకనడిగి తీసికొని యర్చించుచు జంకనిడికొని పాదుకా రాజమా! మీ మహత్వము ననే నే నింత దూరము రాగలిగితిని. నన్నిందు బాఱవైచి మీ రెందో యడఁగియుంటిరి.

మత్పూర్వపుణ్యవశంబున నీవు దొరికితివి. నీ తోడెందున్నదో యప్పటికిఁ దీసికొనిపోవా? అని ప్రార్థించుటయు నప్పడతని నెవ్వరో లాగికొనిపోవుచుఁ నాఁ పీఠం పోవుచుండెను. ఆ త్రోవ నా పల్లెలో చిట్ట చివరనున్న యొక గ ప్రక్కకుఁ దీసికొనిపోయి యాపినది.

అతం డా సన్నగ్రహించి అయ్యా! లోపల నెవ్వరు? మీ యింఁ పాదుక యున్నదని తెలిసినది అది మా గురువుగారిది. పూజింపవలయుఁ యితురేయని కేఁ చెప్పెను. ఆ మాటవిని యా యింటిలోఁది పిల్ల తొట్టిపై గట్టిన యాపాకోడుదెచ్చి యిదియేనా మీ పాదుక మా యింటనున్నదని మీ కె సెప్పిరి? నా దాయలు చుట్టుప్రక్కలవారే మాకు సూదులు. మమ్ముజూ గన్నుల నిప్పులు రాల్తురు. అని వారిని దిట్టుచు నా పాదుక నాకిచ్చినది. ఁ గైకొని రెంటినిగలిపి పరిశీలింపుచుండ వానికిఁ బొగడలు బంగారముతో వేఁ యున్నవి. అది వా రేదియా లోహమను కొనిరి. అందలి నిజమెరింగిన దొకఁడు కొందర కోయవారల ప్రోగుచేసికొని పుత్రకుఁడున్నకతకు వచ్చెను.

అతఁ డా కోయగుంపులంజూచి వెఱచుచు పాదుకలను తొడిగికొని పరమేశ్వరా నేసిప్పుడా దండమున్న చోటునకుఁ బోవలయునని తలంచుకొని కను మూసికొనియెను. అప్పుడతండు తాను జపము చేసికొనుచుండెడు చెరువు తటం నిలువంబడియుండెను. అందా దండము చేతంబూని యొక బాలుండు పసవు దోలుచుండెను. పుత్రకుఁడది గురుతుపట్టి వానింజీరి యోరీ! యీ బెత్తము కెక్కడ దొరికినది. యేదీ చూత మిటుతే అని యడిగిన వాఁడు సామీ ఁ వెదుకు వంతలలో దొరికినది మూడునెలలైనది. వాడుకొనుచున్నాను. అని చె వానికందించెను.

కాలము చక్కబడునప్పుడన్నియు సమకూడును. నీరు పల్లమున జేరునట్లు కోరకున్నను మంచికాలమున సంపదలు చేరుచుండును. చెడుకాలవ చెట్టుపిట్టలవలె నెగసిపోవుచుండును. పాదుకలు దండము దొరికినవి యిక స దొరకవలసియున్నది. దానిం జేరుకొను నుపాయము తోచుచున్నది అని త చుచు నా బెత్తము గైకొని వానిం బొమ్మని యదలించి పాదుకలం దొడుగుకొ "ఓ దివ్య ప్రభావ సంపన్నులారా! పాదుకలారా! ఆ సంచి యెందున్నదో నన ప్రాంతమునకుఁ దీసికొనిపోయి నిలువుఁడు" అని కన్నులు మూసికొని తలంచిన సత్యంత వేగముతో నతఁడొక బాటలోఁ జతుష్పదంబుగ నొప్పుచున్న పెద్ద వ ప్రక్కం జేర్చినది

యా వటవృక్షము నాలుగుదారుల మధ్యనున్నది. దాని శాఖలు న దెసలకు గ్రోశదూరము దనుక వ్యాపించియున్నవి. దానికి తూరుపుదెస నిర్మల పూరితంబగు కాసారము గలిగియున్నది. చుట్టుప్రక్కలనున్న గ్రామములం

బిచ్చమెత్తుకొనివచ్చిన బిచ్చగాండ్రా చెట్టుక్రిందదిగి వండికొని భుజించుచుందురు. ఉట్లు జోలిసంచులు నుయ్యాలలు లోనగునవి బిచ్చగాండ్రా చెట్టుకొమ్మలకు దగిలించి వండుకొను చుందురు. ఊఁడలకును శాఖలకును త్రాళ్ళుగట్టి కొందరుయ్యేల లూగు చుందురు. కొందరు తొట్టెలనుగట్టి పిల్లల జోకొట్టుచుందురు. అందు నానా దేశములవారును పాంథులును వండుకొని పోవుచుందురు. కొందరు స్థలమునకై పోట్లాడుదురు. పెక్కుభాషల మాట్లాడుదురు. కథలను జెప్పుకొనుచు దేశవిశేషములను దెలిసికొనుచు కొందరు వినోదముగా వసింతురు. అది యొక తీర్థమువలె నొప్పుచుండును.

పుత్రకుఁడు కన్నులనుదెఱచి చూచినంత నావింతలన్నియు గనఁబడినవి. ఆ చెట్టు కొమ్మలకు ముష్టియెత్తుకొని వచ్చిన జోలిసంచులనేకము లాయూడలవలె వ్రేలాడుచున్నవి. వానిలోనొక బిచ్చగాడు ముష్టిగింజలన్నియుబోసి చెట్టుకొమ్మకుఁ వ్రేలాడగట్టిన బొంతసంచి వానికిఁ గన్నుల పండువ గావించినది. ఆ సంచి తనదని తెలిసికొని దానినెట్లు సంగ్రహింపవలయునోయని యాలోచింపుచుండెను.

ఆ బిచ్చగాండ్రడు బుడబుక్కలాడువలె గనంబడుచున్నాడు. శకునములఁ జెప్పుదననియు దయ్యముల వదలింతుననియుఁ లోకుల వంచించి డబ్బులాగుచుండును. వీని వేషము భయంకరమైనది. వీని నడిగిన మాటలతో నీ సంచి నాకీయఁడు. వీనితో గొంత పరిచయము గలుగజేసుకొని తరువాత సమయానుకూలముగాఁ కావించెదనని తలంచి మెల్లగా నతని సమీపమునగూర్చుండి యుస్సురని నిట్టూర్పు నిగిడింపుచు నందున్న మరియొక బిచ్చగాండ్ర బలుకరింపుచు నిట్లనియె.

పుత్రకుఁడు—పాంథులారా! మీ దేయూరు? ఎందుఁబోవుచున్నారు?

బిచ్చగాండ్రు—అయ్యా! మాకొక యూరున్నదా? అన్నియూళ్ళు మావియే. ఎక్కడ బిచ్చము బాగాదొరకిన నచ్చటికి బోవుచుందుము.

పుత్ర—అన్నివృత్తులకన్న భిక్షాటనవృత్తియే మంచిదని నా యభిప్రాయము వినుఁడు.

ఉ. వృత్తులలోనఁ నెల్ల సుపవిత్రము భైక్షికవృత్తియే సుధీ
సత్తములంచు మిము నుతిసల్పగ వచ్చు మధువ్రతాళి పూ
గుత్తులఁ తేనె నోరిమిగఁ గ్రోలెడుతీరున మీరు కేసులన్
జిత్తమలర్చి జాలిపడఁజేసి గ్రహింతురు ముష్టిముష్టులన్.

దీనినే మధుకరవృత్తియని చెప్పుదురు మీరు మహర్షులవంటి వారని నా యభిప్రాయము.

బిచ్చగాండ్రు—అయ్యా! మీరు పూర్వకాల మనుష్యులవలె నున్నారు. మా వృత్తి మంచిదైనను దొరకవలదా? రామ రామ దేశముమీఁద బొత్తిగా ధర్మము పోయినది.

సీ. చేయూఁతకొనలేదు పోయిరమ్మనుపల్కుఁ
    జల్లగానొక్క సంసారిభార్య
భోజనాలయినవి పోపొండు నేఁడు బి
    చ్చము బెట్టమనుచొక్క జలజనేత్ర
ఈవేళఁ బొండు మాయింటఁ దద్దిన మున్న
    దని ముష్టి వేయదు వనితయొర్తు
ఏకాదశీపర్వ మీనాఁడు ముష్టివే
    యఁగ రాదటం చొక్కమగువపల్కు
గీ. వేగలేకుంటిమకట! యీ బిచ్చగాండ్ర
తోడ నిండింటి కెనమండ్రుఁగూడియుండ్రు
తలుపుతీసినమూఁగి కేకలనువైతు
రనుచు నిందింతు రెక్కండు వనితలలిగి.

ఉ. గుమ్మముఁజేరగానే యలుఁగున్ బగవారినిఁజూచినట్లుపో
పొమ్మను పోవకున్న తలుపుల్ బెడిదంబుగ మూసిరిట్టు నో
యమ్మయి దేమియన్నఁగడు నాగ్రహమొప్పఁగ గొట్టవచ్చులో
కమ్మిడిముష్టికిఁదగిన కాలముగాదుగదయ్య పాఱుఁడా!

చ. కపటముఁ జేసిలాగవలెఁగాని గృహస్థులనుండి మంచి నే
రుపుగ యథార్థవాదికి నరుల్ తృణమైన నొసంగరందులో
నిపుణుడు రామజోగి యితనిం గనినంతనె పౌరుల ప్రయ
త్నపుగతిమీఁద వైతురుగదా! తగుచీరలు పట్టుశాలువల్.

సీ. పలువన్నె వలిపెంపు వలువలు మెలిపెట్టి
    యుష్ణీషముగఁ జుట్టియొఱయనందు
లలిఁబాలపిట్ట రెక్కలకుచ్చు తగిలించి
    కలియుగాటుక రాచి కనుబొమల
భ్రూమధ్యకుంకుమబొట్టు చక్కఁగదిద్ది
    పీపునఁబులితోలు వ్రేలఁగేల
ముఱుఁగులుంగరములు మురువుఁజూపఁగపట
    చ్ఛత్రంబుఁదాల్చి యుచ్చస్వరమున
గీ. పలుకు మంబా! మహేశ్వరీ! పలుకుమనుచు
ఢక్కవాయించుకొనుచు నాడంబరముగ
రామజోగి మహార్థగాత్రమునవీథి
దిరుగగని యెవ్వరైన భిక్షిల్లకుంద్రె.

పుత్రకుడు—ఏమీ! రామజోగియంతవాఁడా? ఔను నీతని యాకారమే తత్ప్రభావము చెప్పుచున్నది. అటుదిరిగి రామజోగి నీకు పిల్లలెందరు?

రామజోగి—నమస్కరింపుచు బాబూ నలవురు. అదియే నా భార్య మాలో నాడువాండ్రు ముష్టియెత్తఁగూడదు.

పుత్రకుఁడు—నీ యదృష్టము చాలమంచిది. నీ విక్కడి కెప్పుడు వచ్చితివి?

రామజోగి—బాబూ యిరువది దినములనుండి యీ చెట్టుక్రిందనే బస జేసియుంటి.

పుత్రకుడు—యేమీ! గ్రామములోనికి బోవుటలేదా? యింతకాల మిక్కడ నుండనేల?

అని యడిగిన బాబూ మీరు మంచివారువలెఁ గనంబడుచున్నారు. అందలి కారణము చెప్పెద వినుండు. అని చెప్పునప్పటికి వేళ మిగిలినది.

## 278 వ మజిలీ

# కోడండ్రమారి కథ

ఇక్కడికి రెండుక్రోశముల దూరములో నొక యగ్రహారము కలదు. అందప్పయసోమయాజులను వైదికసోమయాజియే కరిణీకము చేయుచుండెను. అతని కొక గయ్యాళిభార్య లభించినది. ఆ రాగయందు నా సోమయాజి నలువురఁగొడుకుల నొకకూఁతుంగని పరలోకమలంకరించెను. మగనియనంతరము పిల్లలు చిన్నవారలగుట ఆమెయే పెత్తనమువహించి యిల్లుగడుపుచుండెను. ఆమెను జూచిన నిరుగుపొరుగు వారు గడగడలాడుచుందురు. అత్యంతప్రేమతోఁ జూచుచున్న భార్యనైనను భర్తకు విరోధముపుట్టునట్లుచేయు నేర్పామెకే గలదు. మగపిల్లలకంటె నాఁడుపిల్ల పెద్దదగుట ముందుగా కూఁతునకుఁ బెండ్లి చేసినది తరువాత పెద్దవానికెవ్వరో పిల్లనిచ్చిరి. వాని భార్య కాపురమునకు వచ్చినది. కొడుకునకు భార్యయందు నెక్కుడు ప్రేమగలిగి యున్నది. ఆ యనుబంధము సహింపక నొకనాఁడామె కూఁతుతో నిట్లనియె.

అమ్మా! తమ్ముఁడు భార్యచెప్పినట్లు నడుచునని తోచుచున్నది యిక మనగతియేమి? వీరిద్దరికి నెట్లో కలహము పెట్టవలెను. వానికి నా మాటయందు విశ్వాసములేదు నీయందు గౌరవమున్నది. యేదియో చెప్పి విరోధము గలుగజేయుము. జాగ్రత్త అని చెవులో చెప్పినది.

ఆ కూఁతురు తల్లికంటెఁ బదియాకులెక్కుడుజదివినది. అమ్మా నీవిందులకు విచారింపకు నాలుగుదినములలో వీరికి బెద్దకలహము పెట్టెద చూడుము. అని ధైర్యము గరపినది. తమ్ముడు కరణీకపు పనికై తరచు పొలమున కరుగుచుండును. అతండు పొలముకొలిచి సాయంకాలమున కింటికివచ్చి విశ్రమించియున్న సమయంబున మెల్లగా దాపునకువచ్చి అక్క యిట్లనియె.

తమ్ముడా! నీకు నేనొక రహస్యముచెప్పెద, అమ్మ వినగూడదు. నీవు పొలమున కేగునప్పుడు అని చెవిలో నేదియో చెప్పినది. ఆ మాట విని సరే అమ్మతోఁ జెప్పను. అది యట్టిదిగాదే అని అప్పటికి తగిన సమాధానము చెప్పెను. మరునాఁడు తల్లి అబ్బీ! అన్నయ్యతో జెప్పితివా! నమ్మెనా? ఏమనియెను? యని యడుగుటయు నది మొదట నేనన్నునా? క్రమముగా బోధ సేయవలెను. నేనూరకిఁ బోయిన వెనుక నీవుకూడ బోధింపుము మతితిరుగ కేమగును? అని వారు మాట్లాడికొనిరి.

ఒకనాఁడతనిభార్యతో నీవు తరచు నేను లేనప్పుడు పొరుగిళ్ళ కరుగు చున్నావఁట. అది తప్పుపని అట్లుచేయకుము అని మందలించిన నా యువతి రామ రామ నేనెక్కడికినిబోలేదు ఏటికరుగునప్పుడు ఎదురింటి విశాలాక్షిని దోడురమ్మందు. ఇంతకన్న మరేమియు నెఱుంగనని చెప్పినది. అతండామాటనమ్మి యూరకుండెను. కూఁతురత్తవారింటి కరిగినది. తరువాతఁ దల్లి యొకనాఁడు కుమారునితో నాయనా! నీ యక్క యననేమోయనుకొంటిని. మన పరువు ప్రతిష్టలు నిలుచునట్లు లేవు, అని కూఁతురు చెప్పినమాటలను వదించి బలపరచినది. తల్లి యమాయకురాలని నిజము చెప్పినదని నమ్మి యతండు భార్యయందు విరోధముచెంది బలవంతముగఁ బుట్టినింటి కంపెను.

ఆ గౌరవమంతయుంజెప్పిన నేఁడు ముష్టికి బ్రొద్దెక్కును. సారాంశము వినుఁడు. ఆమె పెద్దకుమారునికి భార్యమీఁద భార్యలుండగనే నాలుగు పెండ్లిండ్లు రెండవవానికి మూడు పెండిడ్లు, మూడవవానికి రెండు పెండ్లిండ్లు చేసినది. కాపురమునకు వచ్చుదాకయే కోడలి గౌరవము వచ్చిన తరువాత పగ దానికన్న నధమముగాఁ జూచును.

యిప్పుడు నాలుగవకోడలు కాపురమునకు వచ్చినది. దానిని బట్టి నలుపు చున్నది. తండ్రి పట్టింబుట్టింటికిఁ దీసికొనిపోవుటకు నడుగవచ్చిన వానిఁ వెక్క దిట్టులు తిట్టి యవ్వల బొమ్మన్నది. అప్పుడా వియ్యంకుడు వారింటగుడవక వియ్యపు రాలి కెదురుగా నిలువంబడి చేతులతో నెత్తిపొదుచుచు, పెద్దక్కా! నీవు కోడం డ్ర మారివని యెరుఁగక మీ యింటికి పిల్ల నిచ్చితిని. నీ కూతురు కాపురమున కరిగినది కదా దాని నత్తగారు రట్టుపెట్టిన నీ పెట్లు కొట్టుకొనెదవు. అట్లే యెదరి వారియెడ గనికరముంచరాదా? ఇఁక బదిదినములు చూచెద. దరువాత నా ప్రజ్ఞ చూపెద, జాగ్రత్తయని చెప్పి వియ్యంకు డింటికి బోయెను. కొడుకు పొలమునుండి యింటికి వచ్చిన తరువాత మామగారు చేసిన యాగడమంతయుఁ బది రెట్లెక్కువగాఁ జెప్పి వానికి రోసమెక్కించినది.

అది మొదలు అతండు భార్యపై గోపము గలిగి యుండెను. అది యట్లుండె. వియ్యంకుడు తనపై దయ్యమును ప్రయోగము చేసినాడనియు, నది రాత్రులువచ్చి గుండెలపైఁ గూర్చుండి బాధపెట్టుచున్నదనియు, గొడుకునకుఁ జెప్పి

భూతవైద్యుల పిలిపింపుమని మొఱపెట్టినది. కుమారుఁడు భూతవైద్యము చేయించెను. కుదరలేదు. నే నా యూరిలో పిచ్చమెత్తికొనుచు నా వార్తయంతయు విని యర్ధరాత్రమున నీ ఛక్కా వాయించుచు వారింటిమీఁదుగా బోవుచు నందునిలిచి ఓహో! యీ గృహములోఁ గామినీభూతమున్నది యెవ్వరో ప్రయోగించినారు. నాకగుపడుచున్నది. దీని మారణహోమము గావింపఁగలను అంబా! పలుకు జగదంబా! పలుకుమని ఛక్కా వాయించి యట్టహాసము చేసితిని. నా మాటలు విని యామె తలుపుతీసికొని యీవలకు వచ్చి, "ఓ తాంత్రికుఁడా! మా యింటఁ గామినీభూతమున్నదని చెప్పితివి. అది మా విరోధులొకరు నాపైఁ బ్రయోగించిరి. అది త్రిప్పి తిరుగా వానిపై బ్రయోగించి వానిం జంపితివేని నీకు మూఁడు నూటపదారులు కానుక లిత్తు"నని చెప్పిన, "సిది యెంతపని చిటికెలో వానిం జంపగలను. అందులకు గొంత సన్నాహము చేయవలసి యున్నది. ముందుగా గొంత సొమ్మిచ్చితివేని నేఁడే ప్రారంభింతు" ననుటయు నామె యొప్పుకొని యప్పుడేపోయి తెచ్చి నూటపదారు లిచ్చినది.

"వానిపేరు చెప్పుచు వాడు చచ్చిన మఱునాడు తక్కిన సొమ్మిత్తునని యొప్పుకొనినది. ఆమె కప్పుడే రక్ష రేకిచ్చితినిగాని వియ్యంకుఁడు చచ్చువఱకు దానిం గట్టికొనననని శపథము చేసినది. బాబూ! వానిని జంపుటకు నా శక్యమా! నిజముగా నామె కాతఁడు ప్రయోగము చేసెనా! రెండును వట్టివే. నిత్యము నింద హోమము చేయుచున్నాను, కొలది దినములలో నతఁడు మడియఁగలఁడు. అని పోయి చెప్పుచు నేతికనియు లాజలకనియుఁ గొంచము కొంచముగా ధనము లాగుచున్నాను. అందులకై యిందు వసించియుంటి" నని రామజోగి తనవృత్తాంతము చెప్పెను.

ఆ కథ విని పుత్రకుఁడు నవ్వుచు రామజోగీ! స్త్రీలలో నెట్టి గయ్యాళు లైన నున్నారు. ఇందులకు నిదర్శనముగా నేనొక కథ చెప్పెద నాలింపుము.

# గంపగయ్యాళి కథ

చిన్నకోటయను నగ్రహారమున సానుభూతియను బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు పుట్టు దరిద్రుఁడగుట నిత్యము భిక్షాటనము చేయుచుండును. అతని భార్యవంటి గయ్యాళి మూఁడులోకములలో లేదు. నీవు చెప్పిన కోదండరామారికన్నఁ బాగ చెడ్డది. మగఁడు తెచ్చిన బియ్యము వండి తాను తిని యందువిడిచిన నతఁడు పడ్డించుకొని తిని పాత్రల తోమి జాగ్రత్త పెట్టుచుండును. మరియు నిత్య మొక పిసెడు గోఁగునారదెచ్చి త్రాడుపేని యా త్రాటితో రాత్రుల మగనిం గొట్టుచుండును. అట్లు కొట్టుచున్న నామె చెయ్యి తీట తీఱదఁట. ఆ పాపఁడటు దెబ్బలు తినుచు దానితోఁ గాపురము చేయుచుండెను.

ఒకనాఁడతని కెవ్వరో శుభలేఖలిచ్చి పొరుగూరికంపిరి. అతండు తిరుగా వచ్చు నప్పటికిఁ బదిదినములు పట్టినది. అతనిభార్య నిత్య మొకమోకు వడుపున పేని దాచుచున్నది. అతని రాక యాలస్యమైనంత నక్కాంత చేతులు గులగుల యెత్తుటచే నొకనాటి రేయి నా మోపుఁ బండపై నెక్కించి నూరిబయలనున్న రావి చెట్టు నొద్దకుఁ బోయి దాని మొదట నా త్రాళ్ళన్నియు దెగునట్లు బాది బాది తనచేతి తీట తీర్చుకొన్నది.

తఱచు అశ్వర్థ వృక్షముల బ్రహ్మరాక్షసు లాశ్రయించుకొని యుండును. చిరకాలమునుండి యందొక బ్రహ్మరాక్షసుఁడు వసించియుండెను. కాఁగిన యినుప కమ్మిపై గొట్టిన సమ్మెట దెబ్బలు అగ్నికిం దగులునట్లు, తాదాత్మ్యకముగా నా వృక్షమున నాశ్రయించుకొనియున్న బ్రహ్మరాక్షసున కా దెబ్బలన్నియు నాటినవి. అందు లకుఁ దాళజాలక "మ్రో" యని యఱచుచు నా చెట్టు విడిచి యెందో పారిపోవు చుండెను. అంతలోఁ దెల్లవారినది.

అప్పుడు గంపగయ్యాళి మగఁడు ముష్టి మాటలు మూపుపై నిడికొని యింటికి వచ్చుచుండెను. అతనిని జూచి బ్రహ్మరాక్షసుఁడు మీ దేయూరు? యెందుబోవుచున్నావని యడుగుట యు మాది విన్న కోటాగ్రహారము. నా పేరు సానుభూతి నే నక్కడి కే పోవుచున్నానని చెప్పెను. ఆ మాట విని యా రక్కసుఁడు ఆ యగ్రహారములో నొక యాఁడుది నే నున్న రావిచెట్టును మోకులతోఁ గొట్టినది. బాబూ! అట్టి గయ్యాళియున్న యూరిలో నీ వెట్లుంటివని యడిగిన నా పాఱుఁడు వాఁడు బ్రహ్మరాక్షసుండని తెలిసికొని భయపడుచు మెల్లగా నిట్లనియె.

మహాప్రభూ! త్రాళ్ళతో మీరున్న రావిచెట్టు మొదలుగొట్టిన గయ్యాళి యెవ్వతో కాదు. నా భార్యయే ప్రతిదినము నన్నట్లు గొట్టుచుండును. నా వీపెట్లు కాయలు కాచినదో చూచితిరా? అని మూటలు దింపి వానికి వీపు చూపుటయు వాఁడు కటకటంబడి యిట్లనియె.

ఓయీ ప్రతిదినము నీ వట్టు దానిచే దెబ్బలు తినుటకు నీ కర్మము కాలి నదా యేమి? యెందేని లేచిపోవరాదా? అట్టి గయ్యాళితో నేమి సుఖపడుచున్నావు. అయ్యయ్యో! ఒక్కదినము దాని దెబ్బలకు నే నిలువలేకపోతినే. నీ పుట్టియంతయు మునిఁగిపోయినట్లు ముష్టి మూటలెత్తికొని యప్పుడే దానికడ కేమిటికి పోవుచున్నావు? యెందేని బోవరాదా? అని యడిగిన నా విప్రుండిట్లనియె.

స్వామి! కాచిపోయుచున్నది గదాయని యెట్లో దెబ్బలు సహించి కాపురము చేయుచున్నాను. దాని విడిచిన నాకు దిరుగా వివాహముకాదు. అతిదరిద్రుఁడ దగ్గిర చుట్టములెవ్వరు లేరు. యిప్పుడు నే నింటికిఁ బోయితినేని దాచియుంచిన మోకు లన్నియు నా వీపుపైఁ దెగవలసియున్నవి. యిఁక నా బ్రతు కెట్లో తెలియదని యేడువఁ బొడంగెను.

దయలేక పెద్దపులివలె మనుష్యులఁ దినియెడు రక్కసులకే వాని రోదనము వినిన దయగలిగినది. బ్రాహ్మణుఁడా నీవు దుఃఖింపకుము. నీ వింటికిక బోక నా చెప్పినట్లు చేయుము. ఏను మీ ప్రాంతమునందు వనదుర్గమను నగరము గలదు. దానిం దుర్గాదత్తుడను రాజు పాలించుచున్నాఁడు. అతని కొక్కరితయే కూఁతురు. నే దానింబట్టిన భూతవైద్యులకు లొంగక ప్రాణావశిష్టం గావించెద, కొన్నిదినములు పోనిచ్చి నీ వంమవచ్చి భూములో గ్రామములో నీకుఁ గావలసినవి గోరుకొనమని తరువాత నా చెవిలో రావిచెట్టు బ్రాహ్మణుండవచ్చితినని చెప్పుము దాని విడిచిపోయెద నీవు భాగ్యవంతుడవు కాగలవు. అని చెప్పిన నతండతని పాదంబులం బట్టికొని తండ్రీ నీవు నాకుమంచి యుపకారము గావించితివి. అని వాని స్తుతియింపుచు నా మఱ్ఱిమూటలందు బారవైచి భార్యను దిట్టుచుండెను.

బ్రహ్మరాక్షసుఁడు వాని కట్టివరమిచ్చి యప్పుడే యా రాజధాని కరిగి దుర్గాదత్తుపుత్రిక నర్ధరాత్రంబున నావేశించుటయు నా ముద్దియ పెద్దకేక పెట్టినది. ఆ కేక విని ప్రక్కలోనున్న భర్త యులిక్కిపడి లేచి యేమియేమి యట్లరచితివేమని యడిగెను. యేమియా! నిలునిలుమని వాని మెడబట్టికొని కఱవబోయినది. అతండంతలుస నెట్లో తప్పించుకొని యవ్వలఁబడి యామె తలిదండ్రుల కెరింగించెను.

వారు లేచి పరుగునతో నటకుఁబోయి మూఁగికొని యేమే యట్లు భరంగుఱిచితివని యడుగ హుంమ్మని మూల్గుచు పండ్లు కొరుకుచు వారిపయింబడబోయినది. అది భూతవికారమని తెలిసికొని రాజు బంధువులతో నీవలకువచ్చి తలుపు బిగించి మాంత్రికుల రప్పించి భూతవైద్యము చేయించెను. కాని వారి కేమియు లొంగినది కాదు. దినదినంబు కృశింపుచు నిద్రాహారములు లేక స్థాణువువలె బడియుండునది యెవ్వరైన భూతవైద్యులు లోపలికిఁ బోయిన వారిం గఱవవచ్చును. యిఁక, బ్రతుకదని నిశ్చయించుకొని రాజు విచారింపు చుండెను.

అట్టి సమయమున సానుభూతి తెలిసికొనుచు మెల్లగా నా యూరు చేరెను. అందెక్కడ చూచినను ప్రజలు రాజపుత్రిక గ్రహబాధను గురించియే మాట్లాడుకొనుచుండిరి. తిన్నగా నతండు కోటయొద్దకుఁబోయి యందున్న యుద్యోగస్థులతో అయ్యా! మీ రాజపుత్రికకు గ్రహముపట్టినదని విన్నాను దాని నేను విడిపింపఁగలను. భూతవైద్యుండనని చెప్పెనో లేదో పదుగురు మూఁగికొని యాతని గౌరవముగా రాజు నొద్దకు దీసికొనిపోయి వానివార్త జెప్పిరి. రాజు వాని యాకారముజూచి యీఁతఁడా! గ్రహమును వదలించువాఁడు. దిగ్గంతులవంటి వారు దానిచే బాధవింప బడిరి. చాలు జాలు యిక వైద్యముతోఁ బనిలేదని యుపేక్ష గావలికిన సానుభూతి ప్రగల్భముగా నిట్లనియె.

రాజా! నా యాకారము జూచి నీవు నిరసింపవలదు. దాని నే గడియలో

వదలింపలేకున్న నా ప్రాణములు పణముగా నర్పింతు. వదలించిన నేమి కానుకలిత్తువో చెప్పుమని యడిగెను. పారుఁడా నీ వట్లు చేసితివేని నూరు గ్రామములు నీకుఁ గానుకగాఁ నిత్తును. కావలసినయెడల పట్టము వ్రాసి యిచ్చెద. చికిత్సచేయుమని కోరెను. సానుభూతి సంతసింపుచు నక్కాంత యెందున్నదో చూపుడు యిప్పుడే విడిపింతు నని పలికిన నరపతి యయ్యువతియున్న గది చూపుమని పదువుర కింకరు లతని వెంట ననుపుటయేగాక తానుఁగూడ బోయి పరికించుచుండెను.

ఆ బ్రాహ్మణుఁడు ఆ గదితలుపు గొళ్లెము తీసి లోపలికిఁ బోవుచుండ జూచి రాజు ఆ నిలునిలు సాదనమేమియు లేకయే పోయెదవేల తంత్రమంత్రమేమియు జరపనక్కరలేదా ! ఊరకపోయిన మీఁదబడి చంపునుజుమీ ! అనవుఁడు నవ్వుచు నా పారుఁడు లోపలికిబోయి తలుపువైచికొని పరికింప నిలువుటద్దములు గాజుదీపపు బుడ్లు శకలములుగాఁ జేయఁబడియున్నవి. పట్టువితానము చీల్చఁబడి యున్నది. మంచములు విరుగ గొట్టబడినవి. పెక్కేల ఆ గది యంతయు పాటుపడి శకల భూయిష్టమై యున్నది.

అందుఁ బ్రవేశించి జడియుచు నా పడతిం బరికింపుచుండ నొకచోఁ బండుకొనియున్న యా యన్నుమిన్న యతనింజూచి గాండ్రుమని యరచుచు నొక పగడపు కోడుఁబూని లేచి వానిం గొట్టవచ్చినది. అప్పుడతండు బెదరుచు చేతులు జోడించి తండ్రీ ! నీకు నమస్కారము. నేను రావిచెట్టు బ్రాహ్మణుఁడ నీ యాజ్ఞ వడుపున వచ్చితిని. నూరు గ్రామములుగానుకగా నిచ్చిరి. యిదుగో పట్టము. నీ దయ వలన నా దరిద్రము పోయినదని పలికిన విని యా బ్రహ్మరాక్షసుఁడు శాంతించి పారుఁడా వచ్చితివా ! నీ నిమిత్తమే యింత యట్టహాసము చేయుచున్నాను. నీకు గ్రామములు లభించినవిగద, సుఖముగా ననుభవింపుము. మరియొక భార్యం బెండ్లి యాడుము. నే నీమెను విడిచిపోవుచున్నాను. కాని మరి యొక్కమాట చెప్పెద నాలింపుడు. బ్రహ్మరాక్షసులకు యౌవనములోనున్న రాజపుత్రికల నావేశించి నపుడు మిక్కిలి సంతోషముగా నుండును. నే నిప్పుడు మరియొక రాజపుత్రిక నాశ్రయించెద నిన్నక్కడికి రమ్మందురు. నీవు రాఁగూడదు. వత్తువేని నిన్నే కడ తేర్చెద జాగ్రత్త అని చెప్పి యప్పడతిని విడిచి యా యింటి కప్పు దన్నుకొని యా బ్రహ్మరాక్షసు డెందేనియుం బోయెను.

గ్రహము వదలినతోడనే రాజపుత్రిక సొమ్మసిల్లి కదలక మంచముపైఁ బండుకొన్నది. అప్పుడా బ్రాహ్మణుఁడు తలుపు తెరచుకొని యీవలకువచ్చెను. మంత్రి సామంతాదులతో వాకిటఁ గాచికొని యున్నరాజు అతనిజూచి వెరగుపడుచు గ్రహమువిడిచినదా ? యేమి జరిగినది ? అని యడిగిన నవ్వుచు లోపలికిం బోయి చూచుకొనుఁడు. యేమి జరిగినది మీకే తెలియఁగలదు అని యతండు పలుకుటయు వారందరు మెల్ల మెల్లగా లోపలికిఁబోయి యందు బండుకొనియున్న రాజపుత్రిం

జూచి పల్కరించుటయు నా చంచలాక్షి కన్నులం దెఱచి మందస్వరముతో నాకాకలగుచున్నది అన్నము పెట్టుఁడని కోరినది. వెంటనే యామె తల్లి వచ్చి యప్పటికి దగిన యాహారమిచ్చి మఱియొక గదిలోనికిం దీసికొనిపోయి యుపచారముల సేయించుచుండెను.

రాజును రాజబంధువులు నా భూదేవుని దైవమని స్తుతియింపుచు వానికి బ్రహ్మరథముపట్టిరి. మఱియు నా భూపతి మొదట దానన్న దానికి నిబ్బరిగా గానుకలిచ్చి యా నగరములోనే మందిరము గట్టించియిచ్చి మఱియొక బ్రాహ్మణపుత్రికం బెండ్లి చేయించి కాపురము పెట్టించెను.

మఱికొన్ని నెలలు గతించినంత నొకనాఁడా ప్రాంత ధాత్రీపతియొక్క పత్రిక నా దుర్గాదత్తునొద్ద కనిపెను. అందు మహారాజా! మీ కూఁతున కేదియో బ్రహ్మరాక్షసి యావేశించి బాధపెట్టుచుండ నే దేశము నుండియో భూతవైద్యుఁడు వచ్చి యాగ్రహము వదలించెననియు నతనికిఁ గొన్ని గ్రామములిచ్చి మీ గ్రామమునఁ గాపుర ముంచిరనియు మీ యూరినుండి వచ్చిన యొక బ్రాహ్మణుండు యీ వృత్తాంతమంతయు మా కెఱింగించెను. నా కూఁతునకుఁ గూడ నారుమాసముల క్రిందట నొక గ్రహమావేశించి మిక్కిలి బాధపెట్టుచున్నది. నిద్రాహారములు లేవు. ఆ చిన్నది ప్రాణావశిష్టయై యున్నది. ఎందరో భూతవైద్యులువచ్చి యెన్నియో తంత్రములు జరిపిరి. ప్రయోజనము లేకపోవుటయేగాక దానిచే కఱవఁబడి ముగ్గురు మాంత్రికులు చచ్చిరి. కావున మీ యాస్థాన మాంత్రికుని ప్రభావము అద్భుతముగాఁ జెప్పుచున్నారు. మీ కుమార్తెయు నిట్లే బాధపడుచుండ మీ వైద్యుఁడు గదిలో ప్రవేశించిన తోడనే వానిం జూచి యా గ్రహము పారిపోయినదఁట దయయుంచి యొకసారి నా పాచు నిక్కడికి బంపఁగోరుచున్నాను. అందులకై యంపలంబిందుతో నంపితిని. మీ రిమ్మనిన కానుక లీయగలవాఁడనని వ్రాయఁబడి యున్నది.

దుర్గాదత్తుఁడా యుత్తరము జదివికొని వెంటనే సానుభూతిని రప్పించి యా పత్రికా విషయముల జదివి వినిపించి మీ రందుబోయి యాభూతమును వదలించి రండు. మీ కీర్తి దేశదేశముల వ్యాపింపగలదని పలికిన విని యతండు హృదయము ఝుల్లుమన నేమియుం దోచక కొంతవడి విచారించి యిట్లనియె.

మహారాజా భూతోచ్చాటన మన సామాన్యముగాదు. పెద్దకాలము తపము చేసి యా తపమంతయు ధారవోసి మీ యింట బ్రహ్మరాక్షసిని విడిపించితిని. ఇప్పుడక్కడకూడ నెక్కువ ప్రయత్నముచేసి వదలించినచో నేను పరమును దూరుఁడనగుచున్నాను. కావున నందు నే బోవఁజాల నన్ననుగ్రహింపుఁడని పలికిన విని దుర్గాదత్తుం డిట్లనియె. సూరి సత్తమా! ఆ భూరమణుండు నాకు బాలమిత్రుఁడు. బంధువుఁడు. నీ వక్కడికి బోకఁ దప్పదు. మరి యింకొకచోటునకు బొమ్మని యెప్పుడును జెప్పను. ఈ మాటు మాట దక్కించుమని మిక్కిలి బతిమాలి కొనియెను.

ఆతని కంగీకరింపక తప్పినదికాదు. ఆ రాజు పంపిన యందల మెక్కి చుట్టును రాజభటులు పరివేష్టింప నొక శుభముహూర్తంబున బయలు వెడలి సాను భూతి యతి వైభవముతో నా రత్నపురి కరుగుచు దారిలో నిట్లు తలంచెను. అయ్యో నే నిప్పుడు తగుదునని యా బ్రహ్మరాక్షసుని విడిపింప నరుగుచుంటి. నన్నందు రా వలదని యాతండు మొదటనే చెప్పి యుండెను. వాని మాట నతిక్రమించి పోయినచో నన్నుఁ గూడ కరతేస్తును. ఇది నా ప్రాణాంతమునకే వచ్చినది. లేనిపోని దంబ ములు కొట్టితిని. కాని యథార్థము చెప్పిన తీరిపోవును. తపో వ్యయచ్ఛద్మంబున నే నందుఁబోనని యిట్లొప్పుకొంటి నేమి కర్మము. అష్టాక్షరిమంత్రము తప్ప వేరొక చదువేమియు నాకు రాదుగదా! కానిమ్ము దైవము లేదా యని తలంచుచు నా పట్టణము చేరెను.

సీమాంతమునకే రాజబంధువు లెదుర్కొని మేళతాళములతో నూరేగిం పుచుఁ గోటలోనికిఁ దీసికొనిపోయిరి అందున్న భూతవైద్యులందరు చుట్టుకొని మహా పురుషా! నీవే ప్రయోగంబున భూతోచ్చాటనము గావింతువు విధులేమని యడిగిన నతఁడు మౌనముద్రి వహించి యన్నియుఁ బిమ్మటఁ జెప్పెదంగాక యిప్పుడేమియు నడుగవలదని యుత్తరమిచ్చెను. హోమములా తర్పణములా జపములా కావలసిన సంభారము లేమని యడిగిన నేమియు నక్కరలేదు. ఆ చిన్నదియున్నగది యెందు న్నదో చెప్పుఁడని యడిగెను.

ఆ భూపతి రాజబంధువులతోఁడ నా సానుభూతి నంతఃపురమునకు దీసి కొనిపోయి యా గది చూపెను. అతండు మొండిధైర్యముతో వారి నెల్ల దూరముగాఁ బొమ్మని యా గది తలుపు తీసి లోపలఁ బ్రవేశించెను. వానిం జూచి యా చిన్నది బొబ్బలిడుచు నతనిమీదికి లంఘించుటయు చేతులు జోడించి తండ్రీ నేను రావిచెట్టు బ్రాహ్మణుఁడ నీ దర్శనమునకై వచ్చితినని పలికినఁ గటకటంబడి యా బ్రహ్మ రాక్షసుం డిట్లనియె.

పారుపోతా! నే నప్పుడు చెప్పినమాట మరచితివా! నిన్నిందు రావలదని చెప్పలేదా? యిదివరకిప్పించిన యైశ్వర్యము చాలక దురాశతో నన్ను విడిపించు టకై యిక్కడికి వచ్చితివా? నీ మర్యాద నిలుపుదునను కొంటివాయని పలికిన భయమభినయించుచు నతఁడిట్లనియె. తండ్రీ నాకుఁ బరమోపకార మొనరించిన నీ యాజ్ఞ నుల్లంఘింతునా? నా కొక యాపద వచ్చుటయు దానింబాపుకొను నుపాయము తెలియక నిన్నడుగ వచ్చితిని. నేను మా యింటికిఁ భార్యవలన బడియెడు నిడు మల వదలించిన నిన్ను స్మరించుకొనుచు సుఖపడుచుంటి దైవము కాలము సమ ముగాఁ బోనీయఁడు నా భార్య గయ్యాళి. నీవు నా కుపకారము చేయుటవలన రాజ సన్మానము చెంది సుఖపడుచున్నానని యెట్లు తెలిసికొనినదో నా నిమిత్తమై పేని

యుంచిన మోకులన్నియు నిరువది బండ్లమీఁద పట్టించుకొని నేనున్నయూరిలో మా యింటి ముంగలబండ్లు దింపించినది. అప్పుడేమి చేయుటకుఁ దోచక నే నెందుంటినో విమర్శించుచున్న దానిమాట లాలించి పిడుగుపడినట్లు జడియుచు నిచ్చటికి బారిపోవచ్చితిని. బాబూ! నాఁడామె పద దప్పించితిని. ఇప్పుడుకూడ నే దేని దెబ్బలు తప్పుటకై సాధనము చెప్పుమని ప్రార్థించుచున్నాను. లేనిచో మొదటి దెబ్బతోనే చచ్చిపోవుదును. శరణార్థిని రక్షింపుమని శోకము నభినయించుచు నతని పాదములఁ బడియెను.

ఆ మాటవినిన తోడ యా బ్రహ్మరాక్షసునకుఁగూడ మేనఁగంపము జనించినది. తెల్లబోయి చూచుచు బ్రాహ్మణుఁడా ఆ గయ్యాళినాడు రావిచెట్టు మొదటఁ గొట్టిన దెబ్బలు నా మేనికి నాటి యిప్పటికి జ్ఞాపకమున్నవి. నీ యింటిముంగల బండ్లు దింపినదని చెప్పితివిగదా అది యక్కడనే యుండునా? నీ విందు వచ్చితివని తెలిసి బండ్లు తోలించుకొని యిక్కడకు రాదుగదా! నీ పుణ్యము ముండుగఁ జెప్పుము అని యడిగిన వాఁడు సామీ! నేనేమి చెప్పఁగలను? దానికి దివ్యదృష్టియున్న దేమోగాని యెవ్వరి నడుగకుండ యే తిన్నగా మా యింటికి వచ్చినది. అట్లే యిక్కడికిని రాఁగలదు. ఎప్పుడో యననేల నా వెనుకనే బయలుదేరి యుండును. నేను గాని నడకను వచ్చితిని గావున నాలస్యమైనది అది బండ్లమీఁద వచ్చును. ఈ పాటి యూరి బయలకుఁ జేరియుండును సామీ! నాకు గతి యేదియో చెప్పక తీరదు. అని భయము నభినయించుచు నడిగిన నా రక్కసుఁడు మరియుం బెదరుచు నిట్లనియె.

యేమీ! యూరిబయల కేవచ్చునా? బాబో నీ గతిమాట యట్లుండనిమ్ము. నా గతి యెవ్వరు సెప్పుదురు. నీ కర్మము నీది పెండ్లి యాడినందున కనుభవింతువు గాక! నా కేల! నేను ద్వీపాంతరముల కవ్వలికిఁబోయెద. నన్నెట్లు పట్టుకొనునో చూచెదంగాక యని పలుకుచు నా రాజపుత్రికను వదలి యింటికప్పు దన్నికొని యవేగతిగా సముద్రముల దాటి యవ్వలికి బారిపోయెను.

ఉపాయంబునకు సాధ్యమైనపని పరాక్రమమునం గానేరదు. అతండట్టి యుపాయముతోఁ బిలచిన భగవంతునకు గృతజ్ఞుండై యావలకువచ్చి రాజున కవ్విధం బెరింగించెను. అతని భూతోచ్చాటనమంత్ర ప్రభావంబునకు వెరగుపడుచు నా రాజు సానుభూతి కెన్నియేని కానుక లిచ్చెను. ఆ బ్రాహ్మణుఁడు రాజులిద్దరిచ్చిన పారితోషికముల వలన రాజతుల్యుండై పెద్దకాలము భూలోకసుఖంబు లనుభవించెను. రామయోగీ! నీవు చెప్పిన కోశంద్రమారికంటె నీ గంపగయ్యాళి యెక్కువ రాగ యౌనో కాదో విచారింపుమని చెప్పెను.

అని యెఱింగించునప్పటికి కాలాతీతమైనది.

## 279 వ మజిలీ

# బొంతసంచి కథ

పుత్రకుఁడు చెప్పిన కథవిని రామజోగి మీరసినట్లాడుచుండెను. కొండ్లలో నెట్టి గరాసుల్లైనంగలరు. బ్రహ్మహత్యకు వెఱవరు. కోదండరమారి వియ్యంకుసిం బ్రయోగము చేసి చంపమని నాకు నియమించుచున్నదిగదా! సగము సొమ్ము గాగి మూఁడు మాసములు గడువు పెట్టితిని. సగము దినములైనవి శేషించినదినములు లెక్కపెట్టుచున్నది. అప్పుడు మాత్రమువాఁడుచచ్చునా! చూచిచూచి ఒకటి రెండుదినములు గడువుండగనే లేచిపోయెద. నన్నేమి చేయఁగలరు అని చెప్పిన విని పుత్రకుం డిట్లనియె.

రామజోగీ! సఖ్యముసాప్తదీనమని చెప్పుదురు యేడుమాటలాడి సజ్జనులకు స్నేహము కలియునని చెప్పుదురు. నీతో నాకు మైత్రి కలిగినది. నేఁడు నీ వేషము నేను వైటకొసపోయి యా కోదండరమారివలనఁ గొంతసొమ్ము సంగ్రహించికొనివచ్చి నీ కిచ్చెద నా చమత్కారముకూఁడ జూతువుగాక. నీ జోలియు ధక్కయు నా కిమ్మని యడిగిన నతం డంగీకరించెను.

మరునాఁడు పుత్రకుఁడా జోలినందుకొనుచు నటునిటు త్రిప్పి రామజోగీ! యీ సంచి నీ వెక్కడ కుట్టించితివి? కడు విన్నాణముగా నున్నదిగదా! అనవుడు యిది నే గుట్టించినదికాదు. నిరిటి వేసవికాలములో మన్యములో గొన్నినాళ్ళు దిరిగితిని. అంబొక కొండప్రక్క నుండి వచ్చుచుండ దారిలో నొకకోఁతి యీ సంచిపట్టుకొని యాడుచున్నది. ఒకసారి ముసుంగిడు కొనుచు నొకసారి పఱచుకొని పండు కొనుచు నొకసారి మెడకు దగిలించుకొనుచు నీ రీతి మర్కట చేష్టలఁ బ్రకటింపుచుండెను. దానిం దుద్దుకఱ్ఱతో బెదరించుటయు నదిపాఱిపోయినది. దాపునకుఁ బోయిజూడ నీ సంచియైనది. ఇది బొంతతోఁ గుట్టుటచే దానిగోళ్ళు తగిలియు చినిఁగిపోలేదు. ఎవ్వరో పాంథులు మరచిపోయెరని తలంచి దీనిం బదిలపఱచి ముష్టి జోలిక్రింద వినియోగము చేయుచున్నాను. ఇది వచ్చినవేళ మంచిది. ఏకాంబికము వలననో దబ్బు దొరకుచున్నదని యా కథయంతయుం జెప్పెను.

పుత్రకుండు మిగుల సంతసించుచుఁ బ్రాతఃకాలమున నా సంచి జంకకుఁ దగిలించుకొని ధక్కా ప్రేళ్ళకు గట్టుకొని బుడబుడక్కలవాని వేషములో బయలుదేరి యా యగ్రహారమునకుం బోక నడుమ డొంకల తలసందున నిలిచి దండముతో సంచింగొట్టెను. బంగారునాణెములు కొన్ని రాలినవి. వానిమూఁట గట్టుకొని మధ్యాహ్నమునకు మ్రిచెట్టు కతకువచ్చి యా నాణెముల వానికిచ్చుచు రామజోగీ! నేఁడీ నాణెములు సంపాదించుకొని వచ్చితి. నా ప్రజ్ఞం చూచితివా? రేపు పీనికిబ్బ

డిగాఁ జేఁగలను నన్నుఁ బంపుమని పలికిన నతని త్యాగమునకు సంతసించుచు నతం డంగీకరించెను.

మరునాఁడు వృతకుఁడు బొంతసంచిం జంకం దగిలించుకొని ఢక్కాబూని పాఁడు సూచుచుం గొంతదూరము పాదచారియైపోయి యందు ఢక్కయు గడ్డలుం బాఱవైచి పాదుకలు దొడిగికొని జయపరమేశ్వరా నే నిప్పుడు కాశీపురంబున గంగాతీరమున నుండవలయునని కన్నులు మూసికొని స్మరించి తెఱచినంతలో నక్కడికిఁ బోయి నిలిచి యుండెను. యా వస్తువు లెవ్వరేని యెత్తుకొని పోవుదురని వెఱచుచు జనులులేని రేవునకరిగి స్నానముచేసి కొన్ని దీనారముల దులిపి మూటగట్టికొని విశ్వనాథునాలయంబునకు వచ్చి నర్చించుచు నందున్న వైదికులకు నాణెముల బంచిపెట్టుచుండెను జనులు గుంపులుగా మూగి యల్లరిచేయుటచే నా సందడిలో నా దండ మెవ్వరో లాగికొని పోయిరి.

దండము పోవుట తెలిసి యతండు పశ్చాత్తాపము జెందుచు ఛీఛీ నా కింత బుద్ధిలేదేమి. యింతలో నీ దాతృత్వమేమిటికి యెక్కడనో స్థిరపడి పిమ్మటఁ జేయ గూడదా ? అని నిందించుకొనుచున్నంతలో జ్ఞాపకము వచ్చి యోపాదుకలారా ! నన్నా దండమున్న నెలవునకుం దీసికొని పొండు అని తలంచి చూడ నొకవార స్త్రీ గృహాంగణంబున నిలువంబడియుండెను ? అది దివ్యాలంకారంబులచే శోభిల్లుచున్నది. ఆ శయనాంతరమునఁ బట్టపగలు సేయఁజాలునట్టి దీపములు వెలుఁగుచున్నవి. అగణన కత్త రాసారాజుగారి యుంపుడుకత్తె హంసతూలికా తల్పంబున నమ్మహారాజుతో నానావిధ సరససల్లాపము లాడుచుండ నీక్షించెను. ఆ వారకాంత సౌందర్యము వైభవము అతని హృదయము నాకర్షించినది. అట్టి వైభవము తనకెన్నఁడు గలుగునోయని యభిలాషపడుచు నన్నీ పాదుక లిక్కడి కేమిటికి దీసికొని వచ్చినవో దండమిందుండఁ బోలు యెట్లు దొరకునని యాలోచించుచు నాలుగడుగులు పరిక్రమించినంత నా ప్రాంతమున ద్వారమును గాచియున్న రక్షకభటుని చేతిలో నా బెత్తము గనంబడినది.

దానిం జూచి వాని దాపునకుంబోయి పలుకరింపఁబోవుచు ద్వారపాలుఁడు నీ వెవ్వఁడవు ? బహుభటరక్షితంబగు నీ లోపలికెట్లు వచ్చితివి. యిది రహస్యస్థలము నీ వపరాధివైతివి. నీ వృత్తాంతము చెప్పుమని యడిగిన నతండిట్లనియె. నే నొక యోగిని. యిందాక విశ్వేశ్వరుని యాలయమున నర్థులకు విత్తముపంచి పెట్టుచుండ నెవ్వఁడో నా యోగదండమును లాగికొనియెను. దాని వెదకి యోగదృష్టి నిందున్నదని తెలిసికొని గగనమార్గంబున నిందువచ్చితిని నీ చేతనున్న బెత్తము నాది. నీ కెట్లు వచ్చినది. అని యడిగిన నా భటుం డతని మహిమ కచ్చెరువందుచు నిట్లనియె.

సామీ నేను రాజుగారి యాంతరంగిక ద్వారరక్షకుండ మీరు అర్థులకు దానమిచ్చుచుండ నేను విశ్వేశ్వరుని ద్వారముగాచికొని యుంటి. అప్పుడు కొందరు రాచస్త్రీలు జ్ఞానవాపింఁ దీర్థమాడ నరుదెంచిరి. అట్టి తరి గుడిలోఁ గోలాహలము జరుగుచుండ వారి నెల్ల నదలించితిని. ఒక ఘట్టాధిపతి మీ చేతి బెత్తము లాగుచుండఁ జూచి దీనినే గైకొంటి మీరు మహానుభావులు మీ యోగదండము మా కేలగైకొని యవ్వలకుఁ దయసేయుఁడు అని పలికి దాని నిచ్చివేసెను.

తన్ను గృతార్థునిగాఁ దలంచుచు బ్రాహ్మణుఁడు విచిత్రపట్టణము నిర్మించు కొని రాత్రి చూచిన వేశ్యవంటి సౌందర్యవతితోఁ గూడుకొని యుండవలయునని సంకల్పము జనించుటయు నందులకు నంతరంగములన గిట్లు గీయుచుండెను. తాను నిర్మింపబోవు పట్టణము పోలిక దెలియుటకై భూమండలము నందలి ప్రసిద్ధికొందిన నగరము లన్నియుఁ బరీక్షించుటకు నిశ్చయించుకొని యక్కడినుండి రామేశ్వరమున కరిగి గంగాజలంబుల రామలింగేశ్వరున కభిషేకము గావించెను.

అందుండి క్రమంబున శ్రీశైల వేంకటాచల భద్రాచలాదిపుణ్య నగరం బులును, కాంచీ, శ్రీరంగ, మధురా హరిద్వారాదిపుణ్య తీర్థంబులును చంపక బదరి కాది పుణ్యవనంబులును సేవించుచు మనోహరంబులగు పట్టణ బులఁ బరీక్షింపుచు నరిగి తిరిగి యొకనాఁడు మహాబలిపురంబను నగరం బతిరమణీయంబుగా నుండునని విని యాపట్టణంబు చేరి యందు నడుమ నివసించినఁ దనవస్తువులకు హాని వాటిల్లునని వెంచుచు తిరిగితిరిగి యూరిబయలఁ దోటలో నొక పేదరాలు వర్ణశాలం గాపుర ముండుట తిలకించి యామెకడకుఁ బోయి మెల్లన నిట్లనియె.

అవ్వా మాది విదేశము. నే నీయూరిలోఁ గొన్ని దినంబులు వసింపఁ దలంచుకొంటి. నీవు కోరిన సొమ్మిత్తు. నాకు భోజనము పెట్టఁగలవా యని యడి గిన నామె నవ్వుచు నిట్లనియె. అయ్యా! నేను పెద్ద కుటుంబములోనిదానను, నా భర్త యీ నగర ప్రభు నాస్థాన పండితుఁడై యెక్కువకీర్తి సంపాదించిరి. ఈ తోట యంతయు మాదే కాని ఆయన చనిపోయిన తరువాత ఋణస్థులపాలైనది. ఈ యిల్లు మాత్రము నాకు వదలివేసిరి. ఇందుఁదలఁదాచుకొని సద్వృత్తిగాఁ గాలక్షేపము చేయు చున్న దాన. నే నన్న విక్రేతను గాను. సొమ్ము తీసుకొని యన్న మిడుట మహాపాతక మండ్రు. అతిథిగా మా యింటికి వచ్చితివి కావున నీ పూట మా యింట గుడిచి పొమ్ము. అని చెప్పినది. కానిమ్ము! పనేశించి పరిచయము కలుగఁజేసికొని పై మాటపిమ్మట విమర్శించు కొనవచ్చును. అని తలంచి లోపలికిఁ బోయి నలుమూ లలుం జూచి అందామె గాక మరి యెవ్వరు లేకుంకి సంతసింపుచు పెరటి నూతి యొద్దనే స్నానము చేసి యా మూడు పట్టుపులం దినకత మనుచుకొని తృప్తిగా భుజించెను.

భోజనానంతర మొకచోఁ గూర్చుండి అవ్వా! నేఁడు నన్నాదరించి మృష్టాన్నమిడితివి. నీ వృత్తాంతము వినకుండ లేచిపోవుట లెస్సగాదు. నీవు చాల మంచిదానవు. నీ భర్త చనిపోయి యెంతకాలమైనది? నీకు దగ్గిరచుట్టము లెవ్వరును లేరా? పిల్లలు కలుఁగనేలేదా? నీ విప్పుడే వృత్తితోఁ గాలక్షేపము చేయుచుంటివి. చెప్పుమన యడిగిన నా వృద్ధ యిట్లనియె.

అప్పా! యిప్పుడు నా పూర్వస్థితి చెప్పిన నీకును విచారమురాక మానదు. నా భర్త పండిత కంఠీరవుఁడని బిరుదువహించిరి. ఇప్పుడున్న రాజుగారి తండ్రి యాయనను అందల మెక్కించి యూరేగించెడివారు. నా పతి యతివదాన్యుఁడగుట మాఘకవి వలె వచ్చిన సొమ్మంతయు వెంటనే యర్థి సాత్కృతము చేయుచుండు వారు. పెద్దరాజు గతించిన పిమ్మట నతని కుమారుఁడు రాజయ్యెను. ఇతఁడు వదాన్యుఁడు కాడు. పండితప్రీతిలేదు. దానంజేసి నా భర్త ఋణములు చేసి గడపుటచే నాయన యనంతరము ఋణదాతలు పొలము లమ్ముకొనిపోయిరి. నాకు దగ్గఱచుట్టము లెవ్వరును లేరు. పిల్లలుం గలుగలేదు. నివసింప నీ కుటీరము మాత్రము మిగిలి యున్నది.

వినుండు. ఇప్పటి రాజునకు పాటలికయను పుత్రిక గలదు. ఆ చిన్నది యన్ని విషయములఁ దాతం బోలియున్నది. త్రిభువనాశ్చర్యకరమైన రూపము. సకలకళాపాండిత్యము, సంగీత విద్యావైశారద్యము నామె యందే యొప్పుచు మెఱయుచున్నవి.

ఉ. చేరలుమూయఁగామిగులు చెల్వకనుంగవ రత్నదర్పణ
శ్రీ రహిమించుఁజెక్కులు చెన్నెదలచ్చపుకుందనంబె వ
క్త్రీరల ముత్తెపుఁసగము తేనెలుఁజిల్కెడుఁ బల్కుఁగల్కి యొ
య్యారము దెల్పనాకఁ దరమా బొరగారన వేల్పు బిత్తరుల్.

అబ్బాయీ! అది బ్రొకవతిసోగ వెండ్రుకలతీ రేమని చెప్పుదును ఓప్పిన మబ్బు గ్రమ్మినట్లే యుండునుగదా! నిజముగా నడుము పిడికిలితో బట్టినంజాలదు. అయ్యారే! యన్నారీరత్నము జాతి ప్రాశస్త్యమును సూచించుచున్నదిగదా? నా భర్త స్త్రీ వర్ణనలు చేయుచుండ నుత్ప్రేక్షలను కొన్నదానను. ఔరా! ఆ కన్యావతిని జూచినది మొదలు స్వభావోక్తులని దృఢపడినవి. అయ్యో! మఱచి యవ్వరవర్ణిని సౌందర్యము నీ కడ వర్ణించితినేల? ఇది యప్రస్తుతమైన ప్రసంగము. నా తప్పు సైరింపుము. ఆపై రూపము మాట యటుండనిమ్ము. తత్సుగుణంబులు ఫణిపతి నుతింపఁజాలఁడు. ఆమె కడకు నిత్యము విదుషీమతల్లులు పెక్కండ్రుడువచ్చి యాశ్రయించుచుందురు. యిప్పటి రాజు ప్రమత్తుఁడు లోభివాఁడగుట పండితుల నెవ్వరిం జేరదీయక పోవుటచేఁ దదాస్థానమునఁ దగిన పండితులెవ్వరును లేరు.

ఒకనాఁడు నేను పాటలిక సౌశీల్యము విని యొక విదుషీమణి వెంట నామె కడకుఁబోయి నా వృత్తాంతము జెప్పికొంటిని. నా భర్త వాడుక యా చేడియ విని యున్నది. వారు రచించిన గ్రంథములు చదివినదట. నన్నుఁ పెద్దగా సదనంబిం చుచు నట్టి కవీంద్రుని యిల్లాలవు నీ వేమి చదివికొంటివని యడిగిన సిగ్గుపడుచు నే నిట్లంటి.

అల్లి నే నీకడఁ జదివికొన్న దాననని చెప్పఁగలనా? నాకే విద్యయును రాదు. కథలుమాత్రము చెప్పఁగలను. దీనురాల ఎట్లు రక్షించెదవోయని ప్రార్థించితి. ఆ చిన్నది నవ్వుచు అవ్వా! చింతింపకుము? నిత్యమువచ్చి కథలు చెప్పుచుండుము. నీ జీవనము గడపెదనని యభయ హస్తమిచ్చినది. నాటంగోలె నిత్యము సాయం కాలమున నా బోఁటి కడకరిగి నాకుఁదోచిన కథలం జెప్పి వచ్చుచుందును. వినుట కామె కవకాశమే లేదు. ఎందరోవచ్చి యెన్నియో విద్యావిశేషములు ముచ్చ టించి పోవుచుందురు. లాంఛనమునకుగాని కథలు సెప్పి యా విద్వాంసురాలిని నేను మెప్పింపగలనా బాబూ! యిదియే నా వృత్తాంతము. ఒకనాఁడు పెళ్ళక పోయినను రాలేదని మందలింపదు. నే నామె వలననే పోషింపఁబడుచుంటినని తన కథయంతయుఁ జెప్పినది. అతం డా కాంతామణి వృత్తాంతము విని సంతసించుచు అవ్వా! నాకుఁ జాల చమత్కారములైన కథలు వచ్చును. చెప్పినది చెప్పకుండ మూఁడేండ్లు చెప్పగలను అనుటయు నా యవ్వ బాబూ అట్లయిన నేఁడొక మంచి కథ చెప్పుము. రాత్రికూడ నిందే భుజింతువుగాక. ఆమె నిత్యము మంచికథలు చెప్పు మని యడుగుచుండును. నీవు చెప్పినకథ యామెకు నచ్చెనేని మఱికొన్నిదినము లిందే యుందువుగాక. అని కథాకర్ణనోత్సుకత్వముతో నతని నాపి కథ చెప్పుమని కోరిన బ్రతుకుఁడు అవ్వా! నే జెప్పుకథ చాల పెద్దది. ఇప్పుడు వేళ చాలదు. రాత్రి ప్రారంభించెద. మీ రాజపుత్రికకు నెట్టి కథలిష్టముగా నుండును. శృంగారమా! వైరాగ్యమా? యని యడిగిన నామె బాబూ! ప్రథమవయస్సులోనున్న వెలఁది కెట్టి కథ లిష్టమో నీకుఁ దెలియదా? నీతి బాహ్యములు విన నొల్లదు. చక్కని కథ చెప్పుమని యడిగినది. రాత్రి భుజించిన తరువాత నామెను దాపునఁ గూర్చుండఁ బెట్టుకొని యిట్లు చెప్పదొడంగెను.

అని యెఱింగించునప్పటికి వేళమిగిలినది. పై కథ పై మజిలీ యందిట్లు చెప్పెను.

## 280 వ మజిలీ

# శ్రీ దర్శనుని కథ

ప్రతిష్ఠానపురంబున దేవదర్శనుఁడను సోమయాజి కాపురము చేయుచుండెను. అతండు వేదవేదాంగముల సాంగముగా నెరింగిన వాఁడగుట బ్రాహ్మణుఁడు చేయఁదగిన క్రతువులన్నియుం జేసి దేవభూదేవులఁ దృప్తిపఱచెను. నిత్యము యథాకాలమున నగ్ని నారాధించుచు శ్రోత్రియులం దర్పించుకొని కాలక్షేపము చేయుచుండెను. అతని భార్య యనసూయకు లోపము లెన్నఁగలదు ఆ దంపతులకు సంతానము కలిగినదికాదు. అందుకై భార్య దురపిల్లుచుండ నతం డగ్నిదేవతనే యారాధించుచుండెను.

ఒకనాడు సోమయాజులు వేకువ జామునలేచి నిత్యక్రియలు నిర్వర్తించుకొని, యగ్నిహోత్రము సేయ నగ్నిశరణమునకుఁ బోవుడు, దక్షిణాగ్ని ప్రక్కను జలపూర్ణ కనక కలశముమీఁద మెత్తగా వేయబడిన పొత్తికలో దివ్యరూపాభిరాముఁడగు శిశువొకఁ డేడ్చుచుండెను. వానింజూచి సోమయాజి యాశ్చర్యసాగరతరంగముల నూగుచు నా బాలునెత్తుకొని ముద్దాడుచు, సోమిదేవీ ! యేమి చేయుచున్నావు? యిటు రా నీ పూర్వపుణ్యము ఫలించినది. అని పిలిచిన నామె వేగముగా వచ్చి పెనిమిటి చేతులలో నున్న శిశువుం జూచి యబ్బురపడుచు నందు కొనిముద్దాడి భర్త కిట్లనియె.

ఆర్యా యీ శిశు వెవ్వరివాడు ? యిట్టి ముద్దులమూట మన కెన్నటికైనం గలుగునా ? అగ్నిదేవున కెప్పటికైనం దయవచ్చునా ? అని యడిగిన నాశ్రోత్రియుం డిట్లనియె స్వాధ్వీ యెన్నడో యననేల. నా దయాళుం డిప్పుడే వీనిం దయచేసెను. వీడా కలశముపైఁ బొత్తికలో నున్నవాఁడు. ఎవ్వరు నీ లోపలికివచ్చిన జాడలేదు. పావకుఁడే వీని మనకుఁ బ్రసాదించెను. వీని యాకారలక్షణంబులు చక్రవర్తిత్వము సూచింపుచున్నవి. వీడయోనిసంభవుఁడు. వీనిం బోషింపుము. నీవు ధన్యురాలగుదువని చెప్పి భార్యను సంతోషసముద్రములో ముంచి యెత్తెను.

ఆ యిల్లాలా శిశువు నెత్తుకొని పాలుగుడుపుచు ననవరతమునురంబున బెట్టుకొని పోషింపుచుండెను. సోమయాజి యా బాలునకు జాతకర్మాదివిధులు యథావిధిం గావించి శ్రీ దర్శనుఁడనియు నగ్నిదత్తుఁడనియు వానికి నామకరణము లిఖించెను. ఆ బాలుఁడు దినదినాభివృద్ధివహించి చూచువారల కాహ్లాదముఁ గలుగఁజేయుచుండెను. వానికిఁ బ్రాయముతోఁగూడ విద్యాభివృద్ధి యగుచుండెను. శ్రీదర్శనుఁడు గారాబుగాఁ దలిదండ్రులచేఁ బెంపఁబడుటవలన జదువుకంటె నాటల యందెక్కువ కాలయాపము చేయుచుండెను. అక్షక్రీడయనిన వాఁడు చెవికోసికొనుచు పాచికలు వేయుటలోఁ దన్ను మించినవాఁడు లేడని గర్వపడుచుండెను. వ్యాయామవిద్యలోఁగూడ వానికి బాటవము గుదిరినది.

కుమారునకు యౌవనోదయమైనది. మొదలు సోమయాజి వివాహము చేయవలయునని ప్రయత్నించెను. కాని వానియందమునకు సరిపడినసుందరి యెందునుం గనంబడినది గాదు. దానంజేసి యతండనుకొనిన కాలములోఁ బెండ్లి సేయలేక పోయెను.

దేవదర్శనునికి వార్ధక్యములోఁ దీర్థయాత్ర సేయ నభిలాషగలిగినది. సోమదేవి నింటఁ దననిచి తానొక్కరుండ దొలుత కాశీపురంబున కరిగెను. యందలి తీర్థవిధులన్నియు నిర్వర్తించుకొని, గయాశ్రాద్ధమునఁ బితృదేవతలఁ దృప్తిపఱచి, ప్రయాగమున కరిగి యందుఁ ద్రివేణిం గృతావగాహుండై, గంతదఘ్నజలంబున నిలిచి జపంబుచేసి కొనుచుండ నొక మొసలివచ్చి యతని పాదంబులం బట్టికొని యీడ్చికొనిపోయినది. శివస్మరణము చేయుచు నాసోమయాజి గంగాగర్భంబున ముక్తుం డయ్యెను. ఆ వార్త కొన్నిదినంబులకు భార్యాపుత్రులకుం దెలిసినది. వెంటనే సోమిదేవి యగ్నిం బడి పుణ్యలోకంబున నతనిం గలిసికొనినది.

మాతాపితృహీనుండయి శ్రీదర్శనుండు కితవులం గూడికొని ద్యూతక్రీడలాడుచుఁ దనయిల్లే ద్యూతశాలగాఁ జేసెను. నానాదేశములనుండి వేనవేలు జూదరులు వచ్చి జూదములాడి యాడి హర్షశోకము లనుభవించుచుఁ బోవుచుందురు. సోమయాజులుగారి యగ్నిగృహము జూదరులకు వంటశాలయైనది. శ్రీదర్శనుని యైశ్వర్యమంతయుఁ గ్రమంబున ధూర్తులపాలైనది. ఒకనాఁ డేమియులేక యతండు గృహ మొడ్డుటయు, నదియుం గితవుల పాలైనది. యా జూదరియిల్లు వశము చేసికొని శ్రీదర్శనుని యందుండి లేవఁగొట్టెను.

కితవులది మొదలుకొని యొకసదన మద్దెకుఁ దీసికొని యాట సాఁగించుచుండిరి. జూదరి యోడినప్పుడును గెలిచినప్పుడును గూడ జూదమున విరక్తిఁ బొందఁడు. వస్త్రావశిష్టుండైనను శ్రీదర్శనునకా వ్యసనము తగ్గినదికాదు. తనకడ నోదమిలేకున్నను నొరులాడుచుండఁ జూచుచు నతం డెప్పుడు ద్యూతశాలయందే వసించుచుండును. ఒక నాఁడతండు దూరకొంపక తన యుపవస్త్రమును పణముగా నొడ్డుటయు, నదియుం బోయినది. కట్టుగుడ్డ మిగిలినది. యుపవస్త్రము లేదు. మధ్యాహ్నమయినది. భోజనమున కెందేనియుం బోవలయును. అవ్వలకుఁ బోవుటకు సిగ్గుపడుచు నతం డిట్లు తలంచెను.

ఆహా! నా వంటి కులపాంసనుం డెందేనిం గలడా? ఉత్తమ బ్రాహ్మణకుమారుడనై, దుర్వ్యసనములపాలై, సంపదలు గోలుపోయి భ్రష్టుండనైతి. మత్కులమర్యాద యెఱింగినవారందరు నన్నుఁ జూచి మీఁద నుమియక మానరు. ఇఁక నాకు మరణమే శరణము. ఈ వేషముతోఁ బ్రజలమోములు చూడఁజాల భుజింపక యుండే ప్రాణములు వదలెదనని దుఃఖించుచు నాఁడు భోజనమున కెందునుం బోక యందే పండుకొనియెను. కొందరు ధూర్తులన్నముఁ దెచ్చి కుడువుమనిరి కాని యొడంబడక

నిరసించెను. వానికి బాంస్నేహితుఁడు ముఖరకుఁడను వాఁడా వార్తవిని ద్యూతకాల కరుదెంచి, వాని దైన్యముఁజూచి విచారింపుచు నిట్లనియెను.

మిత్రమా! నీ వేమిటి కిట్లు మోహమొందెదవు? ద్యూతవ్యసనపాతక మీ రీతి బాధించునని యెరుంగవా? వినుము.

సీ. జగతి నక్షత్రకూష్మప్రసారములందుఁ
 జెప్పరో బుధులు పాచికల నెపుడు
బాహుపధానముల్ బవ్వళింపఁగ శయ్య
 పాంసువుల్ మేటి చత్వరము గృహము
విధ్వస్తతయ భార్య విజయాపజయములే
 సుఖదుఃఖములుగాఁగ క్షోణియందు
విధియింపఁబడె నరవిందసంభవునిచే
 నక్షజీవులకు నీ పది యెరింగి

గీ. యును విచారముతోడ భోజనముసేయ
కునికి తగునయ్య జీవించియున్న ధీరుఁ
డెప్పటికినైనఁ బడయు నభీష్టములను
రోటఁదల వెట్టి యడలుదే పోటులకును.

యిందులకు నిదర్శనముగా నొకచిత్రమైన కథ చెప్పెద నాలింపుము.

# భూనందముని కథ

భూ మండలమునకుఁ మండనాయమానంబై లక్ష్మీసరస్వతుల కాకరంబై రంభపస్వర్గముగ విధాతచే నిర్మింపఁబడినకోయనఁ గాశ్మీరదేశము విరాజిల్లుచుండెను. ఆ దేశమునకు రాజధాని శ్రీనగరము, హిమాచలము దానింజుట్టుకొని కాపాడు చుండును. వితస్తానదీవీచికల సేవించువారి కల్మషములఁ బోకార్చుచు నతిపవిత్ర మగు నా తీరంబున వసింప దేవతలు వాంఛించుచుందురు. అన్నగరమున కధినాయ కుండై భూనందనుండనురాజు ప్రజలం బాలింపుచుండెను. కామినీకుచయుగ్మములం బోలె క్షత్రుమండలములు తన్నుబరాజనియుక్తములై యొప్పుచుండును. అందలి ప్రజలు నీతిమంతులయ్యు ననీతిమంతులై కృష్ణ కాసక్తచిత్తులై యకృష్ణమానసులై మెలంగుచుందురు.

ఆ విష్ణుభక్తుం డొకద్వాదశియందు వాసుదేవు నారాధించి ధ్యానించుచు రాతిరి నిదురించెను. అప్పుడొక చక్కెరబొమ్మ వచ్చి సంభాషణము లాడుచు హావ భావములచే నతని రాగసముద్రములోముంచి యాశ్లేషచుంబనాదుల మతిఁ గఱఁగఁజేసి యంతర్ధానము నొందినది. ఆ నృపాలుండు స్వప్నాంతమున విహ్వలుండై, లేచి, కన్నులు దెఱచి చూడ నెవ్వరుఁ గనంబడలేదు. సంభోగ చిహ్నములన్నియు నొడలి

యందు వ్యక్తమగుచున్నవి. వానింజూచి విస్మయం సంతోషముల సతం డిట్లు తలంచెను.

ఆహా! నేననుభవించిన విషయములు స్వప్నములు కావని నా దేహమే చెప్పుచున్నది. యెవ్వతెయో దివ్యాంగనవచ్చి నన్ను రాగసముద్రములో ముంచి నది. అదియే నిశ్చయము. ఆ మోహనాంగి సోయగము చతురాస్యుఁడు వర్ణింపఁ జాలఁడు. ఆ మొగము, ఆ నగవు, ఆ పలువరుస. అనర్మోక్తులు నాకుఁ గన్ను లకుఁ గట్టినట్లున్నవి. అట్టి యువతీమణి భార్యగాలేనివాని రాజ్య మొకరాజ్యమా ? సీ! యీ సంపదలన్నియుఁ గాల్చివేయవలసినదే. నీ నాతి యా యంబుజనేత్ర గనం బడకున్న నామేన ప్రాణములు నిలువవు ఆమె గనంబడుదనుక నొరులతో మాట లాడను. అని తలంచుచు మౌన ముద్ర వహించి నాఁడు రవి పశ్చిమగిరి శిఖర మలం కరింపఁగనే భుజించి శయ్యామందిరమునకుఁబోయి పండుకొని ధ్యానించుచుండ నా రేయి నిద్దురయే పట్టినదికాదు.

నిద్రలేనిదే కల యెట్లువచ్చును. కలలోగాని యా నెలఁతుక గనంబడదు. అని తలంచి యా భూపతి మరునాఁడుగూడ నిద్రకై యెక్కువ ప్రయత్నము చేసెను. కన్ను మూతపడినదికాదు. ఆ రీతి బదిదినములు నిద్రలేక ధ్యానించుచు నొరులతో మాట్లాడకునికి నతనికి వెఱ్ఱియెత్తినదని ప్రధాను లాలోచింపుచుండిరి. క్రమక్రమమ్మున నతని కాహారను రుచింపక క్షీణింపుచుండెను. రాజకార్యముల విమర్శింపఁడు. సంతతము మంచముమీఁదఁ గూర్చుండి యా చంచలనేత్ర చిత్రఫలకము వ్రాసి, యెదురఁ బెట్టుకొని చూచుచుండును.

ఒకనాఁడతని ప్రధాన సునందుఁడనువాఁడు రాజమందిరమున కరిగి, తల్పంబునఁ బండుకొనియున్న యన్నరపతింగాంచి నమస్కరించుటయుఁ, జేరంబిలిచి పనియేమని యడిగెను. దేవా! దేవరవారు కొన్నిదినములనుండి యా స్థానమునకు వచ్చుట మానివేసిరి. యిది రోగ వికారమో భోగవికారమో తెలియకున్నది. రాజ కార్యములు చాల విమర్శింపవలసియున్నవి. వానిలో నీ దినము ముఖ్యముగా విచా రింపవలసిన యభియోగ మొకటియున్నది. అట్టి విచిత్రాభియోగము మన మిది వఱకు కని విని యెరుంగము వినుండు.

మనయూర రాజరత్నమను వేశ్యారత్నము కలదు. దాని కూతురు రతి మంజరి రాత్రిస్వప్నములో నొక విటునియొద్ద వేయిదీనారములు దీసికొని సంభోగ మున కనుమతించి కొంత యనురాగము ప్రకటించినదఁట. మరునాఁడు సదయం బున నా భుజంగుఁడు దానియింటికింబోయి రాత్రిచర్యలం దెలుపుచుఁ గూర రమ్మ నపుడు పో పొమ్ము నీ వెవఁడవని యా జవ్వని గెంటించినదఁట. వాఁడు వెంటనే వేయి మండిసి వెంటఁబెట్టుకొని దాని యింటిమీఁదఁబడి భోగమున కనుమతింపుము. లేకున్న నే నిచ్చిన సొమ్మిచ్చివేయుము అని యల్లరి చేయుచు దాని నవమానపఱచెనఁట. రాజ

భటులు వానిం బట్టుకొని కట్టి తీసికొనివచ్చిరి. వారకాంతయుఁ దగవు పెట్టినది. వారిద్దఱ తగవులే మన మీ దినమున విచారింపవలసియున్నది వత్తురే యని యడుగుటయుఁ, దటాలున శయ్యనుండి లేచి యా భూపతి యా యభియోగ విషయములు మరియు మరియు నడిగి నవ్వుకొనుచు, నేఁడా తగవు విచారింతు. వారి నెల్లర నాస్థానమునకు రప్పింపుము అని చెప్పి ప్రధాని నంపివేసెను.

అయ్యమాత్యుండుఁబోయి వాది ప్రతివాదులు సాక్షులతోఁ దద్సభకు రప్పించి రాజునకుఁ దెలియఁ జేసెను భూనందనుండా తగవు విచారింప నోలగంబున కనుదెంచుటయు, వేనవేలుజను లేమితీరుపు చెప్పునో యని వినుటకై సభ నలంకరించిరి. రాజు వాది ప్రతివాదుల నెదుటకు రప్పించుకొని యిట్టి ప్రశ్నముల వైచెను.

రాజు-ఇందు ప్రతివాది విట శేఖరుఁ డెవఁడు?

విట-(ముందఱకు వచ్చి) దేవా! నేను.

రాజు-రాజరత్న మెవ్వతె?

రాజరత్న-(నమస్కరింపుచు నెదుటకు వచ్చి) మహాప్రభూ! నేను.

రాజు-ఈవిటుఁడు నిన్నేమి చేసెను?

రాజరత్న — దేవా! వీనికి మొన్ననొక కలవచ్చినదఁట. అందు నా కూఁతురు రతిమంజరి వీనితోఁగూటమి కనుమతించి వేయి దీనారములు తీసికొనినదఁట. వత్తువా? నా సొమ్మిత్తువా? అని దాని నిరోధించుటయు, మే మొల్లమనిన వేగుర పోగరుపోతుల వెంటఁ బెట్టుకొని వచ్చి నా యింటిమీఁదపడి యల్లరిచేసి కొల్లగొట్టించెను. బాబూ ఇట్టి వింత లెందైన విని యుందుమా?

రాజు-ఏమిరా? విట శేఖర! ఇందులకు నీవే మందువు?

విట—దేవా నేనీ నడుమ నిల్లు కట్టుకొనుటకై మాన్యము తాకట్టు పెట్టి వేయి దీనారములనప్పుదెచ్చుకొని పెట్టెలోఁబెట్టికొంటి. మొన్నటిరాత్రి దీనికూఁతురు రతిమంజరి చక్కనిదని విని యింటికింబోయి నీ కూఁతునకు గన్నెరికము చేసెద నేమి తీసికొందువని యడిగితిని. వేయి దీనారము లిమ్మని కోరినది. వెంటనే నే దాచినవి తెచ్చి దాని రండ యొడిలోఁ బోసితిని. నేను జూచుచుండగనే యా సంచి తీసికొని పోయి మూలనున్న యినుపపెట్టెలోఁ దాచినది. నేను దానికూఁతురితోఁ గొన్ని శృంగార చేష్టలు నెఱయించితిని. అంతలోఁ దెల్లవారుచున్నది కాఁబోలు నా తల్లి తలుపు తీసి వాకిలి యూడ్చుచుండ నారొదవలన నాకు మెలకువ వచ్చినది తండ్రీ! అప్పటి నా శోక మేమని చెప్పుదును?

రాజు-సరే తరువాత నేమి జరిగినది?

విట-ఏలికా! నే మేలుకొని లేచి చూచుకొన మేన నఖక్షతాది సంభోగ చిహ్నములు గనంబడినవి. పెట్టెతీసి చూచినందు దీనారముల సంచి లేదు. అప్పుడు

దాని కలయని యెట్లు నమ్ముదును? నిజమేయని తలంచి, యీ లంజయింటికింబోయి యభిలాష దెలిపినఁబరిచారికలచే గెంటించినది.

రాజరత్నము-నోరుమూయి, నీకు నేను లంజెనా! ప్రభువు వారి యెదుటనే యిట్టి దుర్భాషలు.

రాజు-ఊఁ, తరువాత.

విట-తరువాత మా స్నేహితులఁ గొందర వెంటఁబెట్టుకొని పోయి నా సొమ్మైన నిమ్ము నీ కూతునైనఁ బంపుమని నిర్బంధించి యడిగినమాట వాస్తవమే.

రాజు-తరువాత.

విట-తరువాత నే నల్లరిచేయుచున్నానని చెప్పగా రాజభటులు వచ్చి నన్ను బట్టికొని చెఱసాలలోఁ బడవైచిరి. తండ్రీ! సొమ్మా పోయినది రతిమంజరియు దక్కినది కాదు చివరకు బంధనయోగము లభించినది. ఇది నా గ్రహచారమని వాఁడు విచారించెను.

రాజు-రాజరత్నమా? నీవేమందువు.

రాజరత్నము — దేవా! యథార్థము వాఁడె చెప్పెను గదా. స్వప్నలబ్ధ పదార్థము లెట్టివో దేవర యెఱుఁగనిదియా! ఎండమావులలో నీరు గ్రోలఁ దలఁచినట్లు కలలోఁగన్న చర్యలకుఁ దగవు పెట్ట నే నేమి మనవి చేసికొందును?

విట - మహాప్రభూ! తమకన్న ననుభవశాలు లెవ్వరును లేరు. ఇట్టి విచిత్రములు మీ రెన్నియో చూచి యుందురు, సొమ్మునైనను గొమ్మనైన నిప్పింపుఁడు.

రాజు-స్వ॥ ఓహో వీనిమాటలు సాభిప్రాయముగ నున్నవి. నా హృద్గతము వీని కెట్లు తెలిసినది? లేక మాట వరుస కట్లనెనా? ప్రా॥ఓరి నీ మందసములో సొమ్ము పెట్టినట్లు సాక్ష్యమున్నదియా.

విట-ఉన్నది మహాప్రభూ నా తల్లి యెఱుంగును. ఇంతయేల అప్పు పత్రమే చెప్పునుగదా.

రాజు-నీకుఁగలవచ్చిన మరునాఁడుదయంబున లేచి చూడగా సంచిలేదని చెప్పితివి రాత్రి చూచితివా.

విట - అయ్యో చూడకేమి? పెట్టెలో సంచియున్న నీ తగవేల పెట్టెదను సామీ!

రాజు—రాజరత్నమా! వానిపెట్టెలో సంచి లేకపోవుట విచిత్రము కాదా?

రాజరత్నము—దేవా! దేవరకూడఁ బొరపడుచుండ నేమి చెప్పుదును? కలలో దెచ్చి యిచ్చితినని వాఁడె చెప్పుచుండ నిజముగా జరిగినట్లు ప్రశ్నములు వేయుదురేల?

విటు—నా సంచి దీని పెట్టెలో జూపింతు నౌదంబడునేమో యడుగుడు.

రాజు-ఆ మాట కేమందువు?

రాజరత్నము—అయ్యయ్యో! మీరు గూడ ననుమానపడు చున్నారు నా పెట్టె లోనికి వానిరూకలసంచి యెట్లు వచ్చును?

రాజు-పోనీ. రాజరత్నమా! రతిమంజరికై వీడు విరహాతురుడగు చున్నాడు. అంత సొమ్ము మే మిప్పింతుము వాని యిష్టము నెరవేర్తువా?

రాజరత్నము-పండ్రెండేండులు తపంబుచేసినను నా కూతు నీ యల్పున కీయజాలనుగా.

విటు-పండ్రెండు గాదు మరి పండ్రెండేడులైన తపముజేసి దానిం దాసిగా నేలకపోవుదునా? మహాప్రభూ! నా సొమ్ము నా కిప్పింపుడు.

రాజు-సొమ్ము నీవు తన కిచ్చినట్లు సాక్ష్యము చూపమను చున్నది.

విటు—నా రూకల సంచి దాని యినుప పెట్టెలో నేను జూపెద దేవా నా వెంట రండు. వేర సాక్ష్యమేల?

రాజరత్నము—దేవా! అట్లు చూపినచో వాని కోరిక తీర్చెదనుగా.

విటు-ఆ మాటయే నిలుపు కొనవలయును. దేవరయే ప్రమాణము.

రాజరత్నము—నా పెట్టెలో నీ సంచి చూపనిచో నేమి చేయవలయును?

విటు—చూపనిచో నీ యింట వరపుడనై పనులు చేయుచుందుము.

రాజరత్నము—సరే. ఆ మాటయె నిలుపుకో. దేవరయే ప్రమాణము.

అని వారిద్దరు శపథములు సేయుటయు ఘూనందనుండా విషయము పరీక్షించుటకై యప్పుడే మంత్రిసామంతాదులు వెంటరా బయలుదేరి తిన్నగా రాజరత్నము గృహమున కరిగెను. అందు విట శేఖరుండు చూపిన పెట్టె తాళముచెవి తెప్పించి మూత తీయించి చూచెను. ఇదిగో నా సంచి యని గురు తెరింగినవాడుంబోలె నందుజెయి పెట్టి యా సంచి తెచ్చి రాజుముందర నిలిపెను. అందు వాని విలాసము గూడ నున్నది. దానింజూచి యెల్లరు విస్మయపడం జొచ్చిరి.

అప్పుడు రాజు రాజరత్నమా? ఇప్పుడు నీవేమనియెదవు? స్వప్నములు నిజమయ్యెనా అని యడిగిన నావేశ్య తెల్ల తెల్లవోయి చూచుచు దేవా! దీని నెవ్వరో నే నెరుంగకుండ దీనిలో బెట్టిరి. కాకున్న గలలు నిజములగునా? అని పలికిన విని రాజు సీ! అది యసత్యము. తాళము చెవి నీకడనుండ నందు మరి యెవ్వరుంతురు. ఈ గతియె ఇనుప పెట్టికంటె గట్టిగా నున్నది. ఇది కలికతము కాదు. ఇట్టి వినోదములు జరుగుచుండును. నీవన్న ప్రతిజ్ఞ నిలుపుకొని నీ కూతు రతిమంజరిని వానికిచ్చివేయుము. మే మట్లె తీరుపు చెప్పితిమని పలికి యా రాజమార్తాండుడు విట శేఖరుని మొగము చూచుటయు వాడు మ్రొక్కుచు నిట్లనియె.

దేవా! మీరు నాకోరిక దీర్చితిరి. దేవరయభిలాషగూడదీరఁ గలదు. అనుటయు రాజునవ్వుచు నోరీ! నా యభిలాష నీకెట్లు తెలిసినది. అదియేది అని యడిగిన వాఁడు స్వామీ! నాకదియేదియో తెలియదు? నా మనస్సంతోషముకొలఁది యట్లంటి. నంతకన్న నాకేమియుఁ దెలియదని పలుకుచు మిత్రులవెంట నప్పుడే రతిమంజరి యింటికింబోయెను. ఆ తీరువు విని ప్రజలాశ్చర్యరసావేశులై నృపతిమతి కౌశల్యమును వేనోళ్ళఁ గొనియాడిరి.

ఆ భూనందనుం డాత్మగతంబున నిట్లు వితర్కించెను. ఔరా! నా కీ వేశ్యావిటసంవాద ముపశ్రుతియా. లేక భగవంతుఁడీకై తవమున బుద్ధిచెప్పెనా? ఏది యెట్లయినను లెస్సయే. తపంబునకు సాధ్యముకానిది లేదు. శ్రీహరింగూర్చి తపంబుచేసి కలలోఁగన్న పొన్నికొమ్మంగూడెదంగాక అని నిశ్చయించుకొని మంత్రిన్యస్త రాజ్యభారుండై తీర్థయాత్రాకైతవంబున నిల్లు వెడలి హిమాలయ పాదంబుల కుదంటొసంగు త్రికూటాచలంబుపొంత నత్యంత పవిత్రంబై యొప్పు విక్రమసరస్తీరంబున నివసించి యమ్మహారాజు కందమూలాశనుండై పండ్రెండేలు లుగ్రతపంబు గావించెను.

ఒకనాఁడు త్రికూటాచలశిఖరములనుండి పింగళజటాకలాపుండుభూతిరుద్రాక్షమండితసర్వప్రతీకుండునగుమహర్షి యొకఁడుశిష్యగణసమేతుండై క్రిందకిఁదిగి విక్రమ సరస్సున గ్రుంకులిడనగు దెంచి, యందుసమాధిష్ఠుండగు భూనందనుఁజూచి యభినందించుచు సమీపించి నీ వెవ్వఁడ వేమిటికై యిట్లు తపంబు గావించుచుంటివని యడిగిన నన్నరేంద్రుఁ డాతపస్వి కిట్లనియె

మహాత్మా! నీవు జ్ఞానచక్షుస్సవు. నీ వెఱుంగని రహస్యములుండవు. నేను కాశ్మీర దేశాధిపతిని. భూనందనుండనువాఁడఁ గలలోఁగన్న వస్తువుం బడయఁగోరి యిట్లు తపంబు చేయుచున్న వాఁడనని తనవృత్తాంతమంతయు నెఱింగించిన నామహర్షి యిట్లనియె.

నరేంద్రా! నిన్నుఁగలలోఁ గనంబడి వలపింప జేసినది పాతాళలోక నివాసిని దైత్యకన్యక. నీవందులకై విచారించెందుకు విపరీతముకాదు. దానియందట్టి మహిమ యున్నది. నీవు విచారింపకుము నిన్నందుఁ దీసికొనిపోయెదనని పలికినవిని యలసుచు నయ్యిలాపతి లేచి నమస్కరింపుచు మహాత్మా! నీవు తపఃఫలప్రదాతవగు మహేశ్వరుఁడవని తోచుచున్నది. ఆ కారణవాత్సల్యముతో నన్నాదరించిన దేవర వృత్తాంతంబు విని నహూర్తండనేని యెఱుఁగింప వేడుచున్నాఁడనని యడిగిన నా జడదారి యిట్లనియె

నృపాలా! మాది దక్షిణ దేశము. మా తండ్రిపేరు యజ్ఞవల్క్య, నాపేరు వసుభూతియండ్రు. యోగి శేఖరుండగు మా తండ్రివలన నేనుసమ్మిత జ్ఞానుండనై పాతాళశాస్త్రమంతయుఁ జదివించి హటకేశ్వరమంత్రతంత్రవిధులందు లెస్సగాఁ శిక్షింపబడితిని. అంతటితో విడువక శ్రీశైలంబున బెద్దకాలము వసించి తపంబు గావించితిని.

మల్లికార్జునదేవుఁ డొకనాఁడు స్వప్నములోఁ గనంబడి తంత్రవిధుల ప్రస్తరింపుమనిట్లుపదేశించెను.

వసుభూతీ! నీవు పాతాళలోకమున కరిగి దైత్యకన్యకలతోఁ బెద్దకాలము దివ్యభోగములనుభవించి పిమ్మట నన్నుఁ గలిసికొనఁ గలవు. పాతాళలోకమున కరుగ భూలోకమున ననేక మార్గములు గలవు. వానిలో ముఖ్యమైనదానిని జెప్పెద వినుము. కాశ్మీరదేశమున మయకృతమగు మార్గమొకండుగలదు. ఆ దారిని రహస్యములగు దానవోద్యానభూములఁ బ్రవేశించి బాణాసురకూఁతురు ఉష యనిరుద్ధునితోఁ గ్రీడించినది. అందామెకు గలిగిన ప్రద్యుమ్నకుమారుని రక్షించుటకై యందలి గిరికూటంబున నొక ద్వారము నిర్మింపఁజేయుటయే కాక యందొండు దుర్గాలయము గట్టించి యర్చించుచుండెనది. ఆ కూటమున కిప్పటికి ప్రద్యుమ్నకూటమని పేరు. నీవా మార్గమున బాతాళలోకమున కరుగుము. నీకుఁ భోగసిద్ధికాగలదని శంకరులానతిచ్చి యంతర్హితులైరి. తత్ప్రసాదప్రభావంబున నాకామార్గము లన్నియుఁ గరతలామలకమువలెఁ దెల్లమగుటయు నేను శిష్యులతోఁ గూడ నటఁ గదలి రసాతల ప్రవేశమునకై కాశ్మీరమున కరుదెంచితిని.

ఇందుఁ ద్రికూటశైల శిఖరముల త్రిమూర్తులు వెలసియున్నారనియు వితస్తానది యతి పావనమనియు విని యందుఁబోయి యా వేల్పుల నారాధించి వచ్చుచుంటి. నీ విందుఁ గనంబడితివి. లే లెమ్ము నా వెంటరమ్ము. నీ కామిత మీడేరునని పలికినవిని యానందమందుచు భూనందనుఁడు వసుభూతిని బొగడుచు లేచి యతని వెంటఁ బయలుదేరెను.

ఆ మహర్షి వెంట వేయిమంది శిష్యులు నడుచుచుండిరి. భూనందనుడును వారితో గలిసిపోవుచుండెను. ఎనుముందుగా ప్రద్యుమ్నకూటమెక్కి యందున్న వినాయకుని శారికాదుర్గను వారికిఁ జూపుచు నందొకనాఁడు వసించి యా వేల్పుల నారాధించెను.

అందలి రసాతల బిలద్వారమరయుచు నయ్యతి యావాలు మంత్రించి నలుమూలలు చల్లుటయుఁ దటాలున నా చివర కవాటము తెఱవఁబడినది. భూనందనాదులా వింతచూచి మహర్షి ప్రభావ మగ్గించిరి. అందు క్రిందికి సోపానములుఁ గనంబడినవి. ముందు గురువు వెనుక శిష్యులు నా దారింబడి పదిదినము లహోరాత్రములు నడువ నాలవనాఁటి కాదారి పాతాళగంగా తీరంబునకుఁ దీసికొనిపోయినది. అందలి భూమియంతయుఁ వెండిమయముగా నున్నది. ఆ గంగాతీరంబునఁ గనక సరోజజముల పరిమళము నలుదెసలు వ్యాపింపఁ జందనాగరు ప్రముఖ తరులతావిశేషములచే మనోహరంబగు నొక యుపవనంబు విరాజిల్లుచున్నది. ఆ వన మధ్యమునస్ఫటిక మణిశిలావినిర్మితంబై హాటకేశ్వరుని యాలయముఁ గ్రాలుచున్నది. ఆ మహర్షి తత్ప్రభావమంతయు శిష్యులకు వర్ణించి చెప్పుచుఁ బాతాళ తరులతా

సంజనితములగు పుష్పముల గోయించి తెప్పించి యప్పార్వతీ వల్లభునర్చించి తన్ను గృతార్థునిగాఁ దలంచుకొనియెను.

మఱి యు నా ప్రాంతమందు నెఱయపండిన జంబూతరువరచ్ఛాయను వారు కొంతసేపు విశ్రమించిరి. గాని నా ఫలములు రాలుచుండెను. మహర్షి శిష్యులతో నీ ఫలంబులఁ దినగూడదు కార్య విఘ్నము చేయునని పాతాళసిద్ధిలో నున్నదని చెప్పుచుండగనే యొక శిష్యుఁ డాకలికి నిలువఁ జాలక యా ఫలమొకటి భక్షించెను. వెంటనే యాతండు స్థాణువువలె నిలువంబడి చేష్టలుడిగెను. ఎన్ని పిలిచినను పలుకఁడయ్యెను.

ఆ యుపద్రవ చూచి భయత్రస్త చేతస్కులై శిష్యులును భూనందనుఁడు నటనిలువక తమ కేమిహాని వాటిల్లునోయని యందుండి క్రోశదూరము పరుగిడికొని పోయి యందుఁ నిలువంబడిరి. మహర్షి వెఱవకుఁడు భయములేదు. ఫలముల దినకుఁడని పలుకుచు వారి వెంటఁజని కలిసికొనియెను.

ఆ ప్రాంతముల హేమ ప్రాకార భాసురంబు మహారత్న ఖచితద్వార కవాటంబునగు గృహముఖద్వారమొండు వారికి నేత్రపర్వము గావించినది. ఆ ద్వారశాఖలయందు లోహమయములగు మేషములు రెండు వాఁడిగల యినుపకొమ్ము లచేఁ జిమ్ముచు లోపలకుఁ బ్రవేశింపకుండ నాటంకము గలుగఁ జేయుచున్నవి. వానిం జూచి బెదరుచున్న శిష్యుల కడుటు గఱపుచు దపస్వియోగ దండంబు మంత్రించి వాని శిరంబులఁ గొట్టుటయు నవిరెండు వజ్రాహతములు పగిదిఁ గ్రుంకుచు నెందేనిం బాఱిపోయినవి.

అప్పుడు నిరాటంకముగా నా మార్గంబున లోపలకుఁ బోయిరి. అందు హేమరత్నమయములగు సౌధనము లనేకములు వారికి నేత్రపర్వము గావించినవి.

దంతదంష్ట్రాశిఖరోత్కటులై లోహదండముల ధరించిన ద్వారపాలకులు ప్రతిద్వారమునుగాచి చూచువారికి వెఱపు గలుగఁజేయుచుండిరి. భయంకరాకార ముల నొప్పు నా ప్రతిహారులం జూచి భూ నందన ప్రభృతి శిష్యవర్గంబంతయు వెఱచుచు దూరదూరముగా నిలువంబడి తపస్వితో మహాత్మా! ఆ సౌధాంతరముల గను విచిత్ర విశేషములున్నట్లు కనంబడుచున్నవి. ఈ సౌవిదల్లులంజూడ నుల్ల ములు భేదించు చున్నవి. ప్రాసాదాంతరముల కెట్లు పోవఁగలము. అందేలాటి వింతలుండునని యడిగిన నతండు నవ్వుచు ముహూర్తకాలముపేక్షింపుడు వింతలు చూపింతునన పలుకుచు దుస్సమగు యోగ మవలంబించి మంత్రాక్షత లా ద్వార రక్షకులపై జల్లుటయు వా రెల్లఁ డేగ త్రెంపిన పిట్టలవలె గొట్టుకొనుచు నెక్కడికో పాఱిపోయిరి.

అప్పుడు—

చ. కరము ముదార నా గృహ ముఖంబులనుండి చిరత్న రత్నక
ర్బురవరభూషణాంబర విభూషితలై దగుదైత్య కన్యకా
పరిజన వారకామినుల లపారముగాఁ జనుదెంచి తాపసే
శ్వరునకు శిష్యయుక్తముగఁ బాద్యము నర్ఘ్యమునిచ్చిరయ్యెడన్.

గీ. మౌనితోడ నెంతమంది వచ్చిరొయట
కంతమంది వారకాంతలరుగు
దెంచి ప్రీతినాదరించి వేర్వేర రం
డంచు దైత్యసుతలయాజ్ఞఁ దెలుప
అత్తపస్వి యిట్లనియె.

ఉ. అంతే వాసివతంసులార వినుఁడీయస్మత్ప్రబోధంబుసి
ద్ధాంతం బిప్పుడుచేరి దానవసుతాదత్తోపచారక్రియా
సంతుష్టాత్మకులై యభీష్టరతులన్ సౌఖ్యంబులం బొందుఁడీ
సంతాపము వహింత్రు చూడుఁడు తదాజ్ఞల్మీరినస్మీరటన్.

అని యెఱింగించుటయుఁ ననుమోదించి వారందరుఁ దలయొక సుందరి వెంటఁ నమ్మందిరాభ్యంతరములకరిగిరి. తపస్వియు నొక వారాంగన వెంట నుత్తమదైత్య కన్యక యింటిలోని కేగినంత నక్కాంతారత్న మెదురువచ్చి యతని మెడలోఁ బుష్పదామంబువైచి తీసికొనిపోవుటయు నా తపోధనుఁ డా యువతీరత్నముతో నభీష్ట కామంబుల ననుభవింపుచు బెద్దకాల మానందించెను. అతని శిష్యులుగూడ నట్లే సుఖించిరి.

కాశ్మీరభూపతి బూనందనుండును దనకు స్వప్నంబునఁ గనం బడిన పొన్నికొమ్మ యా సౌధాంతరమ్మున నున్నదని తెలుపఁబడిన వాఁడగుట నౌత్సుక్యాతిశయంబున నొక పరిచారికవెంట లోనికరిగెను. మొదట నతని కొక రత్న మందిరము కన్నులకుఁ మిరిమిట్లు గొలిపినది. అందు సుందరీ సహస్రములు రత్నసాల భంజికలవలె దిరుగుచుండిరి. వారి సౌందర్యాతిశయమున కతం డచ్చెరువందుచు నందు దాను వరించిన మించుబోడి యున్నదేమోయని వితర్కించుచుండెను. అందలి రత్నభిత్తికలఁ బ్రతిఫలించిన వెలందుల యాకృతులఁ జూచి కోటానకోటులు టోటులందుండిరని యతనికిఁ భ్రాంతి కలిగినది.

క. నీలమణికుట్టిమంబుల
మేలుగనిర్మింపఁబడిన మేడ యది విహా
నాళిజయింపగ నచ్చో
గ్రాలుత్రిదివపట్టణమనఁ బ్రకాశించె గడున్.

సీ. ఒకపూవు గుచ్చి వేరొకపూవు పుచ్చుదా
మమున గూర్పుటయే క్రమంబనంగ
బాలా తపంబులాపము సేసి కనుగంద
లలితకోమల తనూలతల బెదరుగు
శుక పికాదిపతంగనికరజల్పిత కల
ధ్వనులె కర్ణ కఠోరతను ఘటింప
మణివినిర్మిత చారుమసృణ కుట్టిమముల
విహరించుటనె పదోద్వేగ మొసగ
గీ. వేరె వర్ణింపనేల తద్వారుసౌధ
భాగల సమాన మానవతీ గణోరు
తరుణ సుకుమార వేశలత్వ ప్రశస్తి
త్రిభువ నాశ్చర్యకర విభాతితమనుచు.
క. కుసుమశర విభ్రమాస్పద
మసదృశమణికాంతి యచిరమగు నా సౌధో
ల్లసదంతరమున నొక సా
రసలోచన వల్లకీ విరాజితకరయై.

శృంగారరసం బుట్టిపడునట్లు మనోహరస్వరంబుల వెలయింపుచు నా నరేంద్రునికిఁ నేత్రానంద మాపాదించినది. ఆ చిన్నది తాను మున్ను స్వప్నంబున బొడగన్నదిగా నెరింగి మేనంబులుక లుద్భవిల్ల నతండు మోహావేశంతో నిట్లు తలంచెను. ఔరా ! యీ నారీమణి దేహప్రభలు వెలుంగుచుండ నీ లోకమున సూర్యాలోక మవసరము లేకపోయినది. మరియు వాణీధవునకు రత్న ప్రభా నిర్మాణ ప్రయాసము పునరుక్తి దోషము నవఘటింపుచున్నది. అని వినుతింపుచు నని ర్వాచ్యసౌందర్యాతిశయంబునం బొలుపొందు నా యిందువదనం జూచుచు నా నృపాలుం డితర వస్తు దర్శనమువలనఁ బొడమిన మలంబు గడుగుచున్న వాఁడుంబోలె హర్షాశ్రువులఁ గన్నులఁ బ్రసవింపఁజేసెను.

అమ్మదవతీవతంస మెదుర నిలువఁబడియున్న యా యొడయనింజూచి తటాలున లేచి తన కుముదినీనామంబు ముసురుచున్న తేంట్లగములచే నన్వర్థము సేయుచుఁ గ్రేగంటిచూపుల నాభూపాలుం జూచిచూచి వ్యామోహం బేపారఁ దదేయకర గ్రహణము గావించి యిట్లనియె.

మహాభాగ ! నిన్నుఁ జాలకష్ట పెట్టితిని నా యపరాధము సైరింపుము అని సాదరముగఁ బలుకుచుఁ దీసికొనిపోయి యొక రత్నపీఠంబునఁ గూర్చుండఁబెట్టి పూసురటిచే వీచుచు నతని నానందపరవశుం గావించినది అప్పుడు తదాజ్ఞాను సారంబున——

ఉ. కొండలు సుందరీమణులు గొబ్బునవచ్చి నివాళులిచ్చి వే
డ్కం దలయంటి రందు జలజంబుల నార్చఁగఁగొంత యందు స్ర
క్చందన చారువస్త్ర విరసన్మణిభూషలఁ దాల్చఁజేసి రా
స్యందలి రాకుబోణులు రసాతల నాధుర సాతలంబునన్.

క. పానందు సేయనికటో
ద్యానవనంబునకు రమ్మటంచుఁ గుముదినీ
మానవతి యతని కౌఁగిట
నానుచుఁ దీసికొనిపోయె ననురాగముతో.

ఆ యుద్యానవన మధ్యంబున నొక దిగుడుబావి యున్నది. తత్తీరతరు శాఖల ననేకశవంబు లూశలవలె వ్రేలాడుచున్నవి తచ్ఛవరక్త వసావము లావాపీజ లంబులం బడుచుండ నేవ పుట్టు నచ్చోటున నా బోఁటి యా భూపునితోఁ గొంతసేపు విశ్రమించినది.

అప్పుడాతండా వాపీజలమలినంబు పరికించి యాత్మగతంబున నిట్లు తలంచెను. అక్కటా ఇట్టి మనోహర పవన ప్రదేశమున నీవా పీజంబులు కుణ పరక్తాసవ దూషితంబులగుట బీభత్సముగా నున్నదిగదా. రక్కసుల బిడ్డలెంత చక్కనివారైనను జాతి స్వభావము విడువ నేరరు. నరరక్తపానము వీరి కలవాటు. ఈ సుందరీ రత్నము సౌందర్యమున కీ దుష్టపానము కళంకము గలుగఁ జేయు చున్నది. గణ సమూహంబున నొక దోషము లెక్కకు రాదని చెప్పుదురు. ఏమి చేయుదునని యాలోచించుచుండ నంతలో నయ్యండ జయాన పరిచారికల గనక పాత్రలలో నా వాపీజలం బెక్కించుకొనివచ్చి యచ్చిగురుబోఁడి ముందరనిడిరి.

అప్పుడప్పడఁతి యాసవపూరితంబగు గిన్నెందీసి పతినోటి కందిచుచ్చు మనోహరా! మీరి మద్యంబు గ్రోలుండు పిమ్మట నేఁగ్రోలెద నన నవ్వం జుగుప్స గలిగి దాని నందుకొనక పెడమోము పెట్టి సీ! సీ! ఇది నా కసహ్యముగుచున్నది. నేఁగ్రోలఁజాల వలదు అని చేతితోఁ ద్రోసివేసెను.

త్రోయవలదు. దీనిం ద్రాగకున్న నీకుముప్పురాఁగలదు. నామాటవినుఁడు. త్రాగుము. త్రాగుము. అని మరియు మరియు నా పాత్ర నతనినోటఁ కందిచ్చినది. సీ. ఇవి మేము త్రాగ దగినది కాదు. దీనిఁజూడ నేవ పుట్టుచున్నది. వలదు. వలదుఅని చేతితోఁ ద్రోసెను. అట్లు ముమ్మారం దిచ్చినను నతండంగీకరింపకయుండెను.

అప్పుడా దైత్యకన్యక కన్ను లెఱ్ఱచేయుచు నీకర్మ మిట్లుండ నే నేమి చేయుదును. అని కోపోద్దీపిత మానసయై యాయాసవ పాత్రమును బాని శిరంబునం బడవైచి లేచిపోయినది ఆ దెబ్బవలన శిరమును నేత్రములు గ్రుంగిపోవఁ బరితపించు చుండ నింతలోఁ గొందరు పరిచారికలు వచ్చి యతనిం బట్టికొనిపోయి బలవంతమున నొకనూతిలోఁ బడవేసిరి.

ఆ నృపాలుం డట్లు కూపంబునం బడి మునిఁగి తేలి కన్నులం దెఱచి చూచినంత మున్ను తాను తపంబు సేయుచున్న విక్రమసరస్తీరమున నిలువంబడి యుండెను. ఆ నృపాలుండు నలుదిక్కులు పరికింపుచు విభ్రాంతుండై నే నెంత వింత కలగంటిని ? యీ వాల్గంటిని నెడఁద నెడపక తలంచుటచేఁ దదనుగుణ్యమగు కలవచ్చినది. ఆ నారీరత్నము నన్ను వలపించుట యిది రెండవసారి. ఈ కలకు మొదలెప్పుడో ! శిష్యులతో నొక తపస్వి నా కడకు వచ్చుటయే ప్రారంభము. ఆ మహర్షి శిష్యులవెంట నన్నుం దీసికొనిపోయి యనేక విశేషములం జూపెను. అయ్యో ! ఈ కల మొదటి కలకంటె విచిత్రముగా నున్నదే ! ఆ కుముదిని పరిచారికలు సూత్నాంబరా భరణాదులచే నన్నలంకరించిరిగదా అయ్యలంకార మంతయు నా మేన వెలియుచున్నదే. నా నారచీరలందు విడిచి వచ్చితిని. ఔరా ! ఇట్టి వినోదములే పురాణములో వినియుండలేదుగా. ఏమనుకొనుచుంటిని ఇది కలకాదేమో నా తపంబునకు మెచ్చి మహేశ్వరుఁడా తపస్విరూపునవచ్చి నా యభీష్టము తీర్చెను. ఆ జ్ఞాపకము వచ్చినది. ఆ తపస్వి యందాసుందరులు చెప్పిన మాటలకడు చెప్ప రాదని బోధించెను. ఆ మాటమఱచి నే నాయాసవము త్రాగనని త్రోసివైచితిని. అందులకే యీ ముప్పు వచ్చినది. ఇది కలకాదు నిజమే కావచ్చును. ఓహో ఈ పరిమళ మెక్కడిది నా నెత్తిపై నళులట్లు మూఁగుచున్న వేమిఁ అయ్యో ! ఇవి యాసవ వాసనలు గాఁబోలు ! అపూర్వ నాసాపర్వము గావింపుచున్నవే ఇట్టి మద్యము నింద్యమని తెలియక నిరసించి మోసపోయితినిగదా. పాపమా పొలఁతి దీనిం ద్రాగకున్న ముప్పు వచ్చునని మొదటనే చెప్పినది గ్రహింపలేక పోయితిని. స్వప్నములో నీ కథ యంతయు వచ్చినదేమో ! ఏది నిశ్చయించుటకు శక్యము గాకున్నది. అని తలంచుచుండ నంతలో నొక మునికుమారుఁడా సరస్సున స్నానముచేయ నరుదెంచి యతని యాకార విశేషములు చూచి వెరఁగందుచు నిట్లనియె.

ఓయీ ! నీ వెవ్వఁడవు ? నీ నెత్తిపైఁ దుమ్మెదలట్లు మూఁగుచున్న వేమి. నీ కడ మంచి పరిమళము గొట్టుచున్నది. వాసనాద్రవ్యము లేమి రాచికొంటివి ? నీవు కట్టిన పుట్టంబులు తొడవులుం జూడ దివ్యుఁడవట్లు తోచుచున్నది. నీ పీపుణ్య తీర్థంబున కేమిటికి వచ్చితివని యడిగిన భూనందనుం డిట్లనియె.

మహాత్మా ! నేను దివ్యుండగాను మనుష్యుండనే. దివ్యపదస్థుండనై యయాతి వోలె భ్రష్టుండనైతిని అని తన వృత్తాంతమంతయు నెఱింగించి యిది కలయో సత్యమో తెలియకున్నది. స్వప్నలబ్ద పదార్థమునకై పరిచింతమాని పండ్రెండేడులు తపంబుగావించితి. తపఃఫలమంతయు నొక్కమాటతో నటమటమై పోయినది. ఇక నాకీ జన్మమున నట్టి విచిత్రవస్తు సందర్శనము కానేరదు. రాజ్యమందాస మొదటనే పోయినది. ఇప్పుడు దేహమందు విరక్తి గలుగుచున్నది. దేహత్యాగము సేసి

యీ చింత బాసెదనని చెప్పుటయు నమ్ముని కుమారుఁడు పక్కున నవ్వుచు నిట్లనియె.

రాజా! ఎంతవఱకు దేహాభిమానముండునో యంతవఱకు దుఃఖక్షయము కానేరదు. కలయో సత్యమోయని నీ తెరంగాలోచించుచుంటివి. సంసారము కలవంటిది కాక సత్యమైనదియా? ఇది దీర్ఘస్వప్నము. రెండును సమానములే. నిద్రాంతమున స్వప్నము వట్టిదని తోచును. మోహాంతరమున సంసారము మిథ్యయని తోచును. పురుషుఁ డనుద్వేగమునం బురుషార్థము సాధించుకొనవలయును గాని దుఃఖించిన ప్రయోజనము లేదు. నీ విదివఱకు భేదబుద్ధితోఁ దపంబు గావించితివి కావున నిట్లు విఫలమైనది. త్రిమూర్తుల నభేదబుద్ధి నారాధింపుము నీ కామితము తీరఁగలదు. ఊరక చచ్చినం బ్రయోజనము లేదు. నీ వాయతిమాట మఱచి యుత్తరమున కెదురాడితివి కావున నిట్లు జరిగినది. నిన్నుఁ బరీక్షించుటకే యా యెలనాఁగ యట్లు చేసినది. ఆసన పరిమళ మెంత వింతగా నున్నదియో చూచితివా? నీ శిరంబీ తుమ్మెదలు విడుచు నుపాయము వినుము నా యీ కృష్ణాజినము నీ కిచ్చుచుంటిని. దీని పయిం గూర్చుండి జపము చేసికొనుము. దీని వాసన సైరింపక యళులు మూగవు. నీకు వెండియు నా యంగన సాంగత్యము గలుగునని యుపదేశించి యా మృగాజినమిచ్చి యా ఋషి కుమారుం డెందేని బోయెను.

అయ్యతికుమారుని వచనంబులఁ దేలి భూనందనుండు వెండియు సంకల్పము చేసి కృష్ణాజిన సంపర్కంబున నళిబాధం బొరయక నియమిత చిత్తుండై పండ్రెండువత్సరంబులు నుగ్రతపంబుఁ గావించెను. ద్వాదశాబ్దానంతరమున—

సీ. తొలుకారు మెరుఁగు దీప్తుల భాతిదేహప్ర.
మేయ ప్రభలు మిరుమిట్లు గొలుప
క్రమరాకాసుధాకరుఁగేరు మోమున
జిరునవ్వు వెన్నెలల్ చెంగలింప
వేణిగ్రథితదివ్య వికచపుష్పామోద
లుబ్ధంబులై యళుల్మూగి రాఁగ
దివ్యమాణిక్య దేదీప్యమానప్రభా
రుచిరభూషణరుచిప్రచయ మడర

తే. గీ. రక్తి గణికాసహస్ర సంయుక్తముగను
వచ్చి నిలిచెను ధరణీశ్వరుని చెంత
రాణలెసఁగంగఁ గుముదినీరాజవదన
నిటల సంఘటితాంజలీపుటిక యగుచు.

కన్నులు మూసికొని ధ్యాననిష్ఠాగరిష్ఠుండై యున్న యన్నరపాలుండు దివ్యసౌరభంబు గొట్టుటయు నట్టె కన్నులందెఱచి కట్టెదుట రూపు గైకొని నిల్కడ

భూమి కవతరించిన విద్యుల్లతయో యన మెఱయుచున్న యత్తెఱవం గనుంగొని యన్నరపతి యపరిమితాశ్చర్యముతో —

క. ఎవ్వతె వీ, వీకోమలు
నెవ్వరు ? నీకేమియగుదురు రిట కేమిటికై
పువ్వుంబోడిరో ! వచ్చితి
వవ్వివరముఁ దెలుపుమనిన నది యిట్లనియెన్.

చ. జనవర ! వినుము నే నల రసాతలవాసిని దైత్యకన్య ని
వ్వనితలు మత్సఖుల్ ధృతిభవత్కృత భూరితపఃఫలంబునం
గొనఁబడునట్టి దాసి నిదిగో చనుదెంచితి మీ సపర్యకై
ననుఁ గరుణించి యేలు మలనాఁటి తిరస్కృతిఁబూన కాత్మలోన్.

రా. ఆ యుద్యానవనంబు లాగృహము లాహర్మ్యంబులు న్నీకుఁ గ్రీ
డాయోగ్యంబులుగాఁగఁ జేసితిని వేడ్కం వేగ విచ్చేసి మీ
రాయైశ్వర్యమునంతకుం బ్రభువులై యందందు నాతోడ సు
శ్రీయం బొప్ప నభీష్టకామముల వర్తింపందగుం దృప్తులై.

క. నాపరిచారిక లందరు
మీ పరిచారికలుగాగ మెలఁగుదు రింకన్
దాపరిక మేల రండో
భూపాలక ! మద్గృహంబుపొంతకు ననినన్.

శా. ఏమేమీ ! చనుదెంచితే కుముదినీ ! యీవే స్వయంవ్యక్తవై
తే ! మాముంగల రమ్మటంచుఁ బిలుతే ! యీ వేళ నన్గ్రమ్మఱన్
నీ మాటల్వినకున్న దూరముగ గెంటింతే మొ ! దైత్యాంగనా
సామర్థ్యం బసమానమెట్లు లిట విశ్వాసంబు చేకూరెడిన్.

అని యెత్తిపొడుచుచుటయు నత్తలోదరి "నరేంద్రా ! యప్పటి యధికార మట్టిది. నీకు బూర్తిగ యిప్పుడు వశవర్తినులమైతి మీక మిమ్మెవ్వరు నవమానించు వారు లేరు. రా రండు పోవుద"మని పలుకుచు నతని గ్రుచ్చి కౌఁగిలిం చిక్కఁబట్టి కన్నులు మూసికొమ్మని రెప్పపాటులో రసాతలలోకంబునకుఁ దీసికొనిపోయినది. ఇంక జెప్పనేమి యున్నది ? వయస్యా ! అతం డామోహనాంగితో నందు బెద్ద కాలము దివ్యభోగంబు లనుభవింపుచుఁ గొంతకాలమునకు ముక్తుం డయ్యెను.

శ్రీవర్ధనా ! ఈ కథ వింటివికద దీన నా యుపదేశము తెల్లము కాదే ? ప్రతికియున్న నెప్పటికైన భూనందనుఁడవతె సౌఖ్యము లంపవచ్చును. సిరిం గోల్పోయితినని విచారించుచు భుజింపకుండుట సమంజసము కాదని మఘభరకుఁడు చెప్పినంత నతండు తదీయాను నయోక్తులచే గొంత పరితాపము విడిచెను.

అని చెప్పునప్పటికిఁ గాలము మిగిలినది. మణిసిద్ధుం దవ్వలికథ పై మజిలీయం దిట్లు చెప్పం దొడంగెను.

## 281 వ మజిలీ

# ప ద్మి ష్ట క థ

వయస్యా ! నీ యుపదేశము శ్రోత్రవ్యమే. నే నుత్తమ వంశమునం బొడమి ద్యూతక్రీడవలన భ్రష్టుండనగుట నీదరిద్రస్వరూపముతో నీయూర మసలుటకు సిగ్గగుచున్నది. ఇందు నన్నెరుఁగనివారులేరు. ఈయూరువిడిచి యెదేశమో పోయెద. నాటంకము సేయనంటివేని కుడిచెదనని చెప్పిన నతం డొప్పుకొని వాని కారాత్రి యన్నము తెచ్చి పెట్టెను.

మరునాఁడు శ్రీదర్శనుఁడు పయనమగుచుండ ముఖరకుఁడు గూడ వాని వెంటఁ బయలుదేరెను. ఆపత్కాలమునఁ బ్రీతివిసర్గింబ ప్రాతమగు మిత్రునికన్న నాధారము మరియొకటిలేదు. వారిరువురునాఁటి వేకువజామునఁ బురివిడిచి యుత్తరాభిముఖులైపోవుచు ననేక బురనదీ పక్కణారణ్యముల దాటిపోవుచుఁ గొన్నినాళ్లు దేశ సంచారము గావించిరి.

ఒకనాఁ డొకమహారణ్యములోఁబడి దారి తెలియక తిరిగితిరిగి సాయంకాల మునకు నిర్మలజలపూరితమగు నొక తటాకతీరముఁజేరి కొనిరి. అందలి జలంబులఁ గ్రోలి తత్తటంబునఁ గొంతతడవు విశ్రమించిరి. మరియు నా ప్రాంతమం దేదియో పల్లెయున్నదని తెలిసికొని యందు బోవలయునని తలంచుచుండ ననన్య సౌంద ర్యాభి రామయగు నొక రామారత్నము నీటికై కలశముంగైకొని యచ్చటికి వచ్చినది.

హరనేత్రాగ్నిదగ్ధుండగు మన్మధుని ధూమమున నల్లఁబడిన రతియుంబోలె నీలోత్పలసవర్ణాంగయును నా కురంగనయనంగాంచి వారాశ్చర్యపడుచుండ దర్శన ప్రీతుండగు శ్రీదర్శనుని విభ్రమ నిర్భరములగు విలోకనముల నీక్షింపుచు సమీపించి మెల్లన నాయంబుజాక్షి వారి కిట్లనియె.

"మహాభాగులారా ! మీ రెవ్వరు ? ఎందుండివచ్చితిరి ? ఇది ప్రమాదప్రదేశమని యెఱంగరనుకొందును. శలభము లగ్నిశిఖంజూచి ఫల భ్రాంతితోఁ జేరునట్లు మీరీదేశ వైభవమున కిలరి యిందు వచ్చితిరాయేమి ? పాపము మీ రిందుండి విపత్తినొందకుండ నవ్వలి కెట్లు పోవుదురోకదా !" అని పలికిన విని ముఖరకుం డావనజముఖి కిట్లనియె.

"బోటీ ! నీ వెవ్వతెవు ? ఇవ్విపినమధ్యమున నేమిటికి వసించితివి ? మాకుఁ గలుగఁబోవు నాపదయెట్టిది ? ఎవ్వరివలనం గలుగును ? నిన్నుఁజూడ నుత్తమజాతి యువతివలెఁ గనంబడుచుంటివి. దయయుంచి నిజమెరిగింపు" మని యడిగిన నాజవరా లిట్లనియె.

"అన్నా ! ఈ ప్రాంతమున నొకకిల్లి పల్లెగలదు. అందుఁ గాపురమున్న వారందరు బోయకులగాం డ్రే. వాండ్ర కధినాయకుండు వినాయకుండను బ్రాహ్మణ

బ్రువుం డిందుఁ గాపుర ముండెను. వాఁడు చేసిన బ్రహ్మహత్యలకు మితిలేదు. దూర దేశములకు గుంపులుగాఁ గన్నగాండ్రనంపి యాళ్ళదోపించి తెప్పించుచుండును. నేనిందు జాగు చేయరాదు. వేగఁ బోవలయు నా వృత్తాంతము సంక్షేపముగాఁ జెప్పెద నాలింపుఁడు.

సుఘోషమను నగ్రహారమునఁ బద్మగర్భుఁడను బ్రాహ్మణుడు శశికల యను భార్యతో గాపురము సేయుచుండెను. ఆపాపునకు గాలక్రమంబున మకర కుండను పుత్రుండును పద్మిష్టయను పుత్రికయు నుదయించిరి. అందుకఁ బద్మిష్టయను దాన నేన. మాయన్న చిన్నతనమందే ద్యూతవ్యసన విప్తుండై కితవులంగూడి యిల్లువిడిచి దేశాంతర మరిగెను. మాతల్లి పుత్రశోక వ్యసనగ్రసిత చిత్తయై కొంది కాలములోఁ బరలోక మలంకరించినది మా తండ్రియు భార్యాపుత్ర వియోగచింతాక్రాంతస్వాంతుండై గృహస్థితివిడిచి నన్ను వెంటబెట్టుకొని పుత్రునర యుచుఁ గొంతకాలము దేశాటనము గావించెను.

భవితవ్యత ననుసరించి మే మొకనాఁడు మార్గముదప్పి యీ పల్లెచేరితిమి. అప్పుడు చీఁకటిపడుచుండెను. ఎదురుపడిన విల్లునితో "నిందు బ్రాహ్మణు లుండిరా?" అని యడిగిన వాండ్రు రండురండు బ్రాహ్మణగృహమున్నదని పల్కుచు మమ్మా కొంగల యెకిమీని యింటికిం దీసికొనిపోయిరి. అప్పుడాపాపాత్ముఁడు వాకిట బదారు చేయుచు మమ్ముఁజూచి పరిజనులవలన మా వార్తవిని లోపలకుఁ దీసి కొనిపొమ్మని నియమించెను.

వాండ్రు మమ్ముఁదీసికొనిపోయి లోపలి యింటియరగుమీఁద గూర్చుండఁ బెట్టిరి. బిల్లస్త్రీలే యాపారున కుంపుడుకత్తెలుగా నుండిరి. లోపల మాంసము వండు చున్నట్లు మాకు వాసన గొట్టినది. మాకు వమనము వెళ్లటయు నందుఁ నిలువలేక యవ్వలకుఁ బోవుదమని మాటయెత్తునంతలో లోపలనుండి యిద్దరు ముచ్చు లీవలకు వచ్చి "నిలుఁ డెందుబోయెదరు! వంటయింట కుందేళ్ళయితిరి. మిమ్ముఁ బోనిత్తుమా! మీ మూటలు విప్పుడు. అందేమియున్నదో యందుబెట్టుఁ" డని యదలించుటయు మా తండ్రి బెదురుచు నిట్లనియె.

అయ్యో! ఇదియేమి యాతిథ్యము? మీ యజమానునితోఁ జెప్పి మిమ్ముఁ దండింపఁజేయుదుము. మా మూటజోలి మీకేలయని పెనుగులాడుచు నా బాలికం గూర్చి మ్రొక్కబెట్ట వారందు రానేలేదు. పిమ్మట నేమి చెప్పుదును? (కన్నీరుఁగార్చుచు) అక్కటా! అక్కటికి వాండ్రా దుష్టుగరర్తితోఁ మా తండ్రి శిరము పగులఁగొట్టి యా మూట లాగికొనిపోయిరి. నేను గోలుగోలున నేడుచుచుండనన్నుఁ బలవంతమున లాగి కొనిపోయి యొక గదిలోఁబెట్టి తలుపువైచిరి. బాబూ! నా యాత్రము మీతోనేమి చెప్ప కొందును. నన్నువాని కుమారునకుఁ బెండ్లి చేసికొనవలయునని తలంచి వెంటనే చంపింపలేదఁట. వినాయకుని కుమారుఁడు ముచ్చుల వెంటఁబెట్టికొని దోఁచికొన నూళ్ళ

మీదికిఁబోయి సంవత్సరమైనది. నా పుణ్యవశమున వాఁడింక నింటికిరాలేదు. ఎందైనఁ బట్టుబడెనేమోయని వెరచుచుఁజారిణులఁ బంపుచున్నాఁడ. నేను మొండిధైర్యముతో వారింటఁ వెలంగుచు బంధవిముక్తికై భగవంతుని ధ్యానించుచున్నాను. మీ రాకవిన్న జారిణులఁ బంపి జంపించును. వానికి దయాసత్యాశౌచములులేవు. ఎట్లు కాచికొని యెదరో అని చెప్పుచుండగనే ముఖరకుఁడు పెద్దయెలుంగున దుఃఖించుచు "హా సోదరీ! నేనే నీ యన్నను ముఖరకుఁడ. మాతాపితృద్రోహుఁడ. నా కతంబునఁ దలి తండ్రులు బలవన్మరణంబుఁ నొందిరి. నీ వొక్కట్టుల పాలైతివి" అని శోకింప నా పంకజముఖి యన్నం గౌఁగిలించుకొని విలపింపఁబొడంగినది.

శ్రీదర్శనుఁడు వారిని వారించుచు "మిత్రుఁడా! మనము మృత్యుముఖంబున నుండి మనుగూట మరచితివా? ఇది శోకింప సమయమా? ఈ యాపద దాటు తెరువాలోచింపవలయు. గత మునకు వగచుట సరగ్గి" మని పలికిన విని యతండు సోదరి నూరడింపుచు నామె వలన వాని చరిత్రమును సవిశేషముగా మరియుం దెలిసికొని కర్తవ్య మాలోచించి యిట్లుచేయమని బోధించి యా మించుఁబోఁడినింటికిం బంపివేసిరి.

నీటికడవ మోసికొని యింటికిఁ బోయిన యా వాల్గంటిం జూచి యా చండాలుఁడు "బోఁటి! ఏఁటికడ నింత యాలసించితివేమి? వేళ తెలియదా?" అని కసరుటయు నబ్బిసరుహాక్షి "మామా! ఎవ్వరో బాటసారు లిరువురు చెరువుకడ నుండిరి. వారిలో నొకఁడు చావసిద్ధముగా నుండెను. వానింజూచుటచే నాలస్యమైన" దని చెప్పియప్పుడఁతి లోపలకిఁ బోయినది.

వెంటనే వినాయకుఁడు కింకరుల రప్పించి "యోరీ! మీరింత తెలియకుండి రేమి? తెరువరు లెవ్వరో చెరువుకడ నున్నారఁట. వారికడ సొమ్మున్నట్లున్నది. వారిఁ గడతేర్చి సొమ్ముతెండు. వేగపొండని నియమించుటయు వాండ్రు దుడ్డుగఱ్ఱలఁ దీసికొని యా తటాకము కడకుఁ బోయిరి.

అప్పుడు శ్రీదర్శనుఁడు నీటియొద్దున బండుకొని మూలుగు చుండెను. ముఖరకుడు ప్రక్కం గూర్చుండి యంత్యకాలసత్క్రియలు చేయుచుండెను. దొంగలు వారి కురంగటకుఁ బోవుఁడు ముఖరకుఁడు వారింజూచి "బాబులారా! మీరెవ్వరు? ఈ ప్రాంతమున నేదియో యూరున్నట్లున్నది. ఇందు బ్రాహ్మణులున్నారా? ఈఁతడు నా సోదరుఁడు. మేము తీర్థయాత్రల తిరుగుచుంటిమి. ఇందు వీని కివసానదశ వచ్చినది. దగ్గరనున్న సొమ్మంతయుఁ బ్రాహ్మణాధీనము చేయఁదలంచు కొనియెను. పరిగ్రహింప నెవ్వరిలన్నఁ జెప్పుఁడు. మీకుఁ బుణ్యము రాఁగల" దని యడిగిన వాండ్రు మనంబులఁ జాలి నొందమ బ్రాహ్మణులున్నారు. వెంటనే యిందుఁ బంపెదము. మీ కడనున్న సొమ్మంతయు నిచ్చివేయుఁడని పలికి వాండ్రు వినాయకునికడ కరిగిఁ యక్కడి వారయంతయుం జెప్పిన బక్కడి నవ్వుచు నన్నవచనుఁడిట్లనియె.

ఔరా! ఇది యెక్కడి క్రమమురా వానిని జంపి ధనము తేక ధానము లందమనియెద రేల? మన కులాచారమును మరచితిరా యేమి. అని యడిగినవాండు "సామీ! ఊరక సొమ్ము లభించుచుండ జంపమనియెద రేమిటికి? ఒకండే రాత్రియే చచ్చును. రెండవవానిని రేపు మేము దారిం గాచి చంపగలము. నేడు మా యింట దేవపూజం దలపెట్టితిమి. జీవహింస యీ వేళ చేయంజాలము. నీవే పోయి దానము లందిరమ్మ"ని చెప్పి వాండ్రింటికిం బోయిరి.

అప్పుడు తప్పక తటాకనికటమున కరిగి "యిందు బాటసారులెవ్వరు? దానము లిత్తురంటి రెందున్నారు? ఇదిగో బ్రాహ్మణుండ వచ్చితి"నని కేక పెట్టుటయు విని ముఖరకుండు "ఇటు రండు ఇందున్నారము" అని పిలిచిన వాండు దగ్గిరకుం బోయి యిదిగో వచ్చితిని. మీకడ నెంత సొమ్మున్నది? అంతయు దానమిత్తురా? అనవుండు ఇత్తముగాని స్నానము చేసి రావలయునని నియమించెను.

చాలు చాలు! నీ చలివేళ స్నాన మెవ్వండు చేయంగలండు? మీ పుణ్యము బాగున్నది దానము లందవచ్చితిని. లేకున్న మీకుం బ్రిధానమే జరుగునని పలుకుచుండంగనే శ్రీదర్శనుండు తటాలున లేచి రమ్ము నీటికడకు రమ్మని పిలిచి నీటికడ గూర్చుండబెట్టి పాదంబులు గడుగువాడువలె నభినయించుచు రెండు పాదంబులుం బట్టికొని యెత్తి నీటిలో బడంద్రోసి గొంతుకమీదం గాళ్లం ద్రొక్కిపెట్టిన యిట్టట్టు కదలుచుండ ముఖరకుని సహాయముతో వానిని ద్రొక్కి ద్రొక్కి నీరు ద్రావి యుక్కిరిబిక్కిరిగాంగం గడియలో మడియంజేసెను.

ఆ తరి నెరింగి పద్మిష్టయు మెల్లంగ నా చీకటిలో నచ్చటికి వచ్చి వినాయకుండు హతుండయ్యెనని విని మిగుల సంతసించుచునాండు. దాయలం గాచువారు దేవపూజలో నుందురని యెరింగిన దగుట వారిని బొగడుచు ముందు దారితీసి నడచుచుండ వారిరువురు నామె వెనుకం బోవుచుండిరి. వారు తెల్లవారునప్పటికి పెద్దదూరము పోయిరి కాని యడవికిం దుది గనంబడలేదు.

మరునాండు సాయంకాలముదనుక నడచిరి. తెరపి కనంబడినదికాదు. చీంకటిపడినంత నయ్యడవిలోనే యొకచోం జిక్కిలంబడి కదలలేక క్షుద్వ్యాకులచిత్తులై ధ్యానించుచుండిరి.

అప్పుడు వారికిం గొంతదూరములోం బ్రదోషాగ్ని జ్వాలవలె నొకతేజము గనంబడినది. దానిని జూచి శ్రీదర్శనుండు మిత్రమా! ఆ ప్రాంతమం దేదియో గ్రామమున్నట్లున్నది. పద్మిష్ట యాహారము లేక చాలయలసి పోయినది మీరిందుండుండు. నే నందుంబోయి యన్నము యాచించి తెచ్చెదనని చెప్పి యతండా జ్వాల ననుసరించిపోయెను. అది దాపునలున్నట్లే కనంబడినది. కాని నాలుగు క్రోశముల దూరములో నున్నది.

చెట్టనక పుట్టనక త్రొక్కుకొనిపోయి పోయి యతండు కొంతసేపటికా తేజంబును సమీపించెను. అది జ్యోతికాదు రత్నమయమగు గృహములకాంతి జ్వాలలవలె మెఱయుచున్నది. అదియొక యక్షిణీ గృహము అందొక యక్షకాంత వేనవేలు యక్షులు సేవింప నందుఁ గాపురమున్నది. అప్పుడు యక్షులు లోపల భోజనము చేయుచుండిరి.

శ్రీదర్శనుఁడు చొరవగా లోపలఁజొరబడి యా యక్షిణియున్న తావునకుఁ బోయి తల్లీ! మేము ముగ్గుర మతిథులము వచ్చితిమి. మాకు భోజనము పెట్టవలయును. అతిథిని విడిచి కుడుచుట మహాపాతకముగాదా! అని చెప్పిన వాని మాటలు విని యా యక్షిణి నవ్వుచు నీ వెవ్వఁడవు? ఈ యర్ధరాత్రమున నిందెట్లు చేరఁగలిగితివి? నీ వృత్తాంతము చెప్పుమని యడిగిన నతండు తన వృత్తాంతమంతయుం జెప్పి దారి తప్పి యీ యడవిలోఁ బడితిమని యెఱింగించెను.

ఔరా! నీ పూర్వపుణ్యము మంచిది. ఈ యడవికి వచ్చిన మనుష్యుఁడు తిరుగఁ బోవుట యరిది. మా యక్షులందరు నే డిట సంతర్పణ భోజనము సేయుటకు నిందు వచ్చిరి. కావున మీ రీ యడవిలోఁ నిలువఁగలిగితిరి; లేకున్న నరుల నందుఁగడతేర్తురు. నీ సాహసమునకు మెచ్చుకొంటినని పలుకుచు నొక యక్షునిం జీరి చతుర్విధాన్నముల నొక పాత్రంబునఁ బెట్టించి యోరీ! ఈతఁడు మాకుఁ జుట్టము. వీని నీ భుజముమీఁద నెక్కించుకొని యా పాత్రతో వాని బంధువులున్న కడకుఁ దీసికొనిపోయి వా రాహారము కుడిచిన పిమ్మట ముగ్గురంగూడ మోచికొని తెల్లవారునప్పటి కీయడవి దాటించిరమ్ము పొమ్మని యాజ్ఞాపించినది.

శ్రీదర్శనుఁడు యక్షిణియాజ్ఞఁ దీసికొని యక్షిణి భుజమెక్కుటయు గడియలో నతని ముఖరకుని కడకుఁ దీసికొనిపోయి దింపెను. ముఖరకుఁడు వాని వృత్తాంతముఁ దెలిసికొని మిత్రుని స్తుతియింపుచుండ నా యక్షుఁ డా పదార్థముల ముగ్గురకుఁ వేరు వేరు పాత్రలో వడ్డించుటయు వారు తృప్తిగా భుజించి మూఁడుదినముల నుండి చేసిన యుపవాసమువలనం గలిగిన యాయాసమంతయుఁ దీర్చుకొనిరి. దేవపదార్థ భోజనమువలన సమృతపానము చేసినట్లు వారికి నక్కజమగు బల ముదయించినది.

వారు కొంత సేపందు విశ్రమించిన తరువాత యక్షుండు యక్షిణి నిర్దేశమెఱింగించి వారి ముగ్గురను స్కంధమున నెక్కించుకొని సూర్యోదయ మగునప్పటి కామహారణ్యము దాటించి యొక్క ప్రదేశమున విడిచి తదాజ్ఞఁగైకొని వెండియుఁ దమ యేలిక సమీపమునకుం బోయెను.

అని యెఱింగించునంతఁ గాలము మిగులుటయు మణిసిద్ధుం డవ్వలికథ తరువాతి నివాసదేశంబున నిట్లు చెప్పంబూనెను.

282 వ మజిలీ

# శ్రీ సేనుని కథ

వారు మువ్వురు హృదయాంధకారముతో గూడ బాహ్యాంధకారము వాసి దిక్కులు తెల్లనై నలుదెసలుఁ దెరపిగా గనంబడుటయు నప్పటికి తమ్ము బునర్జీవితులుగాఁ దలంచికొని జానపదికంబగు నా మార్గంబునంబడి నడచుచుఁ బదిదినములకు మాళవదేశ రాజధానియగు శోభానగరంబు జేరుకొనిరి. శ్రీ సేనుండను రాజప్పు డా దేశము బాలించుచుండెను. వారవ్వీటి నడివీథింబడి యుసగెంకుల నలంకరింపబడి యున్న సౌధపంక్తుల విలాసము లరయుచుం బోవుచుండ నొకభవన ద్వారము "ఇది సత్రము. ఇందు జూదరులకు మాత్రమే భోజనము పెట్టఁబడును" అని వ్రాయఁబడి యున్న ప్రకటన పట్టమును జూచి శ్రీదర్మనుఁడు నవ్వుచు ముఖరకున కిట్లనియె.

మిత్రమా! ఆ ప్రకటనపత్రికం జదివితివా? మన కెందును బూజ్యత లేదనుకొనుచున్నాము. ఇందు గలిగినది. లోపలకుఁ బోవుదమా అనుటకు ముఖరకుఁడు పోవకేమి? నేడు కడుదూరము నడిచివచ్చుటచేఁ బడ్కష్ట యలసియున్నది. జూదమునఁ జాల లాభము వచ్చిన కితవుఁ డెవ్వఁడో యీ సత్రము వేసెంగాబోలు. ఎట్లయిన లెస్సయే యని వానితోఁగూడ నమ్మమెక్కి జూదరులమని ద్వారరక్షకులకుఁ జెప్పి లోపలఁ బ్రవేశించిరి. సత్రాధిపతి వారింజీరి మీ రెవ్వరు? ఏయూరు? ఎందుబోవుచున్నారు? జూదరులగుదురా? అని యడిగిన ముఖరకుఁ డిట్లనియె. అయ్యా! మేము బ్రాహ్మణులము. దూరదేశస్థులము, జూదమాడి యైశ్వర్యమంతయు నోడిపోయితిమి. కూడుగుడ్డలు లేక దేశములపాలై తిరుగుచున్నాము. ఇందున్న ధూర్తులు కొందరు మమ్మెరిగియే యుందురు. అని నిదర్శనముతో దమ వృత్తాంతమంతయుం జెప్పుటయు నతండు నమ్మి వారికి భోజన మిడుటకుఁ బద్దు వ్రాయించెను. సుఖముగా భుజించుచుఁ గొన్ని దినములు వారందరు వసించిరి. అందున్న ధూర్తు లందరు పూర్వార్జితములగు గృహారామక్షేత్రాదుల జూదమున నోడిపోయి జోగులై వచ్చినవారే. వారిలో గొందఱు పేరు నెరింగిన వారగుట—

సీ. శ్రీదర్మనుఁడు - నీవు చెడితివే యేరీతి
బోయెనే నీ మంటపాసు లెల్ల
ముఖరకా! యీ జూదమున నెప్పు గెలిచితి
వేమయ్యె నా విత్త మెల్లఁ జెప్ప
నౌను వెండియు జూదమాడ [illegible]
వింటి - మీరాయూరు విడిచి [illegible]
నాళ్ళాయె నీ పట్టణమున [illegible]
షించు సత్రంబు [illegible] వచ్చి

గీ. నారొకో మంచిపని చేసినారు కడుపు
నిండఁ గుడువంగవచ్చు నిందుండి పీ
రెల్ల కితవులె మనకు స్నేహితులెయంచుఁ
బఱ్కరింపక విని సిగ్గుపడుచునారు.

వారికేమియుఁ బ్రత్యుత్తర మీయరైరి. మరియొకనాఁడు ముఖరకుఁడు సత్రోద్యోగితోఁ బరిచయము గలుగఁజేసికొని యల్లన నిట్లనియె

చ. జగమున బాధకృద్వ్యసనసప్తసుందన నష్టకేళి ఘో
రగతి దర్శితదేవతకు రంగధాత్రియటంచు సత్రముల్
దెగడుదు రట్టిధూర్తుల విధ్రక్రియఁ బూజ్యులఁ జేసి సత్రమిం
దగణితవిత్తులై నిలిపినట్టి మహామహు లెవ్వరో కదా.

సీ. కాశీ గయా ప్రయాగములు సేవించు యా
త్రాజనంబులకు సత్రంబు దగును
కుతపకాలమున కెక్కుడు కష్టపడి దారి
నడిచివచ్చెడువారు కడపు సత్ర
మఖిలంబువిడిచి సన్యాసులై సువిరక్తి
జరియించి జ్ఞానులకిరవు సత్ర
మును నిష్ఠతోఁ దపంబొనరించుచును వేళ
కరుదెంచుయోగుల కిరవు సత్ర

గీ. మంత్రియేకా దుష్టాత్ములగుచుఁ దాత
తండ్రులార్జించినట్టి విత్తంబులెల్లఁ
జూదమున నోడిపోయియే చొప్పులేక
యెసఁగుకితవులకీ సత్రమేల చెపుడ.

అని యడిగిన నతని సంప్రశ్నమునకు మెచ్చికొనుచు నా యద్యోగి వినుఁ డీదేశాధిపతి శ్రీసేనుఁడు పరమధర్మాత్ముఁడు. వదాన్యుఁడు వర్ణాశ్రమధర్మంబు లెరిగి పాలించును. అట్టి యుత్తమునకుఁ బూర్వకర్మ పరిపాకంబునంజేసి రాజయక్ష్మామయము రెండుసంవత్సరముల నుండి పీడించుచున్నది ఎట్టి వైద్యులకు నెట్టిమందులకు లొంగినదిగాదు. అతఁడు జలసన్నరణము నొందవలెనని ప్రయత్నింప నారుమాసముల క్రిందట నొక తాంత్రికుఁ డీ యూరువచ్చి రాజురోగంబు బరీక్షించి భేతాళ తంత్రమున నీ రోగము మొకదినములో గుదర్చగలనని శపథము చేసెను.

ధా తీసునకు జీవికాళజనింప నా తంత్రమెట్టిది ? కావలసిన సంభారము లేవని యడిగిన నా మాంత్రికుం డిట్లనియె అయ్యా, నేనొక రాత్రి స్మశానవాటికలో వసించి హోమ మాదిగాము గావించ నప్పుడొక సాహసికుఁడు నాకు సహాయము చేయవలయు నట్టి గట్టి గుండెవాని నొకని రప్పింపుడు ఇదియే కావలసిన

సంభారమని యతం డెరింగించుటయు నీ దేశములోనున్న పోటుబంటుల నెల్ల రప్పించి వానికి సహాయము చేయుమని కోరుటయుఁ గొంద ఱోపమని యొల్లరైరి. కొంద ఱొప్పుకొని యందుఁబోయి వెఱచరిచి గుండెపగుల శ్మశాన పాలైరి పెక్కండ్రు సాహసించి యా మాంత్రికునకు సహాయముచేయలేక మడియుటవిని యందుల కెవ్వరు నొడంబడకున్నారు. అప్పుడు మంత్రులు నృపతితో నాలోచించి లోకమున జూదరులవంటి సాహసికులెవ్వరుగారు. వారు భార్యాపుత్ర గృహక్షేత్రాదులఁ దృణముగా గణించి విడిచివేయుదురు. వారికి భయమను మాటయే లేదు. వృక్షమూలముల శయనింతురు. ప్రాణముల కాసపడరు. వారికిని యోగులకు నించుకయు భేదములేదు. కావున ధూర్తులఁ బ్రోగుచేసినచో నెవ్వడైన నిందులకు సహాయము చేయకి మానఁడు అని యనువదించి ప్రత్యేకము వారి నిమిత్త మీ సత్రమిందుఁ గట్టించిరి. ఇదివఱకు పెక్కండ్రా కితవులు వచ్చిరికాని సమర్థుడు గనంబడలేదు. మీతో నీ వార్త చెప్పుదమని తలంచుచుండ మీరేకారణ మడిగిరి. సంతోషమైనది. మీ రా సాధనకు సహాయపడి కార్య సాఫల్యము చేయఁగలరా? చేసితిరేని యర్థ రాజ్యము మీకు రాఁగలదు. ఆలోచించుకొని చెప్పుఁడని నొడివిన విని ముఖరకుఁడు శ్రీదర్శనుని మొగము చూచెను.

శ్రీదర్శనుండు చిరునగవుతో నందు మేము చేయదగిన సహాయ మెట్టిదని యడిగిన నంతయు ముందు మీకు సాధకుఁడు చెప్పగలఁడు. ఇష్టమున్న నిప్పుడే రాజునొద్దకుఁ బోవుదము రండు అనుటయు శ్రీదర్శను డిదియెంతపని యశ్రమముగఁ జేసి రాజుగారివలన మెప్పువడయుదమని దండ చఱచెను. ఆ యుద్యోగి శ్రీదర్శనుని యప్పుడే శ్రీసేనునికడకు దీసికొనిపోయి వాని యుత్సాహ మెరింగించెను.

శ్రీసేనుఁడు శ్రీదర్శనునిజూచి తదాకారవిశేషమున కచ్చెరు వందుచు వెంటనే సాధకుని నక్కడకుఁ బిలిపించి వీఁడు నీకు సహాయము చేయును. కర్తవ్య మేమియో యెరింగింపు మనవుఁడు సాధకుఁడు నేను కృష్ణచతుర్దశినాఁడు శ్మశాన వాటికలో భేతాళాహ్వానము గావించి హోమము చేయుదును. నీ వందువచ్చిన నప్పటి కృత్యము తెలిపెదను భయపడక తత్క్రియ నిర్వర్తింతువేని గడియలో ప్రభురోగము వాయఁ గలదు. భయపడితివేని నీకే ప్రాణహాని యగును. ఆలోచించుకొను మనవుఁడు నవ్వుచు శ్రీదర్శనుండు నే నించుకయు వెఱచువాఁడనుగాను మీ తంత్రము గావించుకొనుఁడు. చతుర్దశినాఁడు రాత్రి ప్రథమయామమున మీ రున్న శ్మశాన వాటికకుఁ రాగలను సందియములేదని చెప్పి రాజువలన నామంత్రణంబు వడసి వెండియు సత్రమునకువచ్చి యా వార్త ముఖరకున కెఱింగించెను.

అతం డా కథవిని మిత్రుఁడా! నీవు తొందరపడి యొప్పుకొని వచ్చితివి. అది చాల ప్రమాదాస్పదమైన పనియఁట. శవాధిష్ఠితుండైన భేతాళుఁ బట్టి తీసికొని రావలయునఁట ఆ భేతాళుం డనేక వికారముల బ్రకటించునఁట. ఒక్కొక్క

బొబ్బవెట్టిన నెంతవానికిని గుండెనిబ్బర ముండదఁట. ఆ బొబ్బలువిని యనేకులు మారిరఁట. పూర్వమెన్నఁడో విక్రమాదిత్యుఁడిట్టి సాహసము చేసెనని చెప్పుకొని యెదరు మన బోటుల కా పని శక్యమా పోవలదు పద్మిష్ట నిన్నుఁ బెండ్లియాడ వలయునని తలచుకొనియున్నది. నీ సాహసమువిని విచారించుచున్నది మరల బోయి ప్రతిరోధముచెప్పి రమ్మని పలికిన నవ్వుచు శ్రీదర్శనుం డిట్లనియె.

వయస్యా! కాలము చాలక నా కిట్టి దుర్దశపట్టినది కాని నేను పిరికితన మను మాటయే యెఱుఁగను. విక్రమార్కుఁడును మనవంటి మనుష్యుఁడే ఒకడు కాదు పదుగురు బేతాళులు బొబ్బలు పెట్టినను నేను బెదరువాఁడనుకానా తప్పక సాధకునికి సహాయముచేసి నృపతిని రోగశూన్యునిజేసి యర్ధరాజ్యంబు బడసెదంగాక నీవు విచారింపవలదు. పద్మిష్టకు ధైర్యము గఱపుము. అని పలుకుచు వారికి విస్మయము గలుగఁ జేసెను. అంతలోఁ గృష్ణ చతుర్దశి వచ్చినది. నాఁడు శ్రీదర్శనుఁడు స్నానముచేసి పీతాంబరధారియై ఖడ్గము హస్తమునందుదాల్చి రాత్రిపడినవెంటనే గుఱుతులుచూచుకొనుచు క్రోశదూరములోనున్న శ్మశానవాటికకు జనియెను. అందు—

సీ. పూడ్చిన శవముల నూడ్చి లాగితరంగ
కముల భక్షించు నక్కలను గనుచు
చితినుండిజారి భూగతమైన శవపక్కి-
యాడెడుకొఱవి దయ్యములఁ గనుచుఁ
గాలి పీకేల్లని ప్రేలు పుఱ్ఱెలశక
లములుమీఁదబడంగ లాచికొనుచు
గోమాయువులనోటి కుణపాంగములమీటి
బంతులాడెడు భూతపతులఁగనుచు.

గీ వె. పొకింతయులేక యా విప్ర సుతుఁడు
చంద్రహాసముచేఁబూని చటుల గతులఁ
దిరిగెనొక కొంతసేపునత్తెసల సంధ
కారమయమైన యా వల్లకాటియందు

అట్లు వీరుండొక్కరుండ శివారవ భైరవమై మహాధ్వాంతభీకరమై యొప్పు నా పితృవనంబునఁ జితాగ్నిజ్వాల వెలుఁగున దారిజూచుకొనుచుఁ బోయిపోయి యెట్టకేలకు సాధకుఁడున్నచోటు గనుంగొనియెను. అందా మాంత్రికుఁడును భస్మావలిప్త సర్వప్రతీకుండును శవకేశోపవీతధారియు ప్రేతన స్త్రోష్ణీషభూషితుండు ధృత నీలాంబరుండునై యొక చెట్టుమొదట వేదిగల్పించి హోమ పరికరంబుల సవరించు కొను చున్న సాధకుని కడకుఁబోయి నమస్కరించుచు మహాత్మా! నే నిదే వచ్చితిని. కర్తవ్యమును బోధింపుఁడని పలికిన సాధకుఁ డిట్లనియె

మహావీర ? ఇక్కడికి రెండు క్రోశముల దూరములో బశ్చిమముగా బోయిన కింశుపావృక్షము గనంబడును. దాని చివళ్ళు చితాగ్నిచే మాడియుండును. తన్మూలమున నొక కుణప ముండును. నలుగకుండ బుజముపై నిడికొని దాని నిక్కడికిఁ దీసికొని రావలయును. జడిసితివేని ప్రమాదము. ఇదియే నీవు చేయవలసిన పని యని చెప్పిన శ్రీదర్శనుం డరయుచు వెంటనే సాధకుఁ డెరింగించిన గురుతులు చూచికొనుచుఁ దిన్నగా నా వృక్షమూలమున కరిగెను. దాని మొదట నున్న శవము నప్పుడే మరియొకఁ డెవ్వఁడో బుజముపై నిడుకొని యేగుచుండెను. అదిచూచి యతండు పరుగెత్తుకొనిపోయి వాని సమీపించి ఆ నిలు నీ వెవఁడవు ? నే నుద్దేశించివచ్చిన శవమును నీ వెత్తికొని పోవుచుంటివేమి ? అని యదలించుచు వాని బుజమునుండి యా పీనుఁగును లాగెను. కాని వాఁడు దాని విడువనయ్యెను.

విడు విడు వీఁడు నా మిత్రుఁడు ఎక్కడికిఁ దీసికొనిపోయెదవు. వదలుమని బలవంతమున లాగిన వాఁడును వదలక వీఁడు నాకును మిత్రుఁడే. నే విడువనని గద్దించి పలికెను. ఆ విషయమై కొంతతడ విరువురకుఁ జగడము జరిగినది. అంతలో నా శవమున భేతాళుఁడు ప్రవేశించి ప్రళయ వలాహకంబు దంబున పెద్దబొబ్బ పెట్టుటయు నా ధ్వనివిని రెండవవాఁడు గుండెపగుల నేలంబడి ప్రాణంబులు విడిచెను.

శ్రీదర్శనుం డారొద కించుకయు జడియక యా శవమును భుజముమీఁద నెక్కించుకొని పోవుచుండఁ జచ్చిపడియున్న రెండవవాని దేహములో భేతాళుఁడు ప్రవేశించి యడ్డమువచ్చి యోరీ ! నిలునిలు. పోకు పోకుము. వీని నెక్కడికిఁ దీసికొనిపోయెదవు ? వీఁడు నా మిత్రుఁడు. వీనిఁ దీసికొని పోవనీయనని యాటంక పఱచెను. వీఁడు నీకు మిత్రుడెట్లయ్యెను. నిదర్శనము చూపు మనవుఁడు నీకు మిత్రుఁ డెట్లయ్యె నిదర్శనము చూపిన నేనును జూపెదనని వాఁడు చెప్పెను.

అప్పుడు శ్రీదర్శనుఁడు ఓశవప్రవరా ! నీవు మా యిరువురలో నెవ్వనికి మిత్రుఁడవో నీవే చెప్పుము అని యడిగిన శవముండిట్లనియె.

నాకిప్పుడు మీ యిరువురలో సరిపడినయాహార మెవ్వఁడిడునో వాఁడు నాకు మిత్రుఁడు. వానివెంట నేను బోయెదనని పలికిన విని రెండవవాఁడు నాకడ నాహార మేమియును లేదు అకలిప్పనది బుచ్చుకొనుమని చెప్పెను. అప్పుడు శ్రీదర్శనుఁడు ఇదిగో నీకుఁ దగిన యాహార మిచ్చుచున్నాను. గైకొనుమని పలుకుచు గలంబల మెత్తి రెండవవాని నెత్తిమీఁద వేయుటబోయిన నందలి భేతాళుఁడా శవము నంతర్ధానము నొందించెను.

శ్రీదర్శనుఁడు వానికై నలుమూలలు చూచుచుండ స్కంధశవస్థుడైన భేతాళుఁడేదీ ? నాకు సరిపడిన యాహార మిడుదునంటివి. పెట్టుమని యడిగిన నతండాలోచించి తనగాత్రముకోసి యిచ్చుటకుఁ బ్రయత్నించి కత్తియెత్తి నరుకుకొనఁబోవు

నంతలో భేతాళుఁడు ప్రసన్నుఁడై మహాసత్వా! నీ సాహసమునకు మెచ్చుకొంటిని. నీ దేహ మక్షతమగుగాక. నీకు వశుండనైతిని. నన్నెక్కడికిఁ దీసికొనిపొమ్ము. ఆ సాధకుఁడు స్వల్పసత్వుఁడు తుదిముట్టఁ గార్యము సాధింపఁజాలఁడు. అదియు నీవలననే కాఁగలదు. అనిపలికి యూరకుండెను

ఆ మాటలు విని సంతోషించుచు శ్రీదర్శనుం డాశవమును దిన్నగా నా మాంత్రికునొద్దకుఁ దీసికొనిపోయి స్వామీ! మీసెలవు ప్రకారము శింశుపాతరు నికటమునుండి శవమును దీసికొనివచ్చితి నదిగో చూడుఁడని పలికి దానిం నతనిఁ బ్రమోదింపెను.

ఆ సాధకుఁ డతని నభినందించుచు నంబోక పంచలము రక్తమున నలికి నరాస్థిచూర్ణమున ముగ్గులిడి వాని కోణముల నాల్గిట రుధిరపూరితములగు కలశములను నిచి తైలదీపమాలికల వెలిగించి యామండలము నడుమ నా శవమును వెల్లకితల బరుండబెట్టి రక్తమాల్యాను లేపనముల నలంకరించి పూజించి తద్వక్షస్థలంబున గూర్చుండి భేతాళునావాహనముచేసి తన్ముఖకుహరమున నస్థివినిర్మిత స్రుక్స్రువములచేఁ దంతో కరీతి హోమము చేయుచుండెను. శ్రీదర్శనుండు ఖడ్గహస్తుండై ప్రక్క నిలువంబడి యుండెను.

అట్టిసమయమున నా కుణపము నోటినుండి పెద్దజ్వాలయొకటి చటచ్ఛార వములతో బయలుదేరినది ఆ వేడిసైరింపలేక జడియుచు సాధకుడు శవోరస్థలము నుండి దిగి నిలువంబడి చేతులు వణక స్రుక్స్రువములు జారవిడచెను. అతని వెరపు గ్రహించి శవస్థితుండగు భేతాళుండు భైరవముగా నోరుదెరిచి యామాంత్రికుని సాంగోపాంగముగా మ్రింగివైచెను.

శ్రీదర్శనుం డా యుపద్రవమును చూచి హాహాకారము సేయుచు ఆ నిలునిలు సాధకుని మ్రింగితివేమి? ఇప్పుడు నిన్ను నరికివైచెదఁ జూడుమని ఖడ్గమెత్తి యాశవమును గొట్టబోయిన ప్రసన్నుండై భేతాళుండట్లనియె. మహాసత్వా! ఈసాధకుఁ డల్పసారుఁడు తంత్రవేది యయ్యు ధీరహృదయుఁడు గాడు. ఇప్పుడు ధైర్యచ్యుతుడగుట నాచే మ్రింగఁబడియెను. నీ సాహసమునకుఁ జాల ప్రీతుఁడనైతిని.

నా నోటినుండి బయలు వెడలుచున్న యీ యమృతాలు గైకొని నూరి యారాజు నొసలునకు నంటించుము గడియలో నతనిరోగము నివారించును. నీవు సార్వభౌముఁడగుదువని పలికిన విని శ్రీదర్శనుండిట్లనియె. భూతపతీ! సాధకుఁడు లేక నేనొక్కరుండ యింటికింబోయిన నేనే వానిం జంపితినని జను లనుమానపడకుందురా? సాధకుని నాకర్పింపుమని యడిగిన భేతాళుండు నవ్వుచు నార్యా! సాధకుండిఁక బ్రతుకనేరఁడు. నిన్నెవ్వరైన నిందించినచో నీ శవమిక్కడనే యుండును. వారిఁ దీసికొనివచ్చి దీనింగోసి చూపుము. దీనికడుపులో సాధకుఁడు యథాప్రకారము గనంబడునని చెప్పి స్వర్షపములిచ్చి భేతాళుం డంతర్హితుండయ్యెను.

శ్రీదర్శనుఁడు వెంటనే యింటికి వచ్చెను. అప్పటికి చీఁకటి గానేయుండెను. ముఖరకునిలేపి రాత్రి జరిపిన చర్యలన్నియుం జెప్పి యశని విస్మయసముద్రములో నీదులాడించెను. తెల్లవారఁగనే మంత్రి సామంతాదు లాస్థానంబునకువచ్చి శ్రీదర్శనుం జూచి సంతసించుచు సాధకుఁడు కార్యము సాధించెనా? వానికిఁ దగిన సహాయము చేసితివా? ఇదివఱ కతని వెంటఁ బోయినవారు తిరుగా రాలేదు. నీ వొక్కఁడవే యక్షతుండవై వచ్చితివి, అతండేఁడీ! నేఁటితో తంత్రము పూర్తియైనదియా యని యడిగిన విని విన్నదముతో శ్రీదర్శనుం డిట్లనియె.

అనఘులారా! సాధకుఁడా తంత్రమునుఁ బుస్తకములఁ జూచి నేర్చుకొని యెంగాని యిదివఱకు సొంతముగాఁ సాగించి చూచిన వాఁడుకాఁడు ఆ తంత్రము కడు భయంకరమైనది. భేతాళుఁడు చూపు భీషణక్రియలకు సామాన్యులు ప్రాణము లు నిలుపుకొనఁజాలరు. చెట్టు మొదటనుండి భేతాళావిష్టమగు శవమును వానికడకుఁదెచ్చుట సహకారులపని. పిమ్మట సాధకునిపని. ఇదివఱకు కరిగినవారు మొదటనే భయపడి యొదలు విడుచువారు. నే నతని యట్టహాసములకు జడియక కట్టి తీసికొనపోయితిని. కాని సాధకుఁడు హోమక్రియలో ధైర్యచ్యుతుండై భేతాళాధిష్టిత శవముచే మ్రింగఁ బడెయెనని యా వృత్తాంతమంతయుఁ నెఱింగించెను.

విని సామంతాదులు నయ్యయ్యో! సాధకుఁడే మడిఁగెనా. భేతాళునిఁ బెదరింపులకు జడిసెనా. అక్కటా! ఎట్టి యిక్కట్టువచ్చినది. వానిఁ మ్రింగుచుండ నీవుచూచితివా అని యడిఁగిన శ్రీదర్శనుఁడు నావెంత మీకుఁ జూపుదురండు. అని వారినెల్ల వెంటఁబెట్టికొని స్మశానవాటికకుఁ బోయెను. ఆ శవ మక్కడనే పడియున్నది. అప్పుడు కత్తికొనచేఁ దదుదరగోళము భేదించినంత—

క. గుడిలోని విగ్రహముకై
 పడి పెనుమందసము లోనివస్తువుగతి నాఁ
 జడదారి యొప్పెఁగుణపము
 కడుపున రుద్రాక్షభూతికలితాంగుండై.

వాని సాంగోపాంగముగా నందుచూచి సామంతులు హాహాకారములు సేయుచు విక్రమార్కతుల్యుండని శ్రీదర్శనుం బొగఁడుచు వెంటనే యింటికిఁ దీసికొనివచ్చి వాని శ్రీసేనునకుఁ చూపుచుఁ జరిఁగిన యుదంతమంతయుఁ సవిస్తరముగ నెరింగించిరి. తదానతి వడసి శ్రీదర్శనుఁడా యావాలుసూరించి యా గంధమా సరేంద్రుని యొసలున కాపాదమస్తకముగాఁ బూయించిన గడియలోనే జంఝావాత పాతంబునకు నెడిపోవు కాలమేఘ సమూహంబులు భంగి యా రోగవికారము లన్నియుఁ నటునటమైపోవుటయు శ్రీసేనుం డత్యంత హర్షపులకితగాత్రుండై శ్రీదర్శనుం గౌఁగిలించుకొని—

౭. ఓ సమతీతసాహసగణోత్తర! సన్నుతింపఁ గొందు ని
చ్చేసిన పార్వతీపతివొ శ్రీపతివో యటుఁగాక నీవు సం
త్రాసము కించెలేక నడిరాత్రి శ్మశాన శవంబు సాధకా
భ్యాసముఁ జేయ్పదే యటని యార్పులకోర్చితె మానవుండవే.

౮. సాధకుఁడు భూతతంత్రా
రాధకుఁడైనను వదంతరక్రియల నునో
పాధిఁ ధృతినిలుప లేక శ
వాధిష్ఠితుచేత గిలితుఁడై మడియఁడొకో.

**మహాత్మా!** నిన్నుఁ భగవంతునిగాఁ దలంతు. దుష్కరపిశాచ భయంబగు నా యాపదయంబు వాపి నన్ను గృతార్థుంజేసితివి. నేనపుత్రకుండనగుట నారాజ్యంబంతయుఁ నీకిచ్చివేసితి నీవుఁగైకొని పాలించుకొనుము. నేను దపంబుఁ సేయఁబోయెదంగాక నీ యాకారంబుచూడ మూఁడులోకంబు లేలఁదగిన వాఁడవని తోఁచక మానదని పొగడుచు శుభముహూర్తంబున శ్రీదర్శనునకు మహావైభవముతోఁ బట్టాభిషేకముఁ జేసి తాను తపోవనంబున కరిగెను. శ్రీదర్శనుండును సంప్రాప్త రాజ్యభారుండై ముఖరకుని మంత్రిగాఁ జేసికొని పద్మావతిం బెండ్లియాడి న్యాయంబున రాజ్యము సేయుచుండెనని యెఱింగించు నప్పటికి వేళ మిగులుటయుఁ దదనంతరోదంత మవ్వలి మజిలీయందిట్లు చెప్పం దొడంగెను.

283 వ మజిలీ

# మణి విగ్రహము కథ

ఆ శోభావతీనగరమున సుపేంద్రశక్తి యను వర్తకుఁడు గలఁడు. అతఁడు ద్వీపాంతరముల కరిగి రత్నవ్యాపారము సేయుచుఁ బెక్కుఁ ధనము సంపాదించి కోటీశ్వరుఁ డయ్యెను. బజారుసంఘములో మొదటి వాఁడుగాఁ బేర్కొనఁబడుచుండెను. ఆ వర్తకుఁ డొకప్పుడోడలమీఁద ద్వీపాంతరముల కరిగి మరలి వచ్చుచు నౌకరేవులో గాలికై యెదురు చూచుచుండ నింతలోఁ గొందరు వచ్చి యొక మణివిగ్రహముఁ దెచ్చి యమ్మఁజూపిరి.

పెద్దపచ్చపైఁ దేవీవిగ్రహము చెక్కఁబడియున్నది. ఆ ప్రతిమ మొదటఁజూచిన లక్ష్మివలెఁ బిమ్మటఁ బార్వతివలెఁ దరువాత సరస్వతివలెఁ గనంబడుచుండును. ఏ భావనతో దానిం జూచిన నా దేవి రూపందుఁ గానిపించును. ఆ రత్న మమూల్యమనియు దొంగవస్తువనియు వర్తకుఁడు తెలిసికొనియెను. దీనివెల యెంత? ఎందుండి తెచ్చితిరని యడిగిన వాండ్రు తప్పుబ్బులుగాఁ జెప్పుటయు నా వర్తకుండు వారి మనసు గ్రహించి బేరమాడుచుండెను. ఎంతసొమ్మైన నిచ్చి దానిం గొనవలయునని తలంచుచు వర్తకుఁడు

బేరమాఁడెను. ఎంతకైన నిన్ను వేయవలయునని తలంచుచు దొంగ లెక్కవబేరము చెప్పుచుండిరి.

చివర కాబేరి యేఁబదివేల బంగారు నాణెములిచ్చి యా రత్నవిగ్రహముఁ గొని యోడఁ ద్రోయించెను. కొన్నిదినములకు స్వగ్రామముఁజేరి మంగళాచరణ పూర్వకముగా నింటిలోఁ బ్రవేశించి యా కోమటి భార్యకా రత్నమునుఁ జూపుచు నిట్లనియె.

ప్రేయసీ! దీనిం జూచితివా? ఇంత పరిమాణముగల రత్నము మన దేశములో లేదు. దీని నేకముగాఁ గొను వారుండరు. శకలముగాఁ విడఁగొట్టి యమ్మిన దీనికి మూఁడుకోట్లు దీనారములు వచ్చును. ఈ పయనములో నాకుఁ గలిఁగిన లాభ మిదియే యని చెప్పిన విని యప్పడఁతి దానిం గైకొని యందలి దేవీ విగ్రహమును బరికింపుచు నిట్లనియె.

మనోహరా! ఇది వట్టి రత్నమనుకొంటిని. ఇందుఁ జిత్రమైన విగ్రహము చెక్కఁబడియున్నది. ఈ పని భూలోకములో నెవ్వరును జేయఁజాలరు. దీనిఁ విదఁ గొట్టఁగూడదు. దేవతార్చన పేటికలోఁ బెట్టి పూజించెద నా కీయుఁడని కోరిన నవ్వుచు నిట్లనియె. నీ యభిలాష యెంత యుచితముగా నున్నది. మూఁడుకోట్లు వెలగల వస్తువు పెట్టెలోఁ బెట్టి పూజింతువా? బాలుజాలు నిందలకే యే మాటయుఁ నాఁడువారికిఁ జెప్పఁగూడదందురు. అరువదివేలిచ్చి దీనిం గొంటి. నెలకెంత వడ్డీయగునో యెఱుంగుదువా? పో పొమ్మని మందలించిన నవ్వుచు నా జవరా లిట్లనియె.

మనకుఁ బిల్లలులేరు. కావలసినంత ధనమున్నది. ఇంకను సంపాదించి యేమిచేయుదుము? ఈ విగ్రహము కలకలలాడుచున్నది. దీని విదగొట్టిన గన్నులు పోఁగలవు. నేనుఁ బూజించుకొనుచుండెద నాకిందని కోరిన నతండు మొగమెఱ్ఱ చేయుచు ఛీ! యెప్పుడు నిట్టి యపశకునపుమాట లాడెదవు? ఇదివఱ కీలాటి విగ్రహము లెన్ని చిదియఁగొట్టితినో నీ వెఱుగుదువా? నీకు జెప్పితినా, పో పొమ్మని గద్దించి యప్పుడే సమ్మెటలతో రమ్మని పనివాండ్రకు వార్తలంపెను.

సానబట్టు రత్నపు పనివాండ్రు పెక్కండ్రు వచ్చి యా విగ్రహమునుఁ జూచి యాశ్చర్యపడుచు దాని ముక్కలుగా గొట్టుమని చెప్పిన మాటలు విని కటకటం బడుచు నిట్లనిరి.

ఓహోహో! ఇది కేవలము రత్నఫలకము కాదు. ఇందుఁ జక్కని దేవీ విగ్రహము చెక్కఁబడియున్నది. ఇట్టి పని మేమిదివరకు చూచి యెఱుంగము. దీని విదగొట్టుటకు మాకు జేతులురావు. దేవతా ద్రోహము సేయుట పాపము కాదా! దీనిం బూజింపుచుండుఁడు. అని పలికినవిని యాబేరి పిఱికిపందలారా! మీకు గూడ భయమగు చున్నదా ఆ సమ్మెట యిటు దెండు అని సమ్మెట నందుకొని దాని వాటము చూచి కొట్టబోయినంత వాని రెండుకన్నులుం బోయినవి.

అతం డట్లంధుఁడై సమ్మెట నేలఁబాఱవైచి కన్నులు నులిమికొనుచు నయ్యో! నా కేమియుం గనఁబడుటలేదు కన్నుల నలకలు పడినవేమో చూడుమని భార్యం బిలిచి చెప్పుటయు నప్పడఁతి యద్దము తెచ్చి చూపించుచుఁ గన్నులలో నేమి యును లేదు గ్రుడ్లు తెల్లఁబడి యున్నవని చెప్పిన నలుగుచు నతండు నీవు మొదటనే కన్నులు పోవునని పేరు పెట్టితివి. నీది విషపునోరు. ఇప్పుడేమి చేయుమనియెదవో చెప్పు మనవుఁడు నామె భయగ్రస్తమైన నవ్వుతో నిట్లనియె.

మీరు నా మాట వింటిరా? నేను జెప్పినట్లె జరిగినది. అట్టి దేవీ విగ్రహమును విడఁగొట్ట మీకు బుద్ధి పుట్టించిన వానిం దిట్టవలయు గదా! మంచి ప్రాయశ్చిత్తమైనది. ఇప్పుడైన నేను జెప్పినట్లు విందురా అనవుఁడు నలుగుచు నదేదియో వేగము చెప్పుము తోచకున్నదని పలికిన నాకలికి యిట్లనియె. చెంపలు వాయించుకొనుఁడు సాష్టాంగ నమస్కారములు చేసి యపరాధము చెప్పికొనుఁడు ఎల్లకాలము నింట నుంచుకొని పూజింతుమని మ్రొక్కికొనుఁడు. అని భర్తచే మ్రొక్కించ చేతులు జోడించి తానిట్లు వినుతించినది.

శా. దేవీ? నా పతి వట్టి మూఢుఁడు భవద్దివ్యప్రభావంబు నా
దేవేంద్రాదు లెఱుంగ లేరనిన మాదృఙ్మూఢచిత్తుల్ భవ
ద్వ్యావృతాత్మకు లెటెఱుంగుదురు ద్రవ్యాశన్ భవద్రూప ము
ద్రా విచ్ఛేదము సేయఁబూనె పతి మా తప్పుల్ క్షమింపందగున్.

చ. తనయులు సేయునట్టి పెనుతప్పులు నొప్పులుగా గణించి నం
దను కపియించునే జనని తావకపాదసరోజయుగ్మమే
ననయము గొల్చుచుందు సువర్ణపేటికఁ బెట్టి భక్తితో
ననుఁ గరుణించి నా మగని నేత్రములం దయచేయు మంబికా!

అని భక్తివివశయై ప్రార్థించిన నద్దేవి యా యిల్లాలియందుగల ప్రేమాతిశయంబునం జేసి యా వర్తకునికిఁ గన్ను లిచ్చినది. అతం డట్లు సంప్రాప్తదృష్టి యుగళుండై సంతుష్టి నొందుచు నా రత్న విగ్రహము నుంచుటకు భార్య కనుజ్ఞ యిచ్చెను. ఆ సతీతిలక మా విగ్రహము కొక రమ్యపీఠము చేయించి యందుంచి యను దినము రెండువేళలయందు భక్తి విశ్వాసములతోఁ బూజించుచుండెను. అట్లు కొన్ని దినములు జరిగినంత నొకనాఁ డా వర్తకుం డాత్మగతంబున-

సీ. అయ్యయో ఈ విగ్రహంబు నేవేళ నిం
టికిఁ దెచ్చినానొ యన్నియును వెతలె
అరువదివేలు ద్రవ్యచ్ఛేదమైపోయె
దాని వడ్డి కాసైనరాదు

పై పెచ్చు నా భార్య ప్రతిదినంబును దీప
ధూపనైవేద్యాది రూపకముగ
వేంకవేలుగా వెచ్చపెట్టుచునుండె
వలదనినంత గన్పడవు కన్ను

గీ. లేమి సేయుదు నాకు దిక్కెవ్వరిఁక
నీ మహావ్యయ మడగింప నే యుపాయ
మరయ నిట్లున్న నాధనంబంతయును నా
కింతకాలములో నశియించుఁగాదె.

అనుదినం బతం డాధనవ్యయమునకై వగచుచుండ నొక దావర్తకుని భార్య భర్తకు నమస్కరించుచు మనోహరా! నాకు రాత్రి స్వప్నములో నీయమ్మవారు గనంబడి చిరంటీ! మీ యింట నాకిడుచున్న నైవేద్యాద్యర్చనలు చాలకున్నవి. కావునఁ బ్రత్యేకము గుడి గట్టించి యందుఁ బ్రవేశపెట్టి యెక్కువగాఁ బూజావిధులు జరుగునట్లు చేయింపుము అని యాజ్ఞాపించినది. మనయింట రెండవ విస్తరి లేదు. ఈ పూజ యామెకుఁ జాలకున్నదఁట గుడిగట్టుట సప్తసంతానములలో నొకటి కావున నట్టి పుణ్యకార్యము సేయుఁడు మీరు తరింపఁగలరని చెప్పిన విని కటకటంబడి యతం డిట్లనియె.

నా కీ యాపదలన్నియు నీమూలముగ వచ్చుచున్నవి. నీ శీతంబున నమ్మవారు నన్ను లోకువచేయుచున్నది. గుడికట్టి ప్రతిష్ఠచేసి యర్చకుల నియమించుట సామాన్య మనుకొంటివా? ఆ పని మనము చేయఁజాలము మరియు నింకొక ప్రమాదమున్నది. ఈ మణిని నేను దొంగలమ్మగా గొంటిని. విడఁగొట్టినఁ బట్టికొనలేరు గదాయని యూహించితిని. అట్టి పని జరపుట కాటంకము గలిగినది. దీనిం బ్రత్యేకము గుడిగట్టి ప్రతిష్ఠించినచో వెల్లడి కాకమానదు. ఈ విగ్రహ మేదేశాధిపతిదోఁ కావలయును. ఇందున్న వార్త విని యారేడు వచ్చి యిది యెట్లు వచ్చినదని యడిగిన నేమి చెప్పుదును. దొంగవస్తువు కొనుటయు దప్పే. అప్పు డపరాధినగుట నన్నుఁ జెరసాలం బెట్టింతురు. ఈ చిక్కులన్నియు నాఁడువాండ్రకేమి తెలియును? గుళ్ళనియు గోపురములనియు బూజలనియు గోలపెట్టుచుందురు. కావున గుడి కట్టుటకు వీలులేదు. ఒక యుపాయ మపాయరహితమైనది యాలోచించితి వినుము.

మనరాజు శ్రీసేనుఁడిప్పుడీ రాజ్యమంతయు శ్రీవర్మునఁడను విప్రకుమారున కిచ్చి పట్టాభిషేకము చేసియున్నాఁడు. ఈ యూరనున్న భాగ్యవంతులందరు నాయువరాజునకుఁ గానుకలు విశేషముగా నిచ్చుచున్నారు. నేనీమణివిగ్రహమును గానుకగా నీయఁదలచుకొన్నాను. మనపీడ వదలిపోవును. అమ్మవారు గుడిగోపురములు గట్టింపు మనియతనిం బీడింపఁగలదు. అని చెప్పిన నప్పడఁతి యిట్లనియె.

ఔరా! నీ లోభిత్వము కడునీచమై యున్నది. అమ్మవారు కలలో స్వయముగా వచ్చి గుడి గట్టింపుమని కోరిన నంగీకరింపకుంటివి. ఇంతకన్న నవివేకమేదియైనం గలదా? ఈ కోట్లన్నియు నీయనంతరమేమగును. ఎన్నినాళ్ళు బ్రతుకుదుము. సంపదలు వెనుకవచ్చునా? అయ్యయో! నీ యనంతరము మీసొమ్ము రాజుపాలు కాగలదు. అంతకంటె మనకు యోగము లేదు. మీ యిష్టము వచ్చినట్లు చేయుడు అని కసరి విసిగికొని యమ్మహాసాధ్వి యవ్వలఁబోయినది.

వర్తకుఁడు భార్యమాట పాటిసేయక యొకనాఁ డామణివిగ్రహమును బల్లకిలోఁబెట్టి యూరేగింపుచుఁ దీసికొనిపోయి యాస్థానగతుండైన శ్రీదర్శనునికి సమర్పించుచు నిట్లనియె.

రాజపుత్రా! ప్రజల పూర్వపుణ్యమున ధర్మస్వరూపులైన దేవరవారు మాకుఁ బ్రభువులైరి. భవదీయ సాహసపరాక్రమాదిగుణములు విక్రమాదిత్యునిఁ బోలి యున్నవని యిదివఱకే వాడుకపోసినది. ఇట్టి మీకు నవరానాగా నిచ్చుటకు దగినవస్తు వేదియని యాలోచించితిని. కేవలము మణిమంతనాదులు దేవర లెక్కసేయరని తలంచి పూజాహరమైన యీమణిదేవీవిగ్రహము దీసికొనివచ్చితిని. దీని నేను ద్వీపాంతరముల నుండి కొనితెచ్చితిని. దీనికి వెలగట్టుట దుర్ఘటము "రత్నప్రియాః పార్థివాః" అను నార్యోక్తి ననుసరించి దీని బరిగ్రహింపఁ గోరుచున్నానని యుక్తియుక్తముగాఁ బలికిన శ్రీదర్శనుండు దర్శనీయమైన యావిగ్రహమందుకొని వానినభినందించుచు నిట్లనియె.

ఓహో! ఈ విగ్రహమును జెక్కిన మహానుభావుం డెవ్వఁడోకదా! త్రిమూర్తుల భార్యలస్వరూపములు నిందుఁ బొడకట్టుచున్నవి. ముఖరకా ఇటుచూడుము.

సీ. ఒకపంక్తిఁ జూడు సబకరభాసురమైన
భార్గవీదేవిరూపంబుదోఁచు
గనుపించు నొకదాయఁగన వల్లకీపుస్త
కస్ఫురత్పాణియు గ్వాణిగాఁగ
నడుమవీక్షింప వినాయకాంచితపార్వ
తీస్వరూపముగాఁగఁదెలియఁబడెడు
గజతుండమును బుస్తకము వీణ పద్మనా
లాదులుమాఱియాయాస్వరూప
గీ. ములకుఁజిహ్నలుగాఁదోఁచు ముద్దుగులుక
బాహువులు గాత్రములు దిద్దఁబడియెనీని
గడకనిర్మించె నావిశ్వకర్మగాక
యొరులకిటుసేయశక్యమే యువ్వియందు.

అని మెచ్చుకొనుచు నట్టి వస్తువిచ్చినందులకు నావర్తకుని వితరణము గొని

యాడుచు శ్రీదర్శనుఁడాలోచించి మూఁడురూపములకు మూఁడుగ్రామములు దనదేశములో వాఁడుకోరికొనిన నిచ్చి యట్లుపట్టము వ్రాసి యావర్తకు నంపెను.

ఆ వేరి మఱియును నింటికింటోయి యాపట్టము భార్యకుఁ జూపి ప్రేయసీ! నావంటి తెలివిగల వాఁడెవ్వఁడైన గలఁడా? నీమాటవిని మణివిగ్రహమునకు గుడిగోపురాదులు గట్టించిన ధనవ్యయమేకాని లాభ మేమియున్నది. అప్రత్యక్షమైన మోక్షము మాటనమ్మి ప్రత్యక్షధనము వ్యయపఱచుట యవివేకము. తమకుఁదానధర్మములు సేయరని యట్టి ప్రసంగేసినారు. బ్రాహ్మణులు వారికిభిక్షకలకు నేనువెఱతునా? నేను చేసిన యూహవలన మూఁడుగ్రామంబులు వచ్చినవి నాని వలన మూఁడులక్షలాదాయము రాఁగలదు. నేనిచ్చిన సొమ్మునకు వడ్డీతోఁ బదిరెట్లెక్కువవచ్చినది తెలిసికొంటివా? అనిచెప్పిన నమ్ముదిత నవ్వుచు నిట్లనియె

పాపాత్ముల కట్టి మంచియూహలు పుట్టునా? పరమ ప్రత్యక్ష మంటివి ప్రత్యక్షమైన యిహమున మీరెంతకాలము వసింతురో మీ తాతతండ్రు లెంతకాలముండిరో యప్పుడేమైరో మీరేమైనం దెలిసికొంటిరా? దానధర్మములు సేయనిలోభులు చచ్చినప్పు డాసంపదల నిందునిడిచిపోయిరా? వెంటఁదీసికొనిపోయిరా? ఇంచుకవిచారించినఁ దెలియదా? పోనిందు గ్రహచారముచాలక యావిగ్రహముమీచేతంబడినది. ఆ దేవి కీలినాటికిని వదలనది. ఇఁక సమస్తభోగములు సందగలదని ప్రతికూలముగా సంభాషించినది.

శ్రీదర్శనుఁడు వెంటనే సంప్రోక్షణముచేయించి యామణివిగ్రహముఁదన దేవతార్చన పేటికలోఁ బెట్టి యర్చించుచు మఱియు

క. తనకోట కెదురుగా మణి
కనకవికారముగ దేవ్యగారము ప్రాకా
రనవసుగోపురమంటప
కనకధికద్వారయుతముగాఁగట్టించెన్.

సీ. శుభ ముహూర్తమున బల్విభవ మొప్పంగ న
ద్దేవి నాగుడిని బ్రతిష్ఠచేసి
నిత్యభోగంబులు నిత్యోత్సవములకై
మూఁడువేల్గ్రామముల నొసంగె
సంగీతపాఠ కస్వస్తివాచిక తూర్య .
వాదక వేశ్యాదివర్గములకు
వసతులవేర్వేర నొసంగె నెంతయుగొప్ప
సత్రంబుగట్టించి సంతతంబు

గీ. వచ్చిపోయెడివారి కవ్వారిగాఁగ
నన్నదానము జరిగెడు నట్టులేరు

పరచె శ్రీదర్శనుండు భక్తి వెలయుఁ
గొలుచు మున్వేశదేవి కోవెలకుఁబోయి.

అమ్మణిదేవి విగ్రహంబు సేవించినవారికి కోరికల దీర్చునని వాడుక ప్రోగుటచేత నచిర కాలములో నది కాశీరామేశ్వరములకన్న నధిక క్షేత్రంబై నిత్యము తైర్థికుల రాకపోకలచే సమర్థముతో నొప్పుచుండెనని యెఱింగించుచునప్పటికిఁ గాలముమిగిలినది. అవ్వలికథ మణిసిద్ధుం డవ్వలిమజిలీ యందిట్లుచెప్పం దొడంగెను.

284 వ మజిలీ

# అనంగలతికకథ

శ్రీదర్శనుం డొకనాఁడు ప్రాతఃకాలమున నిత్యకృత్యముల నిర్వర్తింపకుండగనే ముఖరికునకు వార్తనంపుటయు నతండత్యావశ్యకమైన పనియేమివచ్చినదియో యని తొందరపడుచు నృపతినికటమునకుం జనియెను.

దూరమునందె మిత్రునింజూచి నవ్వుచు వయస్యా! రమ్మునీవు చెప్పిన కథలోని భూసంపన్నునకుంబోలె నాకునుం జరిగినది నా మేని భూషణంబులం జూచితివా?

క. హారంబులు ప్రావణాలం
కారంబులు నుంగరములు గంకణములు మం
జీరములిట్టివి నేసిం
గారించుకొనంగ నీవుగంటివె చెప్పుమా.

ఇట్టివిచిత్రములు కథలలోఁ జెప్పికొందుముగాని ప్రత్యక్షముగాఁజూచి యెరుగము. ఈ విచిత్రగాథ వినుము. నిన్నరాత్రి శుక్రవారమగుట మనము దేవీమందిరమునఁ జాల ప్రొద్దుపోవువరకు వసించి యర్చనావిశేషంబులఁజూచి ప్రసాదముగైకొని యింటికిం బోయితిమి గదా! నేను వెంటనే పండుకొంటి గాఢమైన నిద్రపట్టినది. తరువాత చిత్రము వినుము.

నేనొక దివ్యమైన యంతఃపురమున కరిగితిని. ఆ యింటియలంకారములు భూలోకములో నెప్పుడుగూచి యెఱుంగము. ఇంద్రభవనమని తలంపనగు నందు రత్నములే దీపములగుచు వెలుఁగుగలుగఁ జేయుచున్నవి.

ఆగదిశోభ వర్ణించినఁ బదిదినములుపట్టును. చంద్రకాంతశిలాఘటితమగు నా మందిరమున హంసతూలికా తల్పంబున నొక పూఁబోడి గాఢనిద్రచెందుచున్నది, ఆయన్నుమిన్న సోయగము వాక్కులచే వర్ణింపఁజాలను. పోలికయంతయుఁ గన్నులకు గట్టినట్లున్నది. అనక చిత్రఫలము ప్రాసినీకుఁజూపెదఁగాక తరువాత కథ వినుము.

ఆగది నలుమూలలు పరికింపుచు విస్మితవిభ్రాంతస్వాంతుండనై యిట్లు తలంచితి. ఔరా! నేనెక్కడ పండుకొంటి? నీగది యెక్కడిది? ఈ జవ్వని యెవ్వతియ? ఇది కలయా

సిక్కువమా! ఇట్టి కలవచ్చునే? యు నదృష్టమే నే నాలసించితినేని మేలుకువవచ్చి యాకల యంతర్ధానము నొందునేమో ముందుగనే యీ సుందరిని లేపి ముచ్చటించెదంగాక అని తలంచి మెల్లగ దాపునకుంబోయి చేతిలో మేనంటి వాల్గంటీ? లెమ్ము లెమ్ము అని పిలిచినంత నా నెలంత యులికిపడియట్లే లేచినది.

సంభ్రమము ప్రశ్నచేం బొట్రుపాటు గనిపింప నీ వెవ్వండవు? దుష్ప్రవేశమైన యీయంతఃపురాంతరమున కెట్లువచ్చితివి? నీ వృత్తాంతము చెప్పుమని యడిగిన నే నేదియో చెప్పితినికాని జ్ఞాపకములేదు. ఆ చిన్నదియు దన వృత్తాంతము చెప్పినది. అదియు జ్ఞాపకములేదు. తరువాత నాయువతీతిలకము నాకుంగావించిన యుపచారములు చాలగలవు. వానినటుండనిమ్ము. తానా శయ్యం డిగ్గి నన్నందుం గూర్చుండంబెట్టి యది తన దేశాచారమని తెలుపుచు దనతొడవులన్నియు నాకుందొడగి నామేనిభూషలు తాను తొడిగించుకొన్నది ఆ తొడవు లివియే చూడుము. ఈ యంగనాంగమాసంగనయన పూసినదియే యెట్లుపరిమళించుచున్నదియో చూడుము. ఇది స్వప్నము కొంతసేపే నిలుచును. అనిభయపడుచుం గ్రీడాభిరతుండనగుట వేగిరించుచుండ నింతలో వైతాళికుల మేలుకొలుపులు వెలింబడినవి. అంతలో లేచితిని యేదియు గనంబడదు. అప్పటినుండియు నీవు చెప్పిన భూనందనునికథ స్మరించుకొనుచు నీకువార్త నంపితిని. ఇది కలయో! మాయయో! నీవేగ్రహింపుమని పలికిన విని ముఖరకుండిట్లనియె.

ఇట్టి చోద్యములు కథలలోం జెప్పుకొందుముకాని ప్రత్యక్షముగాం జూచి యెరుంగము. భూనందనునివోలె నీవుగూడ నాచేడియం గూడెదవేమో భవితవ్యత యెవ్వరెరుంగుదురు? ఈ యంగరాగము పోవునని స్నానము మానితిని కాంబోలు కడిగినను నిది వదలునట్లులేదు. ఈనగలంగల మణులరత్నములు నీనగలకన్న నివియే యెక్కువ వెలంగలవి నీకు మంచిలాభమే కలిగినది. ఇంక నా భ్రాంతి విడువుము పెండలకడ భుజంపుము, ఈ స్త్రీభూషణముల విడువుము. పరులుచూచిన నవ్వుదురని పలికిన నతండట్లే చేయుదునని చెప్పెనుంగాని యాగడిసింగారము ఆ పర్యంకవిశేషములు ఆ సౌందర్యాతిశయము ధ్యానించుచు నాండెల్ల నెవ్వరితో ప్రీతిగా మాటాడదయ్యెను.

భోజనాంతర మా స్థానమునకుంబోవక సముచితవేషముతోం గాలక్షేపార్థము దేవి మందిరమునకరిగి యచ్చటికి ముఖరకుని రప్పించుకొని తన్ముఖమంటపమునం గూర్చుండి భజనసేయుచున్న భక్తుల సంగీతకీర్తనల నాలింపుచుండెను.

అంతలోం బ్రతీహారి వచ్చి యెవ్వడో యోగి దేవరతో నేదియో చెప్పుకొనుటకై యోలగమున కరిగెనట. అటనుండి యిందుండిరని విని యిక్కడికి వచ్చెనట ప్రవేశమునకు సెలవే యనవుడు యోగులకు సెలవేమిటికి ప్రవేశపెట్టుమని యాజ్ఞాపించెను. ద్వారరక్షకుండు వెంటనేపోయి వానిందీసికొనివచ్చెను. అంబొక వ్యాఘ్రచర్మము పరచి యందుంగూర్చుండ నియమించి వాజ్ఞప్రభాను లిపుపుచు నమస్కరించి యాగమ కారణంబడిగిన నా తపస్వి యిట్లనియె.

మహారాజా! నా కాపురము మణిద్వీపము. నాలుగు సముద్రములుదాటి యా దీవికిం బోవలయు. అనంగచంద్రుఁడను భూపుంగవుఁడా ద్వీపమును బాలించుచున్నాఁడు. నేనతనికిఁ బురోహితుండ, గురుఁడ, మిత్రుఁడ, సమాత్యుండనై యుండు నారాజచంద్రున కనంగలతిక యను కూఁతురుగలదు. త్రిభువనాశ్చర్యకర సౌందర్యంబునం బ్రకాశించు నమ్మించుఁబోఁడి దేవతాభక్తి యేతన్మాత్రముకాదు. అభీష్టదేవతానుగ్రహమువలన నొక మణిమయవిగ్రహము సముద్రతీరమున విహరింపుచుండ నామెకు దొరికినది. త్రిమూర్తి గృహిణీ స్వరూపమున వెలసియున్న యాయంబను నిత్యమారంభోపచారముల త్రికాలములఁ బూజింపుచుఁ బాటలు పాడుచు సయ్యదర్శనమే కృత్యముగాఁగ గాలక్షేపము చేయుచుండెను. సంవత్సరము క్రిత మాతలోదరి యంతఃపురమునకుఁ గన్నము వైచి దొంగలా విగ్రహము నెత్తికొనిపోయిరి. నాఁటనుండియు నాబోఁటి యన్నము తినదు. నిద్రపోవదు. అద్దేవిదొరకువఱకు నుపవాసము లుండుదునని శపథము చేసినది. గురుజన నిర్బంధమునఁ బ్రాణదానమునకై ఫలహారము చేయుచున్నది. ఆమెతండ్రియు విగ్రహముఁదెచ్చినవారికి నిబ్బడిగా ధనమిత్తునని దేశమున బ్రకటించుటయేకాక నానాదేశములకుఁ జారులనంపి వెదకింపుచుండెను.

ఆ కన్యక యొకనాఁడు నాకు నమస్కరింపుచుఁ దండ్రీ! నా ప్రాణబంధు వెందున్నదియో తెలియదు. చాల తిరిగినను లంచములుగొని విడిచివత్తురు. మీరు దేశము లరిగి పరికించి నాయంబను దీసికొనిరాఁ గోరుచున్నాను. మీరుదలంచిన నా చాడ దెలియక మానదని నన్నుఁ పెద్దగా నగ్గించినది. తండ్రిచే జెప్పించినది.

హరిమాట త్రోయలేక బయలుదేరి ప్రాంతదీపములన్నియు బరికించి క్రమంబున జంబూద్వీపమునకువచ్చి యిందుగల దేశంబు లన్నియు దిరిగితిరిగి హరిద్వారంబున మీరు ప్రకటించిన పత్రికలం జదివికొని యది మా విగ్రహమేయని నిశ్చయించి యత్యాతురతతో నిందు వచ్చితిని. మా రాజపుత్రికచే బూజింపబడుచున్న మణివిగ్రహ మందుఁజూచితిని దీనిందెచ్చిన వర్తకునితో మాట్లాడితిని కృతార్థుండనైతిని మీదర్శనముచేయ నోలగంబున కరిగితి దైవికముగా నిందున్నారని విని యిందువచ్చితి నిదియే నా వృత్తాంతమని యెరింగించెను.

ఆ యుపన్యాసమువిని శ్రీదర్శనుండు ముఖరకుని మొగము చూచుచు యోగీంద్రా! ఈ దేవతావిగ్రహమును కొండెదికాలము క్రిందటనే యిందు బ్రతిష్ఠచేసితిమి. అచిరకాలములో నిది పుణ్యక్షేత్రమైనది. మీ రాజపుత్రికతో నీ వార్త చెప్పుడు. తాను బూజించు దేవతను లోకమంతయు బూజింపుచుండ కంతకన్న సదృష్టమేమి? ఈ వైభవమంతయు విని యా కాంత మిక్కిలి సంతసింపగలదు. ఈ విగ్రహసంబంధము నంబట్టి మీ రాజుగారు మాకుఁ జుట్టములైరి. వారిక్షేమము తరచు తెలియఁబరచుచుండగోరెదను. మరియు నీక మూలమున మీ యట్టిమహానుభావుల దర్శనమైనది. మేము కృతార్థులమైతిమని యుక్తియుక్తముగా బలికినవిని యా యోగి యిట్లనియె

ప్రభువర్యా! మీమాటలు క్రియాశూన్యతను సూచింపుచున్నవి. మీరీవిగ్రహమును స్థాపింతురుగాక దీని దొంగలెత్తుకొనివచ్చి మీ యూరిపెరకున కమ్మిరి. ఇది చౌర్యవస్తువైనది. దీనం దాచుట చట్టమునకు విరుద్ధము కాదా! దీని మా రాజపుత్రిక పూజించుచున్నట్లు బలమైన సాక్ష్యము చూపింతుము. మాది మా కిచ్చివేయుడు. ఇందు మరియొక విగ్రహమును స్థాపింపుడు. అట్లుచేసిన మీకును మా రాజునకును బంధుత్వ మొప్పునని చెప్పిన శ్రీదర్శను డిట్లనియె.

యోగీంద్రా! ఆకమతంత్రమునఁ బ్రతిష్ఠింపబడిన దేవతా విగ్రహమును గదలింప నెవ్వరితరము! ఇది మా కొంపయికంటఁగాని చౌర్యముఁగాదు ప్రాడ్వివాకు లీవిషయము విమర్శింతురుగాక. ఇంతకన్న మీ కేమియు బ్రత్యుత్తర మీయఁజాలమను టయు నా సన్యాసి యిట్లనియె.

రాజపుత్రా! నీకంటె బ్రాడ్వివాకుఁ డెవ్వఁడు? మా రాజపుత్రిక దీనికై నిద్రాహారములుమాని పరితపించుచున్నదని చెప్పితిని. అందులకు మీకు జాలి యేల గలుగలేదు. అబలయెడ గనికరముంచవలదా? దీని మీ రీయకున్న స్త్రీహత్యాపాతకము రాగలదు. ధర్మము విచారించి చెప్పుడని యడిగిన శ్రీదర్శనుండు మెల్లగా నిట్లనియె.

మహాత్మా! మీ మాటలు వినుటచే నాకు జాలిగనేయున్నది. కాని యకార్యకరణ మెట్లు చేయువాఁడ. మొన్న దేవత నిందు బ్రతిష్ఠచేసి నేడు పెరికివైచి యీ క్షేత్రమును పాడుచేయుదునా? ఇందులకు నేనొడంబడినను ప్రజ లొప్పుకొందురా? ఈ విషయమై క్షమించి దయచేయుఁడని వినయముగా బలికిన విని యతడు మొగమంతయు గన్నులుచేయుచు నిట్లనియె.

శ్రీదర్శనా! నీవు చిన్నవాఁడవు. బ్రాహ్మణుఁడవు. క్రొత్తగా రాజ్యాధికారి వైతివి. మా ప్రభువనంగ చంద్రుఁడనంగ సామాన్యుఁగాఁడు. అతండు దేవదానవుల కజేయుఁడని యెరుంగుము. అతనికిఁ బదుగురు చక్రవర్తులు ప్రాణమిత్రులుఁ గలరు. అట్టివాఁడు దండువచ్చి బలవంతమున నీ విగ్రహమునుఁ బెరికి తీసికొనిపోయిన నీవును నీ ప్రజలును నేమిచేయఁగలరు? నీ కిష్టములేదని చెప్పవలయుం గాని ప్రజలమీఁదఁ బెట్టెదవేల? సంగరముల కాని నీవే మురుంగుదువు? సామమున బ్రతిమాలుచుండ నా మాట పాటింపవైతివిఁక కాచికొనుము. మా రాజు కొలఁది దినములలో వచ్చి వీఁడు ముట్టడింపఁ గలండని పలికిన నలుకతో లేచి ముఖరకుఁ డేదియో చెప్పఁబోవ వారించుచు శ్రీదర్శనుండు మొగంబునఁ జిరునగవునగయై మెరయ నిట్లనియె.

స్వామీ! మీ మాట వినుటచే నాకుఁ జాలసంతసముఁ గలిగినది. మా చేతితోఁ బ్రతిష్ఠచేసిన విగ్రహమును మేము పెరుకఁజాలము. బలవంతమున మీ రాజు దాడి వచ్చి పెరికిసం బెరుకుఁగాక. అందులకు మేమోపనప్పుడు మా తప్పుండదు. అప్పుడు మమ్ము నిందింప జాలరు, వేగఁబోయి మీ రాజుగారికి వార్తఁ దెలుపుడని

శాంతముగా నుత్తరమిచ్చుటయు నతని వక్తృత్వమున కెల్లరు నాశ్చర్య పడఁ జొచ్చిరి.

ఆ యోగి వెంటనే యటఁగడలి సముద్రతీరము చేరి యోడలెక్కి దీవులఁ దాటి మూఁడు మాసములకు మణిద్వీపము చేరెను. అనంగలతిక యతనిరాక విని మురియుచుఁ దనచెంతకు రప్పించుకొని నమస్కరించి మహాత్మా! నా ప్రాణబంధు వెందేని గనంబడినదియా? నా తల్లి నన్ను విడిచి యెందున్నది. చెప్పుడని యడిగిన నతండు తలయూచుచు నిట్లనియె.

తల్లీ! నీ తల్లి కనంబడినది కాని యసాధ్యస్థలంబున జిక్కుకొన్నది. ఇంతకన్న నెక్కుడు పూజలందుచున్నది. ఆహా! ఆ వైభవము చెప్పుటకు బది దినములు పట్టును. అది యట్లుండ నా రాజకుమారుని జతురుపాయంబుల బ్రార్థించితిని. దాని నిచ్చుట కంగీకరింపలేదని యచ్చట జరిగిన సంవాదమంతయుం జెప్పెను.

అప్పుడతి త్రొటుపడుచు స్వామీ! మా తండ్రి పోయిన కంగీకరింపఁ డేమో. ఏమి చేయుదును? ఎట్లా విగ్రహమును జూతును, నా ప్రాణము లెట్లు దల్లబడును? మీరు వజసకు జెప్పి విగ్రహమునైన నా విగ్రహము లభించు నుపాయము సేయుడు మీ పాదములకు మ్రొక్కుచున్న దానని వేడుకొన్నది. అతండు సరే చూతముగా యని పలికి వెంటనే యనంగ చంద్రు నొద్దకుబోయి యా వృత్తాంతమంతయు నెరింగించెను.

అప్పుడా రాజు మీసములు దువ్వుచు నేమీ? ఆ రాజు చౌర్య వస్తువుం గొని యపరాధమని యెఱంగక యోపయికంబని బింకము లాడెనా? మన బల పరాక్రమము లెరుంగడు కాబోలు. వాడేపాటి బలవంతుడో తెలిసికొని వచ్చితిరా? వానికి మనము చాలుదుమా? తోడిభూపతుల సహాయము తీసికొని పోవలయునా? అని యడిగిన యోగి యిట్లనియె.

అతని బలపరాక్రమము లెరింగివచ్చితిని. వాడు మిగుల చక్కనివాఁడు. ఒక్కఁడు పోయి భేతాళుం గట్టి తెచ్చెనట. అంతకన్న వాని బలమెరింగినవారు లేరు. మంచివక్త. యుక్తియుక్తముగాఁ మాట్లాడును. పలుకునపు డమృత మొలుకు చుండును. నేను యుద్ధము ప్రకటించిన నించుకయు వెరువక చిరునగవుతో మహా ప్రసాదమని యుత్తరమిచ్చెను. ఎట్లయినను దగిన సహాయముతోఁ బోవుటయే లెస్స యని చెప్పిన నతఁడప్పుడు మిత్రభూపతుల కిట్లు వ్రాయించెను.

జంబూద్వీప నివాసియగు శ్రీదర్శనుండను చిన్నరాజు నా కూఁతురు పూజించుచున్న మణివిగ్రహము దొంగలవలనం గొని దాఁచుటయు మే మావార్తఁ దెలిసి మా పురోహితుం బంపి యడిగించిన నీయక తిరస్కరించినందుల కలిగి యతనిపై యుద్ధము ప్రకటించితిమి. దూరదేశమగుట దగిన బలములతో బోవుట యుచిత

మని తలచి మీ సహాయము కోరితిని. వెంటనే యోడమీఁద మీ సైన్యమును గొంత బంపుఁడు. మిత్రకార్యము నెరవేర్చుట యాప్తధర్మము గదా!

ఆ వ్రాఁతలుచూచి మిత్రభూపతులు తమతమ బలంబుల నోడలమీఁదఁ నతఁడు వ్రాసిన దివసము నాఁటికా మణిద్వీపమున కంపిరి. వానితోఁ దమబలంబులఁ జేర్చి శుభముహూర్తమున ననంగ చంద్రుడు బయలు వెడలుటకు నిశ్చయించెను. పయనమునకు ముందు యోగి యనంగలతిక కడకు వచ్చి పడతీ! నీ పట్టు నెఱవేరినది. చతురంగబలములతో రేపుఁ బయలుదేరుచున్నాము. యుద్ధము ప్రవర్తిల్లిన పిమ్మట నెట్లు జరుగునో తెలియదని పలికిన విని యవ్వనితారత్న మిట్లనియె

తండ్రీ! యుద్ధమెప్పుడు జరుఁగును? విజయ మెప్పుడు గలుగును? ఎప్పుడా విగ్రహముఁ దెత్తును? అంతదనుక నా చిత్తము తాళదు. నేనుఁగూడ బురుష వేషము వైచుకొని మీ వెంట వత్తు. మా తండ్రికి జెప్పిన నంగీకరింపఁడు. నే నందు ముందుగఁబోయి మా యమ్మంగందుఁగాక. కొంత నా యనుతాపము చల్లారు. నీ యుపకారము చేయక తీరదని యాతని యడుగులంబడి వేఁడికొన్నది. ఎట్టకే నతం డంగీకరించినంత నక్కాంత పురుషవేషము వైచుకొని తన సఖురాలికిఁగూడ నట్టివేషము వైచి యిరువుర నతని శిష్యులమని చెప్పుచు నిరువుర వెట్టి లాఁగులు తొడిగి యాయుధంబుల ధరించి మహావీరులవలె నొప్పుచు యోగి చెప్పిన వేళకు నోడకడకు వచ్చి నిలిచిరి.

మొదట మా పయనమునకుఁ బదియోడ లాయత్తపరచిరి. యాయుధ సామగ్రియు భోజనసామగ్రియుఁ గొన్ని యోడలనిండ వైచి చతురంగబలములఁ గొన్ని యోడల నెక్కించి భేరీఝాంకార నినాదములు భువనభోంతరాళములు నిండ మంచివేళ నోడలఁ ద్రోయించిరి. యోగి యనంగలతికను పరిచారికను తన శిష్యులని చెప్పి తానున్న యోడ యెక్కించి భద్రముగాఁ గాపాడుచుండెను. దీవులు తిరిగి తిరిగి యాకలనులు మూడుమాసములకు జంబూద్వీపము రేవుచేరి కొనినవి.

అనంగచంద్రుఁ డందు వాని నివేశము గావింపజేసి కరపటి రాయబారము తెలిపి రమ్మని యోగికి నియోగించెను. యోగి యా శిష్యుల నిరువుర వెంటఁబెట్టికొని తురగము నెక్కి కతిపయ ప్రయాణముల శోభావతీనగరమున కరిగెను.

శ్రీవర్మనుఁడు శత్రువులదాడి చారులవలనం దెలిసికొని తనకు మిత్రులైన భూశక్రులకు వార్తలంపి కొంత సైన్యము తోడు తెప్పించుకొని యుద్ధమునకు సన్నద్ధుండై యుండెను. గవనుల నన్నిట యోధభటులు కాచికొని యుండిరి.

పరీక్షచేసిన కాని యితరుల నగరములోఁ జొరనీయరని ముందుగనే తెలిసికొని యోగి వారిద్దరివేషముల తీయించి యోగినీ వేషములు వేయించితనశిష్యురాండ్రని చెప్పుచు గుఱ్ఱములు విడిచి కాలి నడకతో నాలుగు పయనములు సాగించి నగరములో బ్రవేశించెను. పురరక్షకు లొకచో నాటంకపఱచి మీ రెవ్వరు? ఇందేమి పనియుండి

వచ్చితిరి ? అని యడిగిన యోగి అయ్యా ! మేము బైరాగులము. కాశి నుండి వచ్చు చున్నాము. ఈ నగరమున నధిక ప్రభావసంపన్నయగు మణిదేవి యున్నదని యా యమ్మవారిని సేవింప వచ్చెదెంచితిమి. వీరిద్దరు నా శిష్యురాండ్రు. మాకుఁ బుణ్యక్షేత్రములు సేవింపుట తక్క వేరొక్క పనిలేదని చెప్పిన వారిని విడిచి వేసిరి. నడుమనడుమ నడుగు వీరయోధుల కట్టే చెప్పుచు నా యోగి యొకనాఁడు నాలుగు గడియల ప్రొద్దువేళ కాముద్దుగుమ్మల నా యాలయము నొద్దకుఁ దీసికొనిపోయెను. దూరమున నంతగనే కార్తస్వరవినిర్మితమగు దేవీ మందిరశిఖరము తళతళ లాడుచు ననంగలతికకు నేత్రపర్వము గావించినది. మా తల్లిగుడి గనంబడినది. స్వరూపము జూతునని యుబ్బుచు గొబ్బున నచ్చిబ్బోటికవతి యోగివెంట ద్వారపాలుర నతిక్రమించి యావరణలోనికిఁ బ్రవేశించినంత నందలి విశేషములు వారి కచ్చెరువు గలుగఁ జేసి నవి. మరియు—

సీ. ఒకవంక మేటిగాయకులు దేవీగీత
        ముల వల్లకీ ధ్వనుల్ గలిపిపాడ
    నొకయెడ వరవారయోషిజ్జనంబులు
        నృత్యనృత్యస్వరస్తుతినాద
    నొ చాయ భక్తి సంయుక్త జానపదేయ
        బహువిధనవగేయ భజనగూడ
    నొకదండఁ బండితప్రకరజల్పితవేద
        రవములు చెవుల పండువులుసేయ
గీ. నమరఁ గన్నులపండువైనట్టి రత్న
    మందిరావరణంబు సమ్మర్దమరసి
    సరసిజాయతనేత్రమై గరువుజెంద
    డెందమలరంగ నాట్య మందందు సలిపె.

భక్తి వివశయై నృత్యము సేయుచున్న యా చిన్నదానినిజూచి యోగీంద్రుడు వారించుచు నమ్మా ! ఇందు నిగూఢముగా నుండవలయును. గడియలో నీ సమర్థ మడుగు నంతిదనుక నిందు గూర్చుండుదము రమ్మని నియోగించిన నా చంచలాక్షి యిట్లనియె.

యోగీంద్రా ! భక్తి వివశనై కన్యకాజన విరుద్ధముగ నాట్యము చేసితి నిది ప్రమాదమే. మరియు నిందలి యుత్సవ విశేషములు చూడ నా యొడలు జలదరించు చున్నదిగదా ! ఇట్టి చోటునుండి యా విగ్రహమును గదుపుదుమనుట మనదే తప్పుగ దోఁచుచున్నది. నా దంతనుండ నా యమ్మవారి కీర్తి వైభవ మెక్కుడిది ? ఇది పుణ్యక్షేత్రముగాఁ దలంచి దూరదేశమువారు యాత్రగా వచ్చుచున్నారు. చూచితిరా ? యీ యుత్సవము చూచిన నీ దేవతావిగ్రహము నిందుంచి కదుప మనరు. సిశ్చయ

ముగ నాకే యిట్టి బుద్ధి పుట్టుచుండ నితరులమాట చెప్పనేల ? యుద్ధ సన్నద్ధము మాని పించి మా తండ్రితో నీనృపకుమారునితో మైత్రిసేయుమని బోధింపుఁడు. అప్పు డప్పుడు నేన వచ్చి మాయంబను సేవించుచుండెదంగాక అనుటయు నతం డిట్లనియె.

తల్లీ ! నీ నిమిత్తము నీ జనకుఁ డింత ప్రయత్నము చేసెను. నీవు వలద నిన గడియలో సంగరము పరిసమింపను. ఈ రాజకుమారుఁడు చాల మంచివాఁడు. రెండుపూటల నీ గుడికివచ్చి సేవించి పోవుచుండును. నేటి ప్రదోషమువేళ కీ దేవళ మునకు రాఁగలడు. నీవును జూడవచ్చును. ఈ లోపల లోపలికిఁ బోయి దేవిని సేవించి వత్తువుగాని రమ్మని పలికి వారిని వెంటఁ బెట్టుకొని దేవాలయములోనికిఁ బోయెను.

అనంగలతిక గర్భగుడి మ్రోల నేల సాష్టాంగ మెరిగికొని యెదుర నిలువంబడి భక్తి పరవశయై యిట్లు ధ్యానించినది.

శా. అంబా ! నన్నిటనాశివచ్చి యిట దివ్యారాధనల్ గూడ మో
దంబందందగునే త్వదీయచరణద్వంద్వార్చ నాసక్త దా
స్యం బేనాఁడును బుద్ధినేమఱను పేక్షావాప్తికిన్నాడ దో
సంబేమున్నది చెప్పు మొప్పునొకొ వాత్సల్యంబు వోనాడఁగన్.

ఉ. నా యపరాధముం దెలిపినన్ సవరించి కొనందలంతు న
న్యాయముగాదె యోర కిటు లాపులపీడఁగఁదల్లి మొన్న భ
ద్రాయితమూర్తి నొక్కలతి ప్రవరుం బతిగాఁగఁ నిద్రలో
దాయఁగఁ జేసి బాపితకటా ? నను వేఁగ నీకుఁ జెల్లునే.

మ. అతనిం దెచ్చి కృపన్మదీశ్వరుని జేయంజెల్లు నీ కస్మదీ
ప్సితమును దీర్పకయున్న సత్వరమ దేవీ ! నీదు పాదాంకిత
క్షితిఁ బ్రాణంబులఁ బాపెదన్నిజము మచ్చిత్తార్తి నిన్నాళ్ల దా
చితి నెవ్వారికిఁ జెప్పికొందు విని రక్షింపంగ నెవ్వారటన్.

అని ప్రార్థించునంతలోఁ బ్రదోషసమయమగుటయు ప్రభువు వారు వచ్చు చున్నారు. అన్యులిందుండరాదు. లెండు లెండని యర్చకులు వచ్చి తొందర పెట్టు టయు నా సుందరు లిరువురు సర్చకుల నడిగి ముఖమంటపము ప్రక్కనున్న చండి కాలయములో మరుఁగుచేసికొని నిలువంబడి యుండిరి. యోగి ముఖమంటపములోఁ గూర్చుండెను.

అంతలో శ్రీదర్శనుఁడు సుఖరకునితోఁగూడఁ దేవళములోనికి వచ్చి గర్భా లయ ముఖంబున నిలువంబడి చేతులు మోడించి యిట్లు స్తుతించెను.

శ్లో॥ యాసాపద్మాసనస్థా విపుల కటితటీ పద్మపత్రాయతాక్షీ
గంభీరావర్తనాభి స్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా

లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణి గణఖచితైస్స్నాపితా హేమకుంభైః
నిత్యం సాపద్మహస్తామమవసతుగృహే సర్వమాంగళ్యయుక్తా.

అని లక్ష్మీస్వరూపమును—

శ్లో॥ యాకుందేందు తుషారహారధవళా యాశుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండ మండిత కరాయా శ్వేతపద్మాసనా
యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైస్సదాపూజితా
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా.

అని సరస్వతీ స్వరూపమును—

శ్లో॥ ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః
ర్యుక్తామిందు నిబద్ధరత్న మకుటాంతత్వార్థవర్ణాత్మికాం
గాయత్రీం వరదా భయాంకుశక శాస్త్రంభ్రం కపాలం గదాం
శంఖంచక్రమధారవింద యుగళం హస్తైర్వహంతీంభజే

అని పార్వతీ స్వరూపమును ధ్యానించి దేవీ! నీ కతంబున నిప్పుడు గొప్పయుద్ధము తటస్థించుచున్నది రాజులందరు నేకమై నాతో నాజిచేయుదురంట తల్లీ! యెట్లు గెలిపింతువో నీదేభారము అని స్తుతియింపుచు నీవలకు వచ్చి ముఖమంటపములోఁ గూర్చుండెను.

అనంగలతిక యతనిం జూచి వెరఁగుపాటుతో దగ్గరనుండి సఖీ! అమ్మకచల్లా! వీఁడే నా హృదయచోరుఁడు. చూడు చూడు వీఁడే నా ప్రాణభర్త నాఁడు నా యంతఃపురమునకు వచ్చి నాతో ముచ్చటలాడినవాఁడు వీఁడే వానిమేన నా తొడవు లున్నవి చూడుము. ఆ రత్నకర్ణభూషలు నావి. ఆ కంకణములు పరికింపుము చూచెదవేమి? వాని మెడలోనున్న హారము నీకు గురుతు తెలియదా? మేలుమేలు యీ దేవీదర్శనఫలము కాఁబోలునని చెలికత్తెకును జూపుటయు నది పరికించి ఔను ఆ మండనములు నీవే. వీని మేనికెట్లు వచ్చినవి. కలలోని వార్తలు సత్యములైనవా యేమి? ఈమాట యోగితోఁ జెప్పుదమా? అనిన నాఁడవరా లిట్లనియె.

కలికీ! నాకల తెలంగాయనతో నిదివఱకుఁ జెప్పలేదు. ఇప్పుడెరింగించితి మేని వేరొకరీతిఁ దలంచునేమో? తొందరపడకుము. యోగియును వారును నేదియో ముచ్చటించుకొనుచున్నారు. వారిమాటల వినుమని నియోగించి చెవియొగ్గి వినుచుండెను.

యోగి వెనుకటిరూపము మార్చుటచే నతనిని గుఱుతుపట్టలేదు. అయినను యెవ్వఁడో తపస్వియని తెలిసికొని శ్రీదర్శనుఁడు వానికి నమస్కరించి అయ్యా! మీ రెందుండి వచ్చితిరి? మీ నివాస దేశమేది? యని యడిగిన నయ్యోగి యిట్లనియె—దేవా! అన్నిదేశములును మావే. సన్యాసులు కొకదేశము నొక గ్రామముం గలిగియుండునా? కాశిలోనుండి నీ దేవీక్షేత్ర ప్రభావంబు అక్కజముగాఁ వినం

బకుటయుఁ జూచు వేడుకతో నిరువుర శిష్యురాండ్ర వెంటఁబెట్టుకొని యింతకుముందే యిందువచ్చితిని. ఈ క్షేత్ర వైభవము వినినదానికన్న నెక్కుడుగాఁ గనంబడుచున్నది. ఇది యంతయు భవద్భక్తి విశేషమునఁ జాటుచున్నదని పొగడిన శ్రీదర్శనుఁడు చిరునగవుతో నిట్లనియె.

స్వామీ! ఈ విగ్రహ ప్రభావం బట్టిదేకాని యిది అగ్రహమునకు నిప్పుడు కారణమగుచున్నది. ఈ క్షేత్ర మిందుండునో యుండదో మారునో తెలియదు. దైవానుగ్రహ మెట్లున్నదో, అని పలికిన యోగి మీ క్షేత్ర మెన్నఁడును మారదు. ఇందే యుండగలదు అట్లే మే మాశీర్వదించుచున్నాము. అని పలికిన వినయముతో జనపతి! మహాప్రసాదమని యందుకొని స్వామీ! మీరు దూరదేశము నుండి యాత్రకు వచ్చితిరి. ఇపుడు యుద్ధసమయమగుట మఠములలో విదేశస్థుల నుండనీయుటలేదు. మీ రెక్కడను బసచేయునట్లు తోచుచున్నది. ఇప్పుడు ప్రత్యేకము మీ వెంట కింకరు నొకని నంపెద. వానితో మఠమునకుఁబొండు. అందు మీ కన్ని సదుపాయములు జరిగించునని చెప్పిన సంతసింపుచు నా బైరాగి వారి సాధుత్వమును బెద్దగా నగ్గించెను. శ్రీదర్శనుండు తగిన కింకరుని వారి కప్పగించి ముఖరకునితోఁ గూడ నింటికిం బోయెను.

పిమ్మట యోగి శిష్యులతోగూడ నా భటుని వెంట మఠమునకుం బోయెను. అందు రాజశాసన ప్రకారము వారికిఁ దగిన వసతులేర్పరచి భోజన భాజన సదుపాయములు యెక్కువగా గావించిరి. భోజనాంతరము యోగి రాజపుత్రికతో అమ్మా! అమ్మవారిని జూచితివిగద యెట్లున్నది? రేపు మనము పోవచ్చునా? ఈ రాజెంత మంచివాఁడో చూచితివా? అని యడిగిన ననంగలతిక యిట్లనియె. తండ్రీ నాకద నున్నప్పు డమ్మవారి కిట్టి వైభవ మెక్కడిది? శిలాభోగ మనునట్లు ఆమె కిక్కడ కాశీవిశాలాక్షికన్న నెక్కువ భోగములు జరుగుచున్నవి. ఇట్టి విగ్రహము పెకి తీసికొనపోవుట మహాపాతకమని నాకుఁ దోచుచున్నది. ఇప్పుడు యుద్ధసన్నద్ధము మానిపించి యీ రాజుతో మైత్రిఁ జేయుమని మా తండ్రిగారికిఁ బోధింపుఁడు నేనే యిందుండి పణిదేవి నారాధించుచుండెదంగాక. అనవుఁడు యోగి నవ్వుచు నిట్లనియె.

తల్లీ! నీ యుల్లమంతలో మారిపోయినది. విగ్రహము దొరకక పోయినఁ బ్రాణములు విడుతునని శపథము చేసితివే? ఇప్పు డీ విగ్రహమును మానిపింతు ననుకో విగ్రహమును విడిచి యింటికి వత్తువా? ఇందే యుండెదవా? అని యడిగిన నవ్వుచు నా జవ్వని యేమియు మాట్లాడినదికాదు. అప్పుడామె సఖురాలతని కిట్లనియె యోగీంద్రా! ఈమె సంకల్పము మారుటకు వేరొక కారణమున్నది. మీతోఁ జెప్పుటకు సిగ్గుపడుచున్నది వినుండు. ఈమెకు నాలుగుమాసములక్రిందటఁ గలవచ్చినది. అందెవ్వఁడో సుందరుండువచ్చి తన్ను గాంధర్వ విధిని బెండ్లియాడి

వస్తువులు వినిమయము చేసికొన్నారఁట. మెలకువవచ్చి చూచుకొన్న బురుషాలంకారములు తన మేననున్నవి. స్త్రీతాచిహ్నములు కొన్ని గనంబడినవి. నాఁ డా రహస్య మెవ్వరికిని జెప్పక నాతో మాత్రము ముచ్చటించినది. ఇంతలో యుద్ధము తొందరవచ్చుటచే నా విషయము విమర్శింప నవసరము కలిగినది. నాఁటనుండియు నీబోఁటి యాగమ తొడవులే ధరించుచున్నది.

ఇందాఁక గుడిలోనికివచ్చిన యా పట్టపురాణి మేన నీమె వస్తువు లుండుటఁ జూచినని కలలో వరించినభర్త యాతఁడేయని నిశ్చయించుకొని మొదటి సంకల్పము సఫలించుచున్నది. అని సంక్షేపముగా నా కథఁజెప్పిన నా సన్న్యాసి ముక్కుమీఁద వ్రేలిడికొనుచు నిట్లనియె "ఔరా! దైవఘటన మొకటి విచిత్రమైనదిగదా! కలయిట్లగుట నెందును వినియుండలేదు. ఏమి! యామె మేనితొడవు లెట్లున్నవో చూపుము" అనవుడు పరిచారిక యామె ధరించిన రవ్వలజోడు మణివలయములు మణిహారము చిటికినవ్రేలి యుంగరమునుదీసి యతనికిం జూపుచు "మహాత్మా! ఇవి పురుషాలంకారములు లౌనో కావో విచారింపుఁడు. నాఁటనుండియు వీని నీమె విడువక ధరించుచున్నది" అని చూపిన నా తపసి యాశ్చర్యపడుచు "కానిమ్ము దైవసంకల్ప మెవ్వరెఱుంగఁగలరు. ఏది యెట్లయిన నీ రాజకుమారుఁడు నీకుఁదగిన వరుండగును. అతని సుగుణములు నీ కడ నిదివరకే వినుతించితిని. ఈ సంఘటనము మీ దేవీ కృపవలనఁ గలిగినదేమో! రేపు వానికడకుఁబోయి భూషావ్యత్యాస ప్రసంగముదెచ్చి నిజముఁ దెలిసికొనియెదఁగాక అని పెద్దతడవు వారు ముచ్చటించుచు నిద్రవోయిరి.

రాజకింకరుఁ డా రాత్రియెల్ల వారికడ గాచికొనియుండి మరునాఁడుదయమున శ్రీదర్శనునికడకుంబోయి "దేవా! నేను మీ శాసన మనుసరించి మఠమున జాగరణముచేసి నిన్నవచ్చిన యోగుల సంభాషణము వినియుంటిని. వారు శత్రుపక్షపాతులవలెఁ గనంబడుచున్నారు. మరియు మంత్రిగారి యుత్తరువు ప్రకారము ధ్వని గ్రాహిణి యంత్రమం దమర్చితిని. ఇందు వారి సంవాదమంతయు నెక్కియుండును పరీక్షింపుఁ" డని విన్నవించిన నన్నరేంద్రుఁడు మంత్రిని రప్పించి యప్పుడే యా యంత్రమును ముందిడుకొని పలికించెను. వారి సంవాదమంతయుం దెలిసికొని యబ్బురపాటుతో ముఖరకుం డిట్లనియె.

వయస్యా! ఆ యోగి వెనుకటియోగియే. యోగినులలో నొకతె రాజపుత్రిక; యొకతె యామె పరిచారిక మరియొక విశేషమిందుఁ దెలియఁబడుచున్నది. నీవు కలలో వివాహమాడిన చేడియ యా పూఁబోఁడి యనియే తెల్లమగుచున్నది. కొన్నిమాటలు సరిగాఁ దెలియబడలేకునికిఁ గొంత సందియము కలుగుచున్నది. కానిమ్ము ఎట్లయినను వారు శత్రుపక్షపాతకులగుట నవ్వలకుఁ బోనీయరాదు. బంధింపవలసినదే యని పలికిన రాజకుమారుం డిట్లనియె.

మిత్రమా ! ఆ పద్మనేత్ర నేను కలలోఁగన్న యన్నుమిన్న యనెయెదవా? ఆ చిన్నది యిక్కడి కెట్లువచ్చును ? అంతభాగ్యము నాకుఁబట్టునా ? అట్టిదాని నిర్బంధింపుమనియెదవేల ? దాని యిష్టము నాయదిగదా ? అనవుఁడు నవ్వుచు మఖరకుఁడు "చాలుచాలు ! ఇది శృంగారచేష్టలకు సమయముకాదు. శత్రువులు వచ్చి పట్టణము ముట్టడింప యత్నించుచుండ నీ విరహ ప్రశంసలు పనికిరావు. అది యెంతనిజమో తెలిసికొనవలసియున్నది. ఇప్పుడు వారిని బట్టుకొని బందీగృహంబునఁ బెట్టింపక తప్పదని" బోధించి నిరుత్తరుని గావించెను.

తద్భాసన ప్రకారము యోధభటు లా మఠము చుట్టును గాపుండి యందుండి యెవ్వరి నీవలకు రానిచ్చిరిగారు. అంత నాఁటి ప్రాతఃకాలమున వారు నిత్యకృత్యము లను దీర్చుకొని యమ్మవారిసేవకై యావల రారాజభటు లాటంకపఱచిరి. అయ్యో ! మేమేమి తప్పుపని జేసితిమి యోగులము. దేవీ సేవకై పోవుచుంటిమి. యాటంక మునకుఁ గారణ మేమనవుఁడు మీరు శత్రుపక్షపాతులని వారికిఁ దెలిసినది. అందులకై మిమ్మాటంక పరుపుమనిరి. ఇదిగో రాజశాసనమని చూపిరి. అప్పు డయ్యోగి యేమియు మాటాడక మరలి మఠమునకుంబోయి అమ్మా మన సంభాషణము లిందుండి రాజభటు లాకర్ణించిరి కాఁబోలు. గట్టిచిక్కే వచ్చినది. ఇప్పుడు కర్తవ్య మేమని యడిగిన నప్పుడఁతి గురువరా ! వెరువకుఁడు. నేను వారితో మైత్రి గలిపెదంగాక. అని యొక పద్యమిట్లు వ్రాసినది.

సీ. నా ప్రాణమై రత్నత్రిమూర్తులఁ దెచ్చి
          వెట్టువైయెటఁ బ్రతిష్ఠించినారు
కలలోనవచ్చి మత్కరపీడనముచేసి
          గాంధర్వవిధి పుస్తెఁగట్టినారు
పరమాప్తి నామేని వరభూషణములెల్ల
          యెఱవుగాఁ గైకొని యేగినారు
ముచ్చటపడి చూడవచ్చిన మమ్ము బం
          ధింపుచు బందెఁ బెట్టించినారు.
గీ. భళిర ! నీవంటి సాహసుల్ గలరె పుడమిఁ
     దస్కరులఁబట్టి కట్టుట ధర్మ మెపుడు
     తస్కరులై యన్యులనుగట్టఁ దలఁచుచుండ
     శౌర్యమె సుధర్మమయ్యె నీ జగతి నహహ !

ఆ పద్యమువ్రాసి మడిచి యందున్న రాజభటున కిచ్చి యిది మీ ప్రభు వున కందిమ్ము. ఇందులకు బ్రత్యుత్తరముదెమ్ము. అని నియోగించుటయు వాఁ డా పత్రికం దీసికొనిపోయి శ్రీవర్మున కిచ్చెను. అతం డు యంత్రసమములైన యనంగలతిక పలుకులు వినినది మొదలు విరహాతురుండై తదేకధ్యానంబున

నుండెం గావున నా పత్రిక నందుకొని విప్పి చదివికొని యబ్బురు ముఖరకా! యా యనంగలతిక వ్రాసిన యుత్తరము వింటివా? మనము దొంగలమఁట వింటివా? ఇందుకు కేమి ప్రత్యుత్తరము వ్రాయవలయునో చెప్పుము. అని ముఖరకనకుం జెప్పి తదనుమతి నప్పుడే యిట్లు ప్రత్యుత్తరము వ్రాసెను.

సీ. మణివిగ్రహము తానె మా యింటి కరుదెంచె
 నేము తెచ్చితిమె మీ యింటినుండి
దేవి నర్చింప ప్రతిష్ఠించితిమి గాని
 గుడిగట్టి మా యింటనిడితి మొక్కొ
నా భూషణములిచ్చి నీ భూషణములఁ దె
 చ్చితిఁగాని దొంగిలించితినె చెపుమ
యాత్రకై వచ్చితిమంచు రూపులుమార్చి
 మర్మమిల్ దెలియుట మంచితనమె

గీ. నిజము దెలియక మమ్ముదండింప దాడి
వచ్చుచుంటిరిగాదె భూవరులఁగూడి
తప్పులన్నియుఁ దమయొద్ద దాచికొనచు
నెదిరి నిందించుటది ధర్మమే లతాంగి?

క. గుడిలోని కరిగి దేవిం
గురుభక్తి భజించి తప్పుగలవా రెవరో
యడుగుడుముగాక యామెయె
నొడివెడు మధ్యస్థయై కనుంగొను నిజమున్.

ఆ పత్రిక యా భటుని చేతికే యిచ్చి పంపుటయు వాఁడది తీసికొనిపోయి యోగింద్రుని కిచ్చెను. అతం డదివిప్పి చదివి యనంగలతికకు వినుపించుటయు మరియుచు నత్తరుణి మరియొక పద్యమిట్లు వ్రాసినది.

గీ. దొంగవస్తువు లొకచోట దొరకినపుడు
తెలియనవి వచ్చిన విధంబుఁ దెలిపి తప్పు
వాపికొనుటది ధర్మంబు వారికంతె
కాక తెలియుదురే యధికారు లెపుడు.

క. ఆహా! మనవాదంబుల
నూహింపుచు దేవి సాక్ష్యమొసఁగిన మఱి సం
దేహింపనేల నిక త
ద్వ్యాహారంబులకు బద్ధులగుట టబ్బురమే?

నేఁటి సాయంకాలముననే దేవీమందిరమున కరుదెంతుము. చెఱసాలం బెట్టఁ బడినవా రధికారుల యిష్టానుసారము రాకపోకలు గావింపఁ యేమిచేయఁగలరు? అని

వ్రాసి యాపత్రిక నంపినది. దానిం జదివికొని శ్రీవర్మనుండు వెంటనే యందంబులంపి వారి నమ్మవారిగుడికడకుం దీసికొనిరమ్మని యాజ్ఞాపించెను. శ్రీపరిచారికలు పెక్కండ్రు చుట్టునుం బరివేష్టింప ననంగతిలక పల్లకినెక్కి యోగీంద్రుండు ముందు నడువఁబరిచారిక ప్రక్కఁగొలువ గుడికరిగి గర్భాలయములో నిలువంబడినది. అంతలో శ్రీవర్మనుఁడు ముఖరకుని వెంటఁబెట్టుకొని దేవీమందిరమున కరిగి యందున్న యోగీంద్రునకు నమస్కరించుటయు నతండు పెండ్లికొడుకవు గమ్మని దీవించి రాజపుత్రా! మీ స్వప్న చరిత్రము నే నెఱుంగిక మా రాజపుత్రిక దేవీ వియోగచింతాపరంపరలచే గుందుచుండ నేను దేశాటనముఁ గావించి యద్దేవి యిందుండుటఁ దెలిసికొని దీనికై మీపై యుద్ధము ప్రకటించి పోయితిని గదా!

దేవీవిగ్రహదర్శనవ్యగ్రచిత్తయై ముందుగా నిత్తలోదరియిందు వచ్చినది. గుడిలో మిమ్ముఁజూచి మీ యొద్దల తనతొడవులుండుట గ్రహించి విగ్రహచౌర్యమొకటి మందసచౌర్యమొకటి రెండపరాధములు మీయందు నిరూపించి జాబు వ్రాసినది గదా! మీ వేసనున్న నగ లామెవని చెప్పుచున్నది. ఇందుల కేమందురని యడిగిన నతండు నవ్వుచు యోగీంద్రా! ఆ యోషామణి యొద్దనున్న మణిభూషలు నావే యైనచో నవి యామెవే కావచ్చు. ఇందులకు మా తప్పేమియున్నది ? అని విని యోగి అమ్మా! అనంగతిలకా! యిటురా. మీ తొడవులం బరీక్షింపవలయునట అని పిలుచుటయు సిగ్గుచేఁ దలవంచుకొని రాజపుత్రిక యతనికడకువచ్చి నిలిచినది యోగి! యిరువురను వరుసగా నిలువంబెట్టి తొడవులఁ బరీక్షింపుచు ఓహోహో యెంత చిత్రము యిరువురి దొంగతనము యిందుఁబయటఁ బడినది. ఇది యెట్లు జరిగినదో యీ యమ్మవారే చెప్పవలసియున్నది. మీ రిద్దఱు నామె సేవకులే యగుట నామెయే యీ సంఘటనము గూర్చినదని తలంచుచున్నాను అని పలుకుటయు రాజపుత్రుండు నా మాటయే సత్యమని యనువదించి దేవి కభిముఖముగా నిలువఁబడి తల్లీ! యీ రహస్యము నీకుఁ గాక యొరులకుఁ దెలియదు. ఇందుల నిక్కువ మెఱిగింపుమని ప్రార్థించుటయు నద్దేవి యాకాశవాక్కులనిట్లాన తిచ్చినది.

సీ. నరదేవసుత! నీవునాకుఁ గావించెదు
నిత్యోత్సవముల కెంతేని మురిసి
ఆ బాల్యమునుండి యతిభక్తి ననుఁగొల్చు
రాజపుత్రిక సేయు పూజలరసి
యనురూప తేజస్కులగు మిమ్ము నిరువురఁ
గూర్పంగ వేడుకఁగూడుటయును
మన్ని యోగమున నస్మచ్ఛక్తిగణము ని
ద్రనుఁజెందు నిన్ను నత్తరుణి కడకుఁ

గీ. డసికొనిపోయి శయనమందిరము జేర్చి
మీరలొండొరు లనురాగపూరితాత్ము
లగుచు గాంధర్వవిధిఁ బెండ్లియాడ నగల
మార్చుకొనునంతలో నొచట మఱువఁజేసి.

క. క్రమ్మఱ నిను నీదగు సద
నమ్మునకుం దెచ్చి పాన్పునం జేర్చిరి స్వ
ప్నమ్మని యది నీవును నీ
కొమ్మయుఁ దలపోసి విరహఘూర్ణితమతులై.

విభ్రాంతిం జెందుచుంటిరి. ఇది మత్ప్రవాసంబునం జరిగిన కల్పనాకథ. ఇందిరువుర తప్పులేదని యమ్మవారు గగనోక్తులం దెలుపుటయు నా మాటలు విని యందున్న వారెల్ల విస్మయావేశ సంతోష వివశచిత్తులైరి. అప్పుడు రాజపుత్రుఁడు అనంగలతిక చెయ్యి పట్టుకొని యమ్మవారికి మ్రొక్కి యోగీశ్వరుని యాశీర్వాదములంది యా మెం బల్లకి నెక్కించి నిశాంతఃపురమున కనిపెను.

అంతలో శత్రుపీనులు వారువనులెక్కి వేనవేలు హుటాహుటిగాఁ బట్టణము ముట్టడింప వచ్చుచున్నారని వేగులవారు చెప్పుటయు నా వార్తవిని యోగీంద్రుడు రాజపుత్రసహితం జెప్పి యశ్వారూఢుండై వారి కెదురువోయెను. అప్పుడా సీమాంతమున గాచియున్న యోధులకును నా యాశ్వికులకును పెద్ద యుద్ధము జరుగుచుండెను. యోగీంద్రుడు నిలుడు. నిలుడు. యుద్ధము వలదని చేతులెత్తి కేకలువెట్టి వారించుటయు నెల్లను నతనిదిక్కు మొగంబై చూచుచుండిరి. అప్పు డయ్యోగి యనంగచంద్రుని సేనాధిపతిం జేరి మీరింత తొందరపడివచ్చితి రేల? ఏలిక యెందున్నవాడు? చెప్పుడని యడిగిన దళవాయి యిట్లనియె.

స్వామీ! మీరు భర్తృదారికను వెంటబెట్టుకొని మణివిగ్రహమునుజూడ నీ నగరమున కేగినంత మిమ్మిందు శత్రువులు దెలిసికొని చెరసాలం బెట్టిరని మాకు వార్తలు వచ్చినవి. దానం బ్రభువు తొందరపడుచు వారువపుదళముల ముందుగాఁదోలి యూ చెరవిడిపించి రమ్మని యాజ్ఞాపించిరి. అందులకే మేమిందు ముందు వచ్చితిమి. పీనాటంకము సేయఁ గోరుచుంటిమి మిమ్ముఁ బట్టినమాట వట్టిదిగా యేమి? ఎట్లు వచ్చితిరని యడిగిన నతఁడు నవ్వుచు చెరసాల పరిణయసాల యయినది. ఇక మనకు సంగరముతోఁ బనిలేదు. పదు దమ్మహారాజు కడకుఁ బోవుదము. అని పలికిన వారితో గూడ సేనా నివేశముకడ కరిగి యన్నరపతి కా తెరంగంతయు నెరింగించి యతని నానందసాగరమున నోలలాడించెను.

అమ్మవారు స్వయముగా నానతిచ్చెనని చెప్పిన నెవ్వారికి బ్రీతికలుగకుండెదిని? ఆ యుద్ధ ప్రయత్నమే పరిణయ ప్రయత్నముగామార ననంగచంద్రుడు సకల సామంతభూపతిసహితుండై చతురంగ బలములతో నా శోభావతీనగరంబు బ్రవేశించి

యోగీంద్రుం డెఱింగింప మంత్రిరతునిచే శ్రీదర్శనుండు వారికి దగిన సత్కారముల జేయింపజేసెను. మరియు ననంగచంద్రుడు శుభముహూర్తంబున ననంగలతికను దర్శనునిచ్చి తిరుగనందు వివాహమహోత్సవము గావింపజేసెను. యద్ధమునకు వచ్చిన రాజులు రాటభటులు నా యుత్సవమున బాల్గొని కొన్నినాళ్ళందుండి తమతమ నెలవులకుం బోయిరి.

శ్రీదర్శనుం డినవురుభార్యలతో నానందించుచు బద్మిషయందు పద్మ సేనుడనువాని ననంగలతికయందు ననంగసేనుడను వాని నిరువుర సుతులం గని యెను. అని యెఱింగించు నప్పటికి వేళ మిగిలినది. మణిసిద్ధుడు పై మజిలీయందు తరువాత కథ నిట్లు చెప్పందొడంగెను.

285 వ మజిలీ

# పద్మాబలుల కథ

శ్రీదర్శనుండు రాజ్యము సేయుచు నిరువురు భార్యలతో నొక నాఁ డంతః పురమున వినోదించుచుండ నాకిటి నెవఁడో బ్రాహ్మణుఁ డేడ్చుచున్నట్లు వినంబడినది. అయ్యాక్రందనధ్వని విని రాజు సేవకు నంపి యతని లోపలికి రప్పించుకొని బ్రాహ్మణుఁడగుట దెలిసి నమస్కరించుచు అయ్యా! నీ వెవ్వఁడవు? ఇట్లేడ్చుద వేమి? నీ కీ భయ మెవ్వరివలనఁ గలిగినది? నిజము చెప్పుము. నీ యార్తి పోఁగొట్టె దనని చెప్పిన నా పారుం డతని భార్యలు వినుచుండ నిట్లు చెప్పెను.

క. నాదగుదీప్తభాగ్నిమ
హోదయమున నట్టహాసయుక్తిం దీప్తం
బైధూమలేఖయయ్యెను
నా దహనను కాలమేఘహతిఁ బల్లారెన్.

అని చెప్పి గూఢ భూసురుఁ డంతర్ధానము నొందెను. శ్రీదర్శనుండు ఓహో! యితఁ డెవ్వఁడు? ఇతని మాటలు నాకేమియు నర్థమైనవి కావే! ఇంతలో నేమయ్యెను. ఇంద్రజాలనేదియా యేమి? అని యాలోచించుచుండ నతని భార్య లిరువురు నేమియు మాటాడకుండ గన్నుల నశ్రువులు మున్నీరుగా శోకించుచు నతంతు చూచుచుంత నేలంబడి గిలగిలఁ గొట్టుకొని ప్రాణములు విడిచిరి.

పిడుగుపడి నట్టిదైన యా యుపద్రవముఁజూచి శ్రీదర్శనుండు హాహా కారము సేయుచు శోకోపహత చేతస్కుండై నేలంబడి మూర్ఛిల్లెను. పరిజనులెల్ల గొల్లుమని యేడువఁ దొడంగిరి. అవ్వార్తవిని మంత్రిరతుం డరుదెంచి పడియున్న మువ్వురంగని దుఃఖించుచు నతని నొకశయ్యపై బరుండఁబెట్టి రాజభార్య లిరువురు జచ్చిరని తెలిసికొని వారి కగ్ని సంస్కారములు చేయించెను.

శ్రీదర్శనుఁడును మూఁడుదివసముల కొఱకెరింగి భార్యల మరణమునకుఁ బెద్దగా దుఃఖించుచు మంఖరకునిచే నూరడింపబడి వారి కూర్ధ్వ దైహిక క్రియలు నిర్వర్తించి బాష్పదుర్దినబదాంధకార మగునట్లు సంవత్సర పట్టో వెళ్ళించెను.

తరువాత విరక్తి జెంది తనరాజ్యము రెండుభాగములుగాఁ బంచిపెట్టి కుమారులఁ జెఱియొక రాజ్యమునకుఁ బట్టభద్రులంజేసి వారి సంరక్షణమునకై మంఖరకు నందుండ నియమించి తోడవచ్చు ప్రకృతివర్గమును బలిమాలికొని మరలింపుచు దపోవనంబున కరిగెను. అందు ఫలమూలాశనుండై తిరుగుచుండ నొకనాఁ డొకచోట రావిచెట్టు నీడను చేరికొనియెను. అకస్మాత్తుగా నత్తరువు నీడఁజేరిన యా రాజ తపస్విం గాంచి యిరువురు దివ్యకన్యకలా చెట్టు దిగి వచ్చి కొన్ని ఫలముల జూపుచు రాజా! రమ్ము రమ్ము. ఈ ఫలము లందికొని తినుము. అని పలికిరి. మీ రెవ్వరో చెప్పినంగాని మీ రిచ్చిన ఫలము లంగీకరింపను. అకారణముగా నా యందు మీ కిట్టి వాత్సల్యమేల కలిగినదని యడిగిన నా కొమ్మలు రాజా! మా వృత్తాంతము వినవలఁతేని నీవు మా యింటికిరమ్ము. సాంతముగా నెఱిగింతుమనిరి. అతం డనుమతించి వారి వెంట జనుచు నొక వివరములోదిగి హేమమయమగు వారి యింటికి బోయెను. వారందరతనిని నొక రత్నపీఠమున గూర్చుండబెట్టి దివ్యఫలము లారగింపఁ జేసిరి. తృప్తుండై యతండు కాంతలారాఁ యిప్పుడైన మీ వృత్తాంతము సెప్పెదరా? అని యడిగిన వారిట్లు చెప్పందొడంగిరి.

ప్రతిష్ఠాపట్టణంబున గమలగర్భుఁడను బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. అతనికి పద్మ, బల, అను పేరులుగల భార్యలిద్దరుండిరి. ఆ దంపతుల కొండొరులపై గల ప్రేమ భూతలంబున నెవ్వారికిని లేదు. మువ్వురు జీవాత్మకాంత దేహులై యొకనాఁ డిట్లు తలంచిరి.

పెద్దభార్య పద్మ——చెల్లీ! బలా! మనభర్త మనకంటె పెద్దవాఁడుగదా? అతండు మనకంటె ముందుగా మృతినొందినఁ జూడఁగలమా? కావున నే నిప్పుడే బలవంతముగ జచ్చెద. అట్లయిన మీ మరణవార్త నాకుఁ దెలియదుగదా?

బల—అక్కా! అట్టి మాట నే నాలింపలేకున్నాను. నీ మరణము నేను చూడఁజాలను. నేనే ముందుగ నగ్నిలో బడియెద నాజ్ఞ యిమ్ము.

భర్త——ప్రేయసులారా! మీ మాటలువిన నాకు దుఃఖమాగకున్నది. చిరకాలమునుండి నాకుఁ బరిచర్యచేయుచున్నారు. అవ్యాజముగా నన్యోన్యప్రీతిగల మీ చావుమాత్రము నేను చూడఁగలనా?

భార్యలు——స్వామీ! మీ ముందర పసుపుకుంకుమతో మేము బోయినఁ బండువవంటిదిగదా? అట్లనుజ్ఞయిండు.

భర్త——అట్లయిన నేనొక్కయుపాయముఁ జెప్పెదవినుండు. మనము ప్రయాగమునకేగి మువ్వురము వటవృక్షమెక్కి జన్మజన్మమునకు మనమిట్లే యగు

రాగముగల భార్యాపతిత్వముతో నుండవలయునని కోరి యమునలో దుమికి ప్రాణములు విడుతుము. మనకోరికలు తీరఁగలవని చెప్పిన వారంగీకరించిరి. మువ్వురు ప్రయాగము నకుఁబోయి వటవృక్షమెక్కి తమయభిలాష లుగ్గడించుచు యమునలోఁ బడి ప్రాణములు విడిచిరి.

అప్పుణ్యమున కమలగర్భుండను నాబ్రాహ్మణుండు యక్షజీ యోనియందు ప్రదీప్తాక్షుఁడను యక్షునికి దీప్తశిఖుండను పేరుతో నట్టహాసుఁడనువానికిఁ దమ్ముఁడై యుదయించెను. అబ్రాహ్మణుని భార్యలు జ్యోతిర్లేఖ, ధూమలేఖ యనుపేరులతో ధూమలేఖుఁడను యక్షునకుఁ బుత్రికలై పుట్టిరి. వారు సంప్రాప్తయౌవనులై యసు రూపభర్తను బడయ శివునిగూర్చి తపంబుసేయ నమ్మహేశ్వరుండు ప్రత్యక్షంబై యిట్లానతిచ్చెను.

కన్యకలారా! మీరు పూర్వజన్మంబున పతితోఁగూడ మృతినొందిరి. మీ భర్త యక్షుండై దీప్తశిఖాభిదానంబునఁ నొప్పుచు నల కూబరశాపంబున భూమియందు మర్త్యుండై యుదయించి యున్నవాఁడు. వానిపేరు శ్రీదర్శనుఁడు. మీరును మనుష్యులై పుట్టి వానినే భర్తగా భజించి కొంతకాలము భూలోకసుఖంబు లనుభవించి తరువాత యక్షలోకము చేరుదురు అని వరములిచ్చి శివుండు యంతర్ధానము నొందెను. వారిరువురే పద్మిన్యనంగలతికలై భూమియందు జనించిరి. ఆ దీప్తశిఖుండే శ్రీదర్శనుండై యుదయించెనుగదా! నీవే యాతఁడవు. నీ భార్యలే వారు. వారేమేము అని యెరుంగుము. అట్టహాసుఁడు బ్రాహ్మణరూపమునవచ్చి శ్లేషోక్తిగా అట్టహాసా! ధూమలేఖా! ప్రదీప్తాగ్ని జ్యోతిర్లేఖాదినామములు జ్ఞాపకముచేయుటచే నీభార్యలుగానున్న మేమిరువురము పూర్వ స్మృతిగలిగి ప్రాణములు విడిచితిమి. వారే మేము నీవు విరక్తిఁగలిగి తపోవనంబునకు వచ్చితివి. మీకిపుడు శాపాంతమైనది.

అని చెప్పినవిని శ్రీదర్శనునికిఁగూడ పూర్వజ్ఞాన ముదయించినది. తాను దీప్తశిఖుండని యెఱింగినంత తద్రూప మతని నావేశించినది. వెంటనే యావాల్గంటుల నిరువురఁ బరిగ్రహించి యక్షుండై యక్షలోకమున కరిగెను. కథ కంచికిఁబోయె నేనింటికి వచ్చితిని అని పుత్రకుఁడు చెప్పినవిని యాయవ్వ యిట్లనియె.

కుమారా! యీకథవిని మారాజపుత్రిక చాల సంతసింపగలదు. కాని నాకింకొక సందియము కలుగుచున్నది. అది నీవలనం దెలిసికొనక పోయితినేని నానత నాకనకగాత్రి నన్నడిగిన నేనేమి చెప్పఁగలను? కమలగర్భుండను బ్రాహ్మణుండు రెండవజన్మమున దీప్తశిఖుండను యక్షుండై యుదయించెనని చెప్పితిరి. అతండే నల కూబరశాపంబున శ్రీదర్శనుండైపుట్టి తిరుగా శాపాంతమున యక్షుండయ్యెనని చెప్పితిరిగదా? అతనికి నలకూబరుం డేమిటి కేమని శాపమిచ్చెనో తెలిపితిరికారు. ఆ విషయ మామెయడిగిన నేమి చెప్పుదును? కావున సత్తెఱం గెఱింగింపుఁడని యడిగిన పుత్రకుం డిట్లనియె. అవ్వా! నీవుగట్టిదానవే మంచిశంకయే చేసితివి. తద్వృత్తాంతము జెప్పెద

నాలింపుము అని యెఱింగించునప్పటికి కాలాతీతమైనది. తరువాత కథ యిట్లు చెప్పందొడంగెను.

285 వ మజిలీ

## పవిత్రాధరుని కథ

అభినవ ధులకు నాకరంబై రెండవ యలకాపురంబనఁ బ్రసిద్ధివహించిన ప్రతిష్ఠానపట్టణంబు పృథివీలోకనాకంబై విరాజిల్లుచుండెను. అందు బవిత్రాధరుడను బ్రాహ్మణకుమారుం డుత్తమ శీలుండు కాపురము సేయుచుండె. అతం డొకనాడు తనలేమిని గురించి యిట్లు విచారించెను. అహా! నేనుత్తమవంశంబున జనించితిని. శీలవంతుఁడనని వాడుకవడసితిని. కొన్ని విద్యలను జదివితిని. ఇట్టి నేను దరిద్రుండనగుట దుర్విదగ్ధశీలుర, మూఢులు నగు భాగ్యవంతులనడుమ నించుకయుఁ బేరులేనివాఁడనైతినిగదా? నా కంటె నధములగు బ్రాహ్మణకుమారులు భార్యలతో నానావైభవ మనుభవించుచున్నారు. నాకుబెండ్లి యైనఁగాలేదు. నామాట యెవ్వరు వినిపించుకొనరు. అభిమానవంతుఁడనగుట నౌకరి యాచింపలేను యాచించినను దగినధనమిచ్చు వారెవ్వరు? దరిద్రమా! నన్ను నీ వెట్లు వదలి పోవుదువు అక్కటా! హీనకులులు సుగుణరహితులు నగువారు సమున్నతసౌధాంతరముల వసించుచు సాయంకాలమున భార్యాయుక్తులై యశ్వశకటములెక్కి బాహ్యోద్యానవనంబున కరుగుచుండ జూచిజూచి నామనం బెరియుచున్నది. ఒకమంచి కుటీరమైన నాకు లేకపోవలయునా? అయ్యో! వారు దైవికి చుట్టములు నేను విరోధినైతినా? అదికాదు. కృషిలేక నే నిర్ధనుండనైతినేమో? వర్తకములో నష్టముగూడ గలిగియున్నది. వ్యవసాయములో పంటలుగూడ ఫలింపక పోవచ్చును. అదియునుంగాదు. బ్రాహ్మణులకుఁ గులవృత్తి తపంబు. "అట్టితపంబుచేసి యేదేని దేవత నారాధించి యభీష్టము వడసెదంగాక" అని తలంచి యాయూర నొక మాంత్రికు నాశ్రయించి శుశ్రూష చేయుచుండెను.

అట్లు తన కనిర్వ్యాజకముగా శుశ్రూషచేయుచున్న పవిత్రాధరునిజూచి యా మాంత్రికుండు బాబూ! నీ వుత్తమ బ్రాహ్మణ కుమారుండవు. నీ వంశము చాల గొప్పది నీవు నాకు నిత్యము నుపచారములు చేయుచుండ బాధగా నున్నది. నీకేదైనఁ గోరికయున్నదేమో చెప్పుము. ఓపుదునేని గావింతు ననవుడు "ఆర్యసత్తమా! నేనుత్తమ వంశంబునఁ బుట్టినమాట వాస్తవమేగాని ధనికులమధ్య నాకేమియుఁ బేరు లేకున్నది. ఇరువదియేండ్లు వచ్చినను బెండ్లి కాలేదు. ఇల్లులేదు, బంధువులు లేరు. మాపూర్వులు యజ్ఞయాగములుచేసి భూములమ్ముకొని ఋణస్థుల పాలైరి. కావున నాకు ధనాగమోపాయము మీదేని యెఱింగించిరేని మిమ్ము సేవించుచుండెద. అట్టి మంత్రమున్న నుపదేశింపుఁడు. గట్టిగా జపింతు" నని పలికిన నవ్వుచు నమ్మాంత్రికుం డిట్లనియె.

అబ్బాయీ, పూర్వజన్మ సంస్కారములేనిదే లబ్ధధనుండగుట కష్టము. వినుము——

శ్లో॥ మజత్వంభసి యాతు మేరుశిఖరం శత్రూదే జయత్వాహవే
వాణిజ్యం కృషి సేవనాది సకలావిద్యాకలాశిక్షతాం
ఆకాశం విపులంప్రయాతు ఖగవత్ కృత్వాప్రయత్నంపరం
నాభవ్యం భవతీహ భాగ్యవశతో భావ్యస్య నాశః కృతః.

సముద్రమున మునింగినను మేరుశిఖర మెక్కినను శత్రువుల జయించినను కృషివాణిజ్యాదికర్మల జేసినను పక్షివలె నాకాశమున నెగిరినను దన కెంత ప్రాప్త మున్నదియో యదియే వచ్చును. అంతకన్న నెంతకష్టపడినను గుడ్డిగవ్వయైనను లభింపదు. అందులకే మన పెద్దలిట్లు చెప్పిరి.

శ్లో॥ యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితంస్తోకం మహద్వా ధనం
తత్ప్రాప్నోతి మరుస్థలేపి నితరాంమేరేచ నాతోధికం
తద్ధీరోభవవిత్తవత్సు కృపణాంవృత్తిం వృధా మా కృథాః
కూపేపశ్యపయోనిధావపిఘటోగృహ్లాతితుల్యం జలంబు.

కొంచెముగాని చాలగాని దైవము తన లలాటమం దేమి వ్రాసెనో యది మరుభూమి నున్నను వచ్చి చేరును. మేరు వెక్కినను నంతకన్న నెక్కువరాదు. కావున వో మూఢులారా! విత్త సంపాదనకై ధనికుల కడకుఁ బోయి వృధాగా దైన్యమును బొందకుఁడు. నీరుదేర సముద్రమునకుఁ బోయినను తనకడనున్న కడవెడు నీళ్ళే వచ్చునుగాని యెక్కువ వచ్చునా? కావున నొరుల సంపదలఁజూచి తన దారిద్ర్యము నకు వగచుట నిరర్థకము. అయినను నీవు కోరితివి కావున యక్షిణీసాధక మంత్ర మొండు నీ కుపదేశించెద నెలదినములు దీక్షతో నా మంత్రము జపించి జాజిపూవులచే నా దేవతను బూజించినఁ బ్రత్యక్షమై కామితముల నీయఁగలదు. నడుమ నా దేవత చూపించు వికారములకు జడిసితివేని నెత్తిగొట్టును. జాగ్రత్త. అని చెప్పి వాని కా మంత్ర ముపదేశించెను.

పవిత్రాధరుఁ డా మంత్రమును శుభముహూర్తమున పునశ్చరణ చేయు టకు మొదలు పెట్టెను. అతిదీక్షతో జపము చేయుచుండ వాని నా యక్షిణీదేవత యనేక మాయోపాయములచే బెదరించినది గాని యా మొండివాసు యిం చుకయు వెర వక స్థాణువువలె నిలబడి యుండెను. హోమాంతమున యక్షిణి ప్రత్యక్షమై చేతులు గట్టుకొని యెదుర నిలువంబడి "దేవా! నేను మీకు కింకరురాలనైతి. కార్యము దెలుపుఁ"డని యడిగిన నదియుఁ గపటమే యని తలంచి యతండు హోమము విర మింపఁడయ్యె.

అప్పు డాయక్షిణి దివ్యరూపంబునఁ బ్రసన్నమై యతనిని గ్రుచ్చి యెత్తి "ప్రాణేశ్వరా! నే నీకు భార్యనైతి. నాతో నీ వభీష్ట కామంబులఁ దృప్తుండవుగమ్ము.

నీ యిష్టము వచ్చిన వినోదములఁ గల్పించి సంతోష మాపాదించెద." అని చెప్పి యతనికిఁ బహూర్తాతిశయము గావించినది. అతండు కోర చైత్రనందనాద్యుపవనంబు లకు దీసికొనిపోయి యానందముఁ గలుగఁ జేయుచుండెను. వలసినంత ధన మిచ్చు చుండునది.

పవిత్రాధరుఁ డట్లు మనుష్యాతీతములగు సౌఖ్యము లాయక్షిణితో ననుభ వించుచు నొకనాఁడామె కిట్లనియె. "ప్రేయసీ! నీ దయవలన నేను దివ్యభోగము లనుభవించుచుంటి. ఐశ్వర్యములందును, భోగములందు నన్ను మించిన మనుష్యుఁడు లేఁడు. ఇప్పుడు నా కొక్క కోరికగలదు. పున్నామనరకమునుండి రక్షించువాఁడు పుత్రుడు. నా హృదయంబట్టి పుత్రోదయ మభిలషించుచున్నది. నీ యట్టి దివ్యాం గనయందుఁ గలిగిన కుమారుడు లోకాతీతసౌందర్యశాలి యగుట సందియము లేదు. ఈ నా కోర్కె దీర్పుమని వేడిన నా యక్షిణి యిట్లనియె. ఓహో! నీ మాటలవలన నాకుఁ బూర్వోదంత మొకటి జ్ఞాపకము వచ్చుచున్నది. నీకుఁ జక్కని కుమారు డుద యింపఁగఁడు. అది దైవనిర్దిష్టమే. ఇందులకొక్క గాధకలదాకర్ణింపు.

# అ ట్ట హా సు ని క థ

దక్షిణదేశమున పిహితార్కమై ఘనశ్యామమై తమాలకానన మొందు వర్షఋతువునకు జన్మభూమియనయన మనోహరమై యొప్పుచున్నది అందు పృధూధరుఁ డను యక్షుండు భార్యతోఁ గాపురము సేయుచుండెను. చిరకాలమునను నే నతనికిఁ గొమార్తెగా నుదయించితిని. నా పేరు సౌదామిని యండ్రు. మా తండ్రికి నే నొక్కరితను కూఁతురునగుట నన్ను గారాబుగాఁ బెంచుచు మలయాచల, కైలాస, హిమాచలాది దివ్యశైలములకు, దివ్యోపవనంబులకు దివ్యనగరంబులకుఁ దీసికొని పోయి యందలి వింతలం జూపుచు నాడించుచుండెను.

క్రమంబున నా మేన యౌవనము పొడసూపినది త్రిలోక మోహ జనకంబగు రూపంబునఁ బ్రకాశించుచుంటి. నన్ను వివాహమాడుటగా నలకాపురము నుండి పేరుపొందిన యక్షకుమారులు మా తండ్రికి వార్తలంపుచుండిరి. వారివారి చిత్రఫలకముల నాకు మా తండ్రిచూపి నీ యిష్టమయిన వానిని బెండ్లి యాడుమని యడిగిన నే నెవ్వరి నంగీకరించితినిగాను. ఎంత చక్కని వాఁడైన వంకలుపెట్టి నిరసించుచుంటి యక్షలోకములో వర్తకుల నా రూపము చిత్రఫలకముల వ్రాసి యంగళ్ళ విక్రయించుచుందురు. నాకుఁ గపిశయను సఖురాలు గలదు. నేను దానితోఁ గూడికొని మున్నుజూచిన శైలోప వనంబులకుం బోయి విహరించి వచ్చు చుండును.

ఒకనాఁడు కైలాసపర్వతమున కరిగి యందు రత్నసానువుల విహరించు చుండ నట్టహాసుఁడను యక్షకుమారుఁడు మిత్రులతో నాడుకొనుచు నాప న్నైతపర్వము గావించెను. వాని సౌందర్యము నా హృదయ మాకర్షించినది. అతండు నన్నుఁ జూచి మోహవివశుండై యటనుండి కదలలేక "యీ మోహనాంగి యెవ్వతె" యని నా సఖురాలి నడిగెను.

అయ్యా! యీమె పృథూదరుని కూతురు సౌదామిని యని పేరుగలది అని నా చరిత్రమంతయుం జెప్పినది. అతండు నా పేరది వజను విని యున్న వాఁడగుట ఓహోహో! యీ వరారోహ యా మోహనాంగియా? నేఁడు నా కన్నుల కలిమి సార్థకమైనది. ధన్యుండనైతి. లోకాతీత సౌందర్యంబు తుదిగనుంగొట్టి నని స్తుతియించెను.

వాని వలలనకుఁ జిక్కి నేనును నక్కడనుండి కదలలేక పోయితిని. ఇక వేఱ చెప్పనేల? సఖీముఖముగా వాని యభిప్రాయము దెలిసికొని వానినిఁ బెండ్లి యాడుట కంగీకరించితిని. అప్పుడే యతండు గాంధర్వ వివాహ మాడదలంచెను. గాని నే నొడంబడక తండ్రిగారికి జెప్పి పిమ్మటఁ బెండ్లి యాడెదనని సూచించి సఖితో నింటికిం బోయితిని. ఇంటికడ నా సఖురా లట్టహాసుని కథయు నా వలపును మా తండ్రికింజెప్పి యతనికి సంతోషము గలుగజేసినది. అట్టహాసుఁడన ప్రదీపాక్షుని పెద్దకుమారుఁడు. దీప్తశిఖుండనువాఁడు రెండవ కుమారుడు మా తండ్రి వెంటనే నీ కుమారుడు నట్టహాసునకు, నా కుమార్తె సౌదామిని నిచ్చి వివాహము చేసెదనని శుభలేఖ ప్రదీపాక్షునకు వ్రాసి పంపించెను. అతండా శుభంబున కంగీకరించి ప్రత్యుత్తరము వ్రాసెను. కాని యింతలో నా వివాహమున కొక యంతరాయము కలిగినది. వినుండు—

నే నట్టహాసుని విడిచివచ్చిన తరువాత నతండును యతని తమ్ముఁడు దీపశిఖుండును మఱికొందరు యక్షకుమారులును వినోదముగా నొకనాడు హిమవత్సా నోద్యాన వనమందలి చిత్రస్థలంబున నొక నాటకమాడిరి. తత్ప్రకారము సవిస్తర ముగా నెరింగింతు. నా కర్ణింపుము. అందట్టహాసుఁడు కుబేరవేషము. దీప్తశిఖుడు నలకూబర వేషము, నితర యక్షకుమారులు మంత్రి సామంత పరిచారికాది వేషములు ధరించి వినోదముగా నాడిరి.

రంగస్థలము

హిమవద్రత్న సానూద్యానవనము

(కుబేరుఁడును మాణిభద్రుఁడును ప్రవేశించుచున్నారు.)

కుబేరుఁడు—అమాత్య మాణిభద్రా! మొన్న నాకలోకములో జరిగిన మహాసభకు నెవ్వ రెవ్వరు వచ్చిరి? ఏమేమి ప్రసంగములు జరిగినవి? నేను రానందు కు మహేంద్రుఁడేమైన గోపించెనా?

మాణిభద్రుఁడు—కుబేర మహారాజా! మీ రిచ్చిన పత్రిక నర్పించుచు మా ప్రభువు వారిప్పుడు నవనిధులలో గచ్ఛపమను నిధియందుగల రత్నము లెవ్వరో దొంగిలించిరని తెలిసికొని రక్షకపురుషుల విమర్శింపుచు నిందు రానందులకు క్షమింపుమని కోరిరి. కుమారునలకూబరు నంపిరని మహేంద్రునకుం దెలిపితిని.

కుబేరుఁడు—అందుల కతం డే మనెను?

మాణి—ఓహో! కచ్ఛపనిధిరత్నములే దొంగిలించిరా? అట్టివారిని బట్టుకొని శిక్షింపవలసినదే. అని పలుకుచు మహేంద్రుఁడు భర్తృదారకునిరాక నభినందించి రత్నపీఠంబునం గూర్చుండుమని కనుసన్న జేసెను.

కుబేరుఁడు—(సంతోషించుచు) మన చిరంజీవి మహేంద్రునికత వినయ మభినయించుచుఁ గూర్చుండెనా? అతడు వానిని మరేమయిన నడిగెనా?

మాణి—అడుగుటకును విమర్శించుటకును నది సమయమా? మిక్కుటక్కుటక్కిన దిక్పతుల త్రిమూర్తులు గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధవిద్యాధరాదులు వచ్చి సభ నలంకరించిరి.

కుబేరుఁడు—అంగ్రగ సనాధిపత్యము హరిహరులలో నెవ్వరికిచ్చిరి?

మాణి—అందు విషయమై కొన్ని చర్చలు జరిగినవి. కాని చివరకు మహేశ్వరుడే యగ్రపీఠ మలంకరించెను.

కుబేరుఁడు—సంతోషవార్త యింటి. తరువాత—

మాణి—మూడులోకములు విడదీయు విషయము త్రిలోక సంచారియగు నారదమహర్షి ముందుగా నుపన్యసించును. తరువాత నితరులు తమకు దోచిన యభిప్రాయముల నిత్తురు. అని సూచించి మహేశ్వరుండు గూర్చుండెను. ఆ వెంటనే నారదమహర్షి లేచి గంభీర సంభాషణముల నిట్లుపన్యసించెను. సభ్యులారా! స్వర్గమర్త్య పాతాళములని లోకములు మూఁడు ఈ భువన త్రయమునకు శచీకళత్రుడే యధికారియై యున్నవాడు. ఇప్పుడు మనుష్యులను పాతాళలోక వాసులును నా ముఖముగా మీ కిట్లు దెలుపుచున్నారు. వినుండు. స్వర్గలోకవాసులు జరామరణ రోగ శోకములులేక నిత్య యౌవనులై సుఖించుచున్నారు మేము నిత్యము రోగములు బాధింప శోకవ్యాకుల మతులమై స్వల్పాయుష్కులమై క్షణయౌవనులమై దారిద్ర్యము పీడింప బాధపడుచున్నాము. అని మనుష్యులును—

మే మడుగునంటి చీకటిలో గొట్టికొనుచు పురుగులమై తొట్టుపడుచున్నామని నాగులును మొఱ్ఱపెట్టుకొనుచున్నారు. మహేంద్రుఁడు మా కధికారి యను మాటయే కాని యొకసారియయిన దర్శనమిచ్చి మా కష్టసుఖముల విచారింపడు. వారి లోకమునకు మా లోకమునకు సంబంధము విడదీసి మాకు స్వతంత్రాధికారమిచ్చి జరామరణరోగములు లేకుండ నిత్యసుఖము గలుగునట్లు చేయగోరుచున్నాము ఈ విషయమై దేవలోకము మీరు సభచేసి మా మొఱ్ఱ దెలిపి వా రంగీకరించునట్లు చేయ

వలయునని మనుష్యులు నురగులు నాతోఁజెప్పికొనిరి. అందులకు నేనీ సభ గావించితిని. ఈ విషయము మీ రంతరు ఆర్చించి యెట్లు చేయుటకు వీలుండునో యట్లు చేయఁ గోరుచున్నాను. అని నారదమహర్షి యుపన్యసించి కూర్చుండెను. తరువాత శంకరు ననుమతి బృహస్పతి లేచి యిట్లుచెప్పెను.

సభాసదులారా ! యిప్పుడు నారదమహర్షి భూర్భువస్స్వర్లోకముల విడచిసి యెవరి లోకాధికారము వారికే యిమ్మని వారు కోరుచున్నట్లు చెప్పి యున్నారు. ఈ మూడులోకములకు నన్యోన్యాశయత్వముగల్గియున్నది. మేఘ ములకధికారియింద్రుడు. మేఘము వర్షించినఁగాని పుడమి పండదు. దేవ లోకములో నెప్పుడు దుర్భిక్షమే. భూలోకవాసులు గావించు యాగముల వలన వీరికి భోజనము గలుగుచున్నది భూమి పంట, పౌలము, సర్వము వంటశాల. అక్కడ పండిన ఫలమిక్కడ భుజింపవలయు వీని విడఁదీసిన వారికి పంటలులేవు. వీరికి వంటలు భోజనములు లేవు. నాఁకలు చెలఁగున వసింపఁజాలరు. చీకటియే వారి కాధారమై యుండఁ దగినది. కావున మూడులోకములు విడదీయ వీలులేదని బృహస్పతి యుపన్యాసమిచ్చెను. తరువాత దిక్పతులు గరుడ గంధర్వాదులు వాచస్పతి చెప్పినట్లే చెప్పి లోకములు విడఁదీయుట కొప్పుకొనలేదు. ఆ మాటలే యనువదించుచు మహేంద్రుఁ డిట్లుపన్యాసమిచ్చెను.

ఆర్యులారా ! చెప్పఁదగిన విషయము లన్నియు గురువరుండే తెలిపి యున్నాఁడు. మూఁడులోకములు నొక తీఁగకైన నున్నవి. ఆ తీఁగఁలాగిన నవి పడి పోవును. ఇందుల సౌధంబులు దివ్యోపవనంబులు వారి నిమిత్తమే యేర్పడినవి. ఇందున్నవారు వారికిఁ బరిచారికలు పుణ్యములుచేసి వచ్చినవారికి నిక్కడి వా రుప చారములు సేయక తప్పదు ఒక యింటిలో నొకగది భోగమునకు నొకగది వంటకు నొకగది నిద్రకు నిరూపించినట్లు మూడులోకము లొకేదేశమనుకొనుడు. విడదీయరాదని మహేంద్రుఁడు యుక్తియుక్తముగా నుపన్యసించెను. పిమ్మట వానికి బదిసిధిగా వచ్చిన నారదమహర్షి వెండియు నిట్లుపన్యసించెను.

వేల్పులారా ! దేవలోకవాసులందరు నేకగ్రీవముగా లోకముల విడదీయ రాదని చెప్పియున్నారు. మీరు సర్వాధికారులగుట వీరికి బదిచెప్పుట కష్టము. ఇందున్న వారందరు మనుష్యుల నెత్తిపైఁబడి తినువారే. వ్రతమనియు యాగమని ము శుభ మనియు పేరుచెప్పి మనుష్యులు వీరికే బెట్టుచుందురు. విడదీసిన నా తిండిపోవునని మీ రొదంబడరు. ఇందలి వారొక్క విషయ మాలోచింపవలసి యున్నది. వినుండు

సీ. భార్యలేక యొకండు పరితపించుచునుండుఁ
బతిలేక యొకతె బల్వెతలనొందు
కొడుకులులేరని కుందు నొక్కఁడు నష్ట
సంతానుఁడై చింతనడఁచు నొకఁడు

కాలు సేతులులేక కదలలేఁ డొకరుఁడు
చూడఁగన్నులులేక ౘుక్కు నొకఁడు
దాయజాళితపుఁడౌ నొకఁ డన్న
వస్త్రముల్ దొరకక వసకుఁ నొకఁడు.

గీ. కటకటా! ధ్ర్యాతిమర్త్య లోకంబుకంటె
నిరయమే సౌఖ్యముగనుండు నరసిచూడ
వినఁగ నూఱేఁడులాయుష్య మనుటెకాని
దినదినంబును గండమే యనుటఁకందు.

ఉ. నాగులు దేవతాంశ వలనం జనియించిరెకాని సౌఖ్యమం
తేగరుఁడుండువచ్చి తలయెత్తిన బట్టి గసించు నెప్పుడున్
రాగల సంధకార సదసంబుల గాలియ జీవనంబుగా
గతిలేక నుండురు చికాకుపడన్ విషపూరితాస్యులై.

ఈ రెండు లోకములవారు దేవతలవలె నేమిటికి సుఖింపరాదు? వారు తమ హితంబుకోరుట యనుచితంబా! అది పిం రాలోచించి వారికిఁ గొంత స్వాతంత్ర్య మీయవలసినదే. అని దేవముని వెండియుం జెప్పెను. పిమ్మట మహేశ్వరుండు లేచి యెల్లరువిన నిట్లుపన్యసించెను.

స్వర్గమర్త్య పాతాళలోకము లెన్నటికి విడదీయుటకు వీలులేదు. సృష్టిలోనే యొండొంటికి సంబంధ మేర్పరుపఁబడియున్నది. ఇది కలికాలమగుట మనుష్యులు క్లేశబాహుళ్యమొందుట తప్పదు. ముందు కృతయుగము రానైయున్నది. అప్పుడు దేవతలకన్న మనుష్యులే ప్రభావ సంపన్నులై యుందురు. దేవతలకే మనుష్యులు సహాయము చేయుదురు దేవతలే మనుష్య లోకమున వసింప వాంఛింతురు దేవతలే మనుష్యులుగా జనింతురు. పాతాళలోకమున స్వర్గముకన్న సౌఖ్యదంబు అందును జరామరణ రోగవికారములు లేవు. ఫణిశిరోమణి కిరణములచేఁ జీకటులు పటాపంచలై పోవుచుండును. కావున మూడులోకములు విడదీయ రాదని శంకరు లానతిచ్చిరి. హరి బ్రహ్మలాయన యభిప్రాయముతో నేకీభవించిరి. అంతటితో సభ ముగిసినది మహాప్రభూ!

కుబేరుఁడు—మాణిభద్రా! అట్టి సభ చూచు భాగ్యము నాకు లేక పోయినది. మరియింకేమైన విశేషము లందు ముచ్చటించిరా?

మాణి—దేవా! యీ మాట చెప్పుట మఱచితిని. ఆ నడుమ జయతుఁడు మేఘ గంభీర భాషణములతో లోకములు విడదీయ. గూడదని యుపన్యసించెను. ఆ యుపన్యాసము విని భళిర! జయంతాయని వేల్పులు స్తుతించిరి.

కుబేరుఁడు—మనవాఁడేమియు నుపన్యసింపలేదా?

మాణి—మీతోఁ జెప్పిన నలుగుదురుగాని మన వారక్కడ నిలువఁ బడనిదే. ఇదిగో వత్తునని చెప్పి యుపన్యాస ప్రారంభమునందే యవ్వలికిఁ బోయెను. నేను పరిచారకులఁ బంపిరమ్మని వారనంప రంభతో నందన వనంబున విహరించు చున్నాడని వచ్చి చెప్పిరి. ఏమందును ?

కుబేరుఁడు—సభ ముగియువరకు వారక్కడకు రాలేదా ?

మాణి—లేదు దేవా। లేదు. భర్తృదారకునిచేత నం దుపన్యాస మిప్పింప వలయునని నా యావచ్ఛక్తితో ప్రయత్నించితిని. వానికే యేమి చేయుదును ?

కుబేరుఁడు—కొడుకులు గుణవంతులు కానిచో సిగ్గేయుండును. తరువాత ?

మాణి—ఉపన్యాసమైన పిమ్మట వినోదమునకై నాట్యము సేయింప రంభకు వర్తమానము బంపిరి. దాని వెంట నీతఁడుగూడ వచ్చి సభలోఁ గూర్చుండెను.

కుబేరుఁడు—ఔరా ! నా కడుపున నెట్టి దుర్మార్గుఁడ పుట్టెను ! ఎవరక్కడ ? తక్షణము పోయి నలకూబరుని దీసికొనిరా.

పరిచారకుఁడు—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ద్వారపాల—జయము జయము మహారాజా ! కశ్యపాఖ్యుఁడట దేవ దర్శనమునకై వచ్చి వేచియున్నాడు. ప్రవేశమునకు సెలవే.

కుబేరుఁడు—అతను నలకూబరుని మామగారు కాడా ! వెంటనే ప్రవేశ పెట్టుము.

కశ్యపుఁడు—(ప్రవేశించి) దేవా ! నమస్కారము.

కుబేరుఁడు—ఆ పీఠ మలంకరింపుము. యెన్నడును రాని బావగారు వచ్చితిరే యిదియేమి ?

కశ్యపుఁడు—ఆఁడుపిల్లలు కలిగినవానికి రచ్చలకెక్కక రచ్చలుపడక తీరవా బావా !

కుబేరుఁడు—అట్లనుచుంటివేమి ?

కశ్యపుఁడు—ఎన్నినాళ్ళు మీతోఁ జెప్పక దాచియుంచను ? నీ కొడుకు చేష్టితము లేమియుఁ జక్కపడలేదు.

కుబేరుఁడు—(అంతయు సిగ్గుతో) నేమిచేసెను ?

కశ్యపుఁడు—మీ కొడుకు తత్పతిక సుగుణంబులం లోకుల వలనఁ దెలిసికొనవలసినదేగాని నే జెప్పదగినదిగాదు. రాచబిడ్డగదాయని మీ యైశ్వర్యంబున కాశపడి నేను పిల్లనిచ్చితిని. నా మచ్చకంటికి సుఖమును లేదు అతండు వేశ్యాలోలుండై నను నా బిడ్డ పల్లెత్తు మాటనదు గదా ! ఇంటికి వచ్చినప్పుడు భయ భక్తులతో సపర్యలు చేయుచునే యుండును.

కుబేరుఁడు— ఇప్పుడేమివచ్చినది ?

కచ్ఛపుఁడు—అతం డీ నడుమ స్వర్గమున జరిగిన సభకుబోయి యందుండి రంభను వెంటబెట్టుకొనివచ్చి తన పడక గదిలోఁ బెట్టుకొనియె జూచితిరా!

కుబేరుఁడు—తరువాత?

కచ్ఛపుఁడు—అందులకుగాను నా కూతురు సహించి యూరకున్నది. పైపెచ్చు భార్యను దాని కూడిగములు చేయుచుండుమని చెప్పుచుండునట! అందులకు నొప్పుకొని చేయుచుండ దాసిలో హెచ్చుతగ్గు లుగ్గడించి నిన్నరాత్రి దానినిగొట్టి తన్ని యవ్వలకుఁ బొమ్మని గెంటెనట. ఆ పతివ్రత వెంటనే మా యింటికి వచ్చినది. ఎందుకు వచ్చితివని యడిగిన నేమియుఁ జెప్పినదికాదు. రహస్యముగా దల్లి తెలిసికొని నాతో జెప్పగా నేను మీ దర్శనమునకై బయలుదేరితిని. నా కడ్డమువచ్చి వలదు వలదు. మామగారికిఁ జెప్పవలదు. అని యొట్టుబెట్టినదిగాని నేను దానితోఁ జెప్పక వేరొకదారిని మీకడకు వచ్చితిని దేవా! దిక్పతుల కొడుకు లందరు సిగ్గె యాగడముగాఁ దిరుగుచున్నారా? ఇంద్రుని కొడుకు జయంతుఁడు మొన్నటిసభలో నుపన్యాసమిచ్చి యెంత మెప్పువడసెను. రాచబిడ్డలు విలాసమునకై వారకాంతల నుంచుకొందురు కాక ఇంత యాగడమా! నా బిడ్డ కాపురమున కారంభ యెక్కడనుండి వచ్చినదోకాని యది చక్కబడునట్లులేదు బాబూ! కొడుకును మందలించి కోడలికాపురము బాగుచేసికొనుము.

కుబేరుఁడు—(కోపమభినయించుచు) నలకూబరుఁడేడీ? వానిని దీసికో వచ్చుటకు పోయిన పరిచారకుఁ డింకను రాలేదా?

పరిచారకుఁడు—ఇదిగో భర్తృదారకునితో వచ్చియున్నాను. (అని యెదుర నిలువం బడియెను.)

కుబేరుఁడు—(పండ్లుకొరుకుచు) యేమిరా? కులపాంసన! ఆ రండ రంభనుదెచ్చి యింటిలోఁబెట్టి పుస్తెగట్టిన భార్యను వెడలఁ గొట్టెదవట ఇదియేమి యాగడము? జయంతుఁజూచి సిగ్గుపడరాదా! మహేంద్రునికి వ్రాసి నీ రంభను బందీగృహంబునం బెట్టించెద చూడుము.

నలకూబరు—తలవాల్చికొని యేదియో చెప్పబోవునంతలో నిజమైన నలకూబరుఁ డాకాశ మార్గమునం బోవుచు గొంచెము కాలము నిలబడి యా నాటక సంభాషణములన్నియు విని లజ్జాక్రోధ వివశుండై క్రిందికి దిగి వారికడ చేరినంత బరికించి యా నాటకులందరు గడగడ వడంకుచు భీతముల దిగ్గనురికి యతనికి నమస్కరించిరి. అప్పుడు నలకూబరుఁడు వారిని జుఱజుఱం జూచుచు యీ కుబేర వేషము వేసిన వా డెవ్వడు వీరందరు నెవ్వరు చెప్పుడని యడిగిన నతం డిట్లనియె.

అయ్యా! మీ తండ్రిగారివేషము వేసిన నేను అట్టహాసుండను వాఁడ. మీ వేషమువైచిన వీఁడు మా తమ్ముఁడు దీప్తశిఖుఁడు మ మిరువురము ప్రదీపాక్షుని కొడుకులము. వీరందరు యక్షకుమారులని చెప్పిన నవ్వుదుగంచుచు నలకూ

బరుం డిట్లనియె. అట్టహాసా! మీరు మాకు భృత్యులై మా వేషమువైచి మమ్మాక్షేపించుచున్నారా! ఏమి మీ పొగరు దేవలోకములో సభజరిగినదేమి? ముల్లోకములు విడదీయుమని క్రిందివారు నారదముఖముగా మొఱపెట్టుకొనిరా! పాపము మనుష్యులనిన మీ కభిమానముగాబోలు మూఢా! యెంత కల్పన చేసితివిరా? నేను రంభనుదెచ్చి యింటఁబెట్టగా నా భార్య లేచిపోయి తండ్రితో జెప్పికొనగా నా మామ కుబేరునికడకు వచ్చి నా దుండగము లెఱింగించె. నాకు మా తండ్రి విధించు శిక్షకూడా విని రావలసినది. కోపము నిలుపుకొనలేక వేగము చనుదెంచితి పొండు పొండు. మీ రందరు మనుష్యులై భూలోకమున జనించి కష్టసుఖములందుండు అని శపించుటయు నట్టహాసుం డతని పాదములంబడి వేడికొనియెను.

దేవా? పిల్లవాండ్రము తెలియక వినోదముగా నాటకమాడు కొంటిమి. మిమ్మాక్షేపించు నభిప్రాయము నించుకంతయు మాకులేదు. దైవముతోడు రక్షింపుఁడని ప్రార్థించుటయు నలకూబరుండాత్మగతంబున నేను రంభానురక్తుండనని లోకులు నన్నాక్షేపింపకపోరు. నోరుమూసిన లోకమును మూయఁగలమా? మీరు నాకీ నాటక రూపంబున బుద్ధిఁజెప్పిరి. తొందరపడి శపించుట నాదే తప్పు. అని వారియెడ ప్రసన్నుండై వెండియు నిట్లనియె.— అట్టహాసా! నా శాపమమోఘము. అనుభవింపక విడువదు. కానిమ్ము నీ కథయంతయు నే వినియుంటిని. కౌముది యను యక్షకాంతను బెండ్లియాడ నుద్యుక్తుండ వైతివి. దాని కంతరాయము గలిగినది నీవు మనుష్యుండవై పుట్టి యే కాంతను వరించితివో యా యక్షకాంతనే బెండ్లియాడి దానియందు నీ తమ్ముడు ఈ దీప్తశిఖుని కొడుకుగాగని పిమ్మట యక్షుండవయ్యెదవు. కుమారోత్పత్తి పర్యంతమే నీకీ శాపాప్తి. నీ కొడుకుఁగూడ మనుష్యుండై కొంతకాలము సుఖదుఃఖము లనుభవించి వెండియు యక్షుండు కాఁగలఁడు. ఈ యక్షకుమారు లందఱు మనుష్యులై మీకు సహాయము సేయఁగలరు. అని పలికి నలకూబరుండు విమాన మెక్కి యలకాపురంబునకుం బోయెను.

ఆ యుదంతమంతయు నేఁడు నీవు సుతప్రశంసదెచ్చినంత జ్ఞాపకమువచ్చినది. ఆ యట్టహాసుఁడవే నీవిట్లుదయించితివి. నేనే యా సౌదామినిని. మనమిట్లు కలిసికొంటిమి. తప్పక నా యందు నీకుఁ గుమారుఁ డుదయించును. వెంటనే మనకు శాపాంతమగును. అని చెప్పిన పవిత్రాధరుఁడు సంతోషించుచు మఱికొంతకాల మా కాంతతో సుఖించెను.

కాలక్రమంబున నన్నెలంతియ గర్భవతియై శుభముహూర్తంబున కుమారుని గనినది. పుత్రకుని మొగము చూడగనె పవిత్రాధరుఁ డట్టహాసుఁడై భార్యతో నిట్లనియె. సౌదామినీ! మనకు శాపాంత మైనది. మనమిక స్వదేశమున కరుగుదమే యనుడు యక్షిణి మనోహరా! నాయందు నీ తమ్ముఁడు దీప్తశిఖుండు కొడుకుగా నుదయించెఁ గదా? వీని నేమిచేసిపోవలయును? వీనికి దిక్కెవ్వరని యడిగిన నతండిట్లనియె.

సౌదామనీ! మా నగరంబుననే దేవదర్శనుండను బ్రాహ్మణుండు గలఁడు. అతనిభార్య మహాపతివ్రత. ఆ దంపతులు పుత్రోదయమునకై నిత్యము నగ్నిహోత్రు నారాధింపుచుండు. నీ విప్పుడీ శిశువును దీసికొనిపోయి అగ్నిశరణంబున నీ కనకకల శంబున నెవ్వరికిని దెలియకుండ బెట్టిరమ్ము. తరువాత నా దంపతులు వానినిజూచి యాదరముతో బెంచుకొనఁగలరు. ఇదియే కర్తవ్యమని యెఱింగించిన నక్కురంగన యనయట్లు గావించినది. ఆ బాలునకే కాదా వారు శ్రీదర్శనుడను పేరుపెట్టిరి. అతని చరిత్రమంతయు నీకుఁ జెప్పియే యుంటిని. ఇదియే శాపకారణమనియెఱింగించెనని చెప్పునప్పటికి కాలాతీతమయినది.

## 286 వ మజిలీ

# పాటలి కథ

పుత్రకుఁడు చెప్పిన యా కథయంతయు విని యా యవ్వయాశ్చర్యమం దుచు "ఔరా! యెంత చమత్కారమైన కథచెప్పితివి. దీనినంతయు ననువదించుకొని రేపు రాజకుమార్తె యొద్దకుంబోయి చెప్పెదనుగాక. ఈ కథవిని యామె చాల సంతో షింపగలదు" అని మెచ్చుకొనుచు నా వృద్ధ మఱునాఁ డా పాటలియొద్దకుఁ బోయినది. ఆ చిన్నది నీవు మూడుదినములనుండి వచ్చుటలేదేమి? కథలు వినఁ దీరికగా నుంటినే. ఏమి పనివలన రాకుంటివని యడిగిన నామె తల్లీ! నీకుఁ జెప్పుటకు మంచికథలు సంపా దించుకొని వచ్చితిని. అందుల కాలస్యమైనది. వినుమని పుత్రకుఁడు చెప్పినకథ యైదుదినములు చెప్పినది. ప్రతిదినము రాత్రి యింటికివచ్చి బాబూ! నీవు చెప్పిన కథ మా రాజపుత్రిక చాల శ్రద్ధగా వినుచున్నది. ఇంత ప్రీతిగా నిదివఱ కెన్నఁడును వినలేదు. నీవీ కథ యెక్కడ సంపాదించుకొని వచ్చితివని యడిగిన నిజము చెప్పక యేదో బొంకితిని మరియొకనాఁడు పట్టీ! నేటి కథలో "దేవీపరిచారికాగణము నిద్రలో శ్రీదర్శనుని దీసికొనిపోయి యనంగలతికతోఁ గలిపిన విషయము " విని మేను గఱు పాఱ నదియే రసవంతమైనపట్టని మెచ్చుకొన్నది.

మరియొకనాఁ డాయవ్వ మరియును వచ్చి పుత్రికా! నేటితో కథ సాంత ముగా జెప్పితిని. అందులకు మెచ్చుకొని నాకు నూటపదాఁలు కానుక లొసంగినది చూడుము. అని చూపుటయు పుత్రకుడు సంతోషించి అవ్వా! యిక నే పోయివత్తు నను జ్ఞయిత్తువా? అన నామె యిట్లనియె బాబూ! నీతో జెప్పుట మరచితిని. ఇట్టికథలు మరికొన్ని విని నాకు జెప్పుమని రాజపుత్రిక యాజ్ఞాపించినది. నీవు వెళ్ళిన యెట్లు? కొన్ని కథలు జెప్పవలసియున్నది. నీ వలన మాకు గానుకలు రాగలవని బ్రతిమాలు కొన్నది. కథలు చెప్పుచు పుత్రకుడు కొన్నిదినంబు లాయూర వసించెను.

ఒకనా దత దాత్మగతంబున నిట్లు తలంచెను. అవ్వ చెప్పిన మాటలవలన బాటలి మక్కిలి చక్కనిదని తోచుచున్నది. నే నొక రాత్రిపోయి తద్విశేషము లరసి వచ్చెదనుగాక యని యాలోచించి యవ్వవలన యామె యంతఃపుర గుర్తులన్నియును దెలిసికొని యొకనాడు నడిరేయి పాదుకలను దొడిగికొని యందు వోవదలంచుకొని నంత నా ప్రాంతమున నిలువంబడి యుంటిని.

దివ్యాలంకారశోభితంబగు నా గదిలో పట్టుదోమతెరచే నా వృతమగు హంస తూలికా తల్పంబున బండుకొని జగంబంతయు జయించి విశ్రాంతి వహించిన పంచ శరుని శక్తియంబోలె నిదురించుచున్న యమ్మించుబోడిని గాంచి సమీపించి తెరయెత్తి యాపాద మస్తకము యా కోకస్తనిని విమర్శించి చూచి మేన సాత్త్వికవికారములు బొడసూప దీనినెట్లు మేల్కొలుపువాఁడ? పరబుద్ధియ ప్రత్యక్షము. యేమి యభిప్రాయము పడునో యని యాలోచించుచుండ యామకుని వాక్యంబు లిట్లు వినంబడినవి.

శ్లో॥ ఆలింగ్య మధురహుంకృతి
మొలసోన్మిభదీక్షాణాం రహః కాంతాం
యద్బోధయని ప్రసుప్తాం
జన్మనియూనాం తదేవఫలం.

మధురమగు హుంకారధ్వనులతో నలయికచేఁ గన్నులు మూసికొని నిద్ర బోవుచున్న యన్నుమిన్నను నేకాంతముగా నాలింగనము చేసికొని లేపుటకంటె యౌవనవంతులకు నా జన్మమున నెక్కువ సంతోషము వేరొకటి లేదుగదా! అట్టి శ్లోకమును విని పుత్రకుడు ఔరా! నాకీశ్లోక మపశ్రుతివలె వినంబడినది. ఇది శకునసూచకమే. అయినను తొందరపడరాదు. కొన్ని చిట్టకంబులను గావించి యవ్వవలన తదాశయంబు గ్రహించెదంగాక. అని యాలోచించి యందున్న గంధపు గిన్నెలోని నత్తరువంతయు గుమ్మరించి తమలపాకులందు ముంచి యామె గప్పుకొన్న వలువపై ముద్రగా నంటించెను. చిత్రపుల బీకముల తారుమారు గావించెను. కొన్ని పాత్రల బొర్లించెను. అట్లు కావించి పుత్రకుడు తెల్లవారకమున్నపాదుకలెక్కి యింటికిం బోయెను.

మరునా డుదయంబున లేచి యా చిగురుబోడి వలువపైనున్న గంధపు ముద్రలం జూచుకొని యిట్లు కావించిన వారెవ్వరని తుడిచికొనుచు నత్తరువంతయు నొలికి గుమగుమలాడుచుండ బరికించి వస్తువిపర్యాసము విమర్శించి యా రహస్యమెవ్వరికిని జెప్పక తత్కారణ మాలోచించుచుండెను. అంతలో సమయమగుటయు వాడుక ప్రకార మవ్వకథ జెప్పుటకు వచ్చినది. పాటలి యామెనుజూచి అవ్వా! నేడు పెద్దకథ మొదలుపెట్టకుము. చిన్నకథ జెప్పుము అని యడిగిన చిత్తమని యామె యిట్లు చెప్పదొడంగినది.

# కథ

ఒక దేశములో నొకరాజకుమార్తె కలదు. దాని చక్కదనమిట్టిదని చెప్ప ఫణిపతికి శక్యముగాదు. ఆ చిన్నది పూర్ణయౌవనములోనున్నది. తండ్రి యనురూపవరాన్వేషణముం గావించుచుండ దగిన వా డెవ్వడును దొరకలేదు. ఒకనాడామె యంతఃపురమునందు నిద్రించుచుండ మన్మథునింబోలు యువకు డెట్లో యామె పడక గదిలో ప్రవేశించెను. వెరపుతో నిద్రించుచున్న యామెమంచము దాపునకుంబోయి యామె పాదమస్తకముంగా విమర్శించి చూచి మోహ పరవశుండై యాలింగనము చేసికొనదలంచియు పరబుద్ధి యెట్లుండునోయని యామె నంటక యందలివస్తువుల తారుమారు చేసి వచ్చిన దారి సంరీకిం బోయెను. దేవీ! నేనింతవరకే వినివచ్చితిని. పై కథ రేపు వచ్చి చెప్పెదంగాకయని చెప్పిన విని యప్పడతి విస్మయావేశముతో నవ్వ కిట్లనియె.

అవ్వా! మొండికథ చెప్పి యూరకుంటివేమి? తర్వాతచెప్పినంగాని నిన్ను పోనియ్యను. ఇంకను వేళయున్నది. కథలో సందియము లుండగూడదు! అ పురుషు డెవ్వడు? ఆచిన్నదాని యంతఃపురమున కెట్లు వచ్చెను? ఎగిరివచ్చెనా? దూరివచ్చెనా? అని యడిగిన గడగడలాడుచు నాయవ్వ యిట్లనియె. అమ్మా! నేనువిన్నకథ జెప్పితిని.

రాజపుత్రి—ఎవరివలన వింటివి?

అవ్వ—ఇదివరకు చెప్పినకథలన్నియు నెవ్వరివలన వింటినో నిదియు వారివలననే.

రాజపుత్రిక—తొందరలో నిన్నడుగుట మరచితిని. ఆ కథలు నీ కెవ్వరు చెప్పిరి?

అవ్వ—అమ్మా! ఒకరననేల ఊరంతయు దిరుగుచుందును. సత్రములు మఠములు చావడులు రచ్చలు చేరినవారు చెప్పుకొనుచుండ దాపునం గూర్చుండి వినుచుందును.

రాజపుత్రిక—అవ్వా! నీవు నాకడ నబద్ధములాడకుము ఈ కథ యే సత్రములో నే చావడియొద్ద నెవ్వడు చెప్పెనో చెప్పుము.

అవ్వ—(భయ మభినయించుచు) దీనిలో తప్పేమైనంగలదా తల్లీ! యెవ్వరు చెప్పిరో జ్ఞాపకము లేదు.

రాజపుత్రిక—అసత్యమాడుచుంటివా? నేడు చెప్పినవారినే మరచితివా?

అవ్వా—తల్లీ! ఈ కథవిని చాలదినములైనది. నేడు చిన్నకథ చెప్పుమనిన నిది చెప్పితిని.

రాజపుత్రిక—ఈ కథ నేడే వింటివి. అబద్ధ మాడకుము. నీ కేమియు భయములేదు. యథార్థము చెప్పుము.

అవ్వ—(స్వగతము) ఈ కథ నేడే చెప్పినట్లు లీమెయెట్లు గ్రహించినదో యీమెకడ నసత్యములాడుట కష్టమే. (ప్ర) తల్లీ! యథార్థము జెప్పెద వినుము. నిన్న మా యింటికొక బ్రాహ్మణ కుమారుం డతిథిగావచ్చి యీకథ చెప్పెను.

రాజపుత్రిక—అతం డెన్ని యేండ్లవాడు? వృత్తియేమి?

అవ్వ—తొలి ప్రాయమువాడు. మీసములింకను పూర్తిగారాలేదు. నీకడ దాచనేల బ్రాహ్మణ కుమారుడేకాని రాచబిడ్డలకైన నట్టి సోయగ ముండదు. సంతతము జపము చేసుకొనచుండును.

రాజపుత్రి నీ యింటి కతండువచ్చి యెంతకాలమైనది?

అవ్వ-నిన్ననే.

రాజపుత్రి-ఇంకను బొంకుచున్నావుగదా! నీవుజెప్పినకథ లన్నియు నతఁడే చెప్పినట్లు తలంచెద. ఏమందువు?

అవ్వ - అతడే కాఁబోలు జ్ఞాపకములేదు.

రాజపుత్రిక — అట్లయిన నీ విప్పు డింటికింబోయి తరువాయి కథ యతనివలన విని రేపు పెందలకడవచ్చి నాకుఁ జెప్పుము అని నియోగించిన యా యవ్వ దైన్యముతో నింటికి వచ్చినది. పుత్రికుఁ డామెను జూచి అవ్వా! నీ మొగ మట్లున్న దేమి? నీ కథ రాజపుత్రిక వినినదా? నేఁడు పెందలకడ వచ్చితివేమి? అని యడిగిన నామె యిట్లనియె.

అబ్బాయీ! నేఁడు నీవు చెప్పినకథఁ జెప్పితిని. ఎవ్వరు సెప్పిరి? ఎప్పుడు చెప్పిరి అని యా చిన్న దన్నియు శంకలే చేసినది. చివరకు నీవే చెప్పితివని తెలుపక తీరినది కాదు. తరువాతి కథ విని రేపు పెందలకడవచ్చి చెప్పుమన్నది. ఇదివరకెప్పుడు నిన్ని శంకలు చేయలేదు తరువాతి కథ చెప్పుము. రే పామెపోరు తీర్చి వచ్చెదనని యడిగిన నతం డిట్లనియె.

అవ్వా! ఆ కథ నే నొకచోట నంతియే వింటి. పై కథ నాకునురాదు. రాజపుత్రికనే యూహించి చెప్పుమనుము. నీవుభయపడ నవసరము లేదు అని యక్కడ చెప్పవలసిన మాటలన్నియుం జెప్పిమరునాఁ డాయవ్వను రాజపుత్రికయొద్ద కనిపెను. అప్పు డందెవ్వరును లేరు. పాటలి మాత్రమే యవ్వరాక నిరీక్షించు కొనియున్నది. అవ్వను జూచి చిఱునగవుతో రా రమ్ము. ఆలసించితివేమి? అతడు కథ చెప్పెనా? ఎట్లు లోపలికి వచ్చెనో యడిగితివా? అని యడిగిన నా వృద్ధ యిట్లనియె.

తల్లీ! నీతోడు యథార్థము చెప్పుచున్నాను వినుము. అతనికి గగన సంచారశక్తి గలదఁట. ఆ మాట మాత్రమే చెప్పెను తరువాతి కథ నతని కేమియు రాదఁట. అతం డెఱిగినకథ యంతేనఁట. కాళ్ళమీఁదఁబడి బ్రతిమాలికొని యడిగితిని. ఏమి చేయుదును? ఆ కథ పూర్తి బుద్ధిపాటవముగల పాటలియే పూర్తి చేయగలదు. ఆమెచేత చెప్పించుకొనిరా నేను విని యానందించెద అని

చెప్పెను. తల్లీ : ఇంతకన్న నా కేమియుం దెలియదు నా తప్పు మన్నింపుమని ప్రార్థించినది.

పాటలి నవ్వుచు అవ్వా : వారి కంతకన్న రాదు కాఁబోలు. పై కథ నేనే పూర్తి చేసెద వినుము. ఆ దివ్యపురుషుఁడు మనునాఁ డర్ధరాత్రంబున వెనుకటి వలెనే నా యంతఃపురవనకు వచ్చి యందితరు లెవ్వరు లేకుండుట సంతోషింపుచు దివ్యాలంకారశోభితయై యాచిన్నది తాంబూల చందనాదులు మంచము దాపున నమర్చి యుండుటఁ దిలకించి తదాశయము గ్రహించెను. దివ్యపురుషసంభోగంబున కనుమతింపని వెంగలి యెందైనంగలదా? ఆ పురుషుని నెదురఁజూచి సౌందర్యంబున కానందించుచు నమ్మదవతి నిదురించుచున్నట్లభినయించినది. అంతలో నతం డాచిహ్నము లన్నియుం గ్రహించి దాపునకువచ్చి గంధపుగిన్నె దీసికొని పరిమళద్రవ్యము లామెపై చిలికించెను. ఆ రాచపట్టి యట్టె లేచి దొంగా దొరికితివాయని చెయ్యిపట్టు కొనినది. తరువాత సంగతి సర్వజనవిదితమే. తత్కథాశేష మిట్లుండునని యూహించి చెప్పితిని. అవ్వా : ఈ థ నేను పూర్తిచేసితినని వారితోఁ జెప్పవలదుసుమీ. అంతఃపుర పరిచారకలెవ్వరో చెప్పిరని చెప్పుము పొమ్మని యాజ్ఞ యిచ్చినది.

వెంటనే యవ్వ యింటికివచ్చి పుత్రకా : తరువాయి కథ యెంతయో యుండునని కొంటిని. ఆమె యిట్టె పూర్తిచేసినది అని చెప్పి నాలుకగఱచుకొనుచు నామెకాదు ఆమెపరిచారిక యనుటయు నతండు నవ్వుచు కానుపూర్తిచేసినట్లు చెప్పవలదన్నది కాఁబోలు పోనిమ్ము ఎవ్వరైననేమి కథాశేష మెట్లు చెప్పినదో యెఱింగింపు మనవుడు పాటలిచెప్పిన విషయములే యతనికి బోధించినది.

ఆ కథవిని యతం డమృతహ్రదంబున మునింగినట్లు సంతసించుచు నాఁటిసినసెట్లో వేగించెను. నాఁటిసాయంకాలమున పుత్రకుఁడు చక్కగా నలంకరించుకొని నడిరేయిదనుక వేచి పిమ్మటఁబాదుకి లెక్కి సంచిచేతంబూని యక్కాంతామణి యంతఃపురమున కరిగెను. ఆ చిన్నదియుఁ జాలప్రొద్దుపోవువఱకు మేల్కొని యాగలేక యంతలో నిద్రపోయినది. అతఁ డామెదాపునకుఁ బోయి లేపుటకు వెఱచుచుఁ దాంబూలమువైచికొని చందనము నామె చెక్కులకురాచి యప్పటికిని లేవకున్న నాసంచియొకచోట దులిపి దీనారములు రాసిగాఁబోసి యందలి వస్తువులు తాఱుమాఱు చేసి వేకువజామున నింటికిం బోయెను. అతని రాకపోకలేమియు నవ్వ యెఱుంగదు.

అవ్వ మరునాడుదయమునలేచి "రాజకుమార్తెయొద్దకుబోవలయు. నేఁడెద్ది యేని కథ చెప్పెదవా ?" అని యడిగిన నతం "డవ్వా : రాత్రినాకు నిద్దుర యించుకయుఁబట్టినదికాదు. ఇప్పుడు కునికిపాట్లుగా నున్నవి. కథ జెప్పఁజాలను. ఆ మాటయే పాటలిక యడిగినఁ జెప్పుము. పొమ్మని యంపెను. అవ్వ రాజపుత్రికయొద్దకేగిన నా యెలనాఁగ నవ్వుచు "అమ్మా : నేఁడెద్దియేని వింతకథ వినివచ్చితివా ? ఆయన నే జెప్పిన కథాశేషమువిని యేమనెను" అని యడుగుటయు నామె తల్లీ : నీ కథవిని నీ

బుద్ధికుశలత కతండు చాలమెచ్చికొనియెను. అట్లే జరుగగలదని యతం డొప్పుకొనెను. నేడొక కథచెప్పుమని యడిగితిని. రాత్రినిద్రలేదట కునికిపాట్లు పడుచున్నాడు. రేపు చెప్పించుకొని వచ్చెదనని సమాధానము చెప్పినది.

రాజపుత్రిక "అవ్వా! నేడు నీవు పెందలకడ నింటికిబొమ్ము. పండుకొని నిద్రబోయెద. రాత్రి గ్రంథకాలక్షేపము చేయుదమని తలచితిని నిద్రయావేశించి యంతరాయము గలుగజేసినది నేడుపగలే పండుకొని రాత్రిమేల్కొనియెదంగాక పొమ్మని" యనతిచ్చినది. అవ్వ యింటికివచ్చి పాటలిమాటలన్నియు బుత్రుకస కెరింగించినది.

మరునాడు రాత్రి యతండు పాదుకలెక్కి యంతఃపురమున కరిగెను. పాటలి తనయింటనున్న హాటకపురాశిం జూచి యతండు దివ్యపురుషుండని నిశ్చయించుకొని యున్నదగుట నాటిరేయి నిద్దురపోవక ప్రొద్దుపోవువరకు మేల్కొని యతని యలుకుడు వినినతోడనే మంచముపై బండుకొని దొంగనిద్రబోవుచుండెను. అంతలో నతండు మంచముదాపునకువచ్చెను తదాకారమున కచ్చెరువందుచునచ్చెలువ నోరచూపులచే జూచుచుండ నతండు చొరవచేసి గంధముదీసి చెక్కులకు రాచెను. తటాలుననలేచి యాచిగురుబోడి వానిచెయ్యిబట్టుకొని "దొంగా! దొరికితివి వెందుబోంగల"వని పలికిన నవ్వుచు జవ్వనీ నే నిక్కడకేవచ్చితిని. ఎక్కడికిబోగలను నీవు చెప్పినకథలోని నాయకుడనుగానా? దొంగనెట్లయితిని? ననవుడు చిరునగవుతో నామె యిట్లనియె.

పురుషోత్తమా! నేను మీరు చెప్పినకథయే పూర్తిచేసితినిగాని మొదట చెప్పినవారెవరు? చల్లకువచ్చి ముంతదాపనేల? లోపలి కేయభిప్రాయముతో వచ్చిరి. ఆ యభిప్రాయము వడువున జరగవలసినదే. మిమ్మింతదనుక శ్రమపెట్టినందులకు నాతప్పు మన్నింపుడు. అని పలుకుచు లేచి పాద్యమిచ్చి పీఠముపై గూర్చుండబెట్టి యశవృంతమున వీచుచు నిట్లనియె.

మనోహరా! నీచరిత్ర మవ్వవలన గొంతవింటిని. అంతటితోం దృప్తి పొందలేదు. మీకాకాశగమనపాటవ మెట్లుగలిగినది? మీ జన్మభూమి యేది? మీ వృత్తాంతము జెప్పుడని యడిగిన పుత్రకుండు తన కథ యాద్యంత మెరింగించి యక్కురంగనయనను విస్మయ సాగర తరంగముల నీదులాడించెను. పిమ్మట నాకొమ్మ యతనిం గాంధర్వవిధిం బతిగా బరిగ్రహించి కొంతసేపు శృంగారచేష్టలు వెలయింపుచు నతనితో ననిర్వాచ్యమైన యానంద మనుభవించినది.

సూర్యోదయము కాకమున్న యతం డింటికిం బోయెను. ఆ రహస్య మవ్వ యేమియు నెరుంగదు. ప్రతిదినము నట్లు జరుగుచుండ పాటలి గర్భవతి యైనది. చెలులు తెలిసికొని యీశ్వరుని వచ్చినజాడ గనంబడమి వెరగుపడుచు నిత్యము గదిలోనుంచిన పరిమళద్రవ్యంబు లనుభవింపబడుటకు శంకించుచు తద్గర్భచిహ్నములు

గనిపెట్టి గుమిగూడి యాలోచించి చెప్పకున్న తమకు మాటవచ్చునని వెరచి యెట్లో రాజుగారికి దెలియజేసిరి. రాజు నిజము దెలిసికొనుటకై కొన్నిదినము లంతఃపురమున కాపు పెట్టించెను గాని ప్రయోజనము లేకపోయినది. మంత్రులతో నాలోచించి దాసీజనము నియోగించి పాటలి శయనించు తల్పంబుల రహస్యముగా లత్తుకరసము నించిన దూదిపంజకలు నిలిపించెను.

పుత్రకుఁడు పాదుకప్రభావము గగనమార్గంబునవచ్చి యచ్చిగురుఁబోడితోఁ గూడికొని తల్పంబునం బండుకొనలత్తుకరస మతనిపుట్టముల నంటుకొనినది. అతండది యెఱుంగక వేకువజామున నింటికి వచ్చెను. ప్రొద్దున దంతధావనము చేయుచుండఁ బరీక్షింప నిల్లిల్లుఁదిరుగుచున్న రాజభటులు వానిపుట్టంబుల లత్తుకరసముఁ జూచి పట్టికొని వెంటనే రాజునొద్దకురమ్మని నిర్బంధించిరి. అతండు పాదుకలఁదొడిగికొని దండమును సంచిని జేకొని రాజసభకుఁ బోయెను. రాజు వానిం జూచి "నీ వెవ్వఁడవు? నీ పుట్టమున కీలత్తుకరస మెట్లువచ్చినది" అని యడిగిన పుత్రకుఁడు పాదుకలు దొడిగికొని యున్నవాఁడగుట రాజా! నీ కూఁతురు పాటలి తల్పంబునం బండుకొనగా నంటుకొన్నది తెలిసినదా! అని పలుకుచు పాదుకా ప్రభావంబున నంతర్థానమై పాటలియొద్దకరిగెను ఆమెయు నతనిం బట్టుకొనుచున్నారన్న వార్త విని యచలుచుండ నూరడించి యతండు దేవీ! మన మీఁక నిందుండరాదు. ఎందేనిం బోయి సుఖింతము రమ్మని పలికి యక్కలికి నక్కునం జక్కఁబట్టి పాదుకలం దలంచికొని గంగాతీరంబుఁ జేర్పుమని ప్రార్థించెను. గడియలో నాతరంగిణీతటంబు నకుం బోయి నిలిచిరి. అది తృణకాష్ఠజలసమృద్ధి గలిగి యత్యంతరమణీయంబై యొప్పుచున్నది.

పుత్రకుండందు నివసింపఁదలంచి పాటలితోఁగూడ గంగాస్నానముజేసి యభీష్టదేవతల నారాధించి యాదండము రెండవ కొనతో గట్టిగాగీచెను. అందు గొప్ప పట్టణ మావిర్భవించినది. దానింజూడ స్వర్గపట్టణమునకు బొమ్మగట్టినట్లున్నది. భూమిలోనుండి పైకివచ్చిన భోగవతీనగరమో యన విరాజిల్లుచున్న యప్పటభేదంబున నతండు గొప్పకోట గట్టించి సంచిదులిపి ధనరాసులు ప్రోగుచేసి దానికిరాజై యధిక వైభవముతోఁ బాలించుచుండెను.

అ నగరమునకు భార్యపేరును దనపేరునుం గలిపి పాటలీపుత్రమని పేరు పెట్టెను అప్పటినుండియు నాపురము గంగాతీరంబున సకల సంపదలకు నాకరంబై విరాజిల్లుచున్నది. గోపా! నీ వడిగిన ప్రశ్నమునకు సమాధానము వచ్చినదాయని యడిగిన వాడిట్లనియె. తండ్రీ! నేను చిన్నప్రశ్న యడిగితిని చివలకు పలవలు గల్పించి పెద్దకథ జెప్పితిరి. ఇట్టి సామర్థ్యము మీకుఁగాక . యొరులకుఁగలదా! నేను పాటలీపుత్ర వృత్తాంతము విని కృతకృత్యుండనైతి నని యలని నగ్గించెను. ఇరువురుంగలసి యట కదలి తరువాత మజిలీ చేరిరి.

## 287 వ మజిలీ

# ప్రహ్లాదుని కథ

ఉ. వేదవి దాదిశంకర విభీషణ నారద విక్రమార్క భో
జాది మహానుభావుల కథాతిశయంబులు దెల్పి నాకు స
మ్మోదము గల్గఁజేసితిరి మున్నిపు డాదిమభక్తుఁడైన ప్ర
హ్లాదుని సచ్చరిత్రము మహాత్మ! వచించి కృతార్థుఁజేయవే.

గీ. పిన్నతనము మాయూరి పెద్దవీధిఁ
బాటఁ బాడుచుఁ బ్రహ్లాదనాటకంబు
నాడఁ గనుఁగొంటి నతని భక్త్యతిశయంబు
భళిర! వర్ణింప శక్యమే బ్రహ్మకైన.

క. హరి యనవలదని జనకుఁడు
కరులం ద్రొక్కించె ఫణులఁ గరపించెఁ దలన్
నఱికించె నసుల గిరులం
దొరలించెన్ లోతునదులఁ ద్రోయించెఁ గదే.

అబ్బాలునిం బెట్టుకష్టంబులు చూచి నేను నిజమె యనుకొని యూరక యేడ్చువాఁడ సామీ! యెన్ని చిక్కులు పెట్టినను నా పిల్లవాడు హరిహరీ యనుచునే భజన సేయువాఁడు. చివరకు దండ్రికి గోపమువచ్చి చేతనున్న దండముతో నందున్న కాకితపు స్తంభము మీద గొట్టుటయు నందుండి బాబో పెద్దనోరు దెరచికొని భయంకరమైన సింహమే గుభాలున నివలకువచ్చి వానిం బట్టుకొని కాళ్లపైవైచికొని గోళ్ళచే బొట్టఁజీల్చి ప్రేగులదీసి జందెములుగా వేసికొనియెను. తండ్రీ! నిజముగా నట్లచేసెనా? అప్పుడంతవట్టు నా కథవింటి. ప్రహ్లాదు డా సింహము కడకుఁబోయి ప్రార్థించిన నా సింహము కోపముతగ్గి వానితో నేదియో చెప్పినది. అంతటిలో నా నాటకము ముగిసినది. తరువాత బ్రహ్లాదుడు రాజ్యంబు సేసెనా? అతని చరిత్రమెట్లు ప్రవర్తిల్లినదో విన వేడుక యగుచున్నది. నేడు హరివాసరమగుట నా పరమభక్తుని చరిత్రముజెప్పి నన్ను గృతార్థు గావింపుడని వేడిన సంతసించుచు మణిసిద్ధుండు రత్నప్రభావంబున తద్వృత్తాంతము దెలిసికొని యిట్లు చెప్పం దొడంగె——

తొల్లి హిరణ్యకశ్యప వంశసంజాతుండగు హిరణ్యకశిపుండు దానవ చక్రవర్తియై మూడులోకంబులు నేకాతపత్రముగా బాలించు చుండెను. అతనికి వెరచి మహేంద్రుండు ద్వారపాలుండై, యగ్ని వంటవాడై, యముడు దండనాథుండై, నిరుతి క్రీడాసఖుండై, వరుణుండు జలప్రదుండై, వాయువు వాకిళ్ళుదుడుచువాడై, కుబేరుడు ధనాగార రక్షకుండై, ఈశానుడు పురోహితుండై వేల్పులు పరిచారకులై, తుంబుర ప్రముఖ గంధర్వులు గాయకులై, యచ్చరలు తొత్తులై సేవించుచుండ గొన్నినాళ్ళత

ప్రభుత్వము నిరాటంకముగా సాగినది. స్వర్గాదిపట్టణంబులగల మందిరత్నంబు లన్ని యుం దీసికొనిపోయి తనయింట నలంకరించుకొనియెను. నందన చైత్రాదివనంబులం గిల తరులతా విశేషంబులన్నియు దన తోటలో నాటించుకొనియె—

వాని తమ్ముడుహిరణ్యాక్షు డనువాడు విష్ణునిచే వరాహరూపంబున సంహ రింపబడుట విని సక్రోధుండై హిరణ్యకశిపుండు హరిం జంప వైకుంఠమున కరిగెను. అప్పుడా దామోదరుడు వాని నెదిరింపక యదృశ్యుండై వాని కడుపులో బ్రవేశించెను. మూడు లోకములు వెదకి హరిం గాన తన్నిలమూలలగు యజ్ఞంబులఁ జెరచియు గోబ్రాహ్మణులవధించియు, బుణ్యతీర్థంబు బాడుచేసియు సర్వలోక కంటకుండై వర్తించు చుండ విష్ణుండు వాని వధోపాయ మరయుచుండెను.

అతనిభార్య లీలావతి మహాపతివ్రత, విష్ణుభక్తిపరాయణ. కొంతకాలము సంతానములేక పరితపించి నారదదత్త మంత్రప్రభావంబున గర్భవతియై వరుస ప్రహ్లాదాదికుమారుల నలువురం గనినది. అందు ప్రహ్లాదుండు హరిభక్తి పరాయణుండై దామోదరుని స్మరించుచుండ హిరణ్యకశిపుండు వాని ననేక మారణోపాయంబుల వధింప బ్రయత్నించియు విఫల మనోరథుండై నరసింహాకృతి నవతరించిన శ్రీమన్నారాయణునిచే వధింపబడియెను. ఇంతవరకు నా కథనాటకములో నీవు చూచి యుండుదు తరువాత వినుము.

విష్ణుండు హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని దానవ రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునింజేసి వైకుంఠంబున కేగెను. రాక్షసులలో దైత్యులనియు దానవులనియు రెండు తెగలవారు గలరు. వారికెల్ల ప్రహ్లాదుండురాజై పెదతమ్ము డనుహ్లాదుండను వాడు ప్రధాన మంత్రియయి విప్రచిత్తినముచి త్రిలోచన శకుని శంబర పులోమాదులు సామంతులై సేవింప రాజ్యము సేయుచుండె—

సీ. సముచిత భక్తిఁ శ్యాసంబులతోఁ గొల్వ
వలయు గోబ్రాహ్మణకులము నెల్ల
యజ్ఞయాగంబుల కొంతక మించక
యేని చేయఁగరాదు మౌను లఱుగ
ధరఁగల పుణ్యతీర్థంబులెల్లను సర్వ
సులభసాధ్యంబులై వెలయవలయు
దైత్యదానవులెల్ల దామోదరాంఘ్రి సే
వాపరాయణులై పరఁగవలయు

గీ. ననుచుఁ జాటింపజేసె ప్రహ్లాదుఁ డాత్మ
దేశభాగములెల్ల దైతేయసమితి
గుండియలుఝల్లు సజ్జనకోటి మెచ్చ
నంరి పట్టాభిషిక్తుఁడై నట్టినాఁడె.

అట్లు ధర్మంబున రాజ్యము సేయుచుండ నొకనాఁడు ప్రహ్లాదుని కడకు దమ్ముఁ డనుహ్లాదు డరుదెంచి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె—

అన్నా! నీవు కేవలము సాత్వికుండవై దండనీతి నతిక్రమించి విష్ణుభక్తుండ వగుట, శౌర్యంబుచూపకున్న కతంబున వేల్పులు దైత్య దానవుల బరిహసించుచు నవమానము సేయుచున్నారు. రాజునకు గల మర్యాదలు నిలుపుట పరమధర్మంబు. మన తండ్రిగారు దేవతార్చనసేయ నింద్రుండు నిత్యము నందనవన పారిజాతాదికుసుమంబుల గంధర్వులచే దెప్పించి పూజాగృహంబున స్వయముగా సమర్పించువాడు. అట్టి సురపతి నీవు పట్టాభిషిక్తుండవైన వెంటనే సేవకావృత్తి మరచి విష్ణునితో గూడ స్వర్గమునకు సిరగించెను. తక్కినదిక్పతులును దమకిష్టములు తొలగినవని స్వేచ్ఛగా లేచిపోయిరి. కాని నీ సెలవెసంబొందిరా? ఇక దక్కిన రక్కసుల లెక్క వారికే మున్నది. మునుపు మన తోటలలో మొక్కలుత్రవ్వు వేల్పులు నొక్కసారిఅయిన నీ దర్శనమునకు వచ్చితిరా? నీవు విష్ణుభక్తుండవైతగమ్ము. సాత్వికుండవైన నగదువుగాక. వంశాచారముల విడనాడుట నీతికి వ్యతిరేకము.

ఇంద్రుండు గంధర్వులచే నిత్యము దేవతార్చన కుసుమముల నేటికిఁ బంపడో వారినంపవలయు. అప్పుడప్పుడు వచ్చి నిన్నుదిక్పతు లేమిటికి సేవింపరో యడుగవలయు. వారిచే నీవు పనులు గొనవని యెఱుఁగుదును. గంధర్వులువచ్చి నీకడ విష్ణుకీర్తనలు పాడగూడదా? వేల్పులువచ్చి విష్ణుగాథలు ముచ్చటింపరాదా? నీవు సింహాసనమెక్కి యారుమాసములైనది. ఒట్టుబెట్టినట్లొక్క వేల్పయిన వచ్చి నిన్ను జూచినాడా? సేమ మరసెనా? తండ్రిగారి కాలములో దిక్పాలురు వచ్చి మనవాకిట గాపులు పడి యుండువారే. అన్నా! మృదు వెన్నడును బూజ్యము కాదుకదా!

దైత్యదానవులు సమూహముగావచ్చి యిప్పు డీ విషయము తమతో ముచ్చటించుకొనఁ దలఁచుకొన్నారఁట. నీవు మెత్తనివాడవైనచో మే మందరము వేల్పులకుబొత్తులమై యుండవలసి వచ్చును. మా కులగౌరవములు నిల్పుము. నీ సెలవైన నింద్రునిం గట్టితెచ్చి నీ పాదముల ముందఁ బెట్టగలము అని వారు కోరుచున్నారు. సెలవేమియని యడిగినఁ బ్రహ్లాదుండు నవ్వుచు నిట్లనియె.

తమ్ముఁడా! నీ వచనములు కేవలము రాజనీతి నాశ్రయించుకొని యున్నవి. ఇదివఱకు మనవారెంత బలవంతులైనను సంగరమున విష్ణునిచేఁ జంపబడుటకుఁ గారణము దెలిసికొంటివా? దేవత లతనికి జుట్టములు. మనము పగవారముగాము. గుణదోష తారతమ్యమే యందులకు గారణమగుచున్నది. ఇంద్రాదిదిక్పతులు మా తండ్రిచేయు ఘోరకృత్యములకు భయపడి యుపచారము సేసిరి. పరిచారకులై పనులు గావించిరి. కాని భక్తిచేగాదు. వేల్పులు మనకు దగ్గరచుట్టములు. దానవు లసూయచే వారితోఁ దగవులాడుచుందురు. త్రిలోకాధిపతియైన మహేంద్రుని ద్వారపాలునిగాఁ జేయుట మన తండ్రి తప్పుగాదా? పూజ్యులైన

దిక్పతులచేఁ బనులుఁగొనుట విరుద్ధముగాదా ? తండ్రిగారి యధికారమట్లు సాగినదని మనముగూడఁ నట్టి తలంపు పెట్టుకొనరాదు. మనము వేల్పులతో మైత్రిగా నుండుటయే నా తలంపు. విరోధ మన్నివిధముల ముప్పుదెచ్చును. అని చెప్పిన తమ్ముడిట్లనియె.

అన్నా ! నీవు దూరము విచారింపవలయును. మనవారు స్వల్పకాలము రాజ్యము జేసినను పౌరుష ఖ్యాతులతో మూడులోకములఁ బేసుపడసిరి. ఎన్నటికైన జావనివారుందురా ? పౌరుషనామములు లేక యజగరమువలె నెన్నాళ్ల జీవించినను ప్రయోజనమేమి ? మన తండ్రిగారివలె ద్రోహకృత్యములు సేయుమని నే జెప్పుటలేదు. వేల్పులచే నూడిగములు చేయింపుమనియు బోధింపను. వంశాచారముల విడనాడఁగూడదని నా యభిప్రాయము.

నీవు నిత్యము లక్షదళంబుల విష్ణు నర్చింపుచుందువుగదా ? అందులకై గంధర్వులచేఁ యింద్రుఁడు పారిజాత కుసుమంబులం బంపరాదా ? ఆ విరుల వాసనలు తా నొక్కరుఁడే యనుభవింపవలయునా ? నీతో మైత్రిచేసి యప్పుడువచ్చి చూచిపోవుచుండఁగూడదా ? ఇంద్రునికింత పొగరేల ? నీవు విష్ణుభక్తుండవుగదా తనకోలికిఁ బని నిర్లక్ష్యము సేయుచున్నాడు. కనుసన్న చేసితివేని దైత్యులతో బోయి యింద్రునింబట్టితెచ్చి నీ ముందుఁబెట్టెదగాక ! ఆజ్ఞ యిమ్మని కోరిన ప్రహ్లాదుండిట్లనియె.

తమ్ముఁడా ! తొందరపడకుము. మనము వార్తనంపిన మహేంద్రుఁడు కావలసినన్ని మందారకుసుమంబులఁ బంపగలడు. అతండును విష్ణుభక్తుండే మన యభిప్రాయము దెలియక యిక్కడకు రాకుండెనుగాని తెలిసిన నిత్యము వచ్చిపోవుచుండునుగదా అని పలుకుటయు, తమ్ముడు అన్నా! నీ వేమియు నెరుంగనివాడవు. అందరు నీవంటివారే యనుకొందువు. ఏదీ నీ ప్రజ్ఞ చూతము. వార్తనంపి పారిజాత కుసుమంబులఁ దెప్పింపుము. ఇంద్రు నొకసారి యిందు రప్పింపుము. అమ్మయ్యో ! అతండు సామాన్యుఁడనుకొంటివా ! అందిన జుట్టును నందకున్న గాళులుం బట్టుకొనును. వృత్రుని మైత్రిచేసి నమ్మించి చంపె నింతకన్నఁ బాతకమెందేనిగలదా ? ఆ బ్రహ్మహత్యయేగాదా యిప్పటికిని వాని బాధించుచున్నది. అతడు చేసిన ఘోరకృత్యములు చాల గలవు. ఇప్పు డుగ్గడింపనేల. మునుమున్ను నీకే తెలియగలదు. ఇప్పుడు వార్తనంపి పూవులను దెప్పింపుము. తరువాత విచారింతమని చెప్పెను.

అప్పుడు ప్రహ్లాదు డాలోచించి యింద్రునిపేర నొకలేఖ వ్రాసి నమ్మకమైన యొక వృద్ధ దైత్యునకిచ్చి స్వర్గంబున కనిపెను. ముప్పది మూఁడుకోట్ల వేల్పులు సేవింప బృహస్పతితోఁ గొలువుకూట మలంకరించియున్న పురుహూతు నంతికంబునకుంబోయి యా వృద్ధరాక్షసు డాజాబుతని కందిచ్చెను. అతండు

బృహస్పతిచేత వ్రాయబడిన పత్రికయు వాచస్పతి దానిని విప్పి యిట్లు చదువుచున్నాడు.

సీ. సకలదేవ కిరీటచారురత్న మరీచి
నీ రాజితాంఘ్రి పంకేరుహునకు
నా యంతవానికిఁ బ్రహ్లాదుండు మ్రొక్కి స
ద్వినతినేఁ గావించు విన్నపములు
మాకును మీకు సమంబుగా నర్చింపఁ
దగినవాఁడుగదా గంగాధరుండు
అతని పాదముల నిత్యము పూజసేయ నం
దనకనత్పారిజాతములఁ గొన్ని

గీ. చారణులచేతనైన భాస్వరులచేత
నైనఁ దప్పక పంపింపుఁడనుచు మిమ్ముఁ
గోరుచున్నాఁడఁ బ్రీతి నా కోర్కి దీర్చి
స్నేహ మభివృద్ధి సేయ వాంఛింతు నెపుడు.

ఆ జాబువిని మహేంద్రుండు "ఓహో! పరమ భాగవత శిఖామణియగు ప్రహ్లాదునకుఁగూడ కులాభిజాత్యము వదలినదిగాదుగదా? ఇది రక్కసులుసేయు దుర్భేద కావచ్చును. నిత్యము మన మతని దేవతార్చనకై నందనవన పారిజాతంబుల బంపుచుండ వలయునట గురువరా! ఇందులకు మీ యభిప్రాయమే" మని యడిగిన నతం డిట్లనియె.

మహేంద్రా! ప్రహ్లాదుండు విష్ణుభక్తుండు మన కాప్తుండైన నగుగాక. అతని కోర్కెప్రకారము మనము మందారకుసుమంబుల బంపినఁ దప్పులేదను కొందము ఇది యొకనాఁటిపనికాదు. వారింట దేవతార్చన యెన్నంతకాలము బంపుచుండవలయును. ఇతండు మంచివాఁడైన రేపు యితనికొడుకు మంచివాఁడు కాకపోవచ్చును. ఇప్పుడు బంపినవార మప్పుడు బంపకపోయినచో వాఁడూర కొనునా? ఇది మనకు నిత్యదాసత్వము తప్పదు కావున మిప్పని కంగీకరింప రాదు. హిరణ్యకశిపుండు దుష్టుఁడగుట వానికి దాస్యముచేయక తప్పినదికాదు. అయి నను దిక్పతులతో నాలోచింపు"దని యుపదేశించుటయు నతఁ డప్పుడే వారినెల్ల రప్పించి యవ్వార్త చెప్పిన లోకపాలు రిట్లనిరి.

లోకకంటకుఁడైన హిరణ్యకశిపుండు హతుండయ్యెను. ఇఁక సుఖ పడవచ్చునని తలంప దిగుగా నీదాసత్వమేమిటికి? ఇట్టియలవాటు సేసిన నొక నాఁటితో వదలనడిగాదు. కావున బృహస్పతి మతమే మా మతమని దిక్పతులెల్ల నేకగ్రీవముగా జెప్పిరి. అప్పుడు శతక్రతుడు గీష్పతి యనుమతిప్రకారము మిట్లు ప్రత్యుత్తరము వ్రాసెను.

సీ. హరిపాదకంపకజధ్యాసైక నిరతుఁడౌ
ప్రహ్లాదు నిరతరత్రి ప్రీతి
నాశీర్వదించి వ్రాయంగల లేఖార్థ
కములు నీ పంపిన కిమ్మమాకుఁ
జేరె నిత్యమునీవు శ్రీనాథు నర్చింపఁ
బారిజాత సుమాళింపు మనుట
సమరులకెల్లఁ బహర్షదంబే కాని
సురలోకజాత వస్తువుల నెపుడు

గీ. పుడమిఁ జేర్పఁగ రామి వేల్పులును గురుఁడు
నడ్డుజెప్పిరి నీదునత్యర్థసమున
కనువుగాదని కాన నీ మనసులోన
నన్యథా యెన్నరాదుసుమా కుమార!

అని ఉత్తర మట్లు వ్రాసి యా జాబు తెచ్చిన వృద్ధదానవునకిచ్చి యనుపు టయు వాఁడది తెచ్చి ప్రహ్లాదుని కిచ్చెను. అతం డది చదివికొని ఔరా! మా తమ్ముఁడు చెప్పినట్లే చేసెనే మహేంద్రుఁ డిట్టివాఁడని యెరుఁగక యూరక యడిగి తేలికంబడితిగా కానిమ్ము;

సీ. మా యింట వంటవాఁడైయెప్పు దహనుండు
పూవులంపుటకు నొప్పుకొనఁడేమి
యడ్డుసెప్పెనె పూవులంప మావాకిలుల్
దుడిచెడు వాయుదేవుఁడు సెబాసు
వారి మా కందిచ్చు వరుణుండు హరిపూజ
సలుపఁ బూవులు బంపవల దనియెనె
మా దండనాథుండు వాడించెనే ప్రేత
పతి విరుల్ మా కంపవల దటంచు

గీ. బళిర! మా యింట బంచాంగపఠన మూను
గురుఁడు హరిపూజ కంపెడి విరులఁగూర్చి
తగ నుపన్యాస మిచ్చెనే తగ దటంచు
మింటివారల నింతల వింటిమిపుడు.

సీ. మందారకుసుమముల దైత్యవధూక
బరులఁ జుట్టరొకో సుపర్వసతులు
సపరిమళాతపల్లవములఁ గూర్పరో
యచ్చరల్ దైత్యకన్యకలజడల

కైసేయరో కల్పక ప్రసూనములచే
నమరకామినులు దేవారిసతుల
సంతానసుమముల స్వప్న కాంతలు దైత్య
కాంతావతంసముల్ గాఁగ నిడరొ

గీ. నవ్యసౌరభహరి చందనప్రసూన
దామముల దైత్యశుద్ధాంతకామినీ ప్ర
సాధనక్రియఁ జాతుర్యసరణిఁ జేసి
మెప్పువడయరొ దేవభామినులు మున్ను.

శా. ఈనేమంబులు మున్ను లేవొ, సకలాశేషుల్ సేవింపరో,
యానాఁ డాగుఁడుఁ డెందుఁబోయెనొకొ దేవారామసంజాత స
త్సూనంబుల్ దునికింపఁ గూడదని సుద్దుల్ సెప్ప మేల్మేల్ మహా
సూనప్రాభవుఁ డాహిరణ్యకశిపుం డుర్విన్ విజృంభింపఁగాన్.

ఉ. అందిన జుట్టు వట్టుకొను నందకయన్న పదంబుఁ బట్టు సం
క్రందనుఁ డట్టిటక్కరి స్వకార్యరంధరుఁ డెందులేఁ డటం
చందగు వార లందు రది చూడ నిజం బటు గాక విష్ణుసే
వం దలపెట్టి పుష్పములఁ బంపు మనస్ వలదంచుఁ బల్కెనే.

క. హరిచరణము లర్చింప న
మరతరుకుసుమములఁ బంపుమా మా కనినన్
బరిహారము సెప్పితి గా
హరిహయ యిది స్నేహధర్మమా పరికింపన్.

క. హరి కగ్రజుండ వనియును
బరమాప్తుఁడ వనియు మిత్రభావముతో నిన్
విరు లంపు మంచు వ్రాసితిఁ
బరిభవ మయ్యెన్ సెబాసు బళి దేవేంద్రా.

గీ. పుడమిని హిరణ్యకశిపుఁడు గెడసె దనుచ
గర్వపడఁబోకు మెపుడు సుపర్వనాథ!
యతనిపుత్రులు నలువు రుద్ధతపరాక్ర
మప్రకాండులు గలరు సుమీ ధరిత్రి.

గీ. దేవతార్చన సేయంగ దినదినంబు
పారిజాత సుమంబులఁ బంప వలదు
సుగలనే సిప్పఁ నాదు కింకరులె వచ్చి
కోసికొనివచ్చు చుందురు వో సురేంద్ర.

అని క్రమ్మఱఁగమ్మ వ్రాసి యమరవల్లభు నికటంబున కనిపెను. అతండు దానిం జదివికొని మందహాసము చేయుచు వాచస్పతి యనుమతిఁ దిరుగా నిట్లు ప్రత్యుత్తరము వ్రాసి యంపెను.

ఉ. బాలుఁడ వచ్యుతాంఘ్రియుగభక్తి నిరస్తతమః ప్రచారివై
కాలముఁబుచ్చఁగా వలయుఁ గాని సుదారుణ మారణక్రియా
ఖిలసమీకదక్షభుజవీర్య సమగ్రులు పల్కునట్టి వా
చాలత చూపుదే యమరసంఘముఁ జుల్కనగాఁ దలంతువే.

గీ. వాసుదేవునిఁ బూజింప వసుధ లేవొ
తలిరు లెన్నియొ; పారిజాతములెకాని
పసికిరా వొకొ యర్పింప భక్తియే ప్ర
ధాన మగుఁగాని పూవు లేమైన నేమి.

గీ. వలదు వైరంబు నీకు దేవతలతోడఁ
దెలియు మంతకుమున్ను నీదితిజులెల్ల
పొసఁగ మాతోడ ద్వేషంబుఁ బూని వత్స!
కడకు నేమైరొ సాధుమార్గంబుఁ విడిచి.

క. నీ తండ్రి మూడులోకము
లాతురతం జెందఁజేసి యడఁగఁడే తుదకున్
జాతిద్వేషము గైకొని
నీతు లసన్మతివి నీవు నీ కిది తగునే?

ఆ యుత్తరము జదివికొని ప్రహ్లాదుండు రోసమెక్కి మీసములు దువ్వుచు మరియు నిట్లు వ్రాసె.

ఉ. బాలుఁడ నంచు విష్ణుపదభక్తుఁడ నౌట మునిప్రవృత్తులన్
గాలముఁ బుచ్చుమంచు రణకర్మమునేర్వని వాఁడ నంచునన్
హేలనమాడినాఁడ నమరేశ్వర మేలిఁక గాఁచికొమ్ము శా
ర్దూలము గర్వమం దననురూపముగా నజ ముద్భవించునే.

అని వ్రాసి యా వార్త నంపి యప్పుడ విప్రజిత్త్యాదిమంత్రుల రప్పించి పేరోలగంబుండి యిట్లు సంప్రతించెను.

ప్రహ్లాదుఁడు—విప్రచిత్తీ! యిప్పుడు మనకు మహేంద్రునితో యుద్ధము సమకూరనున్నది. దండువెడలి నాకము ముట్టడింపవలయు. తండ్రిగారితోఁబోయి యిదివఱ కింద్రునితో సంగరము గావించిన వీరు లిందెవ్వరున్నారు. స్వర్గరహస్యము లడుగవలయు వారిం బిలిపింపుము.

విప్రజిత్తి—దేవరా మహాప్రభూ! మహారాజుగారితోఁ బోయి దిగ్విజయము చేసిన మహావీరులందరు నిందు వచ్చియున్నారు. సమరము లేక తమ యాయుధ

ములు త్రుప్పు పట్టుచున్నవని వగచుచు బోరెప్పుడైన గలుగునాయని యుర్రూట లూగుచున్నారు.

ప్రహ్లాదుడు-వారెవ్వరు? మనకెంత సైన్యమున్నది ?

విప్రజిత్తి-త్రిలోచన త్రిమస్తక నముచిశంబర శతబాహువు లోమ హయగ్రీవ శకుని ప్రభృతులు మహావీరులు. వీరలందరు మహారథికులు. ఒక్కొక్కనికి నూఱక్షౌహిణీల సైన్యము గలిగియున్నది.

ప్రహ్లాదుడు-వీరిలో దండ్రిగారితో స్వర్గపట్టణమును ముట్టడించుటకై పోయినవారెవరు ?

విప్రజిత్తి - పులోముని హయగ్రీవుని మాత్రమే వారి వారి సేనలతో దీసికొని పోయిరి. అప్పుడు తక్కిన సేనకుఁ బనియే లేకపోయినది దేవా !

ప్రహ్లాదుడు-వారిద్దరు నిందు వచ్చిరా ?

పులోముడు-జయము జయము మహారాజా ! దేవర కృపాకాంక్ష సేయుచు నే నిందున్నవాఁడ.

హయగ్రీవుడు-ప్రసాదుమహారాజా ! నేను హయగ్రీవుఁడను.

ప్రహ్లాదుడు-మీరు దేవాసుర యుద్ధములో పాల్గొంటిరా?

హయగ్రీవుడు-చిత్తము మహాప్రభూ! దేవర తండ్రిగారు నందనవనములో రంభానాట్యము చూచుచుండ మేమే పోయి యింద్రుని వెదకి పట్టుకొని కట్టి మహారాజు వారి కట్టెదుటం బెట్టినారము.

ప్రహ్లాదుడు — అప్పుడా వీట దేవదానవులకు పో రెన్నాళ్ళు జరిగినది.

హయగ్రీవుడు—పోరెక్కడ ? మేమా నగరము ముట్టడించిన వెంటనే దేవత లందరు బిట్టలవలె నలుమూలలకుం బారిపోయిరి. దిక్పతుల జాడయే కనం బడలేదు. గరుడగంధర్వాదుల రూపంబులే యెరుంగము. ఇంద్రుండు పారిపోవు చుండ బట్టికొని కట్టి తెచ్చితిమి. ఇక నెవ్వరితో బోరుదుము.

ప్రహ్లాదుడు-తరువాత నేమి చేసిరి ?

హయగ్రీవుడు-స్వర్గమునంగల యచ్చరలనెల్ల దీసికొని రమ్మని యాజ్ఞాపించుటయు రక్కసు లుక్కు మిగిలి వేడుకతో మేడల దూరి దూరి పారిపోవు వార కాంతల జడలం బట్టుకొని లాగియు జేతులంబట్టి పీడ్చియు న డుములంబట్టి గెంటియు మెడలంబట్టి త్రోసియు నొక్కరితనైనం బోనీక కొంగులు పట్టికొని లాగి లాగి దేవకాంతల నెల్లనీడ్చికొనివచ్చి ప్రభువుగారి మ...ట బెట్టితిమి.

ప్రహ్లాదుడు - ఛీమూఢా ! ...లు ...లు గొప్పపని చేసితిరి. ఏమియు నెరుగని యబలల బట్టుటయా పౌరుషంబు ! అప్పటిల మాటయేల ? సంగర మెట్లు ప్రవర్తిల్లినదో చెప్పుము.

హయగ్రీవుడు—మహాప్రభూ ! కింకరులై యింద్రుండు పనులు చేయు చుంత సంగర మెవ్వరితో జేయుదుము.

ప్రహ్లాదుడు—తండ్రిగా రందెన్ని నాళ్ళుండిరి ? అందు మరి యేమేమి చేసిరి ?

హయగ్రీవుడు-నందనవనములోని పెద్దమేడలో నేడు దినములు వసించిరి. అప్పు డింద్రుడు దచ్చరలచే నాట్యమాడించెను. గంధర్వులచే బాడించెను. దేవకాంతలు కుసుమమాలికలం గట్టి నిత్యము సమర్పించుచుండిరి. ఒకనా డూరిలోనికిం బోయి నాలుగు వీధులుం దిరిగి వచ్చితిమి. ఒకనాడు చింతామణీ భద్రపీఠంబున నాసీనులై గంధర్వుల వింజామరలువీవ రంభానాట్య మాలోకించిరి. ఒకనాడు మందాకినీ నదీ విహారము గావించి కాంచనాంబుజముల విహరించు రాజహంసలు బట్టికొని పంజరంబులం బెట్టించిరి.

ప్రహ్లాదుడు—అప్పుడు బృహస్పతిగా రేమి చేసిరి ?

హయగ్రీవుడు-ఏయూరికో పోయిరట. మాకు గనంబడలేదు.

ప్రహ్లాదుడు – తర్వాత నేమి చేసిరి ?

హయగ్రీవుడు—స్వర్గమునంటి గరుడ గంధర్వకిన్నర కింపురుష సిద్ధ విద్యాధరాదులు వసించు పేటలు వేనవేలు గలవు. వానిలో ముఖ్యమయిన వానిం జూచుచు నెలదినములా నాకమందు వసించిరి. పిమ్మట దిక్పతుల నగరంబులకుం బోయి వారి నెల్ల దాసోహ మనిపించిరి. కొన్నినాళ్ళ కింటికి వచ్చిరి.

ప్రహ్లాదుడు—స్వర్గపట్టణమునకు మార్గ మెరుగుదురా ?

హయగ్రీవుడు—అయ్యో ! అది కొట్టిన పిండియే. నాకే గాక దిందున్న రక్కసులందరు నెఱుంగుదురు. మనవీరులందరు దండయాత్ర యెప్పుడని తొందరపడుచున్నారు సామీ.

ప్రహ్లాదుడు—ఇంత ప్రజ్ఞగల మీ రందరు నింటికడ నుండ మా తండ్రి తపంబున కరిగినపు డింద్రుండు దండువచ్చి మా తల్లి జెఱపట్టి తీసికొని పోవుచుండ నూరకుంటిరేమి ?

హయగ్రీవుడు—అప్పుడు నే నూరలేను. అడియురుం గాక రాజులేని రాష్ట్రముగాదా ?

ప్రహ్లాదుండు—సరే కానిండు. మీరందరు యుద్ధసన్నద్ధులై యుండుండు. ఎల్లుండియే ప్రమాణము. మనవీరుల కందఱకుం దెలుపుము. అని చెప్పి ప్రహ్లాదుడు నిష్క్రమించును. అని చెప్పునప్పటికి కాలాతీతమైనది. మణిసిద్ధుం డవ్వలికథ పై మజిలీయం దిట్లు చెప్పం దొడంగెను.

# ఇంద్రుని కథ

స్వర్గలోకములో మహేంద్రుఁడు దిక్పతులతో నొకనాఁడు సభచేసి ప్రహ్లాదుండు కడపట పంపిన ప్రత్యుత్తరము చదివి వినిపించి బృహస్పతి విన నిట్లనియె. "దిక్పతులారా! ప్రహ్లాదుండు పరమభాగవత శిఖామణియైనను దైత్యదానవులకు రాజగుట జాతిస్వభావ మెట్లు విడుచును? వాని తమ్ముఁడు చాల క్రూరుఁడని చారులవలన వినియుంటిని. అతని మూలముననే యీ యుద్ధము పొసఁగినది. ఇప్పుడు పోరుసేయక తీరదు. అతండు విష్ణుభక్తుండు. వాసుదేవుండు వానితోఁ బోరిన నీకు బాను నేమో యని మొన్న బృహస్పతిని వైకుంఠమునకు బంపి యీ సందేశముచెప్పి రమ్మంటి. దానవహరి మనచరిత్రము విని చిరునగవుతో నది వీరధర్మము కానిండు. దీనం దప్పేమి యున్నదని యూరకొనియెనఁట. ఇఁక మన మందులకు వెరవవలసిన పనిలేదు." అని చెప్పుచుండఁగనె నారదమహర్షి యరుదెంచుటయు సుఖాసీనుం గావించి నమస్కార పూర్వకముగా సునాసీరుం డతని కిట్లనియె.

మునీంద్రా! మీరిప్పు డెక్కడనుండి వచ్చుచుంటిరి? భూలోక విశేషము లేమైనం దెలిసినవా? రాఁబోవు సమీక ప్రకారంబు వింటిరా? అని యడిగిన నారదుండు నవ్వుచు నిట్లనియె "మహేంద్రా! నేనిప్పుడు భూలోకమునుండియే వచ్చితిని. ప్రహ్లాద కుమారుం గాంచి సభాషించితిని. దేవతలతో సమరము వలదని బోధించితిని. అతండు నాతోఁ బెద్దగాఁ జర్చచేసెను. తాను విష్ణుపూజకై పూవుల నడిగిన నేమేమో నీతులు చెప్పితివఁట. ఆ నియమము లేమియో తెలిసికొనుటకై తానీ పనికిఁ బూనుకొనెనఁట. అప్పుడే ప్రయాణభేరి వాయించుచున్నారు. రక్కసు లుక్కుమిగిలి యెక్కడఁ జూచినను దారయయి భూమియంతయు నిండి వీరాలాపము లాడుచున్నారు. శకుని శంబర నముచి త్రిమస్తకాది సామంతులసముద్రుడు మహారథికులు సేనలతో వచ్చుచున్నారు. మీరిట్లుపేక్షగా నుంటిరేమి? ఈ యుద్ధసముద్ర మెట్లుదాఁటుదురో జాగ్రతసుండీ యని చెప్పినఁ బురందరు" డిట్లనియె.

స్వామీ! వారి సేనాధిపతుల బలపరాక్రమములన్నియు నిదివరకెఱిఁగియుంటిమి. కాని ప్రహ్లాదుఁ డెంత బలవంతుఁడో మే మెఱుఁగము. అతండు చిన్నతనము నుండియు హరిభక్తిపరాయణుం డగుట యుద్ధపాటవ మెక్కడ నేర్చెనో తెలియదు. అస్త్రశస్త్రాదు లేమి యెఱింగెనో గ్రహింపఁజాలము. అతని శౌర్యమే పాటిదియో తెలుపవేయని యడిగిన నారదుం డిట్లనియె.

అఖండలా! నీవిట్టి యెకిరిమాట లాడుచుంటివేమి? సింహకిశోరము పుట్టినతోడనే యేనుఁగుల కుంభస్థలము విదళించును. ఆ పాటవ మెవ్వరు నేర్పిరి? పరాక్రమము సహజము. నేర్చుకొనిన వచ్చునది గాదు. విష్ణుప్రసాదంబున నతం డనేకాస్త్రశస్త్రప్రయోగోపసంహారంబుల నెఱింగియున్నవాఁడు. వానిని నీవు సామాన్యునిగాఁ దలంపకయ ప్ర

మత్తుండవై పోరవలయుంజూమీ యనుటయు నింద్రుండు స్వామీ! అతఁడు సాత్వికుఁడు విష్ణుభక్తుఁడు. విరక్తిమాటలంజెప్పి యుద్ధవిముఖుం జేయలేక పోయితిరా? అనిన నవ్వుచు నతపసి యిట్లనియె

పాకారీ! నీవా మురారిపూజకు మందారకుసుమంబు లంపుటకు నాదంబడితి వేని యతండు సమరవిముఖుం డగును. వేరొక తెరువున మరలఁడు. కానిండు! ఈ నడుమ నాకాయోధనపర్వములు లేకున్నవి. కడుపునిండఁ గుడిచెదఁగాక! అని చెప్పి నారదుం డెందేనింబోయెను. పిమ్మట వృత్రారి దిక్పతులదిక్కు మొగంబై మీరు నారదుని వాక్యములు వింటిరిగదా? హిరణ్యకశిపుని సేనాధిపతులే యతని బలాఢ్యులు. వారితో నిదివరకు మీరు పోరియుండిరి. ఇప్పు డెవ్వరెవ్వరితో ద్వంద్వయుద్ధము సేయుదురో; చెప్పుఁడని యడిగిన వారొకరి మొగమొకరు చూచుకొనుచు మాటలాడిరిగారు. అప్పుడు సురపతి యనుమతి గీష్పతి వేరువేర వారిం గనుంగొని అగ్నిభట్టారకా! నీ వెవ్వరితోఁ జివ్వసేయఁగలవు? ప్రహలాదు నాపెదవా? అనవుడు బాబో! నేను వారింట వంటవాఁడనైయున్నతని నతని పరాక్రమ మెఱింగితి. నేనతనిం జెనకఁజాల. మరియొకనిం బేర్కొనుఁడని పలికిన బృహస్పతి "పావకా! తావకాగ్నిజ్వాలలు కొండలనైన భస్మము చేయఁగలవే. వానికి వెఱచు చుంటివేల? పోనిమ్ము. నీకుశంబరుని వంతు వేసితి వానితోఁ బోరి గెలుపుకొనుము" అని చెప్పి దండధరుంజూచి నీవు ప్రహలాదునితోఁ బోరుము. పేరువచ్చిన నతండు అదియుచు బాబో యతండు విష్ణుభక్తుఁడు. విష్ణుభక్తులనిన నాకు భయము. వేరొకని నిరూపింపుఁడనియె ఆ రీతి దిక్పతుల నందఱను ప్రహ్లాదుతోఁ ద్వంద్వయుద్ధము సేయుమని గురుఁ డడిగిన నందుల కెవ్వరు నోపమనిరి. అప్పు డింద్రుడే యతనికి వంతువేసి జయంతునను ప్రహ్లాదునితోఁ బోరుమని తక్కిన సేనాధిపతులకు మిగిలిన దిగధిపతులఁ బోర నిరూపించి నాకపురమున కెనిమిది దిక్కుల నెనమండ్రు గాచునట్లును తూరుపుపొలిమేర ధారుణి యుద్ధరంగముగ నిరూపించుచు స్వర్గపట్టణమందలి వీధులన్నిటఁ బ్రౌఢ యంత్రముల సమరింపఁ జేసి శుద్ధాంతప్రదేశమున కవాటముల మూయించి సుధర్మ యంత్రగుప్తంజేసి యుద్ధసన్నద్ధులై యున్నంతలో—

క. వినఁబడె భేరీధ్వానము
దనుజాలకోలాహల ప్రతారణభయద
ధ్వనితోడ నమరదైన్య
స్వనయుక్తముగాఁగ భైరవ ప్రక్రియలన్.

ఆ వెంటనే నందనవనపాలకులు గోలపెట్టుచువచ్చి మహేంద్రుని పాదములంబునం బడి మహాప్రభూ! దేవేంద్రా! భూలోకము నుండి పెనువేలు రక్కసులువచ్చి నందనవనములోఁ బ్రవేశించి యల్లరిసేయుచున్నారు. మేమడ్డము పోయిన మమ్ముఁ జావఁగొట్టిరి. కల్పతరుప్రసూనము లన్నియు రాలఁగొట్టుచున్నారు.

మందారతరుశాఖలు విఱచుచున్నారు. అయ్యయ్యో! గాలియయినను దిన్నగా విసరనీయని తోటకెన్ని పాట్లువచ్చినవి అని చెప్పినవిని దిక్పతులతోఁగూడ పురందరుఁడు దిగ్గన సింహాసనముడిగ్గి నురికి ఏమీ! అప్పుడే దానవసేనలువచ్చి ప్రవేశించినవా? గురువరా! ప్రమాదము చేసితిమి. ముందుగా నత్తోటకే కాఁపుపెట్టింప వలసినది. ఇప్పుడు కర్తవ్యమేమి! అనవుడు బృహస్పతి వనపాలుర కిట్లనియె ఓరీ! ఆ రక్కసు లెందరువచ్చిరి! సైన్యాధిపతు లెందరున్నారు? ప్రహ్లాదుండుండెనా? అని యడిగిన వారు గ్రదల్లనిరి దేవా! ప్రహ్లాదుఁడో యెవ్వరో మాకుఁ దెలియదు. ఆ సేన యెంతయున్నదో చెప్పఁజాలము. వీరుల మే మెఱుంగము. పుట్టకలుగునుండి పిపీలికా శ్రేణులవలె భూలోకమునుండి యాదానవు లెడతెగక వచ్చుచున్నారు. వారి నెవ్వరు లెక్కపెట్టఁగలరు అందరు వీరులవలె నున్నారు? మెవరోయనుకొని ముందువచ్చినవారి నదలించితిమి. వెనుకవచ్చినగుంపులు మమ్ము దావఁగొట్టి సాగనంపినవి. తరువాతి కృత్యమునకు దేవరయే ప్రమాణమని చెప్పి వారోరసిల్లిరి అని యెరింగించునప్పటికి వేళ మిగిలినది. తదనంతరోదంతమవ్వలి మజిలీయందు మణిసిద్ధుం డిట్లు చెప్పం దొడంగెను.

289 వ మజిలీ

## దేవదానవుల యుద్ధము

నందనవనసౌధములో విహరించుచు ప్రహ్లాదుఁడు విప్రచిత్తితో నిట్లు సంభాషించెను.

ప్రహ్లాదుడు—అమాత్య శేఖరా! నందనవన మిదియేనా? అమరావతీ నగర మిక్కడ కేదెస నున్నది?

విప్రచిత్తి—దేవా! ఇదియె నందనవనము. పారిజాతాదితరుపంచక మిందే యున్నది. స్వర్గపట్టణ మిక్కడికి వాయవ్యముగా మూఁడు యోజనముల దూర ములో నున్నది. ఇందలి మేడయెక్కిన నా పట్టణము గనంబడును.

ప్రహ్లాదుడు-ఇందామందార పారిజాతాదివృక్షము లేమూల నున్నవి?

విప్రచిత్తి—దేవా! అవధారు.

శా. అదె మందార వసుంధరరారుహము దివ్యామోదసంయుక్త మ
ల్లదె సంతానతరూత్తమంబు లలితవ్యాకోచసూనప్రవా
లదళోపేతలతాంచితం బదియె కల్పం బల్లవే వాసనా
స్పదముల్ చందనపారిజాతతరువుల్ సద్వల్లరీదీప్తముల్.

గీ. అమరతరులార! లలితపుష్పాఢ్యులార
ఆశ్రితాభీష్టదాన సమర్థులార

మీ కిదే మ్రొక్కుచుంటి నర్మిలి మదీయ
సేవ గైకొని నన్ను రక్షింపుఁడిందు.

అని యత్తరువంబుల బూజించి విప్రజిత్తీ! మన దేవతార్చన పేటిక యిందు దెచ్చితివా?

విప్రజిత్తి—చిత్తము తెచ్చితిమి. ఆ పెద్ద మంటపములో నమరించి యలంకరించితిమి దేవా!

ప్రహ్లాదుఁడు—నేఁడీ దేవతావృక్షము లైదింటిపూవులు చాల గోయింపుము. నా యభీష్టదేవతల దృప్తిగా బూజించి యానందింతెనంగాక.

విప్రజిత్తి—చిత్త మిదివరకే కోయించి పూజాపాత్రల నమరించియుంచితి. దేవర పూజింప వచ్చును.

ప్రహ్లాదుఁడు—సరే. ఇప్పుడు మనయోధు లేమిచేయుచున్నారు?

విప్రజిత్తి — అమరావతీనగరమున నెనిమిదిదెసల నెనమండ్రు మహావీరులు సేనలతో ముట్టడించిరి. అష్టదిక్పతులు నెనిమిదిగనుమ గాచికొని యుండిరట. జయంతుఁడు దేవరసోదరునితోను మహేంద్రుఁడు దేవరతోను బోరుటకు నిశ్చయించుకొనిరని వేగులవారు సెప్పిరి. యుద్ధము తీవ్రముగానే జరుగుచున్నదఁట!

ప్రహ్లాదుఁడు — ఈ సంగరములో మనవారు సేయవలసిన నియమముల దెలిపితివా, వినుము—

సీ. పారిపోయెడువారిఁ బట్టి గొట్టఁగరాదు
వీతాయుధుఁ బరాభవింపరాదు
శరణన్న రక్షింపఁజను సంతిపురమున
కలిగి రాజస్త్రీల నంటరాదు
అసఁజూర వేశ్య పిచ్చివారి వృద్ధుల
బాలుర మిథునంబుఁ బట్టరాదు
అమరావతీ పురాభ్యంతరంబున కేఁగి
సేన లల్లరి యేమి సేయరాదు

గీ. సంపనోద్యాన తటకాంతములఁ గాన
యిండ్లనేగాని పూవొదరిండ్లఁ గాని
చెరుపరాదు తపస్విలఁ జేరరాదు
పుణ్యపురుషుల చెంతకుఁ బోవరాదు.

మన రక్కసులు తండ్రిగారితో నీ పట్టణము ముట్టడించినప్పుడు చాల యల్లరి చేసియుండుట అట్లు చేయవలదని బోధించితివా?

విప్రజిత్తి—ఆ నిబంధన లన్నియు నిదివరకే మన యోధులకు దెలిపి

యున్నాము. పూజాసమయ మగుచున్నది. దేవర! దేవగృహంబునకు విచ్చే యుదురా ?

ప్రహలాదుడు – అదిగో ఎవ్వరో వీరుల. పరుగెత్తుకొని వచ్చుచున్నారు. వారి రాక కారణము విని లోపలికి బోయెద.

విప్రజిత్తి — అటుచూచి! ఓహో! యుద్ధోపద్రవమేదియో జరిగినది. వారు వేగులవారు సంగరవార్త దెలుపుటకై వచ్చుచున్నారు.

వేగులవారు—జయము జయము మహారాజా! హసాదు అమాత్యవరా!

విప్రజిత్తి – ఏమి యింత తొందరగా వచ్చితిరి. యుద్ధ మెట్లు ప్రవర్తిల్లు చున్నది ? ఎవ్వరెవ్వరికి జరుగుచున్నది ?

వేగులవారు – అగ్నికి త్రిలోచనునకు, యమునకు త్రిమస్తకునకు, వరుణునకు, నముచికి, కుబేరునకు, హయగ్రీవునకు, నిరుతికి, పులోమునకు, భర్తృదారకునకు, జయంతునకు ఘోరముగా పోరు జరుగుచున్నది. ఇంద్రుం డైరావణ మెక్కి వజ్రహస్తుండై దిక్పాలురకు భయపడుచున్నాడు. అతడున్నచోట మనవారి కప జయము గలుగుచున్నట్టు తోచుచున్నది. అతనితో పోరు వారెవ్వరిందుం గనంబడ లేదు. ఇంద్రుని నాప దేవరం దీసికొనిరమ్మని సేనాధిపతులు తమతో మనవి చేయు చున్నారు. వేగవిచ్చేయు వలయు —

ప్రహలాదుడు – విప్రజిత్తీ! నేను దేవపూజ తుద ముట్ట జేసికొని వచ్చెద. ఈ లోపల నీవుపోయి యింద్రునితోం బోరుచుండుము.

అని నియమించి ప్రహలాదుండు పూజాగృహంబునకుం బోయి కూర్చుండి నారాయణమంత్రంబు జపించుచు దేవతాతరు కుసుమ విసరములచే నచ్యుత పాద పద్మముల లక్షోపలక్షలుగా నర్చించి పూజించి యానందపరవశుండై స్తుతియించుచు గొంతసేపు సంగరము మాటయే మఱచిపోయెను.

అంతలో యుద్ధసమ్మర్ద మెక్కువగుటయు దెలిసికొని లేచి కవచంబు దొడిగి కిరీటంబుదాల్చి ధనుర్బాణంబులు బూని ప్రహలాదుండు రథికుండై సంగర రంగమున కరిగెను. అప్పుడింట గాపు పెట్టిన లంబోదర విరూపులను దానవు లిరువు రిట్లు సంభాషించుకొనిరి.

లంబోదరుడు – విరూపా! మన రాక్షసవీరులే కాక మహారాజుగారు గూడ పోరంబోయిరి. మన మూరక యిందుండి యేమి చేయుదుము ? అచ్చరల వీధికిం బోయి చూచివత్తుము వత్తువా ?

విరూపుడు — బాబో! ఈయన పెద్ద మహారాజుగారను కొంటివా యేమి? అడుగుపెట్టంగూడదని శాసించిరి వింటివా ?

లంబోదరుడు – వీరి శాసన మిందలి వారలు వినినారేమి ? మన మొక సారి యటుపోయి యచ్చరలతో ముచ్చటించి వత్తము.

విరూపుడు-ఈ యల్లరిలో వారెందు దాగియుందురో వారి నెక్కడ బట్టి కొనగలము? నాకా వీధియే జ్ఞాపకము లేదు.

లంబోదరుడు-సరి సరి! నీవు మఱచితివి కాబోలు. నా కన్నియు జ్ఞాపకమున్నవి. అచ్చరల యిండ్లన్నియు నొక్కవీధినే యున్నవి. ఆ వీధిలోఁ దూరుపు దెస పెద్దమేడ రంభది; దాని కివ్వలనె తిలోత్తమ మేడయున్నది. దాని కించుక యెడముగా ఘృతాచీ మేనకల సౌధము లున్నవి. నాతో నా వీధికి రమ్ము. నీ కెన్నియేని చమత్కారములు చూపెదను.

విరూపుఁడు-దేవతార్చన పేటిక గనిపెట్టుకొని మనల నిందుండుమని చెప్పిరిగదా మన మందరిగితిమని తెలిసినచో మంత్రిగారు శిరచ్ఛేదయము సేయరా.

లంబోదరుఁడు-అప్పుడే యా యుద్ధమున జయమంది మంత్రిగారింటికి వచ్చిన పిమ్మటగదా మనలను శిక్షించుట. ఈ లోపల మన మింటికి రాకుందుమా.

విరూపుడు-రంభయింటికి మాత్రము పోయి వత్తము, పద దానిం జూచి చాలకాలమైనది. అని యిర్వురు లాలోచించుకొని యటగదలి యుద్ధవీరులకు మఱుగుచు మెల్ల మెల్లగా నచ్చరవీధికిం బోయిరి. అందుఁ గ్రొత్తయంత్రముల మరించి యుండుట వా రెరుగరు. తలలు పైకెత్తి మేడలవంక జూచుచుఁ బోవుచుండ నొకచో లంబోదరుని కాలొక బోనుయంత్రమున దగులుకొని దిగబడుటయు మొఱ్ఱోయని యఱచుచు విరూపా! నా పనియైనది. నా కాలిటు చిక్కుకొన్నది. కత్తెఱలోఁబడి నొక్కబడుచున్నది. కదల్పజాలకున్నానురా. నీవు దాపునకు వచ్చి నన్ను లేవనెత్తవా! అని కేక పెట్టెను.

విరూపు డొకచో జిక్కువడి కాలు కత్తెఱలోఁబడి నొక్కువడుచుండ విధవా! లంబోదరా నే వలదనుచుండ బలవంతమునఁ దీసికొని వచ్చితివి మును పీ యంత్రము లెఱుంగము. క్రొత్తగా నిందమరించిరి కాబోలు! ఇక మన పనియైనది. గడియలో నీ యడుగూడి పోవును. ఈ వార్త దెలిసిన తల యెగిరిపోవును. అని యేడ్చుచుండెను.

అంతలో యుపాత్తుడనువాడు సందుచేసికొని వచ్చి యచ్చరలతో ముచ్చటలాడ నచ్చటికి వచ్చుటయు వానిం జూచి ఓరే విరూపాక్షా! యిటురా మే మిందుఁ జిక్కుకొన్నాము. మమ్ము లేవనెత్తవా? అని కేకపెట్టిన ఆరిముండా కొడుకులారా! నాకుఁ జెప్పకుండ నిందు వచ్చితిరా? మీ కిట్లు కావలసినదే అని పలుకుచు వారి దాపునకు బోవుచుండ నంతొకచో యంత్రమున వాని కాలు జిక్కికొనుటయు వాఁడు మొఱ్ఱో యని యఱచుచుండెను. నందనవనమునఁ గాపు పెట్టిన చిల్లర రక్కసు లందరు నచ్చరలతో ముచ్చటలాడుటకై యా వీధికి నొకరు బోయిరని యొకరు పోయి యంత్రములం జిక్కికొని కుక్కలవలె మొఱుగుచుండిరి. అని యెఱిగించునంత వేళ మీఱినది. పై కథ యిట్లు చెప్పందొడంగెను.

# ఇంద్రప్రహ్లాదుల యుద్ధము

సిద్ధులు – చారణులారా ! విమానము లెక్కి యెక్కడికి పోవుచున్నారు? యుద్ధమెట్లు జరుగుచున్నది? రక్కసులల్లరి చేయుచున్నారా?

చారణులు–సిద్ధులిక్కడి కెప్పుడు వచ్చితిరి ? దానవులకు వెఱచి యీ మేరుసానువుల దాగికొంటిరాయేమి ?

సిద్ధులు–ఔను దుష్టుల నమ్మగూడదుగదా? వెనుక హిరణ్యకశిపునిదాడిలో నా దుర్మార్గులు మముఁగట్టి పశువులంబోలె గొట్టిరి.

చారణులు–ఇప్పుడట్టి భయములేదు. ప్రహ్లాదుని శాసనము రణవిముఖుల జోలికి బోవలదని యున్నది. మీ రిందు దాగికొన నవసరములేదు. అందుబోయి సమర విశేషములం జూడవచ్చును.

సిద్ధులు – యుద్ధ మింకను ముగియలేదా ? జయ మెవరికిఁ గలుగ నట్లున్నది ?

చారణులు – దేవతల కొకప్పుడు జయము గలిగినదా ? ఇప్పుడుగూడ దానవులే జయింపఁగలరు.

సిద్ధులు – ప్రహ్లాదుడు కూడ బలవంతుడేనా ? తక్కిన వీరు లెట్టివారు?

చారణులు—త్రిలోచన, త్రిమస్తక, శకుని, శంబర, నముచి, శతబాహు, హయగ్రీవాదులు మహావీరులు. దేవాసుర యుద్ధములలో నారితేరినవారు. వారికిని దిక్పతులకుం బెద్దపోరు జరుగుచున్నది. ఇంద్రునికిని ప్రహ్లాదునికి ద్వంద్వ యుద్ధము త్రిలోకవీరభయంకరముగాఁ బ్రవర్తిల్లు చున్నది. ఇంద్రుడోడునట్లు గనంబడు చున్నది. అందులకు వెఱచి బృహస్పతి వైకుంఠమునకుఁబోయి జనార్దనునితో నీ వార్త చెప్పిరమ్మని మమ్ము బంపుటచే మే మందరుగుచుంటిమి

సిద్ధులు—అట్లయిన మీరు వచ్చుదనుక మే మిందే యుండెదము. వేగఁబోయి వైకుంఠున కీ వార్త దెలిపి యీ దారినేరండు. మీ వెనుక మే మందువత్తుము.

చారణులు—సరియే వైకుంఠమున కరిగి రరిగిన కొంతసేపునకు విద్యాధరులు విమానములలో బయగిడికొని పోవుచుండ వారింజూచి సిద్ధు లిట్లనిరి. "విద్యాధరులారా ! తొందరగాఁ బోవుచున్నారేమి ? ఎక్కడికి ! స్వర్గమునుండియేనా ? యుద్ధమెట్లున్నది ? మేము సిద్ధులము. వెఱచి యిందు వచ్చియున్నాము. కొంచె మాగి చెప్పెదరా" అని యడిగిన విద్యాధరులు యిప్పు డాగుటకు వీలులేదు. దేవతలకు మీఁదు మిక్కిలి వచ్చినది. హయగ్రీవాది దానవులచే దెబ్బలుతిని దిక్పతులు తల యొక మూలకుం బారిపోయిరి. ప్రహ్లాదుని తమ్ముఁడు జయంతునిబట్టుకొని కట్టించి చెఱసాల బెట్టించెను. మహేంద్రుఁడు ప్రహ్లాదునితోఁ బోరుచున్నాడు. అందు దేవేంద్రుని యేటులు వాటముదప్పుచున్నవి. [illegible]యుధము చేతినుండి నేలఁబడ నెవ్వరో తీసికొనిరి. ఇక రెండుగడియలలోఁ [illegible]ట్టువడునట్లు తోచుచున్నది. అతని

నిస్సారమ్ముగ్రహించి బృహస్పతి యీ వార్త యుపేంద్రునిజెప్పి రమ్మని మమ్ము నియమించెను. మేమిం దాలసించితిమేని దేవేంద్రునిపని కాఁగలదు. లక్ష్మీపతిం దీసికొనివచ్చి దేవతలకు గెలుపుగలిగింపవలయునని సుర పురోహితునిమతము గావున మేము బోవుచున్నామని చెప్పి వారవ్వలఁబోయిరి. ఇంతలో చారణు లా దారిని వచ్చుచు సిద్ధులారా! రండు నాకమునకుఁ బోవుదము రండు. గురు సందేశము వైకుంఠపతి కెఱింగించితిమి. ఆయన యింద్రుని యపజయమువిని పరితపించుచు వారియిరువురకు సంధిచేసిరమ్మని యేమిటికో వచ్చి యీ యుద్ధవార్తలఁ జెప్పుచున్న నారదమహర్షికి నియమించిరి. అతం డప్పుడే వీణఁబాడుకొనుచు నమరావతీ పురంబున కరిగెను. ఆ సంభాషణలు వింధము రండనిచెప్పి యందరుంగలిసి స్వర్గమున కరిగిరి.

అంతలో నారదమహర్షి వైకుంఠమునుండి వచ్చి యింద్ర ప్రహ్లాదులనడుమ నిలువంబడి చేతులెత్తి నిలుఁడు నిలుఁడు విష్ణుదేవుని సందేశ మొందాలింపుఁడు అని పెద్దకేక పెట్టెను. ఆ మాట విని యా వీరు లిరువురు బాణప్రయోగ ముపసంహరించి నిలువంబడిరి. అప్పుడు నారదుండు యిట్లనియె.

క. అరయఁగఁ బ్రహ్లాదపురం
దరు లిరువురు భక్తులేగదా యీయి
ద్దఱు వైరు లగుచు మనసం
గర మొనరింపంగ నాకుఁ గష్టము గాదె.

గీ. వారితోఁ జెప్పి నా యాజ్ఞ బోరు మాన్పి
యిరువురకు సంధిఁజేసి రమ్మిపుడు నీవు
తాపసేశ్వర యని పంపె దానవారి
యాదరింపుఁడు మీరు తదాజ్ఞ దెలిసి.

చ. అనిన మహాప్రసాదమని యప్పుడ యా బలశాలు లిర్వురున్
ధనువుల నెక్కుడించి ప్రవిదారణమున్ విరమించిరంత న
య్యనిమిషభర్త దానవకులాధిప సూనుగరంబుప్రీతి గై
కొని బళిరా! కుమార! త్వదకుంఠితవీర్య మవార్యమే గదా.

గీ. ఇంతవాఁడవనుచు నెఱుఁగకపోతినే
నసురవాజితనయ! యస్మదీయ
భేదభావసంసఁ బెద్దవాఁడ నటంచు
గౌరవించి మిమ్ముఁ గోరచుంటి.

అప్పుడు ప్రహ్లాదుండు వినయ వినమితోత్త మాంగుండై —

చ. ఎడుగక బాలభావమున నోసురనాథ! భవత్పురంబు పైఁ
బడి యనిసేయవచ్చితి, సుపర్వుల నొంచితి దాయణ్కియన్

నడవడిఁ దప్పినాఁడ గరుణామతి నా యపరాధ మాత్మలో
నిడికొన కూర్మితోడ క్షమియింపుము మ్రొక్కెదఁ బుత్రతుల్యుడన్.

అనియె. అట్లొండొరుల గౌరవించుకొనిరి. పిమ్మట నమ్మహేంద్రుడు ప్రహ్లాదుని సపరివారముగా సుధర్మకు దీసికొనిపోయి రత్నసింహాసనంబునఁగూర్చుండ బెట్టి మందార కుసుమ విసరములచేఁ బూజించుచు బెద్దగా సత్కరించెను.

ప్రహ్లాదుండును నాత్మగతంబున "అహా! నేను తామసుండవోలె మంత్రుల మాటవిని త్రిలోకాధిపతితోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వితిని. ఇది నాదే తప్పు. దేవలోకవస్తువులు బుడమిఁ జేర్పఁగూడదని విష్ణుశాసన మున్నదని నాకుఁ దెలియదు. ప్రమాదమే జరిగినది. నేనీ నిరర్థక వ్యాపారమున కేమిటికి దిగవలెను అని సిగ్గుపడుచు నింద్రునిచే సత్కరింపబడి బలములతోఁగూడ గ్రమ్మఱ నిజనగరంబున కరుదెంచెను అని యెరింగించునప్పటికి వేళ మిగిలినది.

291 వ మజిలీ

## ప్రహ్లాదుని విరక్తి

ప్రహ్లాదుం డింటికిం వచ్చిన పిమ్మట తమ్మునితోఁ బశ్చాత్తాప పూర్వకముగా నిట్లనియె. "సోదరా! మనము తగని కార్యమునకుఁ బూనుకొని విష్ణునకు నపరాధులమైతిమి. గిల్లి జగడము దెబ్బెనను మాట యిట్టిదె కాఁబోలు! ఏమియు నెఱుఁగక యింటనున్న దేవేంద్రుని బూవు లంపుమని జగడములో దింపినది మనమేకాదా! అట్లు పంపుమనుటకు మనకేమి యధికార మున్నది. మన కింద్రుండు పరిచారకుడాయేమి? మనకంకి మారకృత్యములకు వెచి యేమి జేసినం జేసెఁగాక! అట్టి రాక్షసకృత్యముల మన ముపయోగించిన మన సాధుత్వమేమి వన్నె కెక్కును? ఇఁక నిట్టి దారుణకృత్యముల కెన్నడును ప్రేరేపింపకు" అని మందలించిన నతం డిట్లనియె.

అన్నా! రాక్షసవీరులందరు గుమిగూడి మనవాకిటఁ నిలువఁబడి చింతించుచున్నారు. మీతో నేమాటయు జెప్ప వెరతురు. తిక్కతుల వీచమడచిరి. జయంతుని చెరబట్టితిమి. యింద్రుడు పరుగునకు సిద్ధముగానుండెను. హస్తగతప్రాయమైన యీ విజయమును పరాభూతము చేసితివి. గెలిచి క్షమించివిడిచినను గొంత పౌరుషముగా నుండును దేవతలెప్పుడు కపటాత్ములే విష్ణుఁడు మన వంశమునకు శత్రువుగదా యిప్పుడును దేవతలక్షేమమే కోరి దానవుల వంచించుచుండును. నీవు విష్ణునకు భక్తుండవైన నగుదువుగాక తక్కిన రక్కసుల బ్రతుకుమాటయేమి. నీవు మెత్తఁవాఁడవైన మమ్ము వేల్పులు నిలువ నిత్తురా. సర్వదా దానవుల నణచింప తెరువాలోచించుచుందురు. యిప్పుడు విష్ణుండు మనలనింధించినటులును తమకు గెలుపు గలుగ జేసినటులును

స్వర్గలోకములో జాటించెనట. యిప్పుడు దానవు లేమి చేయదగినది. అని యడిగిన ప్రహ్లాదుం డిట్లనియె.

తమ్ముఁడా! భూషణ, దూషణ, తిరస్కారంబులు శరీరంబునకుగాని యాత్మకులేవు. నన్నెవ్వరేమి నిందించినను నాకు విచారములేదు. మీరు తమోగుణ ప్రధానులగుట మానసమున నసూయంబూ యుందురు. జనార్దనునకు వ్యతిరేకముగా నడిచిన బ్రతుకవచ్చునా! మన దానవులపని యేమైనదో యేమంగదా. దేవతలతో విరోధము పెట్టుకొనుట మంచిపనికాదని చెప్పినఁ దమ్ముఁ డిట్లనియె.

మహారాజా! నీవు శమదమాదిగుణ సంపన్నుండవగుట నీకుఁ గామ క్రోధాదు లంటవు. అందరకు నట్టి విరక్తికలుగును. దేవత లెప్పుడు రాక్షసకులనాశనము దలంచుచుందురు. అట్టివారిని వంచింప బూనుట పీరిది తప్పుగాదు. రాజనీతి వేశ్యావృత్తివంటిది. సమయ మరసి చతురుపాయముల నడిపింపవలయు. అట్లుకానిచో మొదటికే నాశనమువచ్చు. దేవతలకు విష్ణువు సహాయముగా నుండును. నీ విట్టివాఁడవైన నింక రక్కసుల బ్రతుకేమి కావలయును? నీ విప్పుడు నీ కుమారుఁడు విరోచనునకుఁ బట్టముగట్టుము. అతని ముందిడుకొని మేము మా కార్యముల సాధించుకొందుము. రాక్షసులెల్ల నీకిట్లు మనవిచేయుమని కోరిరి. ఆజ్ఞ యేమని చెప్పిన ప్రహ్లాదుం డిట్లనియె.

దైత్యులారా! మొదటినుండియు నాకీ రాజ్యభారము భారముగానే యున్నది. ఇప్పుడే అనుహ్లాదునకిచ్చి విరోచను యువరాజుం గావించెద. మీరు మీ యిష్టమువచ్చినట్లు మెలంగు మనవుడు దానవు లిట్లనిరి. మహాత్మా!నీవు మమ్ము విడిచిన నిప్పుడీ దేవతలు మమ్ముఁ బరాభవింతురు. మా పక్షమున నుండి యవసరము వచ్చినప్పుడు సహాయము చేయుచుండవలయు ఇదియే మా కోరిక యని పలికిన నొప్పుకొని ప్రహ్లాదుం డప్పుడే రాజ్యము తమ్ముని యధీనముచేసి తాను తపంబుచేయ గంధమాదన పర్వతమున కరిగెను. శమదమాదిగుణ సంపన్నుఁడగు ప్రహ్లాదుండు తుచ్ఛ రాజ్యభోగంబులకు సక్తుండగునా!

అక్కడ నాకములో దేవేంద్రుఁడు ప్రహ్లాదుం డరిగిన పిమ్మట బారిపోయిన దిక్పతులనెల్ల రప్పించి వాసుదేవుని యనుగ్రహమున నాముప్పు వాసినదిగాని గడియ దడసిన నేనుడుగువాడనే. పరాభవము రాకుండ నిలువఁగలిగినది. అబ్బా! హిరణ్యకశిపుని కుమారుఁడు తండ్రికంటె బలవంతుఁడుగదా. అనుహ్లాదుఁడు జయంతు నశ్రమంబున నోడించి చెఱసాల బెట్టించె. అది నామది నెరియఁ జేయుచున్నది. మఱియు —

సీ. పాకనాశారితోఁ బ్రౌఢిఁ బోరితికాని
గలుగలే దిటువంటి కష్టి నాఁడు

వృత్రాదితోఁ బోరు వెలయించితిని గాని
పడలేదు నాఁడిట్టి పరిభవంబు
నముచితో ద్వంద్వయుద్ధము చేసితిని గాని
యలుగదు నాఁడిట్టికష్ట మకట
జంభదైత్యునితోడ జగడ మాడితి గాని
రాదు నాఁడిట్టి పరాభవంబు
గీ. భళిర ప్రహ్లాదుసంగరప్రౌఢి వినుతి
సేయ శక్యంబె వానితోఁ జివ్వ సేయ
హరిహరాదుల కైన నశక్యంతరమగు
గడియతడిసిన నటఁ బట్టుపడఁడుఁ గాదె.

నారాయణుని కరుణావిశేషంబున నిప్పటి కీయాపద దాటితి. అది యట్లుండె. మఱియొక శుభోదర్కంబు వేగులవారివలన వినంబడినది. యిక్కడనుండి యింటికిం బోయినపిమ్మట ప్రహ్లాదుండు విరక్తుండై తపోవనంబున కరిగెనని వింటిని. అతండు లేనిచో నన్ను దైత్యులనఁగ నెంత. వారిపీచ మడంపగలము. అతనితమ్ముని బట్టభద్రుం జేసి దైత్యులు వెండియు విజృంభింపవలయునని ప్రయత్నము చేయుచున్నట్టు వార్తలు వచ్చుచున్నవి. కావున మనమే ముందుగ వారిపై దండు వెడలుదము. కోటలు నగర్తలు గాచికొనవలసిన నవకాశ ముండదు. యిది బృహస్పతి మతమని యెఱిగించిన దిక్పతు లిట్లనిరి.

మహేంద్రా! హయగ్రీవాదిదానవులు అనేకసంగ్రామముల నారితేరినవారు. అట్టివారితోఁ బోరుట సామాన్యముగాదు. మొన్ననేకాదా వారు మమ్ముఁ బీచమడఁగఁ గొట్టిరి. ఆ నొప్పులింకను వాయలేదు. ఇంతలోఁ దిరుగ సంగ్రామమెట్లు చేయగలము? అనిన మహేంద్రుడిట్లనియె. మిత్రులారా! యిందు రాజనీతి గ్రహింపవలసి యున్నది. శత్రువులు పరస్పర విరోధయుక్తులై నిస్సహాయులై యున్నప్పుడు వారిపై దండు వెడలవలయు. ప్రహ్లాదుండు యుద్ధమునకు రాకున్న నేనొక్కరుడనే దంభోళిధారాపాతంబున రక్కసుల నెల్లనుక్కుమాపెదనుగాక మీరు బవరము సేయనక్కరలేదు ఊరక వెనుక నిలువంబడియుండుఁడు. అని పలికిన వారెట్టకేల కంగీకరించిరి.

ఇంద్రుడు ముప్పదిమూడుకోట్ల వేల్పులతో దిక్పతులతో గరుడగంధర్వాది దేవతావిశేషముతో బృహస్పతి నిర్దిష్టశుభముహూర్తంబున దండు వెడలి యాఖండలుండు మేఘమండలము మీదుగా భూలోకమున కరుదెంచి రాక్షసనగరము ముట్టడించెను. అప్పుడు ప్రహ్లాదుండు తపంబున కరుగుటంజేసి వేల్పులు విజృంభించి విచ్చలవిడి నగరంబునఁ జొరబడి కోటలు పగులగొట్టి నగర్తలు పూడ్చియు సౌధంబులఁ గూల్చియు నిచ్చవచ్చినట్లల్లరి చేయఁ బొడంగిరి,

ప్రహ్లాదుండు హయగ్రీవాది దానవులతో నెదుర్కొని కొంతతడవు పోరాడి దంభోళిధారా సంరంభమునకు నిలువలేక బలగములతో పరాయతుం డయ్యెను. అట్లు దానవులెల్ల యుద్ధము సేయలేక పారిపోయి శుక్రాచార్యు నింటికిం జని యతని యడుగులంబడి యిట్లువేడుకొనిరి

మహాత్మా! రక్షింపుము. దేవేంద్రుఁడు బృందారక బృందములతోఁ గూడుకొని యేమి యెఱుఁగని మా పీటిపైబడి యల్లరిచేసి మమ్ముం జావఁగొట్టెను. మాకు విజయము గలుగుసమయములో విష్ణుదేవునికి జెప్పి సంధి జేసుకొనియెను. ప్రహ్లాదుండు విష్ణుభక్తుండు. అతని సాత్వికము దెలిసికొని యింద్రుఁడు మమ్ముఁ బీడించుచున్నాఁడు దేవర రక్షింపకున్న మేమిప్పుడు పాతాళలోకమున కేగవలసివచ్చును. అని వేడుకొనుటయు శుక్రాచార్యుం డిట్లనియె.

దానవులారా! మీరు వెఱవకుఁడు అభయహస్తమిచ్చి మిమ్ము రక్షించెద నా యాశ్రమమున సుఖముగా నుండుఁడు మీకే భయమును లేదు. దేవతలు మీజోలికి రాజాలరు అని పలుకుటయు నా దానవులెల్ల నాలుగిద్దలతో నా యాశ్రమమున సుఖముగా వసించిరి. దేవేంద్రుడు వారు పారిపోయిన వెన్నంటి చని శుక్రాశ్రమమున శుక్ర రక్షితులై యున్నవారని తెలిసికొని వారి నేమియుం జేయజాలక దేవతలతో స్వర్గమునకు నిర్గమించెను.

పిమ్మట దేవతలు యుద్ధ విముఖులై యరిగిరని యెరిగి శుక్రుండు రక్కసుల కిట్లనియె

దైత్యులారా! శ్రీవిష్ణువు సంతతము రక్కసుల నుక్కుమాన ప్రయత్నించుచుండు. అందులకే యతనికి దానవాంతకుఁడని పేరు వచ్చినది. ఇప్పుడు మీకున్న బలముతో దేవతల జయింపజాలరు. మారు మిగిలినప్పుడు వాసుదేవుడు వారికి సహాయము చేయుచుండును? కావున సామాన్యముగా మీకు జయము గలుగుట యరుదు. ఇందుల నొక యుపాయ మాలోచించితి మీరు కొంతకాలము శమము వహించి యుండుఁడు. నేను మీ నిమిత్తమై శివునిగురించి తపంబు గావించి దివ్యాస్త్రంబుల సంపాదించుకొని వచ్చెద. అయ్యస్త్రంబులు మీ కిచ్చినచో దల్లాభంబున మీరు విజయమందగలరు అని చెప్పి విని దైత్యదానవు లిట్లనిరి.

మహాత్మా! నీవు తపంబున కరిగిన మమ్మిందుఁ రక్షించు వారెవ్వరు? నిరాధారులమని యెరిగి వెంటనే మమ్ము దేవేంద్రుడు పరాభవింపక మానడు. మమ్ము పాతాళలోకమునకు దోలవలయునని ప్రయత్నించుచున్నాడు. మా కేదియో గతిచూచి పొండని పలికిన శుక్రుం డిట్లనియె. దైత్యులారా! మీ కొక యుపాయము చెప్పెద వినుండు. చతురుపాయములు సమయానుకూలముగా నడిపింప వలయును. నేను వచ్చుదనుక మీరు శమయుక్తులై తపంబు సేసికొనుచుండుఁడు. తపోవృత్తిలోనున్న మీ జోలికి దేవతలు రాజాలరు. నేను వచ్చినతరువాత శస్త్రాస్త్రంబున వారి పని పట్ట

వచ్చు నిడియే కర్తము. వారు మిమ్ము బట్టవచ్చిన గాళ్ళమీఁదకి మైత్రిచేయుడు. అని యెరింగించుటయు నాసాధనమునకు హారందయ నంగీకరించిరి. వెంటనే శుక్రుండు శివునిగురించి తపంబుసేయ హిమవత్పర్వత పార్శ్వమున కరిగెను.

రాక్షసు లపనంత వెంటనే నిజపురంబున కరుదెంచుటయు నప్పుడే ప్రహలాదుడు గూడ గంధమాదనపర్వతమునుండి యింటికి వచ్చెను అతనికి నమస్కరింపుచు దమకపటము దెలియనీయక విరక్తి దోఁప దైత్యు లిట్లనిరి.

మహాత్మా ! నీ యుపదేశము నాఁడు మాకు నచ్చినది కాదు ఇప్పటికి బుద్ధి వచ్చినది. మేము విజృంభించి దేవతలు మనపురము ముట్టడించిరి. రాజులేని రాష్ట్రమైనది మేము వారితో సమముగా బోరలేక పారిపోయి శరణు జొచ్చితిమి. శుక్ర రక్షితులమగు మమ్ము వారేమియు జేయలేక దేవలోకమున కేగిరి. పిమ్మట శుక్రుండు మా కుపదేశించెను, మీ రాజు ప్రహలాదుడు మహా విరక్తుడై మీ రెరింగియే యుండును క్షమావంతునకి జాలినవాడు లేడు. అంతరంగిక శత్రువుల జయించినవో బాహ్యశత్రువులేమియు జేయజాలరు. మీరు శమదమాది సంపత్తితో నీకమీఁదట తపంబుజేసి కొనుచుండుడు మీ జోలికి వేల్పులు రారు అని యుపదేశించిరి.

తదుపదేశంబున మే మిప్పుడు తపంబొనరింప నిశ్చయించి కొంటిమి. తదుపకరణములు కృష్ణాజినములు దర్భాసనములు నారచీరలు కమండలవులు సంపాదించితిమి. ఒక్కచోట గూర్చుని జపముచేసి కొనుటయే యిక మా కృత్యము. యీ వార్త దేవలోకమున కరిగి యింద్రునకి జెప్పిరమ్ము వారును మనమును సుఖపడగలమని చెప్పిన సత్యమనుకొని ప్రహలాదుండు సంతసింపుచు నప్పుడే యమరావతీనగరంబున కరిగెను. అతనిరాక చారణులవలన విని దేవేంద్రుఁడు దెదురుగ వచ్చి గ్రుచ్చియెత్తి తీసికొనిపోయి యర్ధసింహాసనంబున గూర్చుండఁ బెట్టుకొని యాగమనకారణం బడుగుటయు నతం డిట్లనియె.

దేవేంద్రా ! దేవదానవు లక్కాచెల్లెండ్ర బిడ్డలు. పరస్పరము విరోధము వహించుట లోకోపద్రవమై యున్నది. మీరును మేమును గలిసియున్నచో నంతకన్న సుఖమున్నదియా ? ఇప్పుడు నా యుపదేశంబున రాక్షసులెల్ల శమదమాది సంపత్తితోఁ దపం బాచరింప నుద్యుక్తులై యున్నవారు. యిక క్రూరకృత్యములు సేయమని శపథములు చేసిరి. సస్యశస్త్రములై ధనుర్బాణముల విడిచివేసిరి. జటావల్కలములు ధరించిరి. మాంసాహారము వర్జించి కందమూలాదులు దిన ప్రయత్నించుచున్నారు. పెక్కేల యిక తపోధనులై వర్తింపగలరు. మీతో మైత్రిసేయ నిష్టపడి నన్నిందు బంపిరి. మీరును మేమును పాలును నీరునుం గలిసినట్లు కలిసి యుండవలయునని నేను గోరుచున్నాను, అని చెప్పిననిని మహేంద్రు డిట్లనియె

అసురరాజతనయా ! నీవు భాగవతాగ్రేసరుడవు. నీ వాక్యముల యందెంత సత్యము

సపత్న్యమును౦దదు. నీ మాట విశ్వసించి యట్లే మీతో మైత్రిసేయ తుము. రక్కసుల స్వాతికులైనచో వారిచే వా కేల మే మోరక యె పోము. స్వర్గవైభవము చూచి దైత్యు లోర్వజాలక కలహములు పెట్టుచుం రక్కసి కిద్దకు పట్టాభిషిక్తుడైన వెంటనే నాకము మీఁదికి దండు వెడ మొదలిడిరి. మేము భూలోకమునకు వచ్చి వారి కేమైన నపకారము యేమియు లేనిదే గిల్లికజ్జము పెట్టుచుందురు వేరు చెప్పనేల పర వగు నీకుఁగూడ బోధించి పూవులు నెపంబుపన్ని మాపైఁ గతిగట్టజేసిరి. యిది చెప్పటగాదు. రాక్షసధర్మ మెరింగించితిని నీ వెఱుంగని ధర్మవే మాకును మీకును రక్షకుండు శ్రీమన్నారాయణుండే. నీ యట్టి మహ మైత్రి చేయుటకంటె పరలోక హితమున్నదియా ! అట్లే యంగీకరించితి నుండియు దేవాసురులు విహితుల్లై వర్తింతురుగాక. మేము దివియ భువియందును నిర్భయముగా దిరుగవచ్చును. అని యభయస్త మిచ్చె

పిమ్మట ప్రహ్లాదుఁ డింద్రునిచే ననిపించుకొని యింటి వార్తయంతయు రక్కసుల కెరింగించెను. వారు సంతసించుచు జ ధరించి కృష్ణాజినములఁ గూర్చుండి మహాయోగులవలె దపంబు చేసి అని యెరింగించువరకు వేళమిగులుటయు మణిసిద్ధు దవ్వలికథ దిట్లు చెప్పం దొడంగెను.

262 వ మజిలీ

## శుక్రుని కథ

శుక్రాచార్యుం డట్లు రక్కసుల కుపదేశించి హిమవంతంబున ఘోరముగాఁ దపము గావించెను. తత్తపంబునకు మెచ్చి పార్వ ప్రత్యక్షమై నీ యభీష్టమేమని యడిగిన నతం డిట్లనియె.

మహాత్మా ! దేవతలు విష్ణుసహాయంబున నాకు శిష్యులైన దఱచు పరిభవింపుచున్నారు. అప్పని నాకుఁ జాల నొప్పమిగానున్న దేవతల జయింపదగినని. రక్కసుల బలపఱచునవి అస్త్రశస్త్రంబుల ఇదియే నా కోరిక. అని తెల్పిన మహేశ్వరుఁడు నవ్వుచు కావ్యా ! వరంబులిచ్చుట కింకను సమర్థముకాదు. మఱివేయి సంవత్సర తపంబు చేసితివేని నీవా వరము లందఁ గలవు. అని చెప్పిన శుక్రుం అంతకాలమట్టి తపంబు చేసియే యవ్వరంబులందెదనుగాక. యిప తొందరయేమి యని పలికి వెండియు దీక్షితుండై యట్టి తపంబునకు గావించెను.

ఒకనాఁడు యదృచ్ఛముగా నారదమహర్షి దేవలోకమున కరిగెను. అతనిం జూచి దేవేంద్రుని దెదురువచ్చి సుఖాసీనుం గావించి దేవకన్యకలు వింజామరలు విసరుచుండ నయ్యతి కిట్లనియె. స్వామీ! మీ యనుగ్రహంబున ప్రహలాదుడు వలన నాఁటి యుపద్రవము దాటినది. ఇప్పుడు దానవులెల్ల మౌనులై పుడమిఁ దపంబు సేయుచున్నారు. ప్రహలాదుని వలన దేవదానవులకు సఖ్యము కుదిరినది. హాయిగా గుండెపై జేయివైచుకొని నిద్రించుచున్నాము. అని చెప్పిన నారదమహర్షి నవ్వుచు నిట్లనియె.

దేవేంద్రా! నీ మాటలచే నాకుఁ బరమసంతోషమైనది. నీవు శత్రుచ్ఛిద్రముల నరసెడువాఁడ. విపుడింత బేలవైతివేమి! రక్కసుల కెన్నడైన శమదమాది సంపత్తి గలుగునా. వేమునకు తీపువచ్చునా? పాములు విషశూన్యములగునా? అనవుఁడు గదగదలాడుచు వృత్రారియేదియో మూచకున్న నీతపసి యిట్లాడువాఁడు గాడు. తండ్రీ! క్రొత్తవిశేషము లెరింగింపుమని ప్రార్థించుటయు నారదుం డిట్లనియె.

విశేషములకేమి! నే నిప్పుడు కైలాసమునుండి వచ్చుచుంటిని. అందు నందీశ్వరుఁడు నన్నుఁజూచి మునీంద్రా! నీ కిప్పుడు కడుపునిండ నాహారము దొరుకుచున్నదా? అని యడుగుడు లేదు లేదు. ఈ నడుమ దేవదానవులు ప్రహలాదుని మూలమున నాపులై మెలఁగుచుండిరి. దానంజేసి యుద్ధశూన్యమైనది. యని చెప్పిన నవ్వుచు నతండిట్లనియె.

మునీంద్రా! నీ యాఁకలియడంగు సమయము వచ్చుచున్నది. కొలఁది కాలములో ఘోరయుద్ధము జరుగనై యున్నది. అందు రక్కసులే జయింతురు. శుక్రుండు శంకరుని వలన దివ్యాస్త్రంబుల సంపాదించి వాని దానవుల కీయగలడట. అతండు మగుడు దనుకయె దనుజుల శమవృత్తి అని చెప్పెను. ఆ మాట నా చెవింబడినది. గావున మీకుఁ దెలియజేసితిని. రాఁబోవు ననర్థమునకు ముందరనే ప్రతీకారమే దేని బృహస్పతితో నాలోచించుకొని కావించుకొనుడు. నే బోయి వచ్చెదనని చెప్పి యత్తపసి యెందేనియుం బోయెను.

ఆ వార్త విని యింద్రుఁడు అమ్మనేజెల్ల! దైత్యులెంత కపటము చేయుచున్నారు? నిజముగ మునివృత్తి బూనికొని రనుకొంటిమి. శుక్రుని తపంబున కనిపి యతండు వచ్చుదనుకఁ గాలక్షేపము చేయుచున్నారా? కానిమ్ము. ఈ లోపలనే వారిం బరిభవింపవలసి యున్నది. అని తలంచి బృహస్పతి యనుమతి వడసి దేవవాహినీ పరివృతుండై పుడమి కరుదెంచి తపోధనవృత్తిం బ్రవర్తించుచున్న దైత్యదానవులనెల్ల సంగరమునకు రమ్మని జీరుటయు వారట్లనిరి.

సీ. అయ్యయో యిదియేమి యన్యాయ మస్త్ర స
న్యాసంబుచేసి సంయమనవృత్తి
దపను సేయుచు జటాధారులమై నార
చీరలధరియించి భూరిసిష్ట
నా హితాగ్నులమై గృహస్థధర్మముల య
థావిధి సలుపుచుఁ దపము వెలయ
నా ముష్మికమునకై యత్నించుచున్నార
మభయమిచ్చితిరి కారయ్యమాకు.

గీ. దేవతాధర్మమే సమాధి వ్రతాత్ము
లైన మమ్మని సేయ రమ్మనుట తగదు
చనుఁడు వెలుపులారా మీ స్వర్గమునకు
నడుగు దగ్గర నిది దోసమౌనా? కాదా?

అనుటయు నింద్రుండు—

శా. ఓహోహో సురవైరులార! యిఁక మీ యుక్తిప్రయుక్తుల్ మమున్
మోహంబందగఁ జేయలేవు కపటంబుల్ తెల్ల మయ్యెంగదా?
ద్రోహంబున్ బొనరింపమాకు మునివృత్తుల్ బూనినారింక నే
లాహినోక్తులు రండుపోర వడి నానాస్త్రాదియుద్ధో పేతులై.

క. అడిగితిని గురుని మీఁదగు
నడవడి యెల్లం గ్రహించినాఁ డాతఁడు శు
క్రుఁడు తపముచేసి శంకరు
నడిగిన వరముల విశేషమంతయుఁ దెలిసెన్.

కావున మిమ్మిప్పు డుపేక్షింపరాదు. మేకవన్నె పులులై శుక్రాగమున మతిలక్షించియున్నారు. మీ గుట్టంతయుం దెలిసికొంటిమి. ప్రహ్లాదుని మాట నమ్మి యింతదనుక నుపేక్షించితిమి. ఇఁక విడువము. పోరుసేయరండు. లేకున్న రిసాతలమునకుఁ బొండు. అఁదుండ నీయమని పలికిన నులుకుచు వారాత్మగతంబున నిట్లు తలంచిరి.

క. దాపున ప్రహ్లాదుఁడు లే
డా పద పైబడియె నిప్పు దని సేయంగా
నోపము వేల్పులతో మన
మేపగిది న్నిలచువార మిటుపై నకటా!

శుక్రుం డింకను రాలేదు. పాతాళలోకమున కేగితిమేని తిరుగా భూలోక గమనము దుర్లభము—మనల నిప్పుడు రక్షించు వారెవ్వరో—యని యాలోచించుచు—

గీ. కల దుదుగ్రవతవిఖ్యాత కావ్యమాత
పరమ చారిత్ర భృగుమునీశ్వరునిపత్ని
వసిందదాశ్రమమున కేగి పడుద మామె
యడుగులను సురలు సేయు రాయిడి వలించి.

అని తలంచి యా రక్కసులెల్ల నొక్క మొగిలేది విభూతి రుద్రాక్ష మాలికా విరాజిత సర్వప్రతీకులు, పింగళ జటావల్కలాలంకృతులు, గృష్ణాజిన దర్భాసన కమండలు ధారులునై మహర్షి మండలమునుబోలె నొప్పచు మూఁక మూఁక లుగా వేల్పులచేఁ దరుమబడి భృగుమహర్షి యాశ్రమమున కరుగుటయు నీ మహర్షి ప్రవరులెవ్వరో యెందుండి వచ్చుచున్నారోయని కావ్యమాత యబ్బురమందుచు భృగుం బంట లేమింజేసి తానే వారి కాతిథ్యమిచ్చినది. వారందుకొనక తత్పాదం బులంబడి దుఃఖింపుచు—

శా. అమ్మా! మీరు భవత్పుత్రప్రియవిధేయాదిత్యవైరుల్ సుమా!
యిమ్మాడ్కిన్ మునివృత్తి నొప్పినను దేవేంద్రుండు పూర్వాపదా
రమ్ముల్ దెప్పచు మమ్ముఁగొట్టె నిదె సంరక్షింపవే తల్లి య
స్త్రమ్ముల్ బూనక పారివచ్చితిని నీ సామర్థ్య మాసించుచున్.
అని శరణ వేడికొనుటయు నమ్మహాసాధ్వి—

గీ. వెఱవకుఁడు మీ రసురులార పీతసాధ్వ
సమున వసియింపుఁడ స్మదాశ్రమమునందుఁ
దపము గావించికొనుచు మీ దరికి వేల్పు
లేల వత్తురు వచ్చిన నే సయితునె.

అని యభయహస్త మిచ్చుటయుఁ బూర్వసుపర్వులెల్ల నుల్లములు పల్ల వింపఁ గృష్ణాజినంబుల దర్భాసనంబుల నా యాశ్రమ తరుచ్ఛాయల డింపి యుప విష్టులై తాపసము ద్రిప్పచుండిరి. అప్పు డింద్రుడు యుపేంద్రుని సహాయంబుగా దీసికొనివచ్చి కావ్యమాతకు నమస్కరించుచు నిట్లనియె.

ఇంద్రుఁడు—తల్లీ భృగుపత్నీ! నీకు నమస్కారము. నే నింద్రుఁడ నితం డుపేంద్రుఁడు.

భృగుపత్ని—బాబూ! మీ రిక్కడ కేమిటికి వచ్చితిరి? స్వాగతమా!
ఇంద్రుఁడు—కపటముని వృత్తి బూని రక్కసుల నీదు

మరుఁగుసొచ్చిరి యని సేయ మాని యిపుడు
వారివిడువుము పోరాడ వలయు మేము
ధర్మవిముఖుల రక్షింపఁ దగునెతల్లి.

భృగుపత్ని—ఓహో! మహేంద్రుఁడే యీ ధర్మవాక్యము లుపన్యసించువాఁడు యింత ధర్మాత్ముఁడగా నా వృత్రాసురుని మైత్రిచేసి నమ్మించి హఠాత్తుగాఁబోయి యెట్లు సంహరించితివి బాబూ! విష్ణుం డట్టి పనుల నీకు సహాయమగుచుండును గాదా! మీ కెట్లును శత్రువుల వంచించుటయే ధర్మము చాలు నీతులు బాబూ!

ఇంద్రుడు—అమ్మా! లోకకంటకులగు దైత్యుల నెట్లో కపటోపాయంబున వంచకున్న సత్క్రియ లెట్లు జరుగును. నీ వెఱుంగని ధర్మము లున్నవా తల్లీ!

భృగుపత్ని—తాపసులై జపము చేసికొనుచుండ మీ రిప్పుడు మిమ్మేమి చేసిరని తరిమికొనవచ్చితిరి. యిది సహనధర్మమే?

ఇంద్రుఁడు—తల్లీ! యిది నిజమైన జపముకాదు. నీ కొడుకు శివుని వలన వరమునంది వచ్చుదనుక నిట్లుండి యతనివలన నస్త్ర శస్త్రములు వడసి తరువాత మా పని పట్టుదురఁట. యిందుగనే యీ రహస్యము మేము దెలిసికొని వీరిం బాతాళలోకమున కనుప యత్నించుచున్నాము.

భృగు—నా కొడుకుచేయు ప్రయత్నమునకు నే నన్యథా యెట్లు ప్రయత్నింతును. పొమ్ముపొమ్ము. దైత్యుల విడువను పొమ్ము.

ఇంద్రుఁడు—అమ్మా! నీవు మహాపతివ్రతవని సామముగా నడుగుచుండ తిరస్కారముగా మాటాడుచున్నావు. ఈతఁడు చక్రాయుధుఁ డెఱుంగుదువా. యిదిగో వజ్రము మంచిమాటలచే విడువకున్న నీ యాజ్ఞ నుల్లంఘింప వలసివచ్చును!

భృగుపత్ని—శతమఖా! ఏమీ నీ పొగరు. ఆయుధంబులం జూపి నన్నుఁ బెదరించుచున్నావుగా! చూడు మిదిగో మీ పాట్లు అని వానిపై భస్మము జల్లుచున్నది.

క. చిత్తము లెరియఁగ నిద్రా
యత్తత నొంత లెఱుఁగకుండ నవనిం బడుఁడు
న్మత్తత ననుచున్ వేల్పుల
నత్తాప సనతిశపించె నవని చలింపన్.

అప్పుడు ముప్పదిమూడు కోటుల వేల్పులు దిక్పతులు నిద్రాయత్తచిత్తులై త్రాగినవారుంబోలె నొడలెఱుంగక నేలంబడి పొరలుచుండిరి. ఇంద్రుడును మోహవివశుండగుచుండ నాదండనున్న విష్ణుం డతని బట్టుకొని హృదయంబునం బెట్టుకొని కాపాడుటయు నత్తెఱం గెఱింగి భృగుపత్ని కోపాటోపంబున నచ్యుతా! మచ్ఛాపంబునకుఁ బ్రతీకారంబు గావింతువా? ఇంద్రుని రక్షింప నీ వెంతవాఁడవు నిలు నిలుమని పలుకుచు నోరుదెఱచికొని రౌద్రాకారముతో నింద్రోపేంద్రుల

గుటుక్కున మ్రింగినది. అచ్యుతా! చత్తును. చత్తును. మన మిమెకుషిం బడినం జత్తుమని ఇంద్రుండు మొఱవెట్టుటయు నట్టన చక్రిచక్రమును స్మరించు కొనుచుం దద్ధారచే నామెకంఠం బుత్తరించి యింద్రునితోగూడ నీవలబడి ప్రాణముల దక్కించుకొనియెను.

ఆ యుపద్రవము శిష్యులవలనం దెలిసికొని భృగుమహర్షి యతివేగముగా వచ్చి కంఠముత్తరింపబడి యున్న భార్యంగాంచి దుఃఖించుచు నందు నిలువంబడి చూచుచున్న యుపేంద్రుంజూచి కోపావేశముతో—

సీ. అచ్యుతా నీవు సేయఁగరాని పాపంబు
సేయుదు వేయట్లు సిగ్గుమాలి
బ్రాహ్మణస్త్రీఁ బతివ్రత సంగతవ్రత
సాధుసమ్మత నిట్లు చంపుదయ్య
సకలధర్మరహస్య సంవేది వని నిన్నుఁ
జెప్పుదు రీవు దేమి చేటు వచ్చె
మును లెరుంగక నీదు మోసంబు దోసంబు
ధ్యానింతు రుపుడు చిత్తమునందు

గీ. కటకటా! జంతువులఁ జంపుకటికవాని
కంటె నీచుఁడ వైతి విక్కార్యమునను
నేతు లెట్లాడె నీకు నాశిత విధేయ
సద్గుణనికాయ మత్తాయఁ జంపివేయ

క. ఆ పన్నుల రక్షించుట
పాపమొకో వారు కాళ్ళఁ బడి వేఁడంగా
నోపెనె విడువఁగ వేల్పులు
తాపసు లగువారి దరుమఁ దగునే చెపుమా.

వాసుదేవా! నీవు సకలధర్మజ్ఞుండవయ్యు నకార్యకరణంబునంజేసి నిందా పాత్రుఁడ వైతివి. నీవజుండవయ్యు గ్రిమికీటకాదియోను లంబుట్టుచుఁ నిచ్చుడు భార్యావియోగంబున దుఃఖించుచుండుము. యిదియే నీకు శాపంబని పల్కిన నవ్వుచు విష్ణుండిట్లనియె

మ. నను నీకామిని మ్రింగఁబోవుటయుఁ గంఠస్థుండనై గర్వగో
శనిపాతవ్యధకుం జలించి విగతోల్లాసంబుతో నేమి చే
సిన నే మౌనా యటన్మతిన్ దెగి శిరచ్ఛేదంబు గావించితిన్
మునివర్యా! పరికింతురే యిదుమలందున్ బుణ్యపాపక్రియల్.

క. పులి తన్ను మ్రింగ నోరువు
గలవాఁ డైనన్ నివారణముగా సేటో
సలుపక యున్నే ధర్మ...
తెలియక యూరక శపించితివి గద తపసి.

అని యాక్షేపించుటయు భృగుండు పుండరీకాక్షుని మాటల కేమియు సుత్తరమీయక దుఃఖావేశముతో భార్యకళేబరముపైఁబడి—

మ. తరుణీరత్నమ! నీవులేకిఁక గృహస్థప్రోక్త ధర్మంబు లె
క్కరణిం జేయుదు నాతిథేయము లశక్యంబుల్ గదా యింక న
ధ్వరముల్ సేయుట దప్పెనార్మఁబడుఁ బ్రేతాపాపకంబుల్ కటా!
పరమాప్తన్ నను నాదరించి కుడువన్ బ్రార్థింపవా రే టికన్.

క. సీతనయుఁ దూర లేడు గ
దే తడవులకైన నరుగుదెంచి ప్రియముగా
మా తల్లి యేది యనఁగాఁ
నే తెలుగునఁ జెప్పువాఁడ నీ మృత్యువిధిన్.

గీ. ఊరి కేగి వచ్చి యూర్చినఁ గని లేచి
కాళ్లు గడిగి విసనకర్రచేత
విసిరి సేద దీర్చి పిసుగుదు నా కాళ్ళు
లిట్లు నేయరార లెవ్వరింక.

అని కొంతతడవు దుఃఖించి దుఃఖించి యంతలో నిజతపః ప్రజ్ఞ సంజాత సౌగల్భ్యంబు స్మరించుకొనుచు –

శా. ఏమేమీ? తపసీయమృత్యువిధి కేనే నిట్లుదుఃఖించుటల్
సామర్థ్యంబుదలంప కేను సురలాశ్చర్యంబు నొందన్నినున్
సేమంబొప్ప సజీవఁ జేయుదు సునాసీరుండు విష్ణుండు ల
జ్జామోహంబులఁ జెందజూడుము తపశ్శక్తిన్ సరోజాననా.

అని యత్యంతోత్సాహంబు చెంది దెండము కుదురు పఱచుకొని యా మొండెముపై శిరంబతికి మంత్ర తీర్థంబులు చల్లుచు—

క. సత్యము శౌచము హోమము
నిత్యము విధి దప్పకుండ నే సకిపినచో
బ్రత్యయముగ నిపుడే యీ
సత్యవతంసంబు ప్రాయసంయుక్త యగున్

అని పలికిన నక్కాంతారత్నము సజీవయై హుంకారముతో నేడి విష్ణుండు అని పలికిన నులికిపడి మహేంద్రునితో గూడ సురేంద్రుండందుండ వెదకి యమ్మ లికిం బోయెను. బృందారకులును మేనులం దెలిసి యామె వీకకు వడలుచు దైత్యుల జోలికి రాలేక మూకుమూకలుగా నాకంబున కేగిరి. అని యెరింగించు నప్పటికి సమయ మతిక్రమించినది ఆసంయమి పిదప నగు వృత్తాంతంబు తదనంతర నివాస ప్రదేశంబున వెండియు నిట్లు చెప్పందొడంగెను.

## ২৮৩ వ మజిలీ

# జయంతి కథ

దేవలోకమునకు బోయిన వెంటనే తెలుగంటి దొర వేరొక సభచేసి బృహస్పతి కిట్లనియె. గురువరా ! మేము వద్దఅన్నము లన్నియు మీకు వినిపించితిమి గదా ! ఇప్పు డసుర సంఘములకు భృగుపత్ని కవచమై రక్షించుచున్నది. తద్రక్షితు లను మన మేమియుఁ జేయజాలము. ఆమె ప్రభావము తలంచిన మేను కంపము నొందుచున్నది. మన శత్రువులకు మంచి యంత దొరికినది. ఈ లోపల శుక్రాచార్యులు సంప్రాప్తశస్త్రాస్త్రుండై వాని నెల్ల శిష్యుల కిచ్చివేయును. అపుడు మనము బలహీనుల మగుదుము. కావున నిందుల కేదేని ప్రతీకార మాలోచింపరా ! అని యడిగిన గురుఁడు శుక్రుని తపోభంగము సేయుటయే ప్రతీకారము. వేరొక తెరవునం గాదని పలికిన సురపతి స్వామీ ! అందులకై దేవసుందరుల నెంపగనేని నంద బంపితిని. వారందనేక శృంగారచేష్టలం బ్రకటించిరి. స్థాణువువలె నతం డించుకయు గదల లేదఁట. యేమిచేయుదును. తపో విఘ్న మెట్లగును. అనవుడు గురుం డిట్లనియె.

మహేంద్రా ! దేవవేశ్యలు గావించు శృంగారచేష్టల కతండు లొంగువాఁడు గాఁడు. నీయున్న నీ కూఁతురు జయంతి నాతనికిం బెండ్లి జేయుము. దానం గొంత లాభముండక పోవదని పల్కిన శచీపతి యింతకన్న బాధ మేమియున్నది. అతం డంగీకరింప వలదా ! కోపించినఁ బ్రమాదము అనిన గురుడు వానిమతికి ప్రీతికలుగునట్లు శుశ్రూష చేసినచో నేమిదికి శపించెదిని ఆ వేరు పానాతి చేతిలో నున్నది. అని చెప్పిన గురూపదేశము లెస్సగాదలంచి విష్వక్శవుఁడు కష్టమని తలంపక వెంటనే జయంతిని రప్పించి యాదరింపుచు నిట్లనియె. పుత్రీ ! నిన్ను సురాసురమకుట తట ఘటితరత్న కిరణ నీరాజిత చరణయుగ్ముఁడైన భార్గవునకిచ్చి పెండ్లి చేసితిని. అతం డిప్పుడు హిమవత్పర్వత సానువుల దపంబు సేయుచున్నాఁడు. నీ వతనికడ కరిగి యతండు మెచ్చునట్లు శుశ్రూషచేసి దేవహిత మాపాదింపుము. నొమ్మని యాజ్ఞా

పించుటయు ధన్యకాలనైతి మహాప్రసాదమని పలికి యక్కొమ్మ యతని యనికి దెలిసికొన గంధర్వాంగనలు తోడురా హిమవన్నగంబున కరిగి తదారాధనమునకుఁ బూనుకొనియెను.

శుక్రుండు కొన్నిదినములు ధూమపానము సేయుచు పాదాంగుష్ఠము నేలమోపి యుగ్రతపంబు సేయుచుండెను. అప్పు డప్పడతి సమీపమున నిలిచి తాళవృంతమున మెల్లగా వీచునది. మరియుచు-

సీ. మునికన్నమున్న మేల్కొని వేదులలికి క్రము
  గ్గులువెట్టి కుశలు దర్భలు నమర్చు
మరిలివో సిర్ఘరోదకమున నుదికి తా
  వల్కలంబుల నారవైచి మడుచు
దేవతార్చన సేయఁ దావులు వెనజల్లు
  పూవు లేర్కొనివచ్చి పొంత నునుచు
శయనింప మృదుల ప్రసవపల్లవ ప్రసూ
  నములచేఁ దల్పమింపమరఁగూర్చు
గీ. తపసి జపమాచరింపఁ జెంతను వసించి
  క్రమజలంబాజఁ దాళవృంతమున వీచు
  పట్టపగలున మునికాతపంబుదగుల
  నీడ బట్టునుపైట పై నిలిపి లలన.

హావభావాది శృంగారచేష్టల నేమియుం బ్రకటింపక యత్యంత భయభక్తివిశ్వాసములతోడ నయ్యింతి శుక్రుని సేవించుచుండె. తపోవ్యాసక్త చిత్తుం డత్తన్వి యెందులకు వచ్చినదియో యెవ్వతెయో యెరుంగకయే తదుపచారంబు లందుచుండె. మరియు నియమిత తపఃకాలము సమాపకమైనంత నుమాకాంతుండు ప్రత్యక్షమై నీ యభీష్టంబులేమని యడిగిన-

క. అమరులఁ గెలువఁగఁదగు వ
  స్త్రములున్ శస్త్రములనిచ్చి జయమసురులకున్
  సమరములఁ గలుగు గౌరీ
  రమణా! దయ సేయుమని వరంబులు గోరెన్.

అతనికట్టి వరంబులిచ్చి మహేశ్వరుం డంతర్ధాన మొందుటయు శుక్రుండు తపంబు విరమించి యప్పటికి జయంతి దిక్కు మొగంబై కళ్యాణీ నీ వెవతెవు? యేమిగోరి నా కిట్లు శుశ్రూషసేయు చుంటివి. నీ యుపచారములకు సంతసించితిని. నీ యభీష్టములు తెలుపుమని యడిగిన సిగ్గభినయించుచు జయంతి యిట్లనియె.

క. దేవేంద్రుఁడు నా జనకుఁడు
నీవే నా భర్త వనుచు నీకడ కనిపెన్
గావున వచ్చితి నన్నున్
దేవేరిగఁ జేసికొనుమతి ప్రీతిమెయిన్.

మీ రభీష్టవరలాభంబు వడసితిరి. నేను కూడ నభీష్ట వరలాభంబు వడయ నిందు వచ్చితి ధర్మము దప్పకుండ గామినీజనంబుల కేది ప్రీతియో తద్వ్యాపారంబున నన్ను సంతోష పెట్టుడిదియ నా కోరికయని తెలిపిన సంతసించుచు శుక్రుండు-

క. సుదతీరత్నమ నీతోఁ
బదియేడులుగూడి కామపరతంత్రుఁడనై
ముదమొదవించెదఁ బిమ్మట
వదలెదమచ్ఛిష్య కార్యవశమతి నగుచున్.

అని పలికిన యత్తపసి యప్పుడా సతీతిలకమును బాణిగ్రహణము చేసి కొని భూతంబులకుఁ గూడఁ గనంబడకుండ మనోహర ప్రదేశంబుల నేకాంతముగాఁ గ్రీడింపుచుండెను.

అని యెరింగించి మణిసిద్ధుండు మరియు నిట్లనియె.

२९४ వ మజిలి

# కపట శుక్రుని యుపదేశము

శుక్రుఁడు మహేశ్వరునివలన వరములంది జయంతిచేయు నుపచారములకు మెచ్చుకొని యామెం బెండ్లియాడి యామెతోఁ గ్రీడించుచున్నాడన్న వార్త విని సంతసించుచు దేవేంద్రుడు మరియొక కపటమున రక్కసుల వంచించు నుపాయము గురునితో నాలోచించి యందులకై బృహస్పతినే నియోగించెను. సురపతి యనుమతి వడసి గురుఁడొక శుభముహూర్తంబున నిల్లువెడలి శుక్రాచార్యునివేషమవతరించి పుడమి

కరిగి రాక్షసనగరము ప్రవేశించుటయు నతని రాకవిని రక్కసులు మూకలు మూకలుగా వచ్చి శుక్రుండే యనుకొని మ్రొక్కుచు మహాత్మా! శివుండు ప్రత్యక్షమయ్యెనా? మీరు కోరిన శస్త్రాస్త్రము లిచ్చెనా? మేము కృతార్థుల మగుదుమా? చెప్పుఁడని యడిగిన నతండు వారినెల్ల నాదరించుచు హస్తసంజ్ఞచేఁ గుశలవార్త తెలియ జేయుచు నిట్లనియె.

సీ. సన్యస్తశస్త్రులై జరపిరేకాలంబు
సేమమే మీ కెల్ల శిష్యులార
అమరులు మీ తోడ నాహవం బొనరింప
దాడి రాదుగదా విధానమెఱిఁగి
మునివేషములను గైకొని సమాధిదలిర్ప
మెలఁగుదురే? యనిమిషులు నమ్మఁ
బ్రీతి బ్రహ్లాదుండు మీ తోడఁగూడి వ
ర్తించునే దేవతారిత్వ సరణి

గీ. సురరిపు శ్రేష్ఠులొండొరుల్ సూడులేక
యేక వాక్యముమీఁద వర్తింతురుగద
శుభము లొనఁగూడునే దానవ భవనముల
నేను లేనట్టి కాలమం దెఱుఁగఁజెపుడ.

అని యడుగుటయు దైత్యదానవులెల్ల నతనికి జాలి వొడమునట్లు మహాత్మా! మీ రరిగిన వెనుక మేము బద్ధకాములే తన్మాత్రములుగావు. మీరు సెప్పిన వడువున జడదారులమై మా రహస్యంబు దెలియనీయక ప్రహ్లాదముఖముగా మా జోలికి రావలదని దేవేంద్రునికి రాయబార మంపితిమి. అతనిమాటలనమ్మి వేల్పులు మాతో వైరము విడిచి మెలంగుచుండిరి.తరువాత నందీశ్వరునివలన పోరతిండి పోతు తపసి మనగుట్టు విని వేల్పులకుం జెప్పెనట. అప్పు డాఖండలుండు దండు వెడలి మా పట్టణంబు ముట్టడించుటయు మేమాగలేక పారిపోయి మీ తల్లిని శరణు చొచ్చితిమి. అమ్మహాభాగురాలు దేవతలం బొగ డడిగించినది. ఇంద్రునితో విష్ణుని బ్రమింగినది. అప్పుడు విష్ణుండు చక్రంబును స్మరించుకొని తద్ధార నామెశిరంబు దెగ నరికెను. భృగు మహర్షి యత్తెఱంగెఱింగి విష్ణుని శపించి నిజతపః ప్రభావంబున నమ్మ

వా సాధ్వీం బ్రతికించెను. ఆమె నిరామయయై యప్పటియట్ల దేవతలఁ బ్రతిరోధించి నది. తద్రక్షితులమగు మమ్ము వేల్పులేమియుం జేయలేక నిరాశులై యింటికిం బోయిరి. ఆమె రక్షింపకున్న మే మీపాటికి పాతాళమున నుండవలసినవారమే. ఇదియే మా వృత్తాంతమని చెప్పిన గపట శుక్రుం డిట్లనియె.

దైత్యులారా! మీకు మంచికాలమువచ్చినది. నేను శంకరునివలన దేవతా గర్వ నిర్వాపకములైన వరముల వడసివచ్చితి. ఆ శస్త్రాస్త్రముల మీ కుపదేశించెద. అందులకు మున్ను గొన్నివిషయముల బోధింపవలసియున్నది. మీ రందరువచ్చి నిత్యము నా యుపన్యాసము వినుచుండుడు. పిమ్మట మంత్రోపదేశము గావించెదనని చెప్పిన దైత్యదానవులెల్ల నుల్లముల సంతోషములు వెల్లివిరియఁ దమవార లెల్లరకు నా వృత్తాంతంబు దెలియజేసి గుంపులుగుంపులుగా వచ్చి యతనికడ గూర్చుండ దొడం గిరి. అతం డిట్లుపన్యాసము గావించెను.

## పాషండధర్మ బోధ

శిష్యులారా! మనమిదివఱకు వేదశాస్త్రములనునమ్మి సత్క్రియలఁ గావింపుచున్నాము. వేదవిషయముల విమర్శింపక వాని కించుకయు నిలుకడగనం బడకున్నది. శాస్త్రములకు నైకమత్యములేదు. ఆగమములత్రోవ మరియొకటి — తర్కము బురదఁబడిన స్తంభము వంటిది. యుపనిషత్తుల దారియొకటి సాంఖ్యయోగ ప్రకరణము వేరు. ఒక దానితో నొకదానికి సంబంధము గనంబడదు. పరస్పర విరుద్ధము గనంబడుచున్నది.అహింస పరమధర్మమన్ని చెప్పియాగముల నదిపశువచ్చు నని ప్రాబల్కులు పప్పులోన దుగిడినవి. మరియు కర్మలు చేయుమని శాసించి చివర కర్మలవల్ల బ్రయోజనమేమియు లేదని సాటించుచున్నది. విచారింపగా వేదవాక్యములు శుద్ధాబద్ధము లగుచున్నవి.

నిష్కాములై యాగంబులు సేయవలయునఁట. దేహాంతమున నాకమున కరిగి రంభాదివార స్త్రీలతోఁ గ్రీడింతురట ఈ మాటల కర్థ మేమియో గ్రహింపుఁడు. ఒకదేహముతోఁ గష్టపడి మరియొక దేహముతో సుఖపడుననుట యెంత లెస్సగా నున్నది. ఒక దేహ మిందు నుపవాస నియమంబుల గృశించి త్రికాలస్నానాది దుష్క్రియలఁ జివికి యగ్నితప్తమై బాధపడుచు మరియొక దేహమును బూలపాన్పుపై

ఉండిక్లైనంబెట్టి దివ్యభోగంబుల ననుభవింపజేయుట యవివేకము గాదా ఆ మాటవట్టి యసత్యము. యుద్ధమునం జచ్చినవారు నాకమున కరుగుదురట. అదియే నిజమైనచో విష్ణునిచేం జంపబడిన రక్కసు లెల్ల దివికరిగి సురపతిపని పట్టకపోవుదురా !

దుఃఖములేని సుఖము రాదు. ఇంద్రియ సుఖానుభవమే స్వర్గము. దుఃఖమే నరకము. దేహాంతమే ముక్తి. పునర్భవమున్నదనుమాట బీభీషికకాని నిజముకాదు. స్త్రీలు మేదో మాంసరుధి రాస్థిపుంజములని రోతమాట లాడుదురు. యోగీంద్రులుకూడ వారియందే సక్తులైరకూత నా మాటలయం దెంత నిజమున్నదియో పరికింపుడు. స్త్రీ సంభోగసుఖమే సుఖము. పదునెనిమిది పురాణములు రచించిన వేదవ్యాసుని చరిత్రము లోకవిదితము గాదా ? ఒక పురాణము చేప, ఒక పురాణము పంది, ఒక పురాణము పక్షి చెప్పినవి. తిర్యగ్జంతువులు చెప్పిన పురాణప్రమాణముల ననుసరించి చేయుట యెట్టి నీతియో తెలిసికొనుడు తారు క్రోధనులై పరులను క్రోధనవృత్తిగా నుండుడని బోధింతు మునులకన్న గపటాత్ములు వేరు లేరు అక్షపాదుడు చెప్పిన మోక్షమే మోక్షము. వాని నాక్షేపించువారు మూఢులు మరియొక విశేషము వినుండు. ఆస్తిక్యబుద్ధిగల దేహ మిక్కడ భస్మమై పోవుచుండ మనము చూచుచుంటిమి. ఇక పరలోకమునకరిగి పుణ్యపాపముల ననుభవించువా డెవడు ! ఈ మాటనెట్లు నమ్మందగినది కావున పుణ్యపాపములున్న వనుమాట వట్టిది, భయముకొఱకట్లు చెప్పిరి. లేకున్న లోకయాత్ర నడవదు. పరదార సంగమసుఖంబు యథేష్టముగా ననుభవించుచుండుడు. అని చార్వాకుడు చెప్పినమాట విశ్వసింపదగినది.

అహా ! మృతునకు గర్మఫలం బంటునట యెట్లో తెలియదు. ఆరిన దీపమునకు జమురుపోసిన మరి దానిం ద్రాగునా ? ఇదియు నట్టిదే అని యిట్లు కపటశుక్రుడు వేదంబు లప్రమాణములనియు బురాణకథ లవిశ్వసనీయంబులనియు ధర్మంబులు మర్మకృత్యంబులనియు యజ్ఞంబు లజ్ఞానబోధకంబులనియు నాక్షేపించుచు రాక్షసులకు బాషండధర్మము లుపదేశించుచుండెను. ఆ వార్తలు రక్కసు లత్యంతానురక్తితో నాకర్ణించి సత్యాహింసారహితులగుచు యథేష్ట వ్యాపారములకు బూనుచుండిరి.

అట శుక్రుండు జయంతితో బది సంవత్సరములు అహోరాత్రంబులు దివ్యభోగంబు లనుభవించి యామె గర్భవతి యగుట యెఱింగి దివంబునకుం బోమ్మని

యాజ్ఞ యిచ్చి తానింటికి వచ్చెను. రాక్షసనగరంబున బృహస్పతి తనరూపము గైకొని రక్కసుల జుట్టుం గూర్పుండఁ బెట్టుకొని పాషండధర్మము లుపదేశించుచుండ జూచి సమీపించి ముక్కుపై వ్రేలిడికొని యిట్లనియె.

మ. అకటా ! దేవగురుండ నీ విటుల మాయాపాటవంబొప్ప మా
మక రూపంబు ధరించి దైత్యులకు దుర్మంత్రోపదేశంబు లూ
రక గావింతువె వేషధారివలెఁ గార్యంబ్రాపించిలేదే వే
రొక మార్గంబిసిరో భవత్ప్రతిభకీయుద్యోగమహస్సంబొకో.

అని పలికి రక్కసుల నుద్దేశించి—

ఉ. ఓ సుకవైరులార ! పురుహూతుఁ పురోహితు డీతఁడయ్యయో
మోసముచేయఁ జుండె మిము మోహపడంజెడు బోధచేసి నా
వేసముతోడ మీరలు వివేకములేక తదుక్తమార్గ సదో
పాసనసేయుచుంటి రగుపాట్లుతలంప కిదేమి కర్మమో.

గీ. ఏనులేనివేళ నింద్రుఁడసికార్యంబు
చక్కఁజేయఁదలఁచి సమయమరసి
నాదురూపుఁబూని నయమేతమీకు బో
ధించుచున్నవాఁడు ధిషణుఁ డితఁడు.

క. ఏనిపుడగాదె వత్తును
మానాధునివలన వరసమాజముగొని యో
దానవులారా ! గీష్పతి
హీని విడువుఁ డిప్పుడైన వివరము దెలియన్.

అని పలికిన రక్కసులెల్ల దెల్లఁబోయి యతని దిక్కు చూచుచుండ కపట శుక్రుం దదలించుచు నాశుకుఁన కిట్లనియె.

క. నీ వెవ్వఁడవో హోహో
దేవేంద్రుని హితుఁడ వెరిగితిమి పోపో పా
పిష్ఠ వాక్యంబులు నమ్మరు
దేవాదులు నాదు సన్నిధిం జదువంగన్,

సీ. ఎఱుగనే నీ మాయనువాలేసవపురో
హిత ! హితుండట్ల మోహింపఁ జేయ
వచ్చినాడవె దేవవైరుల నాసమ
క్షమునందు నీమాయసాఁగునొక్కొ
వదసితిఁ బార్వతీప్రాణేశవలన ది
వ్యాస్త్రంబులవి యెల్లనాస్థపీరి
కిత్తువత్తురు వీరలింద్రునితోఁ బోర
ముందవ్వ డుపదేశమున సమంత్ర

గీ. కముగఁజేయుదుగాక భార్గవుఁడవైన
నేటికిరుగుము వినరని శాటులివుడు
నీదుమాటలనగు నవినీతి నీవె
వేషమును మార్చినన్ను శైలూషుఁడంటి.

అప్పుడు శుక్రుండు రక్కసుల నుద్దేశించి——

శా. అంతేవాసులు మీరు నా కితఁడు దేవాచార్యుఁడీరూపునన్
భ్రాంతిం బెట్టుచున్నవాఁడు మిమునాపద్వాప్తిఁ బొందింపఁగా
యింతైనం దెలియంగ లేరుగద మీరేమందనీమందు నిం
జెంతన్నిల్వఁగనీకపొమ్మనుఁడు శాసింతుంబయిన్ వెల్పలన్.

క. నేశుక్రుఁడ నేశుక్రుఁడ
వేశుక్రుఁడననుచు వారలిద్దఱోరన్
గాశుక్రుఁడెవడో తోల్పం
గాశక్యముగాక భ్రాంతి కలితాత్ములై.

క. రండేశుక్రుఁడ నితఁడు గు
రుండని లాగంగ నతఁడు రోషముతోడన్
రండేశుక్రుడఁ నితఁడు గు
రుండని పదలాగు నొకఁడు రోషముతోడన్.

సీ. కానిచూతములే ప్రకాశమ్ముగాకున్నె
సత్యమెప్పటికైన జగిపతినసఁగ

కానిచూతములే ప్రకాశంబుగాకున్నె
సత్యమెప్పటికైన జగతినంచు
నీ మాటల నమ్ముదురే మావినేయులు
వదలింతునిదె చూడగదెయటన్న
నీ మాటల నమ్ముదురే మావినేయులు
వదలింతునిదె చూడగదెయటంచు

గీ. నౌరానీమాట తెలియంగ లేరెయనిన
నౌరానీమాట తెలియంగ లేరెయనుచు
శుక్రుఁడాతంగఁ గపటంపు శుక్రుఁడాడు
జేతులాడించు బొంటొరుల్ సూడుబలియ.

పిమ్మట శుక్రుండు దానవులారా! మీరు నిజంబు గ్రహింపుఁడు. నేను లేని సమయంబున సురాచార్యుఁడు నా రూపుతోవచ్చి మీకు బలప్రతాపములు నశించుటకై జైనధర్మము నుపదేశించుచున్నాఁడు. వీని మాటలు వింటిరేని మీకుఁ జేటుగల్గెడు శివు నారాధించి దివ్యాస్త్రంబులు సంపాదించుకొనివచ్చితి. వానిం గైకొని దేవతల పీచ మడంపుఁడు. వీని విడిచి రండని పలికిన విని కపట శుక్రుండు వాని కిట్లనియె శిష్యులారా! వీని యాశ్రయము గ్రహించితిరా! నాకును మీకును భేదముగల్పించి నే సంపాదించు కొనివచ్చిన శస్త్రాస్త్రములు మీ కీయకుండఁ జేయుతలంపుతో నిట్టి పన్నుగడ కావించెనిది నమ్ముదురుజుడీ! నే జేసిన ప్రయత్నమంతయు చిత్తవోయెడినని పలికె.

అప్పుడు దైత్యులు వారిద్దరిం బోల్చిచూచి నిజము తెలిసికొనలేక సంశయ డోలాయత్తచిత్తులై యొక్కింత తడవు వొండొరులు సంప్రతించుకొని క్రొత్తగా వచ్చిన శుక్రుం దిరస్కరింపుచు—

క. పదియేండ్లనుండి మాదక
వదలక యుపదేశమిచ్చువాఁడే కాకే
యుదయమునవచ్చి కవినని
యదలింతువు నమ్మువార మా మాటలచే.

గీ. దేవగురుఁడవు నీవు నిందెలిసికొంటి
మరుగుమేటనుండి వచ్చితో యటకుముంచ

దెలుపు మమరేంద్రునితో నింకనిలుచు మనకుఁ
బదిపినంబులె స్వర్గాధిపత్యమనుచు.

క. ఇతఁడే మాగురుదస్మ
ద్ధితమును సమకూర్పఁ జనక సింటికిని సమా
గతుడైన దాదిగామఱి
ప్రతిదిన ముపదేశమిచ్చు బహువిషయంబుల్

అని దిరస్కరించుటయు శుక్రుండు కోపోద్దీపితమానసుండై-

శా. ఓరీ బాలిశులార! మీహితము నేనూహించి మెప్పించుచున్
గౌరీనాధుదపశ్శక్తి యాప్తి వివిధాఖండాస్త్ర శస్త్రంబు లొ
ప్పారందెచ్చి నిజంబుదెల్పిన గురువ్యాహారజాలోరు మా
యారజ్జుగ్రథితాత్ములై తెలియకెంతో నన్ను నిందింతురే.

క. మీకర్మమిట్టులుండఁగ
నేకరణింజెవికి నెక్కుహితవాక్యము లోఁ
గాక పరాటవమిటుపై
మీకుఁ బదభ్రష్టులగుచు మెలఁగుదు రవనిన్.

అని శుక్రుండు శిష్యుల శపించి లేచిపోయెను. అది యెరింగి గురుండును సంతోషించుచు మరికొన్ని దినములు మాత్రమే యుండుండి యొకనా డెవ్వరికిం దెలియకుండ నాకంబున కరిగెను.

క. గురుదంత వాడుఁ గార్యా
తుఁడై కపటంబులన్ని దోషాచరులన్
బరిభవమందఁగఁ జేసె ని
తరులను నిందింపదగునె ధర్మవిముఖులన్.

అట్లు కార్యంబు సాధించుకొని వచ్చిన యాచార్యుంజూచి పురందరుం డమందానంద కందళిత హృదయారవిందుండై కార్యం బెట్లు ప్రవర్తిల్లినది విశేషము లేవని యడిగిన ధిషణుండు దాను జరిపిన కపటచర్య దెలిపి రక్కసులు గురుశాప దగ్ధులగుట వినిపించి వారిం బాతాళంబునకు దోలనిదియే సమయమని పురిగొల్పుటయు పురుహూతుఁడు గురున కిట్లనియె.

మహాత్మా! నీ దయవలన భార్గవుం డార్జించిన శస్త్రాస్త్రములవలన బాధ మాకుఁదప్పినది. ప్రహ్లాదుడు మునుపే విరక్తుండై వారిం గలియకుండెను. ఇఁక మనము రక్కసులం జయించుట గోటిలోని పనియైయున్నది అని యభినందించుచు దేవేంద్రుండు దేవవాహినీ సమూహంబులఁ బ్రోగుచేసికొని పుడమికరిగి దనుజనగరంబు పైబడి రక్కసులఁ బోరుసేయ రమ్మని చీరుటయు నంతకుఁ బూర్వమే తమ కుపదేశించుచున్న శుక్రుంగానక యతఁడే గురుండు దమ్ముఁగపటము చేసెనని నిశ్చయించుకొని శుక్రశాపదగ్ధులగుట తెలిసికొని భార్గవు నొద్దకుం బోవుటకు సిగ్గుపడుచు నట నుండి పారిపోయి ప్రహ్లాదుండున్న దావెరిగి యటకుఁజని యతనియడుగులంబడి యిట్లు వేడుకొనిరి.

దేవా! నీవు విరక్తుండవై మమ్ము పేక్షించుచున్నావు. మేమిప్పు డన్నివిధ ములం జెడితిమి. దిక్కులేనివారమైతిమి. మాసమిత్రమై శుక్రుం డెక్కుడు కష్టపడి తెచ్చిన శస్త్రాస్త్రలాభంబు గురుని కపటబోధచే వ్యర్థమైనది. పైపెచ్చు శుక్రునిచే శపింపఁ బడితిమి. ఇప్పుడు దేవేంద్రుండు మాతోఁ బోరుదురా! రసాతలంబున కరుగుదురా! యని దండువచ్చి పట్టణము ముట్టడించియున్నవాఁడు. ఇపుడు నీవు పూనికొని రాకున్న మేమధోగతిం బొందువారము రక్షింపుమని వేడుకొనుటయు బ్రహ్లాదుడు గురుడుపన్నిన కపటంబునకు కటకటంపడి గాసిందు మన మిప్పుడు శుక్రునికడకుం బోయి తప్పు సెప్పికొని యతనియడుగులం బడుదము. అతం డనుగ్రహింపక మానఁడు. యతనియూతలేక వేల్పుల మనము జయింపజాలము పదుఁడు శుక్రుని కడకుఁ బదుఁడని పలికిన సురవైరు లిట్లనిరి. స్వామీ! మాలో కొందరు ముందుగానే యందుఁబోయి శుక్రు నాశ్రయించిరి. వారింజూచి ఛీఛీ పొండు పొండు నాయింటికి రాకుడు. మీకు మంచి ప్రాయశ్చిత్త మగునని తిరస్కరించిరఁట. అతఁడు మనరక్కసుల పేరుదలపెట్టిన రోసము గ్రక్కుచుండెనట. ఏమిసేయుదము గురుఁడుపన్నిన జాలములోఁబడి గురుధిక్కారము చేసితిమి అని చెప్పిన బ్రహ్లాదుం డిట్లనియె.

దైత్యులారా! వెఱవకుఁడు అతడు కరుణాళుడు. సంతతము దైత్యహితమే కోరుచుండును. మనలరక్షింపకపోఁడు. నేనుగూడ మీ వెంటవత్తు పదుఁడని ప్రహ్లాదుండు రక్కసులనెల్ల గూడబెట్టుకొని శుక్రాచార్యునొద్దకరిగెను. మోడ్పుచేతులతో వచ్చిన ప్రహ్లాదుం జూచి యాదరించుచు శుక్రుం డతని నమస్కారములందీ దీవించుచు నిట్లనియె.

ప్రహ్లాదా! నీవు విరక్తుండవై క్రుమ్మరుచుంటివి. నేను దానవులనిమిత్తమై తల్క్రిందుగా దపంబుచేసి శస్త్రాస్త్రంబుల సంపాదించుకొనివచ్చితి గురుటోథచే వీరు నన్ను దిరస్కరించిరి. నేను వీరిని శపించితిని. ఆ కథయంతయు నీవు వినియే యుందువు రక్కసులకు గాలము మంచిదిగాదు శాపదగ్ధులనెవడు రక్షింపగలడు. నేజేసిన ప్రయత్నమంతయు నిష్ఫలమైనదిగదాయని పలికిన విని ప్రహలాదుం డిట్లనియె.

మహాత్మా! ఇందు దైత్యులెరింగిచేసిన తప్పేమియున్నది. మీయాజ్ఞానుసారము మునివృత్తిబూని జటావల్కములు ధరించి తపంబు చేసికొనుచుండిరి. గురుడు కపటముజేసి మీరూపుతోవచ్చి బోధించిన నిజమనుకొని మిమ్ము దిరస్కరించిరి. అది కాలమహిమగాక వారిదోషమా మోహితులగువారిం బరిభవించుట న్యాయమా? పిల్లలెఱుంగక తప్పుచేసిన తండ్రి దండించునా! నీవు సర్వజ్ఞుండవు. నీ వెఱుంగనిదిలేదు ఇందు మాదోషముచెప్పి యాక్షేపింపుము అరియుచుంగాక సాధువులకోపము క్షణకాలముకన్న నిలువదు. అగ్నిసంపర్కమువలన జలము వేడెక్కినను సహజమగు శైత్యముజెందకుండునా? కావున రోషమువిడిచి యాశ్రితుల ననుగ్రహింపుము. అని ప్రార్థించిన విని శుక్రాచార్యుండు ప్రహలాదుని వాక్యములచే దేరి దివ్యదృష్టింజూచి వారియందు దోషంబులేదని రోషంబువిడిచెను.

రోషజ్వాలావళీ భీషణవదనుండై త్రిలోకములకు భయము గలుగజేయు నరసింహావతారము లక్ష్మీబ్రహ్మాది దేవతల స్తుతి వాక్యంబుల జల్లారక నుగ్రుండైయుండ శాంతింపజేసిన మహానుభావుండగు ప్రహలాదునకు శుక్రునికి గోప ముపసంహరింపజేయుట యొక యబ్బురమా? ప్రసన్నుండై శుక్రు డిట్లనియె.

ప్రహ్లాదా! నే నెప్పుడను దానవహితమే కోరుదును. కాని పాపము వారికి యపకారము జరిగినది. విష్ణుండు దేవపక్షపాతి యగుట సురలకు విజయంబు సిద్ధిల్లును. రక్కసులయెడ తప్పులేదని నే జెప్పనుగాని యెప్పుడో యెవ్వడో విజృంభించెనని యాజాతియందే పగబూనియుండుట వేల్పులది తప్పు. ఇప్పుడు వారేమి చేసిరని బృహస్పతి యింత కపటము బన్నెను? దైత్యులకు జెడుకాలమగుటఁ బరిస్థితులిట్లు కూడినవి. కానిచో నా ప్రయత్నమంతయు వ్యర్థమగునా? మదీయ శాపదగ్ధులగుట రక్కసులు కొన్నినాళ్ళుపేక్షించి యుండవలయును. ఇప్పుడు వీరికి జయము గలుగుట దుర్లభము అని పలికిన బ్రహలాదుం డిట్లనియె.

గురువరా! గురుడు చేసిన కపటము విన్నది మొదలు నా హృదయమున రోషమావేశించుచున్నది. వెనుక నే నింద్రునితో బోరి చిక్కినవానిని విఘ్నసందేశంబున విడిచితిని. ఇంద్రు డెప్పుడును నుపేక్షింపదగినవాడు గాడు. మీ శాపము నాపై వ్యాపింపలేదు. కావున నేనిప్పుడేపోయి యింద్రునితో బోరద. అతం డిప్పుడు మా పురము ముట్టడించి యున్నవాడని చెప్పుటయు శుక్రుండు ప్రహలాదా! నీ తలం పెప్పుడు రిత్తవోదు. నీ వలిగిన మూడులోకంబులు గడగడలాడును. నీ ముందర సునాసీరు డెంతటివాడు సర్వసేనాధిపత్యము వహించి యిప్పుడు వెడలి యింద్రు నితో బోరబొమ్ము. నీకు విజయ మగుంగాక అని దీవించుటయు బ్రహలాదుండు గురునడుగులకు నమస్కరించి తదనుజ్ఞవడసి దానవులు సేవింప నిజపురంబున కరిగెను.

అందున్న రక్కసులకును వేల్పులకును యుద్ధము జరుగుచున్నది. ప్రహలాదుండు హయగ్రీవాది దానవులం గూడుకొని కవచము దొడగి కోదండంబు ధరించి దివ్యాస్త్రంబులం బ్రయోగించి పీడు ముట్టడించియున్న వేల్పుల పీచమడంచెను. బాబో! ప్రహలాదుడే సన్నద్ధుండైవచ్చె నతని ముందర నిలుచువారెవ్వరు, అని సురలు పికాపికలై తలయొక దారిం బారిపోయి స్వర్గదుర్గమంబుల దాగికొనిరి. ప్రహలాదుండు దానవులతోగూడ వేల్పుల వెన్నంటి తరిమికొనిపోయి స్వర్గము ముట్టడించెను. అప్పుడు దేవేంద్రుండు కవచధారియయి ప్రహ్లాదు నెదుర్కొని ఘోరయుద్ధము గావించెను. వారిద్దరకు బెద్దకాలము ద్వంద్వయుద్ధము జరిగినది. అందు దేవేంద్రుం డోడి పారిపోయి దుర్గాదేవి నారాధించుటయు నాయంబ ప్రత్యక్షంబై యింద్రుని యభిప్రాయము దెలిసికొని భయంకరాకారముతో నామె యుద్ధభూమికివచ్చి హుంకారము గావించినది.

అప్పుడు దైత్యదానవు లా యంబనుజూచి యోహో యీమె భంకముండా సుర సంహారిణి వేల్పులకు సహాయము వచ్చినది కాబోలు యీమెం జయించుట కష్టము. ఉపాయమేమి యాలోచించెదనో చూడుమని పలికిన బ్రహలాదుండు చేతులు జోడించి యద్దేవికి మ్రొక్కుచు భక్తిపులకితగాత్రుండై అంబా! మేమును మీకు బిడ్డలమే మాకన్న వేల్పులు నీకు దగ్గరచుట్టములా! తల్లికి బిడ్డలందరును సమానులు కారా! మాయెడ విరోధముమాని కినికరింపుము. అని యుపాసనావాసనా విశేషంబున నామె గైవారంబు సేయుటయు బ్రసన్నయై ప్రహలాదుని స్తోత్రమునకు మెచ్చుకొనుచు నిట్లనియె.

వత్సా! నీవు హరిభక్తుండవు. నీ కెందును నసాధ్యంబు లేదు. కాని ప్రస్తుతము దైత్యులు శుక్రశాపదగ్ధులగుట విజయమునకర్హులుగారు. వారికతంబున నీవును శాపఫలం బనుభవింపవలసివచ్చుచున్నది. మీరందరు కొన్నిదినంబులు పాతాళలోకంబున వసింప వలయును అందునీవు రాజువై యథేష్టసుఖంబు లనుభవింపగలవు అందేకొరంతయు నీకుండదు. నీవు విరక్తుండవు యెందున్నను నీకు సుఖదుఃఖములు లేవుగదా? వీరివెంట బెట్టుకొని యిప్పుడ రసాతలంబున కరుగుము. యే వెఱపు నుంచవని యుపదేశించినది. అతండు దేవీ వాక్యంబులువిని కాలమహిమకు వెఱగుపడుచు నంగీకారము సూచించి యప్పుడరక్కసులతోగూడ పాతాళలోకమునకరిగి భోగవతీనగరంబున సుఖంబున రాజ్యము సేయుచుండెను అని యెరింగించునప్పటికి గాలాతీతమైనది. మణిసిద్ధుండు వెండియు నిట్లు చెప్పం దొడంగెను.

## 295 వ మజిలీ

# చ్యవనుని కథ

ప్రహ్లాదుడు పాతాళలోకమున రాజ్యము సేయుచున్న సమయంబున భృగుపుత్రుండు చ్యవనుండను మహర్షి రేవానదిలో స్నానముచేయుచుండ నొక మహాసర్పమతని చరణంబులంబట్టుకొని పాతాళలోకమునకు లాగికొనిపోయినది. చ్యవనుండందుజేరి విష్ణుని స్మరించుకొనుచు గన్నులదెఱచి చూచినంత భోగవతీనగర మతనికి గన్నుల పండువ గావించినది అందు స్నానముచేయుచున్న నాగకన్యకలం జూచి చ్యవనుండు మీరెవ్వరు? ఈనగరము పేరేమి? దీని నెవ్వరు పాలించుచున్నారని యడుగుటయు నాకన్యక లమ్మునివరునితో నిట్లనిరి.

ఇది భోగవతీనగరము రసాతలమునకు రాజధాని. దీనిం బ్రహ్లాదుడను రాక్షసచక్రవర్తి పాలించుచున్నాడు. మీరెవ్వరు? యెందుండివచ్చితిరి? మీపేరేమని యడిగిన నతం డిట్లనియె. తరుణులారా! నేను భూలోకనివాసిని నాపేరు చ్యవనుండందురు. నేను నర్మదానదిలో స్నానముసేయుచుండ మకరమో సర్పమో నాకాళ్ళకు బట్టుకొని నన్నిందీడ్చుకొనివచ్చినది. పరమభాగవత శిఖామణి ప్రహ్లాదుడీందున్నాడా! అతనింగాంచి యిందలిరాకకు సాఫల్యము గలుగజేసికొనియెదంగాక అని పలికినవిని యానాగకన్యకలు చ్యవను డనగా సుకన్యభర్తకాదా! మీరు వారేనా! మరి యెవరా! అనుటయు నతం డౌను సుకన్య నాభార్యయే. ఆవార్త మీకెట్లు తెలియును.

అనుటయు వాండ్రు సరిసరి సుకన్య మహాపతివ్రత ఆమె చరిత్రము మేము నిత్యము భక్తిగా బఠింపుచుందుము. ఆ కథ నిత్యము చెప్పుకొనుచుందుము. మీ దర్శనమువలన మేము కృతార్థులమైతిమి. నేవేం దుని మ ప్పుదినూడఁకోట్ల వేల్పులతో స్తంభింపజేసి యశ్వనీ దేవతలకు హవిర్భాగ మిప్పించిన మహా భావుండవు నీవాక జంతువుచే గట్టబడి యుండు దీసికొని రాబడితివా? ఇది నీకు దండనగాని నిర్బంధనముగాదని వారు స్తుతించిరి.

అతండు వారిమాటల నభినందించుచు వెంటనే బయలుదేరి బ్రహలాదునిం జూడ, దదాస్థానమున కరిగెను అని చెప్పినవిని గోపకుమారుండు మణిసిద్ధునకు నమస్కరించుచు మహాత్మా! సుకన్య చరిత్రము నిత్యము పఠించుచుందుమని నాగ కన్యకలు చ్యవనునితో జెప్పిరంటివి ఆచరిత్ర మెట్టిదో ముందుగా వివరించి నాకు సంతోషము గలుగజేయుము. వీరిమాటలచే నందేదియో చమత్కార మున్నదని తోచుచున్నది అని యడిగిన మణిసిద్ధుం డిట్లనియె.

# సుకన్య కథ

వత్సా! సుకన్యచరిత్రము పవిత్రమైనది. చెప్పెదవిను, పూర్వకాలంబున శర్యాతియను భూపతి భూతలంబేలుచు నాలుగువేలమంది భార్యల రూపవంతులంబెండ్లి యాడి వారిలోఁ ద్వితీయపురుషార్థంబున గృతార్థుం డగుచుండెను. వారిలో నొక్కరి తకుమాత్రము గొంత కాలమునకు నాఁడుపిల్ల బుట్టినది. మరియెవ్వరికి నేసంతాన మును గలుగలేదు. అతనిభార్యలందరు నాకన్యపై బ్రాణము లిడుకొని గారాముగాఁ బెంచుచుండిరి. త్రిభువనాశ్చర్యకర సౌందర్యంబునఁ బ్రకాశించు నా బాలకు సుకన్య యని పేరువెట్టిరి. సర్వజనదర్శనీయమై యొప్పారు నక్కన్యయు నను దిన ప్రవర్ధమానయై క్రమంబున యౌవనోదయంబున నవయస్కలగుసఖులతోఁగూడి యాడుకొను చుండును.

ఒకనాఁ డాయెకిమీదు క్రీడార్థిరతి నాలుగువేలభార్యలతోఁ గూడికొని చతురంగబలయుక్తుండై నగరమునకు నతి సమీపమునగా తోయి నిర్మలజలపూరితంబు మనోహర సోపానవిరాజితంబు జలవిహంగమ హృదయంగమంబు నగు సరోవరతీరంబున బలంబులతో విడిసి పటకుటీరంబులఁ దత్తటభూతలం బలంకరింపఁజేసి దేవియలతో గూడ నందు జలక్రీడ లాడుచుండెను.

ఆ సమయమున సుకన్య సఖులతోఁగూడుకొని ప్రాంతారామంబులకుఁ బోయి పుష్పాపచయము సేయుచు నొకచోఁ బుట్టకలుఁగలనుండి ఖద్యోతములవలె మిణుకు మిణుకుమని మెరయుచున్న తేజము జూచి చూచి వెరఁగుపడి బాల్యచాపల్యమునంజేసి వాడిగల ముండ్లకొనచే నా తేజమునకు మూలమగు కన్నులం బొడిచినది. బొటబొట నీరుగారుటయు జడియుచు సకియలతో దూరముగాఁ బారిపోయినది

అంతలో నవ్వలి తటంబున హా! మహారాజా! చచ్చితిమి చచ్చితిమి మలమూత్రములు బిగింపబడినవి. కడుపు లుబ్బినవి అని యరపులు వినంబడినవి. రాజునకును రాజపత్నులకుగూడ నట్టి బాధయే పొడగట్టినది శర్యాతి భయపడుచు వెంటనే బయలు వెడలి పురంబుచేరి వైద్యుల రప్పించి చికిత్స సేయించెను ఉపయోగములేకపోయినది. ఇందేదియో దైవాపచారము సేయఁబడినది. కాకున్న నిట్టి యిక్కట్టు రానేరదు. అదియేదియో యని మంత్రులతో నాలోచించుచున్న సమయంబున సుకన్య యెరిగి తండ్రికడకరిగి తాను జేసినపని తెలియఁజేసినది.

ఆ మాట కడలుచు నొడయఁడు మంత్రులతోఁగూడ నయ్యడవికరిగి తిరిగి తిరిగి యా వల్మీకమును బొడగని విస్మయసాధ్వసములలో నా పుట్ట త్రవ్వింప నందు చ్యవనుండను మహర్షి తపము చేసుకొనుచుండెను. అతం డతివృద్ధుండు. అక్కాననంబు వివిక్తమని నిరాహారుండై స్థాణువువలెఁ గదలక చ్యవను డందుఁ దపము సేయఁ గొంత కాలమునకుఁ దృణలతాదు లతనిం గప్పినవి. పైనఁ బిపీలికములు పుట్టవెట్టినవి. మృత్పిండమువలె నతండు గదలక యద్భుతతపము చేసికొను చుండెను.

సుకన్య ముండ్లకొనచే నతని కన్నులం బొడచినది. దాని నతండు గ్రుడ్డివాఁడై బాధపడుచుండెను. శర్యాతి యతని యడుగులంబడి మహాత్మా! నేను వైవస్వతుని కుమారుఁడ, శర్యాతియనువాఁడ. నా కూఁతురు సుకన్య బాల్యచాపల్యమునంజేసి మీకీ యుపద్రవము గలుగఁ జేసినది. ఈ యపరాధము క్షమింపవలయునని ప్రార్థించెను. చ్యవనుఁడు రాజా! నే నెవ్వరిపై నలుగలేదే. నిరపరాధినగు నన్నుఁ బొడుచుటచే దైవము మీ కట్టిబాధ కలుగజేసెను గాని నే నేమియు శపింపలేదు. నేనతివృద్ధుండనైతి కన్నులుఁలేక కాలమెట్లు వేగింతునో తెలియదని విచారించిన శర్యాతి యిట్లనియె.

మునీంద్రా! నీవు నన్ను ననుగ్రహింతువేని నీ కుపచారములు సేయుటకై పెక్కండ్ర పరిచారికల నియమింతు. దాసీదాససహస్రములు విడువక మిమ్ము సంత

తము సేవించుచున్నాడు. కావలసిన సంభారములు సమకూర్చిందెద నని పలికిన చ్యవ నుండు రాజా! వేతనము తీసికొని సేవించు వారి సేవయెట్లుండునో నీ వెఱుంగవా? నీకు నన్నోదార్పు తలంపు గలిగినచో నీ కూఁతు సుకన్య నాకిచ్చి పెండ్లి సేయుము. సంత సింతునని పలికెను. పిడుగు పడినట్లు ఆ మాటవిని మూఁగవలె నేమియు మాటాడక నిశ్చేష్టుండై యిట్లు తలంచెను.

అకటా! గ్రుడ్డివాఁడు అతివృద్ధుఁడు నగు నీ తపసికి దేవకన్యకలఁ దిరస్క రించు సుకన్యవచ్చి పెండ్లియెట్లు సేయువాఁడ. తన సుఖము కొరకై బిడ్డగొంతుక కోయువాఁ డెవ్వఁడైన నుండునా? తాపసులు ఎక్కువ కోపులు. స్వల్పాపరాధమునకే శపింతురు. జరత్కారువు నిద్రించు పతిని (ధర్మభంగమునకు వెరచి) లేపి యా యప రాధమునకై విడువఁబడెనది. అయ్యో! కాలమెంతలో మారినది? దైవమెట్టి యిక్కట్టు దెచ్చిపెట్టెను? అని విచారించుచు నా మునికేమియు సమాధానము సెప్పక వెంటనే యింటికింబోయి సామంత పురోహిత ప్రముఖులరప్పించి చ్యవనుని యభిప్రాయ మెరింగించుటయు వారిట్లనిరి.

మహారాజా! యీ మనుటకు దోచకున్నది. కుసుమకోమలియగు సుకన్య నాయంధున కిమ్మనఁజాలము. మలమూత్ర ప్రతిబంధక వ్యధయు భరింపరాకున్నది. అందులకు దేవరయే యాలోచింపఁ దగినదిగాని మే మేమి చెప్పఁగలము అనుటయు రాజు కర్తవ్యతా మూఢుండై విచారింపుచుండెను. ఆ కలవరమంతయు సఖులవలన విని సుకన్య తండ్రికడ కరుదెంచి నమస్కరించుచు నిట్లనియె.

జనకా! మీ కెల్లరకు నీ యాపద గలుగఁ జేసినదానను నేను. నా చేసిన దోషఫలంబు నే ననుభవింపవలయు. మీ రేల నన్నా తనికిచ్చి పెండ్లిచేయుఁడు. సంశ యింపవలదు. నే నతనితో గాపురము చేసెదనని పలికిన విని కన్నీరుగార్చుచుఁ దండ్రి యిట్లనియె.

సీ. మణిదీప్తభర్మహర్మ్యములఁ గ్రుమ్మఱు నీవు
వసియింతువెటు ఘోరవనములందు
చెలులకు బనిచెప్పి యలపుచెందెదుదాన
వెటు లూడిగములు గావింతు మునికి
[illegible] చెనటిపల్కులకె యల్కెడినీవు
వినెదు భీకరమృగ ధ్వనులనెట్లు

చీనాంబరములదాల్చిన గందుతనువందుఁ
గట్టంగనేర్తు వల్కలములెట్లు

గీ. లలితమృదు భోజనముల జుఱ్ఱఁగఁజూతు
కందమూల ఫలాదులెక్కరణిఁదిందు
నమ్మ యెఱిఁగి యెఱిఁగి నిన్నంధునకును
జేతులారంగ నెటు పెండ్లి సేయువాఁడ.

మ. మునిశాపోపహతి న్బలంబులును మేనున్ దుర్వ్యథావాప్తినా
శనమైనన్ మఱిలెస్సగాని నిను నో సంపూర్ణ చంద్రాస్య యం
ధునకుం బెండ్లియొనర్ప నొప్పుకొననెందున్ "బూర్వకర్మక్రియా
ప్తిలిఁగాకున్నది గాకనూనదుగదా" వేయేండ్లు చింతించినన్.

అనుటయు సుకన్యాబాలిక జనకున కిట్లనియె.

తండ్రీ నన్ను గుఱించి మీ రింతకయు విచారింపవలదు. బలములును మీరును నా నిమిత్తమై యిక్కట్లలమందుచుండ నా మనస్సునకు సుఖమెక్కడిది. పరమ పవిత్రుండగు నమ్మునితిలకునకు గళత్రమునై పతివ్రతలలో నగ్రగణ్య నయ్యెదం గాక! జనకా! నా కేమియు భోగేచ్ఛలేదు. తొల్లి లోపాముద్రాది రాజకన్యకలు మహర్షుల బెండ్లియాడి త్రిభువన ప్రఖ్యాతకీర్తితో నొప్పుచుండలేదా? క్షణభంగురమగు మేని సుఖంబునిమిత్తముగాఁ బెక్కండ్రఁ బాధపెట్టుట నా తలంపుగాదు అని యుక్తియుక్తముగా జెప్పిన విని మంత్రులెల్ల ప్రభ్రాంతి జెందిరి.

శర్యాతియు, ప్రతీకారశూన్యమగు సేనలపరితాపము పరికించి యందుల కనుమతించి సకల బంధుమిత్ర పరివారసమేతుండై కూతును వెంటబెట్టుకొని యా యరణ్యమునకరిగి యమ్మునిపాదంబులబడి యిట్లనియె. మహాత్మా! మీ యాజ్ఞవడువున నా పుత్రికం దీసికొనివచ్చితి. దీనిధర్మపత్నిగా స్వీకరించి నన్నుఁ గృతార్థుం గావింపుఁడుఅని వేడుకొనుటయుఁ జ్యవనుండు మఱియుచు నరవరా! సత్యసంధుఁడవ నిన్నే చెప్పవలయు. నే నంధుండ, వృద్ధుండ నట్టి నన్నుఁ బెండ్లియాడి నీకూఁతురేమి సుఖపడగలదు? కుసుమపేశలగాత్రి యీ యడవిలో నెట్లు మెలఁగఁగలదు? మాటవరుస కంటి నావాల్గంటి నింటికిం దీసికొనిపోవు దనుటయు నప్పుడమిఱేడు సాభిప్రాయముగా సుకన్యమో ముపలక్షించెను.

అయ్యాశయము గ్రహించి యక్కన్యక యిట్లనియె. జనకా! నీవట్టియూహ విడువుము. నాకీతండె పతియని వాణీపతినొసట వ్రాసియుండెను. ఏల తప్పును. ఇప్పు డమ్ముని వలదనినమాట యెట్లు. నేనికనొరులఁ బరిగ్రహింతునా! వేగమే నన్నా యనకుఁ గన్యాదానము గావింపుమని ప్రోత్సహించినది. శర్యాతియుఁ గూఁతుమతి ద్రిప్పఁజాలక చ్యవనుం బ్రార్థించి సుకన్య నతనికి గన్యాదానము జేసెను.

గీ. ఒరులు ప్రేళ్ళంటి చూపంగ గరములాఁచి
తడవికొనుచు మునీంద్రు డత్తన్వి మెడను
గట్టె మంగళసూత్రంబు కంపమొదవ
గొల్లుమని యేడ్చి రపుడాప్తు లెల్లఁజూచి.

మ. బలిమిన్ గన్నులులేని యాబడుగు పైపై కెత్తిహస్తంబు లం
న్యులు కృత్యంబెరిగింప ముత్తెముల నయోషోత్త మాంగస్థలిన్
దలఁ బ్రాల్పోయగఁజూచి బంధుజన సంతాపంబు రస్తాదన
స్థలదఁ బ్రశూదకధారసీర వగచెన్ గాష్ఠాశిఖుర్గిల్లగన్.

ఉ. మేలికడానితళ్కుఁ జిగిమించు తనూద్యుతలెల్లెడన్ బ్రబలా
జాలము గుమ్మరింపగఁ గిసాలమనోజ్ఞ కరంబులెత్తిర
త్నాలు వశక్షమైన జడదాశితలందల బ్రాలువోయు ప్రో
యాలిగనంగ నెట్టి కఠినాత్మునకైన విచారమాగునే.

శర్యాతి కూతున కట్లు వివాహము గావించి పదిదినములందుండి వేడుకలు సేయుచుండ చ్యవనుం డిట్లనియె.

నరేంద్రా! యివ్వనంబు వివిక్తంబని నేనిందుఁ దపశ్చర్యా సక్తుండనై యుంట నీవు నన్ను గృహస్థుం గావించితివి. యిఁక మీరిందుండరాదు. అందరు నింటికిం బొండు. నాకు భార్య పరిచర్య సేయు చుండెడుంగాక యీ వైభవంబులు నే నొల్లనని పలికిన జనపతి యిట్లనియె.

మహాత్మా! నాకూఁతు రిదివరకు గారాముగాఁ బెరిగినది. పనులుచేసి యెరుంగదు మీకుపచరింప దానితో నూర్వురఁబని కత్తెలనిందుంచ నియమించెద నాజ్ఞయిండని కోరిన నతండు బాలుఁజాలు పెండ్లియాడినందులకే వగచుచుంటి పై పెచ్చు కాంతా సంఘముల సంపర్కముఁగూడ గలిగినచో నా తపశ్చర్య నాటక చర్యయేయగుం

గావున నెవ్వరు నిందుండఁదగదు. తఱచు మీరిందు రాగూడదు. నీవుగాని సంవత్సరమున కొకసారివచ్చి చూడవచ్చును. అందుల కిష్టములేకున్న నీకూఁతుం దీసికొనిపొందు అని చెప్పిన శర్యాతి యేమియు మాటాడలేకపోయెను.

వెంటనే యవ్వాల్గంటియుఁ జీనాంబరము విడిచి నారచీర ధరించినది. రత్నభూషాంబరములు తీసి పసుపుకొమ్ము గట్టికొన్నది. అట్టి సమయమున బంధుజనుల హాహాకారధ్వనులు నింగిముట్టినవి. సుకన్యయే వారి ననునయించి యందరిం బంపివేసినది. శర్యాతియుఁ విడువలేక గూఁతునకు బుద్ధులుజెప్పి యెట్టకేలకుఁ బట్టణమున కరిగెను.

సంవత్సరమైనవంత సుకన్యతల్లి యొకనాఁడు వల్లభుని కిట్లనియె. మనము అమ్మాయిని విడిచి సంవత్సరము దాటినది. దానిగతి యెటులున్నదో తెలియదు. ఆ యరణ్యవాస నొంటియై నా కంటకున కెట్లు శుశ్రూషచేయుచున్నదో యెఱుఁగము. ఎక్కడి శుశ్రూష యీపాటికి మరసియేయుండును. ఆ పాడుజడధారి పరిచారికల నిత్తుమన వలదని చెప్పె. నేమిపాపము. అఖండభూమండలాధిపత్యముగల చక్రవర్తికి బట్టమహిషియై దాసీసహస్రములు సేవింప సుఖింపవలసిన నాబిడ్డగ్రుడ్డి చీకుతోఁ గాపురముసేయ విధి విధించెనా? కటాకటా! అని వగచుచుండ శర్యాతి భార్య కిట్లనియె.

దేవీ! నీ వా పూఁబోడికై వగవఁబనిలేదు. అది పతివ్రతయైపతికి శుశ్రూష సేయుచున్నది. నిత్యము ప్రాతఃకాలమునలేచి పర్ణశాలయలికి ముగ్గులుపెట్టుచుఁ దాను స్నానముజేసి భర్తకు స్నానము చేయించి యగ్ని గృహంబునఁ గూర్చుండబెట్టి యతండు జపముచేసికొనుచుండ దాను ప్రక్క గూర్చుండి ధ్యానించుచుండునట. కందమూలాదికములఁదెచ్చి వండిపెట్టునట. సంతోషముగానున్నదని గూఢచారులు పోయి వచ్చి చెప్పిరి. అది పతివ్రతలలో నెన్నఁబడగలదని పలికిన నిని భార్యయిట్లనియె.

సుకన్యంజూడ మీ యిల్లాండ్రందరు వేడుక పడుచున్నారు. ఏటికొకసారి చూడవచ్చునని యా జడదారి చెప్పెంగదా? మమ్మఁదీసికొనిపోవదురే అని యడిగిన నతిండు జనసంపర్కమునకు నీ యల్లుఁడొల్లఁడు. మనమందరము పోయినచో నలిగి శపించునేమో? కావున నీ దాదినంపుదము. అదిపోయి యామె సేమమరసి వచ్చెడుంగాక అని చెప్పిన నప్పడతి యొడంబడి యప్పుడే నప్పరిచారిక నంపినది.

యాపనికత్తియు నా యరణ్యమున కరిగి సుకన్య చరిత్రమంతయుఁ బరికించి యింటికివచ్చి రాజపత్ని కిట్లనియె. అమ్మా! నీ కూతున కేమియు లోపములేదు. ఇంద్రాణి వలె భోగము లనుభవించుచున్నది. అనుటయుఁ దెల్లపోయి అట్లంటవేమిఁ కాయఁ గూరలు దినుచుండెడి వృద్ధతాపసుని పెండ్లాము యింద్రాణివలె భోగములెట్లనుభవించును. తిన్నగాఁ జెప్పుమని కసరుటయు నాపనికత్తియ యిట్లనియె.

అమ్మా! మీ యొద్దదాచనేల? అమ్మాయి మన్మథునివంటి పురుషునితోఁ గూడుకొని యా యరణ్యమే యుద్యానవనము చేసికొని విహరింపుచున్నది. ఆ చీఁకు జూచి యేమయ్యెనో తెలియదు. భూమిచక్రకిందైనను చెలింపని మనసుగల సుకన్య కట్టివిపరీతపుబుద్ధి పుట్టుట యెట్టి యాశ్చర్యమో తెలియదు. అని చెప్పిన బిడుగుపడి నట్లు అదియును నాయిల్లాలు యేమంటివి? నా కూఁతురు పుంశ్చలియైనదా? ఆ పరపురుషుని నీవుచూచితివా? అని యడిగిన నదియిట్లనియె.

దేవీ! నేనంతవిమర్శింపక చెప్పుదాననా? సుకన్య నెరుఁగనిదాననా? పెండ్లి కాలమున నీ యల్లుని జూచియుండలేదా! ఆ కాంతవింతపురుషునితో జలక్రీడ లాడుచుండ బూవులుగోయుచుండ సరసము లాడుచుండఁ గన్నులారఁ జూచితిని. చెవులార వింటిని. పల్కరించితిని. తల్లుబందరనడిగినది సమయమకని యీ పురుషుఁ డెవ్వఁడని యడిగిన నా ప్రాణనాథుడని చెప్పినది. యా తాపసుఁడేమయ్యెనని తెగించి యడిగినఁ బకబకనవ్వుచు నా పురుషునివంకఁజూచి యేమియు సమాధానము చెప్పినదికాదు. అప్పుడు నా మనసునరోతబుట్టుటయు నామెకు జెప్పకయే లేచివచ్చితిని అని యా వృత్తాంతమంతయు నెరింగించినది.

అక్కాంతయది సత్యముగాఁదలంచి చింతాకులస్వాంతయయి పరితపింప నప్పుడే యవ్వార్త యంతఃపురిమంతయు వ్యాపించినది. క్రమంబున నూరిపైబడినది. పౌరులు గుంపులుగాఁ గూడుకొని కొందరు కాదనువారు కొందరౌననువారు వాదోప వాదములు గావింపుచుండిరి. ఆ వార్త వచ్చి వచ్చి శర్యాతి చెవింబడినది. యతఁడు భార్యకడకువచ్చి పరిచారికవలన వెండియు సుకన్యకథ వినికోపమాపఁజాలక కరవాలము చేతఁబూని తురగారూఢుండై యా యరణ్యమున కరిగి పర్ణశాలం బ్రవేశించి చాటున నిలువంబడి వారిమాటలాలించెను. అప్పుడాభార్యాభర్తలిట్లు సంభాషించుకొనుచుండిరి.

భర్త—రాచపట్టీ! నీ పుట్టినింటినుండి వచ్చిన దాదియేమైనది. మీతండ్రిని రమ్మని వార్త నంపితివా ?

భార్య—అది మిమ్ముఁజూచి మరియొకరనుకొని నన్నడిగిన నవ్వుటాలకు నేను వేరొకరీతి నుత్తరమిచ్చితి దానం గోపించి నన్ను జారిణిగాఁదలంచి నాతోఁ జెప్పకయే లేచిపోయినది.

భర్త—అయ్యో! దానితో నిజమేమిటికి జెప్పితివికావు. దాని మాటవిని మీవారు నిన్ను వేరొకలాగున దలంతురేమో.

భార్య—అది మరికొన్ని దినము లిందుండు ననుకొంటి చెప్పకయే పోయినది పోనిండు మరల రాఁగలదు

భర్త—అశ్వినీదేవతల కిచ్చిన వరము సఫలము చేయవలదా.

భార్య—తప్పకచేయవలసినదే మా తండ్రికి వర్తమానమంపెద అనివారు సంభాషించుకొనుచుండఁగ విని శర్యాతి యోహో! వీరు నావాక తెలిసి యిట్లు కపటముగా మాట్లాడుకొనిరా? తొందరబడి వీరిం బరిమార్పఁగూడదు. వీరిం బల్కరించి నిజము తెలిసికొని పిమ్మట యుక్తానుసారము గావించెదనని తలంచి తనపేరుసెప్పి తలుపు తీయుఁడని కేకవెట్టెను ఆ మాటవిని యాబోటి తటాలున తలుపు తీసినది. అతనిం జూచి మందహాసశోభిత వదనారవిందయై యర్ఘ్యపాద్యాదు లర్పించి యుపవిష్టుఁజేసి యిట్లనియె

గీ. తండ్రి కుశలంబె యంబకుఁ దల్లులకును
సేమమే బంధువులకెల్ల సేనలెల్ల
వ్యాధులను బాసి సుఖియించువారె దేశ
మునసుభిక్షము వెలయునే జనక చెపుమ.

అని యడిగిన నతండామె మాటలకు నొకవిధంబున నుత్తర మిచ్చుచు నెదుర మదనాకారంబున బ్రకాశించు పురుషుం జూచి తల యూచుచు సుకన్యా! నీ మగఁడా గ్రుడ్డితాపసి యెందుబోయెను. ఈ సుందరపురుషుఁ డెవ్వఁడు? నిజము చెప్పుము పరమపవిత్రమైన వంశంబునం జనించి యిట్టి నికృష్టపుకృత్యంబునకుఁ బూనుకొంటివేమి? నాఁడు మాకు బెక్కునీతులుపదేశించితివే ఆ నియమమంతయు నేఁడు

బోయినది. నీ చేష్టలు పురమంతయు విపరీతముగాఁ జెప్పుకొనుచున్నారు. ఆ యపకీర్తి మోయలేక మీ యిరువురం బరిమార్చుటకై యీకత్తి బూసివచ్చితి నిజము చెప్పుమని యడిగిన నప్పడఁతి యించుక సిగ్గుపడుచు గనుల జలమ్ముగ్రమ్మ మెల్లన నిట్లనియె.

రాజా! నీకిద్ద యెన్నడైన జెడ్డకార్యములు సేయునని తలంచితివా? నీ ప్రజలెరుంగకట్లు చెప్పుకొనుచున్నారు. ఆ గ్రద్ధితాపసియే యీతఁడు యీతఁడే నీ యల్లుడు. అనవుడు ముక్కుపై వ్రేలిడుకొనుచు నా యొడయఁడు ఔరా! యింకనుం బొంకెదవా? నీ మగని నేనెఱుంగననుకొంటివా? నిజము చెప్పుమని యదలించిన నా చెంచలాక్షి తనవృత్తాంత మిట్లు చెప్పందొడంగెను.

అనియెరింగించి కాలమతిక్రమించుటయు మణిసిద్ధుండు పైకథ పైమజిలీ యందిట్లు చెప్పందొడంగెను.

## 29౮ వ మజిలీ

# అశ్వనీదేవతలకథ

క. ఇరువురు చక్కని వారలు
పురుషులు మాపర్ణశాల పొంతకునొకనాఁ
డరుదెంచిన వారలగని
తెరువరులని యతిథిపూజ దీర్చితి భక్తిన్.

తండ్రీ! నాభర్తను వాడుకప్రకారము తటాకంబున జలకమాడించి తీరంబునఁ గూర్చుండబెట్టి కార్యకరణీయంబులు దీర్చుకొనుచుండ గృహకృత్యంబులకై పర్ణశాలకు వచ్చినంత నిరువురతిథులు మాయింటికి వచ్చిరి. వారి నర్చించితిని. వారు నన్నుఁజూచి వ్యామోహమొందుచు నబలా నీ వెవ్వతెవు? యీ విపినంబున నొంటియై నేమిటికుంటివి? పతి యెవ్వరు? తలిదండ్రు లెవ్వరు. అని యడిగినఁ దలవంచుకొని నేనిట్లంటి.

మహాభాగులారా! నేను శర్యాతిభూపతి కూతురను. నాపేరు సుకన్య యందురు. నాభర్త చ్యవనుండు. అంధుడు. ఆ తటాక తీరంబున గూర్చుండి జపము చేసుకొనుచున్నారు. మీ రెవ్వరో యెరింగింపుడని యడిగిన నప్పురుషులు విస్మయముతో నిట్లనిరి. పూఁబోఁడీ? నీ తండ్రికి బుద్ధిలేకపోయినదా? నీ రూపముచూడ దేవకన్యక మించి యున్నావు? చూచిచూచి నిన్నా యంధున కెట్లు పెండ్లి చేసెను. ఆ గ్రుడ్డిదీకుతో నెట్లు కాపురము సేయుచుంటివి? యిక చాలు. వీనివిడిచి మాలోనొకని వరింపుము. సుఖపడియెదవని పలికిన నేనిట్లంటి.

ఆర్యులారా! మీరా విరుద్ధముకన్న మీరనినమాట లోకవిరుద్ధముగా నున్నది. భర్తకుంటియైన గ్రుడ్డియైనను సేవింపవలయునని శాస్త్రములు ఘోషించుచున్నవి. మీ రెవ్వరో నేనెరుంగ శాస్త్రవిరుద్ధమైన మాటలాడిరి. నాభర్తనుగురించి మీకు వగవం బనిలేదు. మీ రతిథులరై వచ్చితిరి. కావున నాతిథ్యమంది పొండు. కొండొక మాట పలుక మీకు బనిలేదు. అదిగో నాపతి పిలుచుచున్నాడు. పోయి తీసికొనివత్తు నని పలికి నేనక్కడకును కడకరిగి పదిలముగా బతి చేయిపట్టుకొని మెల్లగా నడిపించుచు దీసికొని వచ్చి పర్ణశాల గూర్చుండ బెట్టితిని. వారక్కడనే నిలుచంబడియుండి చ్యవనునియంధత్వము, వృద్ధత్వము, నా యుపచారములుం జూచి నాశీలమును మెచ్చుకొనుచు బ్రసన్నులై నాకిట్లనిరి.

సాధ్వీ! నీ పాతివ్రత్యము స్తుతిపాత్రమైయున్నది. మేమశ్వనీ దేవతలము యదృచ్ఛముగా భూమి విహరింపవచ్చితిమి. నీ దర్శనమున గృతార్థులమైతిమి. నీ కేదేని యభీష్టమున్న దెలుపుము. అని యడిగిన నమస్కరించుచు నేనిట్లంటి.

దయాళులారా! మీరు వేల్పులు. మేము మనుష్యులము మీ దర్శనమున మేము కృతార్థులమగుదుము. నాకేకోరికయునులేదు. పతియానతిలేనిదే యొరునడుగను మీకుబ్రేమయున్న వారి నడుగుడు. అనుటయు నాశ్వనేయులు చ్యవనునకునమస్కరించి మునీంద్రా? మేమా సత్యులము. మీపత్ని పాతివ్రత్యమునకు మెచ్చికొని వరమీయనుంటిమి. మిమ్ము·గోరుమన్నది. మీ యభీష్టము తెలుపుడని యడిగిన సంతసించుచు చ్యవనుండిట్లనియె.

ఆర్యులారా! నాకైశ్వర్యములతో బనిలేదు. ఇక్కామిని నన్ను బెండ్లియాడి యుపచర్య గావింపుచున్నది. నావలన సుఖలేశ మెయ్యంగదు. దీనికతంబున మిమ్మొక వరమడుగుచుంటి. వినుండు. నాకు మీవంటిసౌందర్యము రూపము ప్రాయము తేజము గలుగునట్లు వరంబిడుడు. సంప్రాప్త యౌవనుండనై యిక్కాంతారత్నముతోఁ గొంతకాలము క్రీడించి దివ్యభోగము లనుభవించెద. అని కోరుటయు నాదివ్యవైద్యు లప్పుడే యాతపస్వితోఁగూడ నత్తటాకంబున మునింగి లేచివచ్చిరి. అమ్మహర్షి తెఱ వెడలి వచ్చినట్లు వృద్ధరూపము వదలి దివ్యాకారశోభితుండై ప్రకాశించెను. మువ్వురు నొక్కపోలికగా నుండి నాయెదుట నిలువంబడిన నేపతిం దెలిసికొనజాలక యాదేవ ద్యులం బ్రార్థించితి. వారు నాయెడ బ్రసన్నులై నాభర్త కెడముగా నిలువంబడి యాతఁడే యని నిరూపించి చెప్పిరి.

అప్పుడు నా భర్త వారియెడ గృతజ్ఞత జూపుచు మీరు నాకుఁ గావించిన యుపకారమునకుఁ బ్రత్యుపక్రియ చేయలేక పోయితినేని నాతపఃక్రియ నిరర్థకముగదా? మీ యభీష్టముగూడ జెప్పుడు. తీర్చి కృతకృత్యుండ నయ్యెదంగాక. అని యడిగిన వారు వెఱఁగుపడుచు మునీంద్రా? నీ వట్టివాఁడవైతేని కోరెదము వినుము మాకు జన్మంబుల హవిర్భాగంబులఁగొనుట కధికారము లేదని దేవేంద్రుఁడు మమ్ము నిరాకరింపుచున్నాడు. అతని కోపి మా కా భాగంబుల నిప్పింతువేని మిగుల సంతసింతుమని పలికిరి. అట్లే యిప్పింతునని శపథము చేసి నా పతి వారి నంపిరి.

అది కారణంబుగా నా మహర్షి యిట్టి దివ్యరూపము ధరించి నాతోఁ గ్రీడింపుచున్నారు. నేఁడే యాగంబు చేయించి యశ్వినులకు హవిర్భాగంబు లిప్పింపఁ దలంచుచున్నారు. అందులకే నిమంత్రణము బంపుమని చెప్పిరి. నీవు వచ్చునప్పటికా మాటలే ముచ్చటించుకొనుచుంటిమి. ఇదియే నా వృత్తాంతము. అని సుకన్య యెఱింగించినది.

చెప్పఁబోవు నంతలోఁ జ్యవనుండరుదెంచి మామకు నమస్కరింపుచుఁ దనవృత్తాంతము నెంతయుం జెప్పి యతని సంతోషసముద్రమున ముంచియెత్తెను.

శర్యాతియు దదాజ్ఞ వడువున నిరతిశయవైభవముతో భూతలంబునంగల శ్రోత్రియులనెల్ల రప్పించి మితిలేని దక్షిణలిచ్చుచు నా తటాక తీరంబున దేవయజనంబు గల్పించి యధ్వరము సేయఁ బ్రారంభించెను. ఆ యాగమున చ్యవనుం డుపద్రష్టయై హోతలచే నశ్వినీదేవతలం బిలిపించి హవిర్భాగములిచ్చుటకుఁ బ్రయత్నింప మహేంద్రుఁడెరింగి ముప్పదిమూడుకోటుల వేలుపులతో వచ్చి యత్తపసి కిట్లనియె.

క. మందుల నొసగుచు వేల్పుల
కందఱకును బ్రణధులైన యాశ్వినులను మా
ముందఱనిడి మా తోడుత
విందుల గడువంగ బిలుతువే జడదారీ!

కం. నిగమంబుల జదువవా? దే
వగణంబుల నెఱుఁగవో? సవప్రక్రియలం
దగువిధుల మఱచితో? యిటు
తగుదని యేమిటికి నిట్టు తలపెట్టితివా.

ఉ. ఈమహి నశ్వినీసుతుల నింతకు మున్నెవరైన నధ్వర
సోమమునందు నాహుతులతోడ హవిస్సుల నీయఁదల్చిరే
నీమది నిట్టులేల నవినీతి వహించితివో నెఱుంగవో
మామక పాణి భాస్వదసమాన పవిప్రభావముల్

ఉ. దాసులు గారె మాకునల దస్రులు వారినభూతపూర్వులం
జేసి సమాన గౌరవ విశేషంబులం బిలిపించినావు సం
త్రాసమొకింతలే కిటుస్వతంత్రుఁడవై యది తప్పు తప్పు మా
తోసరిగద్దెఁగూడికొని తుష్టిభుజింపగ వారలర్హులే.

గీ. మీదెఱుఁగకుండ బిలుచుట నీడితప్పు
పిలువగనె వచ్చుటరయ వారలదితప్పు
ఎఱుఁగరే వారు తమబలం బెదిరి బలము
మంకలింపుమ గుట్టనుండి మరలినఁగ.

అని పలికినపసి సోపహాసముగాఁ జ్యవనుండిట్లనియె.

సీ. మునికామినీసంగ మొనరించి తనువెల్ల
భగములై వెలయ శాపంబు గొనవు
బ్రహ్మహత్యా పాపపరిభవంబున కోడి
డాగరు బిసరంధ్రభాగమందు
నగ్నిసాక్షిగ మైత్రి నాచరించిన మిత్రుఁ
దెలియకుండఁగనె వధింపరెపుడు
పాఱరు రణభూమి బలుమారు శాత్రవుల్
వెన్నంటి తరుమంగ వెఱపుగదుర

గీ. నశ్వనీ సుతు లధ్వర హవ్యభాగ
ముల గ్రహింపగ నర్హత బూనరంటి
వేమితప్పులు చేసిరోయెరుగఁ జెపుమ
వారు నీ కంటెఁ దక్కువవారెయింద్ర!

గీ. భువనములకెల్ల రతనంపు భూషసకల
వేదమంజూష పూష తద్వీర్యమునను
జనన మందిరి బడబరూపునఁ జరించు
నుషకు నాసత్యులిట నపూజ్యులె సురేంద్ర

గీ. ఏడియెటులైన వారికీ నిత్తునంటి
హవ్యభాగంబు లన్మతంబులాదఁజాల
నీవుగాదల్ల భువనాధి నేతనైన
వలదటన్నను విడిబెడువాఁడగాను.

అనుటయుఁ గటకటంబడి యింద్రుండు యేమీ చ్యవనా నీ వింత పొగరు చూపితే త్రిలోకాధిపతినైన నన్ను గౌరవింపక యధిక్షేపించుచుంటివా? నా చేత వజ్రాయుధమున్నదని యెరుంగదువా? మహర్షివగుట నంతవట్టు సైరించితి బ్రతుకదలంచితి వేని, నీ యాసత్యులనంపివేయుము. లేకున్న నిప్పుడే దంభోళిఘాతంబున నిన్ను నీ యాజకులను శమనలోకాతిథులం గావింతెన. చూడుమని బలుకుచుండగనే చ్యవనుండు మందహాసము సేయుచు హోతలచే శస్త్రోచ్చారణ గావింపజేసి యశ్వినీ దేవతలకు నగ్నిముఖంబున హవిర్భాగంబు లిప్పించుటయు సింద్రుఁడలిగి యతనిపై దంభో

విసరుటకు దక్షిణభుజాస్తంభంబెత్తుటయు చ్యవనుండు సంరంభంబున హుంకారం బొనరించి తద్భుజాస్తంభనంబు గావించె నప్పుడు సురలెల్ల హాహాకార నినదంబులు గావించెను.

అత్తపస్వి యంతటితో విడువక తన తపోబలంబుని నింద్రుని జంపదగు కృత్తి యుదయింప మంత్రములం జపించుచు నగ్ని వ్రేల్చుటయు నందుండి భయంకరా కారముతో—

సీ. క్రిందియోష్ఠంబు ధాత్రీమండలంబుపై
మీఁదియోష్ఠమాకాశమంత
యదర నూఁగామధ పొదవుగల్గిన నాల్గు
వాణికోఁఅలు రుచి జ్వాల గ్రక్క—
దశయోజనాయామదశనముల్ మరికొన్ని
ప్రాసాదశిఖరముల్ పగిది మెఱయ
దీర్ఘ బాహువులు భూధ్రధరంబుల భంగి
వక్త్రంబు కాలాగ్నివలెఁ దలర్ప

గీ. రవిహిమాంశుల పగిది నేత్రములు గ్రాల
నప్పళించుచు నోరు జిహ్వాగ్రమునను
జగములన్నియుఁ గబళించు పగిది మదుఁడు
ఉరికె సురపతి మీఁదికత్యుగ్రుఁడగుచు.

మహేంద్రుండు నచ్చెఁ జచ్చెనని వేల్పులు కేకలు వెట్టుచుండ వికృతవక్త్రుండై తనమీఁదికి వచ్చుచున్న మదుంజూచి నముచి సూదనుండు స్తంభితభుజుండగుట నెటకుం బారిపోవనేరక సాత్వసవ్యాకుల చిత్తుండై చ్యవనుని పాదంబులఁబడి మహాత్మా! రక్షింపుము నీ యానతి వడవున నశ్వినీసుతులకు హవిర్భాగంబు లిప్పించెద. నీ యుపద్రవంబు దప్పింపుమని ప్రార్థించెను.

కృతాంతరంగిత హృదయుండగు నమ్మునిపుంగవుండు వామ హస్తపంచాలనంబున నమ్మదు నౌద్ధత్యంబు వాపి యింద్రు సమక్షంబున నాసత్యుల సోమపీథులం గావించెను. ఇటుపై యాగంబుల నశ్వినీ నందనులకు హవిర్భాగంబు లిచ్చుటకు నంగీకరించితిమని యెల్లవేల్పులు విన నింద్రుండు పలికె. చ్యవనుననుజ్ఞవడసి మదుని బాధం బొందక నిజనివాసంబు కరిగెను.

అశ్వినీ దేవతలు చ్యవనుని ప్రభావంబు వేనోళ్ళఁగొనియాడుచు సంతుష్టాంతరంగులై దివంబునకు జనిరి.

గీ. ఇంద్రునెదిరించి బెదరించి యేపుమాపి
యాశ్వినేయుల కిప్పించె హవ్యములను
తపసి యాత్మీయ వార్ధకాంధత్వములను
బాపికొనఁ డయ్యె వింత తాపసులచింత.

యిదియే సుకన్య చరిత్ర. ఆ మహానుభావుండే యీ చ్యవనుండు. అని నాగకన్యకలు సుకన్యచరిత్రము చెప్పుకొనిరని చెప్పి అంతలో వేళమిగిలిన పై కథ పై మజిలీయందిట్లు చెప్పందొడంగెను.

## 300 వ మజిలీ

# ప్రహ్లాద నారాయణుల యుద్ధము

చ్యవనమహర్షి యట్లు ప్రహ్లాదుండున్న నాతని యాస్థానమున కరిగి ద్వారపాలురచేఁ దనరాక నివేదించుటయు నా హరిభక్తుం డత్యంత భక్తిపూర్వకముగా నర్ఘ్యపాద్యంబులఁ గొని యమ్మునికెదురువచ్చి యర్చించి తీసికొనిపోయి సుఖాసనాసీనుఁ గావించి వినయముతోప నిట్లనియె.

మునీంద్రా ! నీవెందుండి యిందు వచ్చితివి ? ఇంద్రుం దండించి యశ్వినీ దేవతలకు హవిర్భాగంబు లిప్పించి న ధన్యుఁడవు. నీ దర్శనము వలనఁ గృతార్థుండనైతి. భవదాగమనకారణం బెరింగింపుమని యడిగిన నమ్మహర్షి యిట్లనియె.

పరమభాగవతశిఖామణివగు నిన్నిందుఁ జూచుటచే నా రాక సాద్గుణ్యము నొందినది. నేను తీర్థయాత్రా సక్తచిత్తుండనై పరిభ్రమించు నర్మదానదిం గ్రుంకులు వెట్టుచుండ జలజంతువేదియో నాకాళ్ళకుఁ బట్టుకొని నన్నిచ్చటికి లాగికొనివచ్చినది. విష్ణు నామస్మరణము వలన దానిపట్టు వదలించుకొంటిని. నాగకన్యలవలన నీ విందుంటివని యిందువచ్చితినని తనకథయంతయుఁ జెప్పెను.

ప్రహ్లాదుఁ డతనిచరిత్రము విని సంతసించుచు మహాత్మా ! భూలోకములో నెన్నితీర్థములున్నవి. వానిలో నేది శ్రేష్ఠము. పుణ్యప్రదమైన దేదని యడిగిన నా జడదారి ప్రహ్లాదా ! నీ వెరుంగనివిశేషము లుండునా ? మనశ్శుద్ధి కలవానికి ప్రతిపదమందుం దీర్థముగలదు. అన్నితీర్థములు పావనములైనవియే అది లేనివానికి

గంగయుఁ బల్వలమే యగును. గంగాతీరంబున ననేక పల్లెలుగలవు. అందనేక జాతులు వారుగలరు. వాండ్రు ర్రాతింబగళ్ళు గంగలో నాడుచుందురు. వారలకా తీర్థంబులు పంకశాకనోపయోగంబులే యగును. అయినను నడిగితివి కావునఁ జెప్పెదివినుము.

గంగా, గోదావరీ, కృష్ణ, వేణి, కావేర్యాదిమహానదులఁ బెక్కు తీర్థంబులు లోకపావనంబులుగలవు. బదరీ చంపకానైమిశాద్యరణ్యములు నతిపవిత్రములు. వానిలో నతిపవిత్రమైనది నైమిశారణ్యము అందు మహర్షులు పెక్కులు సత్రయాగములు చేసియున్నారు. గోమతీనది యందుఁ బ్రవహించుచున్నది. అని దానిం బెద్దగా బొగడుటయుఁ బ్రహ్లాదుఁడు మనంబున నైమిశారణ్యమున కరుగుటకు నౌత్సుక్యముజనింప మహాత్మా! మీ మాటలచే నాకు నైమిశారణ్యముజూడ వేడుక గలుగుచున్నది. చూచి వత్తము వత్తురే యనుటయు నమ్ముని యంగీకరించెను.

ప్రహ్లాదుఁడు కతిపయ పరివారము సేవింప చ్యవనునితో గూడ శుభముహూర్తంబున బయలుదేరి పాతాళలోకము విడిచి భూలోకమున కెక్కి తిన్నగా నైమిశారణ్యమున కరిగెను. అందు గోమతీతీర్థమున గృతావగాహుండై విష్ణుప్రీతిగా ననేక దానములు గావించి కొన్నిదినములందలి మునులతోఁ గోష్ఠి గావింపుచుండెను.

ఒకనాఁడొక రావిచెట్టుక్రింద గొన్ని బాణములు పడియున్నవి. వానిం జూచి విస్మయముతో నోహో మహర్షుల యాశ్రమమందు యుద్ధభూమింబోలె శిలీముఖంబులుండనేల యని వితర్కింపుచుండ కమండలు కృష్ణాజిన జటావల్కలాదులు ధరించి ధనుర్బాణతూణీర యుక్తులై వచ్చుచున్న నరనారాయణులం గాంచి క్రోధరక్తాక్షుఁడై రాక్షసరాజనందనుఁడు వారికిట్లనియె.

ఉ. తాపసవృత్తి నొప్పు జడదారులకుం దగునయ్య మీకు నీ
చాపవృషత్కధారణము క్షత్రియధర్మము గాక భూరిని
ష్ఠాపరులై తపఃక్రియ దృఢవ్రతు లౌమునులేడ శత్రుసం
తాపకృదుగ్రచాప శరధారణమేడ విరుద్ధమౌఁగదా.

గీ. బూతిబూసితి రొడలెల్ల బొజ్జతిరుగ
గట్టితిరి నారచీరలఁ గౌతుకమున
జడలదాల్చిరి బ్రహ్మతేజంబు వెలయ
నేమిటికినయ్య మీకునీ తామసంబు.

బ్రాహ్మణులై క్షత్రియవృత్తి వర్తించువారిని రాజుదండింప వచ్చునని స్మృతులు చెప్పుచున్నవి. పరస్పర విరుద్ధమగు మీ డాంబిక వేషముచూడ నా కొంటొక తెఱంగున సందేహంబు బెరియుచున్నది. క్షత్రియవేషము విడిచి శ్రోత్రియత్వము వహింపుఁడు. అని పలికిన నరుఁ డిట్లనియె.

ఓహో ! నీ వెవ్వఁడవు ? మమ్ము శాసించునట్లు మాట్లాడుచుంటివే ? మాజోలి నీకేల మాయందు రెండుధర్మములు గలిగియున్నవి. నీ దారిని నీవుబోక శాసనకర్త వలె మొఱయుచుంటివి ? పొమ్ము మా గొడవ నీ కేలయని యదలించిన విని ప్రహ్లాదుఁడు విడువక యిట్లనియె.

ఏమీ ! ధనుర్బాణ ధారణమాత్రముననే గర్వాభిభూతులైతిరే. మీరీ పుణ్యతీర్థంబున ధర్మ సేతువు పెరగొట్టుచుండఁ జూచి చూచి యెట్లూరకుందును ? మీరు బ్రాహ్మణులై జటావల్కలముల ధరించి క్షత్రియవృత్తి వర్తించిన సహింతునా మీకు యుద్ధమున సామర్థ్యము గలిగియున్నచో నాతోఁ బోరుఁడు. అనిన నరుండిట్లనియె.

బాపురే ! నీ వెవ్వఁడవో పిలిచి జగడమాడుచుంటివే. సరే కానిమ్ము. ఇదిగో చాపమున శరసంధానము గావించుచుంటి గాచికొనుమని పలుకుచు ధనుష్టంకారము సేసెను. ప్రహ్లాదుఁడు చాప మెక్కుపెట్టి మూడుబాణంబుల నమస్కార సూచనముగా వారి పాదంబులగొట్టి నడుమ క్షేమప్రశ్నావసక్తముగా శ్రవణాసన్నమునకైదు బాణములు ప్రయోగించెను.

పిమ్మట నరునకుఁ బ్రహ్లాదునకు ఘోరయుద్ధము జరిగినది. అందు

క. నరుఁడేసిన బాణంబుల
సురవైరి సుతుండు నడుమనుత్రిక్కఁగ జేయున్
సురవైరి తనయుఁ డేసిన
శరముల ఖండించు నరుఁడు సమర ప్రౌఢిన్.

క. అస్త్రములకు నస్త్రంబులు
శస్త్రములకు శస్త్రములును సరినేయుచు శ
స్త్రాస్త్రంబులతోఁ బోరు
రస్త్రాభేద్యముగ నర ప్రహ్లాదుల్.

అవకాశంబైన తఱిఁ బ్రహ్లాదుడందు శరశరాసముల ధరించి యుద్ధ వైశారద్యము చూచుచున్న నారాయణుంగూడ మూడువాడి శరంబులం గొట్టెయు

నమ్మహాత్ముండు నరుం గూర్చుండుమని చాపమెక్కువెట్టి హిరణ్యాక్షిపు పట్టిం బెట్టిదపు తూపులంగొట్టె నప్పుడు వారిద్దరికిం బెద్దయుద్ధము జరిగినది. ఆ సంగర వైచిత్ర్య మవలోకింప నిలింపులు విమానములెక్కి యంతరిక్షమలంకరించిరి.

ఇట్టి భయంకర సంగ్రామోత్సవము నేనిదివఱకు చూడలేదని నారదుండు వీణంబాడుచు వేడుకగా జూచుచుండెను. మరియు

క. అసుర వరతనయుఁడును ధ
ర్మసుతుఁడ సమ సమర నిపుణ రథసప్తాశ్వ
ల్లసదురు శస్త్రాశ్త్రిన్
విసువక పోరాడి రొక్క వేయేండ్లు ధృతిన్.

అట్లు వేయి సంవత్సరములు పోరినను నందెవ్వరికిం జయము గలుగ లేదు. ఆ ఋషివర్యుల ప్రభావంబున కచ్చెరువందుచు ప్రహ్లాదుఁడు దామోదరుం బ్రార్థించుటయు బుండరీకాక్షుండు వానిసదుమ నిర్భిప్రత్యక్షంబై నంతఁ జేతులు జోడించి ప్రహ్లాదుఁడిట్లనియె.

మహాత్మా : మీరెవ్వరో మహర్షులు ఆశ్రమ విరుద్ధముగా శరశరాసనములు దాల్చిరని యలిగి కయ్యమునకుఁ గాల్దువ్వితిని. వేయేండ్లు పోరాడియు మీరిం జయింపలేక పోయితిని. మీ రెవ్వరెరింగింప వేయని యడిగిన విష్ణుం డిట్లనియె.

వత్సా : మీరు మదంశవలనం జనించిన వారు నరనారాయణులు ధర్మ పుత్రులు సహస్రకవచాసురుం బరిమార్పుటకై యిట్లవతరింపవలసి వచ్చినది. ఆ దానవుని కవచం బొక్కొక్కటి వేయేండ్లు తపంబుచేసి వేయేండ్లు పోరాడినంగాని భేదింప శక్యముగాదు. నరుండు తపంబుసేయుచుండ నారాయణుండు పోరుచుండ నారాయణుండు తపంబుసేయుచుండ నరుండు పోరుచుండు నీ రీతి వానివేయి కవచం బులు భేదింప వలసియున్నది. అట్టివారితో నీవు సమముగాఁ బోరితివిగాని యితరు లకు శక్యమా ? వారే నేనను కొనుమని పలికిన విని ప్రహ్లాదుండు పశ్చాత్తాపము పడుచు శరచాపంబుల నేలంబాఱవైచి వారి పాదంబులందు సాష్టాంగ నమస్కారములు గావించుచు నిట్లనియె.

చ. గురువముతోడ మీ మహిమఁ గానక దర్పము మెలదర్పమీపయిన్
శరములవైచి తప్పుపని సల్పితి నా యపరాధమంతయుం
గరుణదలిర్ప సైపఁదగు గంజదళాక్షుని యంశజాతులై
పరగిన మీప్రతాప భరింపఁ దరంబె నా కిటన్.

గాక మాతో నిన్నినాళ్ళు ఘోర సమర్థుండగు పీరుండు గలుగునే పరమ భాగవత శిఖామణివి నీ గుణగణంబులు ఫణిపతివర్ణింపజాలఁడు నీవు చిరకాల జీవివగుదువు గాక యని యా మహర్షులతని నాశీర్వదించిరి.

ప్రహ్లాదుండును దదాశీర్వాదములంది వారి యనుమతి వడసి యటనుండి వెండియుఁ బాతాళలోకమున కరిగెను.

క. ప్రాతఁ నీ ప్రహ్లాద చ
రిత్రము పఠియించినం బరిస్ఫుట భక్తిన్
ధాతి ధన ధాన్యగేహక
ళత్రాది సుఖంబులం జెలంగు జనుఁ డిలన్.

క. అనిచెప్పిన విని గోపుడు
ఘనవిస్మయ సుప్రహర్ష కలితాత్ముండై
ప్రణుతించెఁ దపసి తపసియు
జనియెం దదనంత రావసథమున కంతన్.

చ. గిరితన యా మనోరమణ కిన్నర సిద్ధ పిశాచ సాధ్యఖా
స్వరముఖ దేవయోని పరివార కనద్రజితాచలేంద్ర మం
దిర పురుహూత ముఖ్యసుర దివ్య కిరీట మణిప్రభాలస
చర్చిణ సురాపగా లలిత చారుక పర్దకృపాపయోనిధీ.

చ. కరమరుదార నీపదు నొకండవ భాగమునే బృహత్క- థాం
తర లసమాన మానిత కథావితతిం బరికించి వానిలో
సురుచిరమైన వాని పరిశోధనచేసి రచించితిన్ మహే
శ్వర భవదర్పితంబగుచుఁ బావనమైయిదియొప్ప దే భువిన్.

క. శుభనిధి యుగవసుచంద్రాం। కభవ శకంబున సుభిక్షకలితంబగు నీ
ప్రభవాబ్దంబున గౌరీ। ప్రభుకృపరచియించిదీనిఁ బ్రకటించితిగా.

గద్య. ఇది శ్రీ విశ్వనాధ సదను కంపాదిత క తా విచిత్రా
త్రేయ మునిసుత్రాగు గోత్ర పవిత్ర మధిర కుల కలశ జలనిధిరాకా
కుముద మిత్ర కొండయార్య పుత్ర లక్ష్మి నారా
యణ పౌత్ర సుకవిజనావి రక్షిత సుబ్బన
దీక్షిత నామధేయ విరచిత విజగు కాశీ
యాత్రా చరిత్రంబునఁ బదు
నొకండవ భాగము
సంపూర్ణము.

K. Nirupama
17.4.2003

22.4.03

శ్రీవిశ్వనాదార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శోభనాచల ప్రెస్, విజయవాడ-1.

